శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

పీఠికాపురోన్నతపాఠశాలాప్రధానోపాధ్యాయుఁడగు

కూచి నరసింహము చేఁ

దెలుఁగున వ్రాయఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.





పిఠాపురమునందలి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితమై ప్రకటింపఁబడియె.

1914.

 వెల రు 1-4-0. 

Dear reader,

It is more than a year since the first part of "Lord Gauranga" was published. In reviewing the work, some of the journalists and friends, to whom the book was sent, have expressed a strong desire to see it completed soon. Their kind appreciation of Part I. has acted as a powerful incentive in me to bring out Part II. I owe them an apology for the delay, which could not, in my indifferent state of health, be avoided, though almost all the time I could snatch from the onerous duties of the head of a school, under the present altered conditions of the department, was devoted solely to the translation of the sequel.

While the already published portion of the work comprises all that the Lord did in His early life, Part II is mainly an account of the moral and spiritual revolution effected by Him in Northern India and some parts of the Dekhan.

No coercion was brought to bear upon the people in conversion. The sweet face, the guileless look radiating the light of *bhakthi*, incessant tears of love and sympathy, and occasionally mere will to reclaim people from sin and confer upon them the indescribable bliss of *bhakthi*, did, in the twinkling of an eye, what acrimonious polemics and thundering eloquence fail to achieve by years of unremitting labour. This is perhaps why the Lord is paid divine honours, I believe deservedly, even to-day.

The English biographer Shishir Kumar Ghosh names the book "Salvation for all," though *Sree Krishna* was the very breath of the Lord's nostrils; for the princi-

ples of *bhakthi* taught by the Lord are most catholic and of universal application. If there is a Saviour to save, men of all denominations-Hindu, Christian or Mahomedan, must find them quite acceptable. Only those whom the names of *Krishna* and *Radha* do not suit, will have to substitute for them their own favourite names of God and an ideal *bhaktha*.

Two incidents in this part——the conversions of Vasudeva Sarvabhauma and Prakasananda——may be a little distasteful to those who fanatically advocate the *monistic* doctrine. But I beg to point out that Sree Sankara, the greatest *Advaithic* preacher wrote volumes of thrilling devotional verses in sweet Sanscrit, addressing God by such different names as *Govinda*, *Lakshmi Narasimha*, *Samba Siva*, but oftener, as *the Great Beloved Mother*. *Bhakthi* is, therefore, not only tolerable, but necessary and of utmost importance to every aspirant for the unalloyed eternal bliss of *Mukthi* or salvation. Genuine *Advaithic Mukthi* is entirely a matter of *experience*. Until that consummation is reached, the proudest *Advaithi* is practically a *Dwaithi* or dualist, though few have the frankness to acknowledge it.

Permit me also to mention in this connection that, according to Sree Rama Krishna Paramahamsa, the greatest of modern Indian sages, the quarrel between a *Dwaithi* and an *Advaithi* is based on mutual imperfect understanding, *bhakthi* at its highest tide being identically the same as *Advaithic Mukthi*. He says, in that state, the worshipper merges wholly in the Worshipped, losing his separate individuality. Radha's description of her state of mind and her absorbing love to Sree Krishna in the 11th chapter of this part, fully bears this out.

If Gauranga fails to catch your heart, and move you to refreshing tears and, with them, wash off the taints of sin and suffering and care, I do not know who else can, in the field of *bhakthi*.

That the *bhakthi* preached and practised by the Lord is free from the least tinge of sensuality, is proved by the immaculate lives led by Himself and His immediate disciples.

If you, my friend, only overlook the defects of my translation and inadequacy of expression, I have no doubt that you will be the better, the nobler, the purer and the happier for reading "Gauranga" in the spirit in which it should be read. Good-bye!

PITHAPURAM.
14-11-1913.

Your sincere and well-wishing
K. NARASIMHAM.

శ్రీరామా.

# పీఠిక.

ఆంధ్రప్రియమిత్రులారా!

"శ్రీగౌరాంగచరిత్ర" మొదటిభాగ మచ్చొత్తించి యొక సంవత్సరము దాఁటినది. ఈకాలవిలంబనమునకు నాయనారోగ్యస్థితియుఁ దీఱికలేమియునే కారణములు. రెండవభాగముఁ జూడ నతికుతూహలుల మైయున్నామని కొందఱు పత్రికాధిపులు మిత్రులు వ్రాసిన దయాపూర్వకము లైనవ్రాఁతలు దానినిప్పటికైన ముగింప నాకు శక్తిఁ గలిగించినవి. దైవానుగ్రహమువలనను మిత్రప్రేరణము వలనను గ్రంథముఁ బూర్ణము చేయఁగలిగితిని. బాగుగఁ జేసితినని మీరు చూచిసంతసించువఱకు సాహసించి చెప్పఁజాలను. నాలోపములెన్ని యున్నను శ్రీగౌరాంగస్వామిమాత్రము చదువరులహృదయములందు సద్భక్తిఁ గలిగింపకుండఁడని నాదృఢవిశ్వాసము.

"శ్రీకృష్ణ" "రాధా" దిశబ్దములు తఱచుగ నీపుస్తకమునం దగపడునని వైష్ణవేతరభక్తులు సందేహింపవలదు. శ్రీచైతన్యస్వామి బోధించినభక్తిమార్గము సర్వమతసమాదరణీయముగను సర్వజనగ్రాహ్యముగ నున్నది. కావలసినవారు వారివారి కిష్టమైన భగవంతుని యనంతశుభనామములలో నొకటియు భక్తాగ్రణుల నామములలో నొకటియు శ్రీకృష్ణరాధాశబ్దములకు మాఱుగఁ బెట్టుకొనిన, నిది యందఱకు సమ్మతమైనపూతగ్రంథ మగుననుట బూటకము గాదు.

ఇందలి "సార్వభౌము" నికథయుఁ "ప్రకాశానం" దో
పాఖ్యానంబు నద్వైతమతావలంబుల కించుకయు నిష్టముగాఁ గానుపించ
నేని, వారి కొకచిన్నమనవి చేసికొనియెద. కేవలానుభవైకవేద్యమగు
ముక్త్యవస్థాతారతమ్య మెట్లుండిన, నద్వైతమతబోధకాగ్రగణ్యుఁ
డగుశ్రీశంకరాచార్యుఁడే ముద్దులుగుల్కు నుడులు పులకరింపఁజేయు
భక్తిశ్లోకములు వేలకొలందిగ ననేకదేవతల స్తుతించుచుఁ జేసి ప్రక
టించినసంగతి యెల్లరకు విశదమే కద! దానిఁబట్టి భక్తి సహ్యమే
కాక ముక్తిపరుల కత్యావశ్యకమని తేటపడుచున్నది. ఇదియుఁగాక
తత్త్వానుభవపూర్ణమహాజ్ఞానులలో నొక్కఁడగు శ్రీరామకృష్ణపరమ
హంసుఁడు భక్త్యద్వైతముక్తులు బాగుగఁ బరికించి చూచిన నొక్క
టేయని సెలవిచ్చియున్నాఁడు. పూర్ణభక్తిలో నుపాస్యోపాసకభేద
మిసుమంతయేని యుండదఁట. ఈభాగమునందలి పదునొకండవ
యాశ్వాసములో శ్రీకృష్ణనిమగ్నాత్మచిత్తస్థితిని వర్ణించు రాధవాక్య
ములు నీబోధమునకుఁ బోషకములగుచున్నవి. కావున మాత్సర్య
రహితచిత్తముతో నవలోకించు మహానుభావులకు సామాన్యభక్తుల
కువలె శ్రీగౌరాంగచరిత్రము వందనీయమును భవదుఃఖసాగరతార
కమును భక్తిసుఖదాయకమునై చూపట్టక మానదు.

కర్మభక్తిజ్ఞానములలో భక్తిమార్గము ముఖ్యమని శ్రీరామ
కృష్ణపరమహంసుఁడే స్వానుభవముంబట్టి బోధించియున్నాఁడు.

రక్షించుట కొకభగవంతుఁడును గావఁబడుట కొక[illegible]
భక్తుఁడు నున్నయెడల, భక్తియే తరణమార్గములలోఁ బ్రధాన
మైనయెడల, శ్రీగౌరాంగస్వామిం బోలుభక్త్యుపదేష్ట యొకఁడు లేఁడని
నిస్సంశయముగఁ జెప్పవచ్చును. చైతన్యస్వామి భగవదవతారపురు
షులలో నొక్కఁడనియే నాసమ్మతము. అట్టి సమ్మ[illegible]

నామహానుభావుఁడు నిరుపమానశ్రీకృష్ణభక్తుఁ డని చెప్పుటకించుకయు సందేహపడరు. ప్రకాశానందుఁడు చెప్పిన, ట్లంతభక్తుఁడేని, యవతారపురుషుఁడువలె నెల్లరకు వందనీయుఁడే.

మన తెలుఁగుదేశములో ననేకభక్తచరితములు వ్యాప్తములై యున్నవి; కాని యీభక్తప్రకాండముచారిత్రము మనవారిది వఱకంతవిని యుండలేదు. ఆకొఱంత నాశక్తికొలఁదిఁ దీర్చుట కుద్యమించినాఁడ. నాపూర్వపుణ్యమునఁ, బెద్దలయాశీర్వచనబలంబున, శ్రీరామచంద్రమూర్తికృపామహిమంబున, నాకోరిక నెఱవేఱినది; చరితార్థుఁడ నైతిని. నాకంటె గొప్పవారును గవితాకుశలులును బుద్ధిశాలులును భక్తరత్నములును బయలుదేఱి శ్రీగౌరాంగదేవుమహిమలను లీలలను నాటకహరికథారూపంబులుగ మన తెనుఁగుదేశమున వెదచల్లి భక్తిని వెల్లిగొలుపు శుభదివసంబు లెప్పుడు వచ్చునా యని ప్రతీక్షించుచున్నవాఁడ.

రేఫశకటరేఫముల యతిప్రాసంబులం జొన్పుట, యించుగాగమవిరామంబు వాడుట, "వడిగల యెద్దులఁగట్టుక మడిదున్నక" వంటిక్త్వార్థకప్రయోగములు చేయుటయుఁ దక్క నితరసమస్తవిషయములలో నాకు సాధ్యమైనంతవఱకుఁ బ్రాచీనకవితల్లజానుసారినై యే పోయితిని. తప్పులు లోపము లున్న, నవి యజ్ఞానజన్యము లనియు, గ్రామ్యభాషాపోషణలాలసుండ నై బుద్ధిపూర్వకంబుగా నేనుపయోగపఱిచినవి గావనియుఁ, దలఁప భాషాభిమానులు ప్రార్థితులు.

పిఠాపురము. ఇట్లు విన్నవించుసజ్జనవిధేయుఁడు,

14-11-13. కూచి. నరసింహము.

శ్రీరామా.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

## ప్రథమాశ్వాసము.



శా. శ్రీల న్జాలఁగ నిచ్చునీపదముల ♦ న్జైకూర్చునిశ్రేణికి
న్మూలం బౌనలభక్తి ప్రేమ మనురెం♦డు న్మ్రొల్గడ; ల్మెట్లు లు
ద్వేలాంతఃకరణప్రవృత్తు; లవి స్వా♦ధీనంబు లై యున్నస
చ్ఛీలవ్రాతము వాని మెట్టి కనుసు ♦ శ్రేయంబుల న్రాఘవా! 1

చ. భజనలు సల్పునప్పుడు క ♦ వాటముల న్బిగియించికాని భ
క్తజనులు పాడ; రేల యనఁ♦ గాపురుషు ల్సనుదేరఁ జిత్తముల్
ఋజుగతి వీడి నిశ్చలత ♦ యేది చరించెదు నాడ కీడకున్;
నిజ మగుభక్తిమోదము జ ♦ నింపఁగ నేరదు దాన లోపలన్. 2

క. ఈకారణముననే నిమి
రాకుండఁగ నాజ్ఞ పెట్టెఁ ♦ బ్రాకటభజనా
స్తోకానందము భక్తులు
జోక న్గొనునవసరముల ♦ క్షుద్రపురుషులన్. 3

క. ఐన నటువంటివారలు
కానఁగ రాకుండఁ దూఱి ♦ కాంచి భజనముల్

మానసశుద్ధిం గని యమి
తానందము నప్పు డప్పు ♦ డంది రనేకుల్. 4

వ. ఇట్లు యొకానొక కాలమందు. 5

మ. వరశీలుం డగునొక్కనైష్ఠికుఁడు శ్రీ♦వాసు న్సమీపించి, మీ
హరిసంకీర్తన చూడ వాంఛ గలద♦య్యా! నాకుఁ జూపింతె నా
నరియే రమ్మని యొక్కరేయి యతని♦న్జైతన్యుతోఁ జెప్పకే
చొరఁబెట్టె న్దనయింట యోగ్యుఁడతఁడం♦చున్జూచి ధైర్యంబునన్.

క. గౌరాంగుఁడు హరికీర్తన
మారంభము సేసి యస్తె ♦ యాఁపి హరి! హరీ!
యీరాత్రి భక్తిరసమే
యూరదు మది నెందుచేత ♦ నో! నే నెఱుఁగన్. 7

వ. అని శ్రీవాసుదిక్కు మొగంబై. 8

క. పండితమండన! ముద్వివ
శుండను గా నెందుచేత? ♦ సురుచిరనాట్యం
బొండుం జేయఁగలే నిఁకె
వండే నన్యజనుఁ డిటకు ♦ వచ్చెనె చెపుమా. 9

వ. అన శ్రీవాసుం డతనిపాదంబులపైఁ బడి తాను జేసినదంతయుం
జెప్పి యిట్లనియె. 10

మ. క్షమియింపన్వలె దేవదేవ! విమల♦స్వాంతుం, డితం డుత్తమో
త్తమచారిత్రుఁడు, నైష్ఠికుండు, తనున♦త్వంబంత పోకాడ క్షీ
రమె యోరెంబుగఁ ద్రావి నిల్చుననుచు♦న్నానిచ్చి మీయాజ్ఞభ
గ్నము గావించినవాఁడనేను; గరుణ♦న్గాపాడుమా మ్రొక్కెదన్.

వ. అది విని మందహాసంబుతో గౌరాంగుం డిట్లనియె. 12

తే. మఱొకచోటికిఁ బోనిమ్ము ♦ మాన్యుఁ డైన

నీదునిష్ఠాగరిష్ఠుఁ బం ♦ డితవరేణ్య!
ద్రవపదార్థముఁ దినినమా ♦ త్రానఁ గృష్ణ
పదజలజసేవ గలుగ దె ♦ వ్వాని కిలను. 13

తే. వెంట నాతని నవలికి ♦ వెడలఁ గొట్టి
రాతఁ డానందపరవశుం ♦ డయి బయటికి
నేగుచుండెను బన్నంబు ♦ నెదఁ దలఁపక
యంత రమ్మని వానికి ♦ నాజ్ఞ యయ్యె. 14

ఉ. వచ్చి యతండు మిశ్రజుని ♦ పాదము లంటి నమస్కరించి మీ
రిచ్చినయాజ్ఞ మీఱితి తిల ♦ కించితి శ్రీహరికీర్తనంబు ; నేఁ
గ్రచ్చఱఁ గాంచఁగల్గితి న ♦ ఖర్వవినిర్మలకృష్ణభక్తి ; మీ
యిచ్చకు వేఱొనర్చితి ; క్ష ♦ మింపుము స్వామి ! యనెన్వినమ్రుఁడై. 16

వ. గౌరాంగుం డిట్లనియె.

ఉ, చక్రిని గొల్చి ముక్తిఁ గనఁ ♦ జాలుదు వీ వది సత్య ; మీధరా
చక్రములోని భక్తజన ♦ సత్త్రములం దొకరుండ వీవు ; బా
హ్యక్రియ లచ్యుతాంఘ్రియుగ ♦ మందఁగఁ జేయఁగ లేవటంచు, భ
క్తిక్రమము న్జనంబులకుఁ ♦ దెల్పఁగఁ జేసితి నిట్లు మిత్రమా ! 17

క. కనుక క్షమియింపు నన్నం
చును నాకాళ్లపయిఁ బడుట ♦ చూడఁగ నోపన్
నిను వెళ్లఁగొట్టినందుల
కును గినియక మనమునందుఁ, ♦ గూర్మి మెలఁగుమా ! 18

సీ. తాళమర్దళముల ♦ ధ్వనులు సంగీతంబు
చపలచిత్తముల ని ♦ శ్చలములుగను
జేసి, యాపరమాత్మ ♦ జీవాత్మయోగంబు
సమకూర్చి సంపూర్ణ ♦ సౌఖ్య మిచ్చుఁ

ముక్తితత్త్వరహస్య ♦ భక్తపుంగవులకుఁ ;
బరులు దానికి నర్హు ♦ లత్తు రనియు
నిలలోన విరివిగాఁ ♦ గలదుష్టనరతతి
గేలిసేయుచు భక్త ♦ జాలమునకు
ఆ. హాని సేయుననియు ♦ నన్యుల రానీఁడు
భజనసేయునట్టి ♦ పట్లకు నిమి ;
యంతెకాని వేఱు ♦ చింతను జేయునే
యట్లు తండ్రి, హరి, మ ♦ హాత్ముఁ డిలను ? 19
తే. భక్తి స్వాచరణంబునఁ ♦ బ్రజల కిట్లు
నేర్పి యిఁకఁ బ్రేమ యెట్టు లా ♦ నీరజాక్షు
పైని జూపఁగవలయునో ♦ భక్తు, లద్ది
యాత్మచర్యలఁ గఱపె గౌ ♦ రాంగుఁ డవల. 20
సీ. గయ కేగి వచ్చిన ♦ కాలంబునుండియుఁ
గొన్నాళ్లు వివశత ♦ పన్నుపడఁగ
గౌరాంగుఁ డున్మత్తు ♦ కరణిని జరియించెఁ ;
బిమ్మట నాస్థితి ♦ వీడి యతఁడు
దైవత్వమును దాల్చి ♦ తఱులయందుండక్క-
నన్యకాలముల మి ♦ త్రాళితోడ
నవ్వుచుఁ బేలు చ ♦ నన్యాత్మసౌఖ్యంబు
నుల్లాసమున వారి ♦ కొసఁగు చుండె
ఆ. భక్తి యెట్లు తాల్చి ♦ వర్తింపవలయునో
నిమిని జూచి స్నిగ్ధ ♦ సమితి నేర్చు
కొని మెలంగి యతని ♦ యనువున, భక్తత
ల్లజసమాఖ్యఁ గనె ని ♦ లాతలమున. 21

వ. ఇంకఁ బిమ్మటఁ బ్రేమావబోధనలాలసుండై గౌరాంగుండు. 22

ఉ. ఎప్పటియట్లు కీర్తనల ♦ కేగఁడు, పాడఁడు ; మాఱు మాటలం
జెప్పఁడు పిల్చువారలకుఁ ; ♦ జిత్తము నేడనొ పెట్టి చూచుఁ గ
న్నెప్పలు పైకిఁ ద్రిప్పి; యెవ ♦ ని న్దనమ్రోలను నిల్వనీయఁ ; డే
చొప్పునఁ గూరుచుండు నొక ♦ చోటను మిత్రజనాళి బెగ్గిలన్ .

ఉ. అన్నము పెట్టిన న్మనసు ♦ నం దిడకే భుజియించు ; వీథులం
దు న్నడయాడునప్పుడు నె ♦ దో యొకధ్యానమునందె చిక్కుఁ ; జే
సన్నలు సేయు వెఱ్ఱిగతి ; ♦ స్నానముచేసిన నట్లె చేయు ; నా
పన్నునిరీతి నొక్కపుడు ♦ బాష్పముల న్వెడలించుఁ బెల్లుగన్ . 24

క. చెలికాం డ్రీవాలకము
న్దిలకించి భయంబు పొంది ♦ నిమి కిక్కట్టుల్
గలుగునని రేయిఁ బవలుల్
మెలఁకువఁ గాపుందు రతని ♦ నీడలపగిదిన్. 25

క. ఇది తిను మది తిను మని తన
సదయాంతఃకరణు లైన ♦ సచివులు పల్కన్
మది యచటలేమి నిమి యొక
మెదుకేనియుఁ జేత నంటి ♦ మెసవక చూచున్. 26

ఆ. ఉండి యుండి యాతఁ ♦ డొక్కప్పు డతిమోద
జనితముఖవికాస ♦ మెనసి చెల్మి
కాండ్రదిక్కు చంద్రి ♦ కాతుల్యవీక్షణ
ములను బఱపు వారు ♦ మోదమంద. 27

ఆ. అంతలోనె యతఁడు ♦ చింతాసముద్రమం
దు మునిఁగి మది నెవఁడొ ♦ దోఁచికొన్న

యట్లు వెక్కివెక్కి ◆ యడలును నిట్టూర్పు
లూర్చుఁ గార్చు నశ్రు ◆ లొక్కపగిది. 28

క. శ్రీకృష్ణనామ మది చెవిఁ
దాఁకిన మూర్ఛిల్లి పడును ◆ ధరపై నిది ప
ల్లాకులు పట్టణబాలకు
లేకరణినొ వినిరి విని ని ◆ కృష్టక్రీడన్. 29

శా. గంగ న్స్నానముచేసి వచ్చెడుతఱి ◆ న్గౌరాంగు నీక్షించి చే
రంగా నేగి 'హరీ! హరీ!' యనుచును ◆ ద్రావంబు గావించి, రం
తం గౌరాంగుఁడు భూమిపై నొఱగె, మి ◆ త్రవ్రాతమున్వానిస
ద్ధాంగంబు న్గొనిపోయె నింటికి వెస ◆ న్హాస్తంబులన్ భీతితోన్. 30

గీ. చూచు వెన్వెంటనె శచి కు ◆ సుఱులు చెదరెఁ
గొంతసేపటి కాతఁడు ◆ కుదురుపడియె
నంత 'నాతండ్రి ! యేమిరా !' ◆ యంచుఁ దల్లి
యడిగె; దానికి మార్వల్కఁ ◆ డయ్యె సుతుఁడు. 31

శా. తా నిట్లుండఁగఁ గోరి పల్కెనిమి య ◆ ద్వైతాఖ్యుతో నిట్లు "భ
క్తానీకంబును గొంచు నెప్పటియటు ◆ ల్హాళి న్నిశ న్గృష్ణసే
వానృత్యాదులు సల్పుమా! విడక శ్రీ ◆ వాసాంచితాగారమం
దే నెట్లుంటినొ కృష్ణకీర్తనల న ◆ ట్లే నీవు నుండన్వలెన్." 32

క. ఈయాదేశముఁ గైకొని
పోయి మహాపుణ్యభక్త ◆ పుంగవుఁ డెలమిన్
జేయుచునుండెను శ్రీవా
సాయతనంబునను రేల ◆ హరికీర్తనముల్. 33

మ. ఒకరే యాతఁడు కృష్ణభక్తివివశ ◆ త్వోద్రేకుఁడై పట్టువీ
డక నందాత్మజపాదసంభజనని ◆ ష్ఠాయుక్తి, నో కేశవా!

వికచాబ్జాయతలోచనా ! నతమహా ♦ భీత్యబ్ధిఝుంఝానిలా !
ప్రకటత్వత్కృపఁ జూపుచూపుమనుచుం ♦ బాడంగఁదొట్టె న్గలిన్.

గీ. ఒడలు దెలియక యిటు పాడు ♦ చుండి యాడు
చుండ సూర్యోదయం బయ్యె ♦ నెండ యెక్కెఁ
గాని యాపండితాగ్రణి ♦ కానరాఁడు
చనెను రాతిరి పగలువ ♦ చ్చె ననియౌర ! 35

చ. నను క్షమియించి సంశయవి ♦ నాశము చేయుము పుణ్యమూర్తి ! న
మ్మనమున శ్రద్ధఁ దాల్చి యను ♦ మానలవమ్మును లేక భక్తితో
నను దినము న్నిను న్గొలుచు ♦ నాతని భాగ్యమె భాగ్య ; మీయనే
వనజదళాక్ష! నాకు నటు ♦ వంటియసంశయచిత్తము న్దయన్. 36

క. అని చేతులెత్తి వలవల
వనరెడు పండితునికడకు ♦ భక్తులు సనివ
చ్చెను మధ్యాహ్నపుసమయం
బన వారలతోడ నిట్లు ♦ లాతఁడు వల్కెన్. 37

క. గంగాస్నానమునకు నర
పుంగవు లరుగుఁ డిదె కొంత ♦ ప్రొద్దిట విశ్రాం
తిం గని జాలము సేయక
గంగకడ న్నిమ్ము నేను ♦ గలసికొనియెదన్. 38

ఆ. పలికె నిట్లు కాని ♦ చలువలే దారితి
వెండి వచ్చె వంత ♦ పండితునకుఁ
గన్ను లెఱ్ఱఁబడియెఁ ♦ గన్నీళ్లు చిప్పిల్లె
నతఁడు దైన్యమూర్తి ♦ యట్లుతోఁచె. 39

గీ. బ్రాహ్మణశ్రేష్ఠుఁ డిట్లు శ్రీ ♦ వాసునింటి
యున్నతంపువసారలో ♦ నుండి " నన్నుఁ

బోవవా! తండ్రి!" యంచువా ♦ పోయిపోయి
క్రిందఁ బడియెను ఖండిత ♦ వృక్ష మట్లు. 40

గీ. తనగృహంబునఁ బరవశ ♦ త్వంబుతోడ
నొంటరిగఁ గూరుచున్న భ ♦ ర్గోజ్జ్వలాంగుఁ
డదిరిపడి లేచి చివ్వన ♦ నరిగె నా త్రి
నున్న యద్వైతుఁ గావ వి ♦ ద్యుత్తుమాడ్కి. 41

సీ. మకరపీడను జిక్కి ♦ వికలమానసుఁ డైన
ద్విపరాజుమొఱ్ఱలు ♦ విన్నవాఁడు
శరతల్పగతుఁ డైన ♦ శాంతనవునిబాధ
నుడిగింప వేగఁ బ♦ర్విడినవాఁడు
మండెడు చితిమీఁద ♦ నుండి వేఁడినశంక
రునకుఁ గేలూఁతగాఁ ♦ జనినవాఁడు
మానభంగము సైఁప ♦ లేనయ్య! శ్రీకృష్ణ!
యన్న ద్రౌపది కండ ♦ యైనవాఁడు

గీ. పట్టనమునందు నొకవృద్ధ ♦ పండితుండు
నుత్తముండును బరితప్త ♦ చిత్తభక్తుఁ
డాత్మశుద్ధుని జేసిన ♦ యార్తరవము
విని యరిగె నంట యొక పెద్ద ♦ వింతగాదు. 42

వ. తిన్నఁగఁ జని గౌరాంగుఁ డతిదైన్యం బాననంబునం గనఁబడ వలవల దుఃఖించుచున్నయద్వైతాచార్యుప్రక్కను గూర్చుండి శిరంబు కరంబునం దువ్వి ధైర్యంబు నెలకొల్పి యిట్లనియె. 43

ఉ. ఏమిది యిట్టు లేడ్చెదవు ♦ వృద్ధమహీసుర! కోరు మిచ్చెద
న్నీమది కిష్ట మెయ్యదియొ, ♦ నే నరుదెంచితి నీవు పిల్వఁగాఁ

గామితసిద్ధి పూర్ణముగఁ ♦ గల్గెను నీ కని యెంచుచుంటి; నిం
కేమికొఱంతయో తెలుపు ♦ మిా! దురపిల్లకభక్తరత్నమా! 44

వ. ధైర్యంబు దెచ్చికొని యద్వైతుం డిట్లనియె. 45

సీ. స్వామి! నాదురవస్థ ♦ చక్కఁగా నాలింపు
మతిచంచలం బయ్యె ♦ నంతరంగ;
మెంతప్రయత్నించి ♦ యేడ్చిన నది యేమి
పాపమో! స్థిరతను ♦ బడయ లేదు;
క్షణ ముండి సద్భక్తి ♦ సమయు నా వెంటనే
చిత్తంబు వినదు నేఁ ♦ జెప్పినట్టు;
లితరులు మోదాబ్ధి ♦ నీఁది యాడుచునుండ
దుస్సంశయానిల ♦ ధూతమాన

గీ. సుండనై కొట్టుకొనుచుందు ♦ సుందరాంగ!
యిదియె మద్దుఃఖహేతువ ♦ హీనశాయి!
నీపదములందు మదినెప్డు ♦ నిలుపునట్టి
యచలభక్తి నిదయసేయు ♦ మయ్య! నాకు. 46

గీ. కనికరంబు, శోకంబు ము ♦ ఖంబునందుఁ
గానిపింపఁగ నద్వైతుఁ ♦ గాంచి మిశ్రి
సూనుఁ "డే నేమి చేసిన ♦ మానసంబు
చెంది తృప్తిని స్థిరపడుఁ ♦ జెప్పు" మనియె. 47

ఉ. అంతట విప్రుఁ డిట్లనియె ♦ నర్జునుఁ డాహవసీమయందు స
ర్వాంతరబాహ్యవర్తి భవ ♦ దంచితతేజము విశ్వరూపము
వింతగఁ గాంచితుష్టిని వి ♦ వేకము నొందె స[illegible]; నా
చింతలు వాయఁ జూపి నిమి! ♦ చిత్తవిలోలతఁ గొట్టివేయవే? 48

ఉ. దేవుఁడు సత్కృప న్నరుని ♦ తీరుగఁ దోఁచిన, భక్తి పేరిమమా
దేవునిపైని జూపి విను ♦ తింపఁగఁ గల్గును మానవుండు స్వా
భావిక దివ్యవిగ్రహమె ♦ వానికిఁ జూపినఁ జూడఁ జాలఁడే
కైవడి సృష్టికర్త నడు ♦ గం దగ దెప్పుడుబుద్ధిశాలికిన్. 49

చ. శిరములు బాహు లక్షులు వి ♦ శేషముగాఁ గనిపింపఁ జేసి దు
ర్భరశతకోటిభానునిభ ♦ భాస్వరకాయముఁ బైకిఁ గ్రిందికిన్
బెరుగఁగనిచ్చి తోఁప హరి, ♦ భీతిని బార్థుఁడు మేను గంపమున్
బొరయఁగఁదానుగన్నుఁగవ ♦ మూసుకొనెన్ గదకాంచజాలమిన్.

ఆ. అఱపు రూపు బలము ♦ నద్భుతము లని శా
ర్దూల మెదురుపడఁగఁ ♦ దొడరి మేఁక
పిల్ల, తల్లిఁ జూచి ♦ ప్రేమించినట్లు ప్రే
మించు టరసినామె ♦ మేదినిపయి ? 51

క. నిమి దైవమొ మనుజుఁడో చూ
తమని యిటులుగోరెఁ బండి ♦ తప్రవరుఁడు స
ర్వము నెఱుఁగుప్రౌఢ యీమో
సమునకుఁ గారణముఁ దెలియఁ ♦ జాలక యున్నే ? 52

వ. చిఱునవ్వు నవ్వి గౌరాంగుండు "సరియే ! శ్రీవాసుపూజాగృహం
బునకు రమ్మ" ని చెప్పి యద్వైతుతోఁ గదలి చని యచ్చట 53

చ. బెదరక చూడుచూడుమని ♦ పెంచెనుగాయమునంగజాలమున్
బదములు మూర్ధ మేడఁగను ♦ పట్టకపోయెను ; మేన దీధితుల్
గదిరెను ; లోకవార మదు ♦ కంబడెనందునద్భుతంబుగన్ 54
మది చెదరన్మహీసురుఁడు ♦ మ్రాన్పడి నిల్చెను వెఱ్ఱిచూపులన్ ;

ఆ నిమిని వెతకికొనుచు ♦ నితి యటకే తెంచెఁ

జూడు మనెడుమాట ◆ జాడఁ బట్టి
విశ్వరూప మరసి ◆ విహ్వలచిత్తుఁ డై
యుర్వి నతఁడు మూర్ఛ ◆ నొఱగఁబోయె. 55

గీ. అంత నిమి విశ్వరూపంబు ◆ నాఁపి వేసి
నిజమనోహరరూపంబు ◆ నెమ్మిఁ దాల్చె
ధూతసంశయచిత్తుఁ డ ◆ ద్వైతుఁ డతఁడుఁ
గలిసి యానందనృత్యము ◆ ల్సలిపి రపుడు. 56

గీ. నరహరి, గదాధరుండుఁ బూ ◆ ర్ణ మగుజాగ
రూకతను నిమితోడ న ◆ రుగుచు నుండి;
రైన నప్పటినుండి గౌ ◆ రాంగుఁ డల్ల
కృష్ణవిరహార్త రాధ యై ◆ కెరలు చుండె. 57

సీ. స్నానార్థ మొకనాఁడు ◆ సని నిమి గంగ, క
చ్చటఁ బొడగాంచెఁ బ్ర ◆ శస్తపుష్ప
వృక్షలతాకీర్ణ ◆ బృందావనంబును
దత్ప్రాంతమునను గ ◆ దంబ మొండు
దానిక్రిందనుహస్త ◆ తలమున నొకవేణు
వును దాల్చి క్రొంబస ◆ ల్వొడమునట్టి
దివ్యమోహావహ ◆ దేహంబుతో సురు
చిర మైనచిఱునవ్వు ◆ చెలువుతోడఁ

ఆ. బడినమాత్ర ధైర్య ◆ పటిమంబు సడలించి
చిత్తసీమ నీరు ◆ సేయునట్టి
నీటుఁజూపుతోడ ◆ నిలుచున్న నవ్యయౌ
వనపుమిసల నెసఁగు ◆ వాని నొకని. 58

గీ. అంత నాతఁడు రాధాల ♦ తాంగి యైన
కతమునను బరపురుషుల ♦ సతులు దేఁటి
పాఱఁ జూడఁగ రాదని ♦ బయలుదేఱె
వలపుఁగ్రేఁగంటిచూపులు ♦ వఱపుకొనుచు. 59

గీ. ఇట్లు తనయింటి కరుదెంచి ♦ యెవరులేని
యొకవసార నధిష్ఠించి ♦ యుండె, నంత
నెచ్చెలులు గుమిగూడుచు ♦ వచ్చిరటకు ;
వారిఁగుర్తింపలేఁడయ్యెఁ ♦ బాప! మతఁడు. 60

గీ. ఇల్లు బృందావనం బయ్యె ♦ వల్లవీల
లామ తా నయ్యె గోపికా ♦ లాలసుండు
సుందరుఁడు కృష్ణుఁ డాత్మహృ ♦ చ్చోరుఁ డయ్యెఁ
బ్రాణమిత్రాళి చేటికా ♦ వార మయ్యె. 61

వ. రాధావిరహిణియై శ్రీగౌరాంగుఁడు వడినవలవంత యీక్రింద
వ్రాయఁబడిన నరహరికృతగీతికామాలికవలనం దెల్లంబగు. 62

ద్వి. ఇది యేమిచిత్రమో ♦ యేగె గౌరాంగుఁ
డుదయించె రాధమో ♦ హోరుచిహ్నములు. 63

ద్వి. అయ్యయ్యో! బంగారు ♦ టంగంబు ధూళి
యయ్యె; దుఃఖాక్రాంత ♦ మయ్యె నెమ్మోము.
నిట్టూర్పు లూర్చుచు ♦ నిమి బాధపడుచు
నెట్టుబాఁదుకొనుఁ దా ♦ నెదను జేతులను
గన్నీరు బట్టలఁ ♦ గాయంబుఁదడుపు
చున్న దీమాక్రింద ♦ ముదుగుటలేదు. 64

ద్వి. " దైవమా! యిది యసా ♦ ధ్యంపుఁబ్రొద్దేని

యీ పూర కిట్లు న ♦ న్నేఁచెద వేల ?
చూడు మెట్లుంటినో ♦ శుష్కించెదనువు
రాఁడు శ్రీకృష్ణుఁడు ♦ ప్రాణనాథుండు;
గతియించె నిందియ ♦ గణబలం బెల్ల;
మతిచెడి వట్టియు ♦ న్మత్తనైతి ''
నంచు మాఁగారాంగుఁ ♦ డడలి యశ్రులను
నించుఁ గన్నుల ; వ్రాలు ♦ నేలపై సోలి. 65

ద్వి. '' ఏఁడి నాకృష్ణుఁడు ♦ హృదయేశుఁ డాతఁ
డేడ నున్నాఁడో నే ♦ నేగుదు నటకు ''
నంచుఁ దానర్తించు ♦ నంతలో నేడ్చు
మంచు సోఁకినవాని ♦ మాడ్కిని వడఁకు. 66

ద్వి. '' ఈరాత్రి శ్రీకృష్ణుఁ ♦ డే తెంచు లలిత !
తీరిచి నీటుగా ♦ దిద్దవే ! నన్ను ''
నని నిమి, ప్రియభక్తుఁ ♦ డౌ పురుషోత్త
ముని వేఁడు సంభ్రమం ♦ బున గడ్డ మంటి. 67

ద్వి. '' వేసారితిని గృష్ణుఁ ♦ ప్రేమించి వేఁడి
కాసంతదయ రాదు ♦ గా వాని కింక;
నడియాసలను మాని ♦ యతికష్టజీవ
ముడిగింతు యమునలో ♦ నుఱికి యీవేళ ''
నని పల్కి చెక్కుల ♦ హస్తంబు లుంచి
కనుఱెప్పలను వ్రాల్ప ♦ కయ చూచుచుండు. 68

గీ. రాధ యం చోకభక్త ధ ♦ రాతలమున
నుంటెనో లేదో యని శంక ♦ నొందువారి

కామె యవ్యాజనిస్తులో • దారనిష్క
ళంకభక్తి నిజూపె నీ • లాగున నిమి. 69

క. నిమి సూపఁగల్గె నీగతి
సమలం బగురాధప్రేమ • మందఱ కుపయు
క్తమగునని ; యన్యుఁ డెవ్వఁడు
క్షముఁ డౌ నిటు దాని నుర్వి • గనఁబఱుచుటకుఁ. 70

సీ. శ్రీకృష్ణునర్ధశ • రీరమే రాధ ; యా
లలనాలలామయు • ల్లంబునందు
విప్రలంభవ్యథా • వృత్తు లెట్టెట్టివి
జనియించెనో యేమి • కనెనో యామె
పలికెనో చేసెనో • భాగవతంబున
విపులంబుగాఁ గాని • పించు ; వాని
కెక్కుడుగాఁ జేసి • యెల్లరకుం జూపె
గౌరాంగుఁ డురుభక్తి • కల్పతరువు

గీ. పూర్వరాగంబు సూపె న • పూర్వముగను
రాసలీలను ధనలీలఁ • జేసి చూపె
నవ్యొ వాసకసజ్జిక • యమితమోహ
కంఠిమగ్నాభిసారికా • గణియు నవ్యొ. 71

గీ. కృష్ణవిరహార్తి రాధమా • ర్కిని మిగిలిన
కాలమంతయుఁ గడపె న • ఖండకృష్ణ
భక్తిమార్గోపదేశక • ప్రవరుఁ డల్ల
సచ్చిదానందరూపుండు • శచిసుతుండు. 72

వ. శ్రీకృష్ణగాఢానురాగవివశుం డయి నిట్టూర్పులు విడుచుచు, వె

క్కు వెక్కి పొక్కుచు, మూర్ఛ నొందుచు గౌరాంగుఁడు వివర్జితని
ద్రాహారుం డై యనేక దివారాత్రంబు లీక్రింది విరహవేదనావా
క్యంబులతోఁ గడపె 73

శా. ఏఁడీ కృష్ణుఁడు? దొంగిలించె నెవఁడో ♦ శృంగారి; నేమిత్రుఁడుం
లేఁడే క్రిమ్మఱ వానిఁ దెచ్చి యెదుట ♦ న్బెట్టంగ శక్తుండడయో!
వాఁ డీడ న్వసియింపకున్న నెటు లీ ♦ ప్రాణంబుల న్నిల్పుదుం?
బోఁడా వానికి నాయవస్థఁ దెలుప ♦ న్బుణ్యాత్ముఁ డొక్కండుఁడుం? 74

ఉ. ఓరి శశాంక! యేల యిటు ♦ లూరక బాధలఁ బెట్టె దీవుస?
న్నారసనేత్రుఁ డీయెడను ♦ నాసరస న్గనరాఁడు పోర! యో
క్రూరసుమంబ! ముల్కివయి ♦ యొమ్మనుదూఱెదవల్లగోపికా
జారుఁడు చెంతనున్న చెలి ♦ సౌఖ్యపడున్నినుఁగాంచియేగుమా! 75

గీ. మధురలో నుంద వెన్నాళ్లు ♦ మన్మనోవి
భుండ? శ్రీకృష్ణ! రావయ్య! ♦ యుండలేను
గాంచి కాంచి నాకన్నులు ♦ కాయగాయు
నెంతకాలము స న్నిట్టు ♦ లేఁచెదయ్య! 76

ఉ. ఏగుము మిత్రమా! వడిగ ♦ నేగుము వల్లభుచెంత; కేగి యే
లాగునఁ దెచ్చి చూపెదవో! ♦ లాగవలెన్పురినుండి యూతనిం
దాఁ గనఁజాలఁడన్యజన ♦ తాపము; కృష్ణుఁడు మంచివాఁడు; రాఁ
డే, గతజీవనౌదునని ♦ యేర్పడఁ బల్కుము! వచ్చుఁ జెచ్చెరం 77

గీ. నాఁడునాఁటికి నాయొడ ♦ ల్నవసిపోవు
చున్న విఁక నెన్నినాళ్లో యీ ♦ యుసులు లుండ
వంచు విస్పష్టముగఁ జెప్పు ♦ వయ్య! సఖుఁడ!
పరుగు పరుగున వచ్చు నా ♦ పజ్జ కతఁడు. 78

క. నామనముం దొంగిలి యే
మోమోటములేక కృష్ణ! ముగ్ధనగుననుఁ
బాములు పెట్టెదు తగవే
కోమలుల న్దిక్కులేని గోలల వేఁపఁ? 79

ఆ. ఎంత తెలివిలేని యింతి నైతిని నేను
సర్వ మయ్యొ! నీ కొ సంగికొంటి
నార్త బంధుఁడ వను ఖ్యాతిమాత్రమె కాని
రాతిగుండె నీది ప్రాణనాథ! 80

గీ. నన్నుక్షమియింపు మన్మనో నాథ! కృష్ణ!
యనుచితంబుల నెన్నెన్నొ యాడి చేసి
పాపమొడిఁగట్టుకొంటి నీ ప్రాపులేమి
వివశతను వెఱ్ఱిదాన నై ప్రేలినాను. 81

వ. ఇట్లు విలపించు గౌరాంగు ప్రక్కం గూర్చుండి విష్ణుప్రియయు శచియుఁ గడుదుఃఖంబున సానురాగబాష్పంబుల, బుజ్జగింపు మాటల, నెంతపల్కిన నేమిచేసిన నతండు నిరుత్తరుం డై యుపశాంతి నొందక యెప్పటియట్ల కలవరించుచుండెఁ; జివర కీయున్మత్తస్థితినుండి తెరల్చినది కృష్ణానందుండనువాఁడు; ఇతఁడు గంగాదాసగురువ్యాకరణపాఠశాలయందు గౌరాంగు సహాధ్యాయుండు. తంత్రిశాస్త్రవిదగ్ధుం డయి 'ఆగమవాజి' యను బిరుదుం బడసినవాఁడు. 'సార్వభౌముని' తరువాతఁదర్కశాస్త్రంబున 'రఘునాథు' నట్లు కృష్ణానందుండు భరతవర్షంబునఁదాంత్రికవిద్యయందుఁబ్రిథమగణ్యుండు. గౌరాంగునద్భుతచర్యలాతండు విని యేఁ గాని యిప్పటివఱకుఁగనీ యుండలేదు. ఆతని

మతమునకును శ్రీగౌరాంగుఁడు బోధించుభక్తిప్రధానమతము
నకును జాల వైషమ్యంబు గలదు కాన నతండు గౌరాంగుని
తోఁ బ్రసంగించి భక్తిమతఖండనంబు గావించి, తన్మతబోధకు
నోడించి, తనమతంబు స్థాపింప నూహించి, నిజవాదబలం బధి
కం బనుతలంపున, నిశ్చితభావివిజయోద్భూతగర్వాతిరేకంబున
నొకనాఁడు నిమిగృహంబు సొచ్చె. 82

చ. సకలకలాప్రవీణతను ♦ జాలెడునాననకాంతి గల్గుధీ
ప్రకటకనేత్రభాషణవి ♦ రాజితుఁ గాక యపారదుర్వ్యథా
వికలమనస్కుఁ డై సచివ ♦ బృందసమావృతుఁ డై సదీసుఁ దాం
త్రికకులశేఖరుం డరసి ♦ నివ్వెఱపాటును జెంది నిల్చెఁ దాఁ. 83

గీ. జాలిఁ గొల్పెడు మోము ని ♦ స్సారకాయ
మశ్రుసిక్తాక్షులును బండి ♦ తాగ్రగణ్యు
క్రూరశత్రుత్వగర్వము ♦ ల్వీడఁ జేసెఁ
జటులపాండిత్యసంవాద ♦ పటిమమువలె. 84

క. అంతటఁ గృష్ణానందుఁడు
చింతాక్రాంతాత్ముఁ డౌచు ♦ స్నేహముతో నొ
క్కింత యుపదేశమును గా
వింతుననుచుఁ జెంత కేగి ♦ పిలిచె శచిసుతుఁ. 85

వ. దానికి నిమి ప్రత్యుత్తరం బొసంగునని యెవ్వ రనుకొనలేదు;
కాని విచిత్రంబుగా గౌరాంగుండు మోమెత్తి యతనివంకఁ
జూచి తా నింకను రాధాభావంబున నున్నవాఁడుగావునఁ గృష్ణా
నందుండు తననుండి యెడఁబాపి కృష్ణుని దీసికొనిపోయి వశుని
జేసికొన్న మధురాపురవాసులం దొక్కండును గృష్ణసేవకుండు
ననుభ్రాంతిచే నీర్ష్యాక్రోధంబులు మోమునం గనఁబడ నిట్లనియె.

ఉ. తీసికరమ్మటంచు నినుఁ ♦ దీరిచి పంపెనె యామహాత్ముఁ; డా
యాసము చెందినారు గద! ♦ యంపినవారును నీవు; వానిసా
వాసము చాలు చాలు! వడి♦వచ్చినత్రోవనెపోయి, వంచకా
గ్రేసరుఁ డైనమీప్రభువ ♦ రేణ్యునితో నిటుపల్కు దూతుఁడా!

గీ. హృదయమును జూచితిని, శిలా ♦ మృదుల మయ్యె;
మమతవగలును బుద్బుద ♦ సమము లయ్యె;
నట్టిదాక్షిణ్యశాలి ప ♦ ర్యంకమునకు
వత్తు నెట్టులు? రానని ♦ పల్కుమయ్య! 88

వ. తనయాధిక్యంబు నెదుటివారలకుఁ జూపించుటకును గౌరాంగునికి బుద్ధిచెప్పుటకును దగినసమయంబు దొరకె నని, నిమిత్తకాల చిత్తస్థితి నెఱుంగనికృష్ణానందుండు డగ్గఱి యిట్లనియె. 89

ఆ. పండితాగ్రగణ్య! ♦ భక్తప్రకాండమ!
సత్కులప్రసూత! ♦ శాంతచిత్త!
సిగ్గుమాలి యిట్లు ♦ శ్రీకృష్ణభగవాను
నిందమాట లాడ ♦ నీకుఁ దగునె? 90

మ. అన గౌరాంగుఁడు స్థూలదండ మొకటి ♦ హస్తంబునందాల్చి నేఁ
జనుమన్న న్జనకున్నవాఁడవు; ప్రశ♦స్తం బైనయీకర్రయే
పనుచు న్నిన్నని లేచి వెంటఁబడె; వి♦ద్వాంసుండు నిర్వేడి పా
ఱెను బ్రాణావనదృష్టి రోఁజుచుమహా♦ర్తిధ్వానము ల్సేయుచున్.

గీ. ఇట్లు చని చని వడిఁ దన ♦ యిల్లు సేరి
జరిగినటువంటిసర్వంబు ♦ నెఱుకపఱిచె
నిజసచివశిష్యసేవక ♦ నికరమునకు;
వారు పరిహాసవచనము ♦ ల్వలికి రంత. 92

చ. తినుటకుఁ దిండిలేక కడుఁ ♦ దిప్పలువడ్డమనుష్యుఁ డయ్యెనే
జననుతిపాత్రుఁడైవ! మిది ♦ చాల విచిత్రమటంచుఁ గొందఱుఙ్
దనఘనపాండితీమహిమ ♦ తత్వము నేఁడె యెఱుంగనయ్యెఁగా!
యని యొకకొందఱు న్నొడఁగి ♦ రచ్చటఁ గేలియొనర్పమిత్రుఙ్.

ఆ. మిత్రుసూతిఁ బట్టి ♦ మెత్తగాఁ దన్నినఁ
బాగరుఁబోతుతనము ♦ వోవుననుచు
న ట్లొనర్పనిశ్చ ♦ యము సేసికొనిరి కో
పమునఁ దాంత్రికాప్త ♦ వరులు తుదకు. 94

గీ. అవనికిం దొడవు లగున ♦ నన్యలభ్య
విత్తధీబలవిద్యాప్రి ♦ విమలచిత్త
నీతివైరాగ్యభక్తిస ♦ మేతు లెపుడు
శత్రువు లకారణముగ నీ ♦ శ్లాఘ్యులకు. 95

వ. ఇంక గౌరాంగుండు. 96

శా. ప్రాణాపాయభయంబున న్జనిసక్ర♦ష్ణానందునార్తిధ్వనిఙ్
దా నాలించి నిజస్మృతి న్బొరసి సం♦తప్తాంతరంగంబుతో
నే నేలా యిటువంటిపిచ్చిపనుల ♦ న్జేయంగ నుంకించితిఙ్?
నానన్జైంద, కటంచు వ్రైచి పుడమి♦న్దండంబుఁ, గూలె న్ధరఙ్. 97

క. పంచమహాపాపము లొన
రించినవానిగతి మోము ♦ వ్రేలిచి, వెతఁ జి
తిరించినటులు గూర్చుండెను
గొంచక నడిబాట మిశ్రు ♦ కొమరుం డంతఙ్. 98

గీ. కొంతసే పటనుండి తా ♦ నంతఁ గదలి
చనియె గంగకు భక్తసం ♦ ఛయముతోడ

నచటఁ గూర్చుండి కూర్చుండి ♦ యట్టహాస
మొందు గావించె భక్తుల ♦ గుండె లవియ. 99

గీ. హాప మతిదుఃఖమున నట్లు ♦ చేసి నిమి వ
చించుకొనెఁ దనలోనఁ దా ♦ నిట్టు 'లయ్యొ!
యెంచి చూచిన రోగార్తి ♦ కెక్కు డయ్యెఁ
జేసెదుచికిత్స; నే నేమి ♦ చేయువాఁడ ?' 100

ఉ. ఈగతి నవ్వలే దెపుడ ♦ హీనముదావహహాసచంద్రిక
దోఁగఁగఁ జేసెఁగానిమముఁ♦దోయజనేత్రుఁడుస్వామి; యిద్దుః
ఖాగతహాసమట్లు గన ♦ నయ్యెడు ; నాతఁడు వల్కినట్టివా
క్యాగ మదేమి ? యంచుఁ దల♦పోయుచునుండిరిభక్తపుంగవుల్.

గీ. ముందునకు వచ్చి యప్డు ము ♦ కుందుఁ డిట్లు
పలికెఁ నోవెఱ్ఱులార ! త ♦ద్భావ మిదిగో!
'యేను వీరల విడనాడి ♦ యేగువాఁడ
నంత నందఱుఁ జాల దుః ♦ ఖింతు ' రనియె. 102

వ. తక్కువా రిట్లనిరి. 103

ఆ. అర్థ మద్ది యెట్టు ♦ లౌనయ్య! యది గాదు
వానిఁ బాసి మనము ♦ బ్రతుకలేము
ఘనము ప్రేమ యెపుడు ♦ మనమీఁదఁ బ్రభునకు
నతఁడు మనలఁ జంపి ♦ యరుగువాఁడె ? 104

వ. ముకుందుండు తల పంకించి యీవృథాసంతోషంబులు మానుం
డని యిట్లనియె. 105

ఆ " భక్తులార! మిమ్ము ♦ వదలి పోవుట మది
కేగుదెంచినప్పు ♦ డెల్ల గుండె

లవియుచున్న" వంచు ♦ ననలేదె స్వామి శ్రీ
వాసునింట వింతఁ ♦ జేసినపుడు? 106

వ. దానిపై భక్తులందఱు దిగులువడి యుండిరి. కొన్నాళ్లు దాఁటిన పిదప మౌనముద్ర వీడి గౌరాంగుం డేకాంతంబున నితితో నిట్లనియె. 107

ఆ. ఊర నేమి చేయ ♦ నూహించుచున్నారొ
నీకుఁ దెలిసెనేని ♦ నితి! వచింపు;
నన్నుఁ గొట్టఁ జూచు♦చున్నా రెఱుంగవే?
యన్యు లెవరుఁ జెప్ప ♦ నైన లేదె? 108

వ. విని దుఃఖానమితశిరస్కుం డై యెఱింగినవాఁ డయ్యుఁ జెప్ప నిష్టంబులేక నితి మిన్నకుండె; నది చూచి వెండి గౌరాంగుం డిట్లనియె. 109

క. ఆలోచన నే నెఱుఁగుదు
నాలోచనపరులుఁగూడ ♦ నాలోకితు లై
రాలోచన సెప్పు మిపుడు
కాలోచితకార్య మెదియొ ♦ కావింతు నితీ! 110

వ. అందునకు నితి యేమియుఁ బ్రత్యుత్తరం బీయఁజాలకుంట చూచి గౌరాంగుండు వానివంకఁ దేఱిచూచి నేఁ జేయఁదలఁచుకొన్న దేదియో చెప్పెద వినుమని యిట్లనియె. 111

గీ. అందఱను వీడి సన్న్యాసి ♦ నౌచు నాదు
శత్రువులయిండ్లకడనె బి ♦ చ్చంబు నెత్తు
వాఁడ; దాన వారలు మిత్ర ♦ వర్గ మౌదు
రంతియేకాక హరినామ ♦ మందుకొంద్రు. 112

వ. ఈమాటలు వినినతోడనే యశనిపాతం బయినట్లు నితి విషాద
వివర్ణవదనుం డై డగ్గుత్తికతో నిట్లనియె. 113

ఉ. శోకము శోకు వీడి మముఁ ♦ బూతశరీర ! పురంబులోనిప
ల్గాకులుఁ గూడ నిన్నైనకి ♦ కాఱియపెట్టరు, పెట్టఁజాల, ర
స్తోకకృపాంతరంగ ! స్మర♦సుందర ! సంయమివౌచుఁ బోయితే
నీకయి వేనవేలు మర ♦ ణించెద ; రిద్ది నిజంబు నమ్ముమా!114

క. చూడుము మము నీభక్తులఁ;
జూడుము నినుఁ గన్నతల్లి; ♦ సుందరవనితా
చూడామణి భార్యను గను;
వీడుము గార్హస్థ్య మపుడు ♦ విడఁ గల్గుదువే. 115

వ. గౌరాంగుం డిట్లనియె. 116

సీ. నామార్గ మొల్లని ♦ నరులను దూఱకు
మురుభోగములఁ గోరిలు ♦ చుంటి నేను
భక్తమండలదత్త ♦ భాగ్యరాసులు నావి
రాజులు దొడుగువ ♦ స్త్రములు నావి
సద్యోఘృతోపేత ♦ శాల్యన్నములు నావి
పక్వఫలంబులు ♦ పాలు నావి
మేర మీఱినసుప ♦ టీరచర్చలు నావి
వికచలతాంతమా ♦ లికలు నావి

గీ. యాయతైహికభోగప ♦ రాయణుఁడను
గాదె నే ; నిట్టిభోగుల ♦ కడకు వచ్చి
యీసుఖంబులలో నించు ♦ కేని లేని
గృహివిరాగులు హరినామ ♦ మెట్లు కొందురు? 117

గీ. సకలరాజోపచారము ♦ లనలిపినట్టి
వారి నెడఁబాసి పోవుట ♦ పాప మనియుఁ
గృష్ణభక్తికి నడ్డులే ♦ దింట నుంట
యంచుబోధింప నుంటి గృ ♦ హంబునందు. 118

క. మాతకు గృహిణికి మీకును
జేతోమోదంబు సేయఁ ♦ జిక్కితి గృహమం;
దీతీ రిఁగ బాధక మగుఁ
బూతశ్రీకృష్ణనామ ♦ బోధంబునకున్. 119

ఆ. తఱికి వేచి వేచి ♦ తత్తఱపడుచుంటి;
నింతకాలమునకు ♦ నేగుదెంచె
నాత్మభాగ్యగరిమ ♦ ననుకొన్నసమయ; మం
దఱను విడిచి చనుట ♦ తప్ప దింక. 120

గీ. చెప్పు శ్రీపాద! యిం దేది ♦ సేయు మనెదొ
మిమ్ము సంతోషపెట్ట గృ ♦ హమ్మునందె
యుండుటో! హరినామ మిం ♦ కొందురీతిఁ
గొనని పెక్కండ్ర రక్షింపఁ ♦ గోరి చనుటో. 121

గీ. మాఱువల్కఁగఁ జాలక ♦ యూర కుండె
నితి శిరము వాంచి "నీతోడ ♦ నేను వత్తు"
నంచు; దురదృష్టవతు లైన ♦ యతివలగతిఁ
గూర్చి మాత్రిము మనసులోఁ ♦ గుళ్లు చుండె. 122

క. ఈపరమసుందరుం డెటు
కౌపీనపుఁగావితాల్పు ♦ కాఁగలఁ డయ్యో!
యేపగిదిఁ బ్రదుకఁ గలఁ డని
వాపోవు నహర్నిశంబు ♦ బాష్పము లురలన్. 123

ఆ. ఎంతబాధ నొంది • యేడ్చుచుండిన, నితి
చెప్పఁడయ్యె నొక్క • స్నేహితునకుఁ
బరమమిత్రత, నిమి • వల్కినపల్కులు ;
గాని కూడుఁ గూర్కు • మాని యుండె. 124



క. నీకృపఁ బడయఁగ భక్తుల
నేకులు గృహిణీతనూజ • హితబాంధవులన్
ప్రాకృతవిషయసుఖములఁ దృ
ణీకృతములుగా నొనర్ప • నేర్తురు రామా! 125



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### ద్వితీయాశ్వాసము.

ఉ. సృష్టిని జేయుచుందువు వి ♦ చిత్రపరంపర; మంచివారలన్
గష్టముపాలు సేసి యది ♦ కర్మఫలం బని కన్నుదుడ్చి నీ
యిష్టమె తీర్చికొందు వీక ♦ నెన్నియొ పోకలు పోయి; మాయ వి
స్పష్టము సేయ వెంత నెఱ ♦ జాణవొ! భానుకులప్రదీపకా! 1

సీ. ఇంతకాలము సహి ♦ యించితిఁ గష్టంబు;
నిఁక సైఁపఁజాల నీ ♦ కృష్ణవిరహ;
మాకుటిలాలకు ♦ నాదర మే నొంద
వలయు; దయానిధి ♦ వాసుదేవుఁ;
డేల నాయుబలాట ♦ మీక్షింపఁ; డాతని
దర్శనంబే చాలు; ♦ దాని నీఁడె?
మధురమంజులరూప ♦ మాన్య! శ్రీకృష్ణ! నేఁ
దహతహపడుచున్న ♦ దాన నయ్య!

ఆ. ప్రాణనాథ! కంటఁ ♦ బడకుంటి వింకను;
బడకయుంటివేని ♦ బ్రతుక లేను;

నన్నుఁ బట్టుకొనకు ; ♦ నాథుపజ్జకుఁ బోము ;
ననుచుఁ బొక్కునిమి య ♦ హర్నిశంబు. 2

వ. ఇట్లనేకదినంబులు గడపి యొక్కమధ్యాహ్నంబు గదాధరు
నురంబుపైఁ దనవెన్ను చేరిచి కాళ్లు సాఁచికొని సీత్కారమ్లా
నాధరంబుతోఁ, బరాగలిప్తాంగంబుతో, సంతతబాష్పస్రావరక్త
నయనంబులతో, భక్తిభరోద్భూతతనుకంపంబుతో, గద్గద
కంఠంబుతో, నిమి నిజభక్తవారంబుం బిలిచి యిట్లనియె. 3

చ. స్వసుఖపరాఙ్ముఖత్వమునఁ ♦ జాయలపోల్కి నెంబడించి, యీ
వసుధ నపూర్వమైనభయ♦భక్తుల సేవలు సేసినారు నా
కు సఖులు ; మిమ్ము వీడి యల♦గోపకుమారునిఁజూడఁబోయెదన్ ;
మనలఁగఁజాల నిచ్చటను ; ♦ మక్కువఁ జూపి క్షమించి పంపరే!

క. ఈకాయము మాయందఱు
దేకరణిని దానిఁ జేయ ♦ నిష్టపడెదరో
యాకరణిఁ జేయుఁ ; డమ్ముదు
రో ! కాక యిఁ కెట్లునలుప ♦ నూహించెదరో ! 5

గీ. ఉర్విఁ బురుషార్థములలోన ♦ నుత్తమంబు
వాసుదేవాంఘ్రిసారసా ♦ వాప్తి సుండి ;
యవ్వి దొరకినఁ జాలు న ♦ ట్టడవి నున్న,
హర్మ్యమం దున్న, వే ఱున్న ♦ నంటి యున్న. 6

క. చనితిని నే నని శ్రీకృ
ష్ణుని గొల్చుట మానివేసి ♦ స్రుక్కకుఁ డయ్యా !
మనమున, వాక్కునఁ, గాయం
బున, నాతనిసేవ చేసి ♦ ముక్తిని గనుఁడీ. 7

క. ధనపరత దూరదేశం
బునకుం జని వణిజుఁ డచటఁ ♦ బుష్కలవిత్తా
ర్జన చేసి సౌఖ్యసెట్టును
దనవారల మఱల వచ్చి ♦ ధనరాసులచేఁ. 8

ఆ. అట్లె నేనుఁ గూడ ♦ నరిగి కృష్ణప్రేమ
మరసి సంగ్రహించి ♦ మఱల వచ్చి
బంధుమిత్రితతికిఁ ♦ బంచిపెట్టెద వారి
వదలిపోయినట్టి ♦ వంతఁ బాపి. 9

వ. ఈమాటలు విషలిప్తనిశితనారాచంబులభంగి భక్తహృదయంబు
ల నాట; నంతఁ దోర్ద్రోల్త శ్రీవాసుం డిట్లనియె. 10

గీ. నీదునెడఁబాటునకుఁ దాళి ♦ నిలువఁ గల్గు
వీరు లలకృష్ణప్రేమకై ♦ వేచి యుందు
గాక! యూఱటఁగొల్పవు ♦ నాకుమాత్ర
మీవు వల్కినబొంకులు ♦ నిచ్చకములు. 11

వ. స్వభావభీరు వగుగదాధరుం డెన్నం డెఱుంగని ధైర్యంబుఁ దెచ్చి
కొని యి ట్లనియె. 12

గీ. స్వామి! నీవింతపల్కులు ♦ స్పష్టపడవు;
మము వదలిపోదు వన్న నీ ♦ మాత శచిని
వదలుదు వటన్నమాటయే! ♦ వార్ధకమునఁ
దల్లిముప్పును గడపుట ♦ తెల్ల మయ్యె. 13

క. ఒకఁడే కొమరుం డాత
ల్లికి వృద్ధకు సేవమాని ♦ లేచి చనుమటం
చకటకట! చెప్పి పుచ్చెదు
వికటశ్రీకృష్ణభక్తి ♦ వీడఁగ వలదే? 14

వ. ఈ మాటలకు భక్తు లందఱు నాశ్చర్యమగ్నులై చూచుచుండిరి. గౌరాంగుఁ డనంగీకారసూచకంబు లగుచూపులు వఱపి గదాధరుతో ని ట్లనియె. 15

గీ. అస్వలాభాభిలాషాంచి ♦ తానురాగ
ముండెనే నీకు నాయెడ ♦ నోసఖుండ!
నేను బోయినతరువాత ♦ నీవు నాదు
మాతకుం గల్గుదుఃఖంబు ♦ మాన్ప లేవె? 16

క. నీమాట లగ్నిపోలిక
నామనసు దహించు; నద్దు♦నా కిది యొండే;
నామాతవంత యాఱిచి
యోమిత్రమ! నా కొనర్పు ♦ ముపకారంబున్. 17

ఆ. వ్యపగతాత్మ మైన ♦ వ్యర్థశరీరపు
గుల్ల యేమి మేలుఁ ♦ గూర్చు మీకుఁ
గృష్ణుకడకుఁ జిత్త ♦ మెగిరిపోయిన దయ్యొ!
యుండఁజాల నిచట ♦ నుండ నయ్య! 18

చ. దవదహనంబుమాడ్కి తను♦దాహ మొనర్చుచుబాదిసేయుఁగృ
ష్ణవిరహ మయ్యొ! సౌఖ్యము నొ♦సంగున దెద్దియులేదునాకు నీ
భువి నలకృష్ణదర్శనముఁ ♦ బొందుట తక్కను; మీకుఁ జాల మ
క్కువగద నాపయి న్వలదొ♦కో! ననుమృత్యువునుండి కావఁగన్. 20

వ. మురారి యి ట్లనియె.

గీ. మహితవిషయలంపటుల మా ♦ మాదునెదల
భక్తిబీజంబులను నాటి ♦ వానిఁ బెంచి
యిప్పు డామొక్కలను జంపి ♦ యేగుటె కద!
మమ్ము విడనాడి పోవుట ♦ మంజుగాత్ర! 21

వ. పిదప హరిదాసుండు మున్నగుతక్కుభక్తులెల్ల వారివారికిం దోఁచినయుక్తు లుపయోగించి గౌరాంగు నతనితీక్ష్ణోద్యమంబు నుండి మఱలింపఁ బ్రయత్నించిరి. చివరకు ముకుందుండు వాద సాధనంబు నిరర్థకం బని యెంచి వెక్కివెక్కి యేడ్చుచు గౌరాంగుపదంబులపైఁ బడి యిట్లనియె. 22

గీ. మమ్ము విడఁద్రొక్కి పోదువా! ♦ మహితతేజ!
నీవు మాప్రాణమవుఁ బ్రాణ ♦ జీవమవును
నీవు లేకుండ జీవింప ♦ నేర మయ్య!
హృదయదళనంబుఁ గావింతె ♦ యేగి మాకు? 23

వ. అంతఁ గపటమానుషవేషుం డగుగౌరాంగుం డొకపెద్దనవ్వు నవ్వి యెల్లభక్తుల నాలింగనంబు సేసికొని శాంతింపఁజేసి యిట్లనియె. 24

సీ. ఈపాటిదాని కీ ♦ రేల చింతిల్లెద;
రరిగిన మఱుల రా ♦ నట్టిపోక
కా; దెట్లు నను వీడి ♦ కాయంబు నిల్వఁగాఁ
జాలరో మీ రట్లె ♦ నలుప లేను
జీవయాత్రను నేను ♦ క్షితి మిమ్ము విడనాడి;
కతము లేనట్టిదుః ♦ ఖమును జెంద
కుండుఁడు, మనకు వి ♦ యోగం బదింతటఁ
గలుగదు; కలిగినఁ ♦ గలుగుఁ గాక

గీ. యెల్లకాలంబు నట్లుండ; ♦ మింక నెన్ని
సారులో కలిసికొందుము; ♦ సత్ప్రసంగ
ముల నొనర్చెద; మీయంశ ♦ మునుగుఱించి
ముందు భాషింతు; మూరక ♦ పోకవలదు. 25

వ. అని చెప్పి. 26

క. ప్రతిభక్తాగారమునకుఁ
బ్రతిదినమున నేగి, సాను ♦ రాగత నిమి తా
బతిమాలి మృదుచతురవా
క్తతితో నొప్పించి వారి ♦ తాపము వాపెన్. 27

వ. ఈకాలంబున భక్తచిత్తస్థితి యెట్లుండెనో యీక్రిందినరహరి రచితగీతంబువలనం దెలియ నగు. 28

ద్వి. రోగమో! యేమొ! యె ♦ ఱుంగరా దిప్పు
డీగతి నుంటి నే ♦ నేమికతంబొ?
గౌరాంగుఁ జూచిన ♦ కాలంబునుండి
పారవశ్యంబులోఁ ♦ బడి యున్నవాఁడఁ
గనుమూసికొన్న జా ♦ గరమున నున్నఁ
గనఁబడు భావజా ♦ కారుఁ డౌనతఁడె
ప్రక్కల మ్రోలను ♦ బైఁ గ్రింద వెనుక
నెక్కొని కాన్పించు ♦ నిమిముద్దుమోము
కంటిలో నుండు నా ♦ కాంచనకాయుఁ
డింట, నావల, మింట ♦ నెల్లవస్తువులఁ
దూటి నామెదలోనుఁ ♦ దోఁచెడు నౌర!
గౌరాంగమయ మయ్యెఁ ♦ గా! లోకమంత. 29

వ. ఇట్లుండ. 30

క. కొడు కుండు తెఱఁగు, భక్తులు
పడునలజడి, విశ్వరూపు ♦ బాల్యావస్థ
వడి స్మృతికిఁ దేర నెద త
ల్లడమందెను బుత్రవత్స ♦ లత్వచే శచిరన్. 31

వ. ఒక్కనాఁడు తన చెల్లె లగుచంద్రశేఖరపత్నిని రావించి శచి యి ట్లనియె. 32

శా. వాసంబందున నిల్వఁడే! నిమి; గృహ♦వ్యాపారము ల్లేవు; చిం తాసక్తుం డగు నెప్డుఁ; బిల్చినఁ బర♦ధ్యానంబులోఁ బల్కు; స న్న్యాసుల్నెయ్యురు; బాష్పబిందువులెనీ♦రాహారముల్; చెప్పవే! యోసీ! సంసృతి రోసివీఁడుఁజనునే♦మో! యన్నమార్గంబునన్.

గీ. వచ్చె సన్న్యాసి కేశవ♦భారతి యను
వాఁ డొకఁడు మొన్నఁ గాత్యాని♦ పాసి యిటకు;
నంత మనవాఁడు వాఁడు నే♦కాంతముగను
గూడి యేమేమొ గుసగుస♦లాడుకొనిరి. 34

క. అది గాంచి నాదుగుండెలు
చెదరంగాఁ జొచ్చె; వీని♦చేష్టలుఁ జూపుల్
తుద కేమి తెచ్చునో! నేఁ
బ్రిదుకు టెటు లీవఁడు మనల♦వదలి చనినచోన్? 35

క. మన మేల భయమునొందుట?
చనఁడే భక్తుఁ డగువాఁడు♦ సంయమికడకున్?
బని లేనిచింతఁ దవులకు
మనె 'శేఖరు' భార్య దుఃఖ♦మార్పఁగ శచికిన్. 36

వ. శచి యి ట్లనియె. 37

ఆ. అయ్యొ! విశ్వరూపుఁ♦డందఱు విడనాడి
పోవలేదె వెన్కఁ;♦ బురికిఁ గావి
బట్టవార లెవరు♦ వచ్చిన నాగుండె
దడదడమనుఁ దల్లి!♦ తథ్యముగను. 38

గీ. అట్టు లైనను దిన్నఁగా ♦ నరిగి నిమినె
యడుగు ; డాఁపఁడు నీకడ ♦ నాతఁ డేమి
యనియె శచిచెల్లె; లంతలో ♦ నటకు వచ్చె
నెచట నుండియొ గౌరాంగుఁ; ♦ డేగుదెంచి. 39

గీ. మ్రొక్కె గృక్కన వారికి ♦ మోఁద్రిల నతఁడు ;
తల్లు లాశీర్వదించిరి ♦ తనయు ; నంత
గుండె దిటవుపఱుచుకొని ♦ కొమరుతోడ
నెదుటఁ దా నిలఁబడి శచి ♦ యిట్టు లనియె. 40

క. నే నొకటి యడుగఁ దలఁచితి
నోనిమి! ధారాళముగ న ♦దుత్తర మిత్తే?
నా, నిమి తప్పక యిచ్చెద
నా, నూహించి శచి యిటు త♦నయుతో ననియెన్. 41

క. నిమి నిన్నుఁ బాసి నే నొక
నిముసంబును నింట నుండ ♦ నేర ననుట స్ప
ష్టముగా నెఱుఁగుదువు కదా!
సమయింతే నన్ను వీడి ♦ చని యెడ్డేనిన్ ? 42

వ. ఉత్తరం బిచ్చుటకుఁ బూర్వము కొంతసే పాలోచించి పూర్ణమా
తృప్రేమద్యోతకంబు లగుచల్లనిచూపులు శచిపైఁ బఱపి నిమి
యి ట్లనియె. 43

గీ. అమ్మ! నే నొక్కపూతస్థ♦లమ్ముకడకు
యాత్ర వోనెంచినాఁడ ; నీ ♦ వడల కమ్మ!
నీసెలవు నందియే పోదు; ♦ నేను బోయి
నను మఱల వత్తు నీకు వం♦దనము సేయ. 44

చ. అఱువదియాఱువర్షముల ♦ యమ్మకు సమ్మతిగాఁగఁ బోదునం
చఱమఱలేక పల్కె నిమి ♦ యాతనిసాహస మేమొ? తల్లియుం
బొరసె ముదంబు నింత పరి♦పూర్ణపుఁబ్రేమను సూనుఁడెన్నఁడున్
వఱలఁగలే దటంచు; శచి♦వంటి యమాయికురాండ్రు లేరుగా!

ఉ. ఆడినమాట తప్పఁ డెపు♦డాత్మజుఁ డద్దృఢనిశ్చయంబుతో,
వేఁడిన సన్న్యసించుటకు ♦ వెళ్లెనె నే సెలవీయ? నంచు నా
ప్రోడను జూచి పొంగి శచి♦"రూఢిగ నీ వనిన ట్లొనర్తు వే
పాడిఁ దొఱంగ" కన్ననిమి♦"పల్కినయట్లెయొనర్తు నే" నన౯.

వ. గయనుండి వచ్చినదాదిగ నప్పటివఱ కంతయనురాగంబుతో
నావకాశంబుగ మన సిచ్చి కొమరుం డెప్పుడు మాటాడలే దని
శచి కొండంతసంతసం బంది యాతనియెడలఁ దాఁ జేసినయొక
యకార్యంబు జ్ఞప్తికి రాఁగ 'గౌరాంగా! నే నొకయపచారంబు
సేసితి; మన్నింపవలయు' నన నిమి యి ట్లనియె. 47

క. నీవంటితల్లి నాయెడఁ
గావించినకార్య మెదియుఁ ♦ గా దపకృతి; య
మ్మా! వగపు మాని యది యే
దో వక్కాణింపవమ్మ! ♦ తొరపడుదు విన౯. 48

వ. చెమ్మగిల్లిన కన్ను లొత్తుకొని శచి యి ట్లనియె. 49

గీ. విశ్వరూపుఁడు ననుఁ దండ్రి ♦ విడిచి పోవు
నప్పు డొక పుస్తకంబు ర ♦ హస్యముగను
బెట్టి నాచేతిలో నిమి! ♦ పిన్నవయసు
దాఁటినపిదప నిమ్మనె ♦ దాని నీకు. 50

వ. అనిన విని కాలవిలంబంబున కేమియుఁ జింతింపవలదు తల్లీ!
దాని నిప్పు డీయవచ్చు నన శచి దుఃఖాక్రాంతచిత్తయై యి

ట్లనియె. 51

సీ. గ్రంథ మిచ్చినకొంత ♦ కాలంబునకు విశ్వ
రూపుండు సంసృతి ♦ రోసి పోయె;
నదిగాక యతఁడు స ♦ న్యాసిగాఁ దనపోల్కి-
నినుఁగూడ రమ్మని ♦ నెమ్మి బోధ
పఱుచుచున్నట్లు స్వ ♦ ప్నమునందు నొకరేయి
కాంచితిఁ; జాలదుః ♦ ఖంబుపడితి;
నంత విద్యావంతుఁ ♦ డౌపుత్రుఁ డిహసౌఖ్య
ములఁ వీడి, నను వీడి ♦ పోవు నంచు

గీ. నెంచి సంతప్తహృదయ నై ♦ యింక నీవు
దానిఁ జదివిన జోగి వై ♦ తరలిపోదు
వనెడుభీతిని దాని—నే ♦ మని వచింతు?
నగ్నిదగ్ధంబుఁ జేసితి ♦ నయ్య! తండ్రి! 52

గీ. హరి! హరీ! యనె నిమి; యంత ♦ నంబుదావృ
తం బయినపూర్ణచంద్రబిం ♦ బంబుమాడ్కి-
నాననం బొకనిమిషము ♦ గానిపించె;
నపుడె తెప్పిర్లి గౌరాంగుఁ ♦ డనియె నిట్లు. 53

క. మాతృప్రేమను జేసితి
వాతీరున నీవు నను గృ ♦ హంబునగార్హ-
స్థ్యాతతసురుచిరసౌఖ్య
వ్రాతాంబుధి నోలలార్ప; ♦ వసరకు తల్లీ! 54

వ. అని చెప్పి చనియెఁ గాని తల్లిమనంబు క్రమక్రమంబుగ మఱల సంశయదుఃఖాశ్రయం బై కుదురుపడక యుండె. భక్తులమోము చూచిన, వారిపల్కులు వినినఁ దన కేదియో కీడు మూఁడనున్న

దని శచి చింతిల్లుచుండె; నిట్లు కొన్నాళ్లు గడచినపిదప నేకాం
తంబుగఁ గొమరుం జూచి యొక్కనాఁ డామె యి ట్లనియె. 55

గీ. ఏగుదును యాత్ర కంటివి; ♦ యెప్పు డేగు
వాఁడవో, పోవునట్టిభ♦వ్యప్రదేశ
మేదియో స్పష్టముగఁ జెప్పి ♦ నాదుమనము
నలజడిని మాన్పివేయవు♦రా! కుమార! 56

గీ. తనదుహృదయాభిలాషంబుఁ ♦ దల్లి కిపుడు
చెప్ప సమయం బటంచు శ♦చీతనూజుఁ
డల్లబృందావనంబున ♦ కరుగ నాకుఁ
బ్రియతమం బైనయొకచిత్త♦వృత్తి గలదు. 57

వ. అని 'బృందావన' శబ్దోచ్చారణంబున భక్తిపరవశుం డయి యొకించుకసేపు మాటాడలే కూరకుండి వెన్వెంటఁ దెలివి చేసి కొని క్రమ్మఱ ని ట్లనియె. 58

క. జననీ! యటు సేయను నీ
యనుమతిఁ బుచ్చుకొన కే స♦టంటిని నీతోఁ
వెనుక; న్నే నట కరుగుట
కనుజ్ఞ నా కిప్పు డీయ♦వా? దయతోడన్. 59

వ. శచి దాని కుత్తరంబు సెప్పక "నాయనా! నిన్నుఁ గూర్చి ప్రజ లేమేమో గుసగుస లాడుచున్నవారు; దానికతంబు మోస పుచ్చక నాకుఁ జెప్పు" మని యడిగె; నంత నిమి జాలిఁ గొల్పు మొగంబుతోఁ సరనిరుద్ధబాష్పప్లుతం బగునయనద్వయంబుతోఁ దల్లిం జూచి యి ట్లనియె. 60

మ. పదిపై రెండునెల ల్త్వదీయశుభగ♦ర్భంబందున న్మోసి, యా
పిదపన్ స్తన్యము నిచ్చి పెంచి, కొడుకే♦పృథ్వి న్సమస్తంబుగా

మది నూహించి మెలంగి, తండ్రి గతియిం♦ప న్విద్య నేర్పించియుం
తదయ నోర్చితివమ్మ! యీతనువు; మా♦తా! యంతనీదేకదా!

ఆ. ఇంత చేసినావు ♦ ఋణ మెట్లు తీర్చుకోఁ
గలను దల్లి! శేష♦కాల మింకఁ
బ్రాణ మైన నిచ్చి ♦ నే నిన్ను సుఖపెట్ట
వలదె మాతృభక్తిఁ?♦ బలుకు మమ్మ! 62

వ. ఏదియో పిడుగువడ నున్నదని తలంకుచు మార్వల్కలేక శచి మిన్నకుండ గౌరాంగుండు వెండియు ని ట్లనియె. 63

సీ. నీవాఁడ నై యుండి ♦ సేవచేయుట విధి;
విధియె శ్రీకృష్ణుని ♦ వీడుటయును;
నే నేమిసేయుదు ♦ నీకంటె బలవంతుఁ
డై నాఁడు శ్రీకృష్ణుఁ ♦ డయ్యొ! తల్లి!
కొమరుఁడు రోగియో! ♦ గుడ్డియో! యైనప్పు
డేమిచేయును మాత? ♦ యేను నట్లె;
నీఋణమును దీర్ప ♦ నేర నెమ్మెయి; నన్ను
ఋణవిముక్తుని జేసి ♦ యీధరాత

గీ. లమున నాత్మసుఖత్యాగ♦విమలచిత్త
పుత్రవత్సలమాత వ♦న్పుణ్యకీర్తిఁ
బడయుమా! యమ్మ! కృష్ణుని♦కడకుఁ బోక
యుండలే నింక నే నింట ♦ నుండలేను. 64

వ. శచి యి ట్లనియె. 65

గీ. దాఁపక వచింపు గౌరాంగ! ♦ తరలి నీదు
నన్న విశ్వరూపునిమాడ్కి ♦ నన్ని వదలి

ధరణి సన్యాసివై నీవు ♦ తిరుగు దన్న
యర్థమే కద! యీమాట ♦ లన్నిటికిని. 66

శా. "ఓ నమ్మా!" "సుత! నాదుసమ్మతినినీ♦వర్థింతె యీకార్యమం"
"దౌ నమ్మా!" "యది మద్హృదుద్గతము స♦వ్యాజంబుశుద్ధంబునా
త్మానందప్రతిపాదకంబు నయి కా♦దా! రావలె న్బుత్రకా!"
"యౌ నమ్మా! యటువంటిసమ్మతి కెనేఁ♦బ్రార్థింతుఁ జేమోడ్చి నిన్."

గీ. కంటఁ దడిపెట్టుకొనదు; ప్ర♦కంపమొంద;
దధికధైర్యస్థిరత్వాంచి♦తాత్మ యగుచు
నెట్టయెదుటను నిలఁబడి ♦ కట్టెపోల్కిఁ
గొడుకుఁ గని యీవిధంబుగ ♦ నుడివెఁ దల్లి. 68

మ. అది నాసాధ్యము కాదు కాదు; భవదీ♦యప్రీతికై యట్లు సే
యుదుఁ జేయన్వలెఁ దప్పదన్న; నెపుడే♦నొండయ్యె నే? కానియెం
తదయాహీనపుఁదల్లియున్ సుతుఁడు స♦న్యాసంబుఁ గైకొంట కొ
ప్పదురా! చిత్తవిశుద్ధితోడ; నది య♦స్వాభావికం బాత్మజా! 69

క. తల్లిని, ముదుసలిదానను,
బిల్లం డొక్కండు, లేరు ♦ వేఱుగ నెవరున్,
దల్లులలో నధమాధపుఁ
దల్లియు నటువంటిసుతునిఁ ♦ దా విడఁ గలదే? 70

వ. అని నిమినిం దేఱిచూచి వెండియు నిట్లనియె. 71

క. సరియే నిమి! నన్విడెదు;
పరులే నన్మట్టిసేయఁ ♦ బడెదరు శ్రీమ; సుం
దరి, సాధ్వి, నేమి చేసెదు
తరుణి న్విష్ణుప్రియాభి♦ధానను జెపుమా! 72

వ. 'విష్ణుప్రియ' యనుమాట విషలిప్తశల్యంబువలె హృదయంబు

దాటి యేఁచ మహాద్రోహియ ట్లుత్తమాంగంబు వంచికొని నిమి
తల్లితో నల్లన ని ట్లనియె. 73

ఉ. పోయెద నేని భార్య సెల♦వు న్గొని పోయెద నమ్మ! జ్ఞానజ
న్యాయత సౌఖ్యమిచ్చెద మృ♦గాక్షికి నిక్కము నమ్ము; స్రుక్కినన్
గాయము స్రుక్కఁ గాక; మది♦కందదు కృష్ణునియాజ్ఞ మీఁద నేఁ
జేయఁగఁబోవుపుణ్యకృతిఁ ♦ జేడియ యించుక యెంచి చూచినన్.

క. ఇహసుఖ పరజనదృష్టిని
బహుదుఃఖాత్మకయె నాదు♦పడఁతి; యయిన నే
నహరహమును బడఁబోయెదు
నిహకష్టము లంతకంటె ♦ నెక్కుడు తల్లీ! 75

వ. శచి యంత నిమిసంభాషణప్రవాహంబున కడ్డు వచ్చి గ్రుడ్ల
నీళ్లు గ్రుక్కుకొనుచు ని ట్లనియె. 76

మ. అలినీలాలకఁ, బార్వణేందుముఖి, లో♦కాతీత సౌందర్యరా
శి, లసచ్ఛీల, విశాలనేత్ర, సకల♦స్త్రీస్తుత్యసమ్యగ్గుణా
వళికి న్నెలగు టెంకి, శ్రీమతి, మృదు♦స్వాంతాభిరామన్, సతీ
తిలకంబు న్విడనాడి పోవు టది పా♦తిత్యంబురా! నాయనా! 77

గీ. ఓరి! గౌరాంగ! మృతిదాఁక ♦ నుండునట్టు
లధికదుఃఖార్త విష్ణుప్రి♦యాక్షమాలఁ,
దెఱవ కన్నీళ్లయాణిము♦త్తెములసరము,
నెట్లు నీతల్లిమెడ వైచి ♦ యేగఁగలవు? 78

సీ. గౌరాంగ! భక్తాగ్ర♦గణ్యుండ వైతి; వ
పారంబు లోకంబు♦పైని ప్రేమ
నీ; కది వింటిని ♦ నేఁ గంటిఁ గనులారఁ;
దత్స్మృతి మదినుండి ♦ దాఁటి పోదు;

వసుధ సందఱపైని ♦ బరిసరించునిపేరిమ
రస మేల మాపైకి ♦ రా దొకింతఁ;
దల్లియు భార్యయు ♦ ధరలోనిజనులలో
వారలు కారొకో ♦ భక్తసింహ!
ఆ. లోకదుఃఖదమన! ♦ ప్రాకటమోక్షప్ర
దాత! జననమరణ ♦ తాపశమన!
తల్లినైననన్ను, ♦ దార యానాముగ్ధ,
నేడిపించి చనుట ♦ పాడి గాదు. 79

వ. అంత నిమి యీమార్గం బేకంబనికిరాదు; పుత్రిత్వం బవ్వలికిఁ దోసి బోధకత్వంబుఁ దాల్చెదఁ గాక యని తల్లి కి ట్లనియె. 80

సీ. దారికి వచ్చితి ♦ తల్లి! యిం కాలింపు
చెప్పెద నీకు వి ♦ శేష మొకటి;
జీవముఖ్యార్థంబు ♦ శ్రీకృష్ణుఁ బడయుట,
యదియె సౌఖ్యము; దుఃఖ ♦ మన్య మమ్మ!
యిహదుఃఖములు మాయ ♦ లే! యని నమ్ముము;
శ్రీకృష్ణభక్తులఁ ♦ జెనక వవ్వి;
శ్రీకృష్ణుఁ గొల్వుము ♦ చెదరిపోవును వంత;
చేకూఱును బరిశాంత ♦ చిత్తసుఖము;
ఆ. నీకు బాధలేని ♦ లోకోపకారకృ
త్యముల కడ్డురాక, ♦ యాగ్రహింప
కంపు నన్ను నిర్మ ♦ లాంతరంగంబుతోఁ;
దల్లియాజ్ఞ లేక ♦ తగదు పోవ. 81

క. కరుణావంతుఁడు, ప్రేమకు
నిరవౌ శ్రీకృష్ణుఁ డాతఁ ♦ డెట్టులు చెప్పఁగా

నరులకు విధి యటుసేయుట
పరమానందమున వినయ♦భక్తిభయములన్. 82

గీ. నిత్యకల్యాణగుణశుద్ధ♦సత్యమూర్తి
చెఱుగులను జేయు మని యెప్డు ♦ చెప్పఁ డమ్మ!
విధుల కభ్యంతరము సేయు ♦ వెఱ్ఱితల్లి
యెంతపాపంబుపా లౌనొ ♦ యెంచి చూడు. 83

ఆ. కృష్ణునాజ్ఞమీఁద ♦ నే నేను జన నుంటి;
నింద నాదుమన సొ♦కింత లేదు.
తోయజాక్షుపనికిఁ ♦ దోడు గావలెఁ గాని
తల్లి! యడ్డుపడుట ♦ తగునె చెపుమ? 84

గీ. లౌకికానందలోపంబు ♦ నీ కగు నని
యొరులశాశ్వతసౌఖ్యంబుఁ ♦ జెఱుపఁ గూడ;
దట్లు చేసినవారలు ♦ స్వార్థపరులు.
స్వప్రయోజనపరత పా♦ప మని వినవె? 85

క. ఇంచుక కష్టముపడి పం
పించిన న న్నేనవేలు♦విష్ణుకృపానం
దాంచితు లయి తరియింతురు;
కాంచఁగ నిలఁ బుణ్య మింత♦కంటె న్గలదే? 86

ఆ. పాపభీతి నైనఁ, ♦ బాపనిపైఁ బ్రేమ
నైనఁ, బుణ్యకాంక్ష ♦ నైనఁ, గృష్ణ
భక్తి నైన,గాదు♦పావనకృత్యంబు
నకు సహాయపడుము ♦ నతు లొనర్తు. 87

వ. అంత. 88

క. చిత్రంబుఁ గరఁచుగోరాం
గోత్రమవాక్పుంజము విని • యాఱడి శచి ప్రి
త్యుత్తర మీయఁగఁ జాలక
చిత్తరువ ట్లుండెఁ గొంత•సే పచ్చోటన్. 89

వ. కొంతవడికిం దేఱి నికృత్తదుఃఖయు నిష్పంకచిత్తయు నై జ్ఞానా
నందోద్భూతబాష్పపూర్ణనయనంబులతో శచి నిమి కి ట్లనియె.

ఉ. ఇంతయు సంభవించు నని•యే మది భీతిలుచుంటి నయ్య! యీ
పుంతనె భావిసూచకుఁడు • వోయెను న న్విడి విశ్వరూపుఁ; డ
త్యంతసుఖంబు నా కెటులు•దక్కు నదృష్టవిహీనురాలికిన్?
జింత యొకింత లేదు; చను •శీఘ్రము లోకముఁ బ్రోవ నందనా!

చ. పతి గతియింప నున్నయది•పాపఘటం బిది; నిన్నుఁ బోలుస
త్సుతు ననురాగసంపదయు • సుందరరూపవిలోకనోద్భవా
యతసుఖభాగ్య మెట్లు గన•నయ్యెడురా? చిరకాల మింక నే
వెతఁదవుల న్బ్రజాతతికి • విష్ణుమహాత్మ్యముఁ జెప్పఁ బొప్పునా.

క. శ్రీకృష్ణుఁడు కరుణ న్బు
త్రాకృతి జనియించె నాకు • సంతతిభాగ్యం
బేకాంత కేనిఁ గల్గునె?
నా కేభీతియును లేదు • నాయన! చనుమా! 93

క. రాతిని గోఁతిని గజమును
దైతేయుని బ్రోచినట్టి•తండ్రి, తనుఁ బ్రజా
నేతం గుక్షిని దాల్చిన
మాతకు ముక్తిసుఖ మిచ్చి • మాన్పఁడె వెతలన్? 94

క. దేవస్పర్శనదర్శన
సేవాదిసుఖములు నాకుఁ • జేకుఱు నిత్యం

బీవాసంబుననే యని
భావించితి; నెట్టు లట్టి♦భాగ్యం బబ్బున్. 95

క. నే నొకతె నట్టిసామీ
ప్యానందం బందుచుండి ♦ యనిశ, మొరులకా
యానంద మొసఁగనీయను
గాన న్జను వారిఁ గావ ♦ గౌరాంగ! యిఁకన్. 96

గీ. అంద అజ్ఞానజన్యదుః♦ఖాంధకార
మగ్నులై యుండఁ బూరుషు♦లాత్మనినులును
నే నొకతుక మహానంద♦నిత్యమగ్న
నౌట ధర్మము గాదు గౌ♦రాంగ! పొమ్మ. 97

వ. అంతఁ బుత్త్రప్రేమ మనునిబిడమాయాంధకారంబు మఱలఁజిత్త
సీమం గప్ప శచి యిట్లనియె. 98

క. నీవే! నాప్రాణంబవు
గావా? నిమి! నీవు వోవఁ♦గా నేపగిదిన్
జీవింపఁగలను? ఛీ! ఛీ!
యీవగ యాత్మసుఖవాంఛ ♦ నేర్పడఁ దెల్పన్. 99

క. పరసుఖమునకై కష్టముఁ
బొరయుట యుక్తంబె, కాని ♦ పుత్త్రా! చిత్తాం
తరమున నెన్నోయాసలు
చొరఁబడియుండె, నవి యిపుడు ♦ సురుఁగఁగవలసెన్. 100

చ. కలికియు నీవునుం గలిసి ♦ కాపురముం బొనరింతు రంచుఁ, బి
ల్లలఁ గన వారి నెత్తుకొని ♦ లాలనభోజనహాస్యభాషణా
దుల నొనరింతు నే ననుచుఁ, ♦ దోరపుటాశను వేచియుండఁగాఁ
గలలపరిసంగమయ్యెఁగొడు♦కా! యిపుడంతయు నేమిచేయుదున్.

క. యోగ్య లగుకాంతలకె యా
భాగ్యంబులు గాని, యవ్వి • పరికింపఁగ నే
యోగ్యతయు లేనియీాని
ర్భాగ్యపుఁబెద్దమ్మ కెట్లు • రా! లభియించున్. 102

వ. ఇది య ట్లుండనిమ్ము. 103

ఉ. చిన్నతనంబునుండియును • జేతులఁ బెట్టుక పెంచినాను; మృ
ష్టాన్నముగాని యొండు తిన; • వన్న్యలు పెట్టిన నిచ్చగింప; వీ
తెన్నునఁ బెర్గినావు నిమి! • తీఱె ఋణంబిఁక నీకు నాకు నీ
యన్న తెఱంగున న్గనెద • వా! పరకాంతలె నీకుఁ దల్లులా! 104

మ. ధర పైఁ బున్నమ రేయిచందురుఁడును, ని•ద్దంపుఁ బైనయద్దంబులున్,
సరసీజాతము, లింద్రనీలములు, జ్యో•త్స్న, ల్పక్వబింబంబు, బం
గరునిగ్గు, ల్హారికీర్తనంబు, లకటా! • క్రొల్గంటి నీభార్య, యు
క్కఱ కెన్నాళ్లు పరంగు నే మఱవలే • నన్నాళ్లు ని న్నోనిమీా!

సీ. తినుతిను మనిపోరి • నను దిన్నఁగాఁ దిన,
వింటింట నెటు బిచ్చ • మెత్తఁ గలవు?
మృదులశిరీషస • మ్మితపాదములతోడ
నూరూరఁ దిరుగ నె • ట్లోర్వఁ గలవు?
సుకుమారదేహంబు • శుష్కింప నుపవాస
ముల స్నానముల నెట్లు • సలుపఁ గలవు?
లలితసుమాంబరా • లంకారములమాఱు
కావిబట్టల నెట్లు • గట్టఁ గలవు?

గీ. సురభిళపటీరచర్చలఁ • దొఱఁగి యొడల
భసితపటలంబు నీ వెట్లు • ప్రామఁ గలవు?

వీనికన్నిటి కేమి? నే ♦ నూనె రాచి
పెంచినశిరోజముల నెట్లు ♦ వీడఁ గలవు? 106

క. తిండి కొకయమ్మ వేఁడుచు
నుండుటకు న్బండుకొనుట ♦ కొక యిలు లేకే
నెండఁ బడి, వానఁ దడియుచు
ముండుఁడ నై పోదు నన్నఁ ♦ బొమ్మనఁ గలనే? 107

ఆ. ఇంత వంత నన్ను ♦ నేఁచుచు నుండఁగాఁ
జిత్త శుద్ధితోడ ♦ సెల వొసంగు
మనెద వయ్యొ! యట్టు ♦ లొనరింపఁ గల్గునే?
యెట్టికష్టమాత ♦ యేని తండ్రి! 108

వ, అంత నిమి మాతం గౌఁగిలించుకొని దుఃఖదవానలంబుం జల్లా
ర్చి యి ట్లనియె. 109

ఆ. తల్లిరో! యి దేమి? ♦ తపియించె దీ విట్లు
నేను బోవ నట్టు ♦ లేని; యిష్ట
పడుచు నన్ను నీవు ♦ పంపినఁగాక నే
నరుగ నన్నమాట ♦ యెఱుఁగవమ్మ? 110

వ. శచి యి ట్లనియె. 111

గీ. ఇద్ది కృష్ణాజ్ఞగాన నీ ♦ వేగు వేగ;
తడయరా దింకఁ దండ్రి! నీ ♦ తల్లికడను;
మనస్మనఃపూర్వకముగ స ♦ మ్మతి నొసఁగితి
ననుటమాత్రము నిమి! యస ♦ త్యంబుసుమ్మ! 112

వ. అంత నిమి యి ట్లనియె. 113

శా. ఓతల్లీ! యెవఁ డిచ్చగింపఁడు కళ ♦ త్రోత్కృష్టసౌఖ్యంబులన్
ప్రీతి న్గడ్పుచు నింట నుండుటకు? నా ♦ రీతి న్బ్రసర్పంగ నా

చేతంగా; దటువంటియూహ మొదలోఁ ♦ జేరంగనే వచ్చి కం
జాతాక్షుం డిలువీడి రమ్మనుచు స ♦ న్న్యాసించి వేధించెదుః. 114

ఆ. ఉండఁ జాలఁ దల్లి! ♦ యుండతే నే నింట;
నుంటినేని జీవ ♦ ముండ దింకఁ;
గృష్ణు వెతకవలయుఁ, ♦ గృష్ణుని గనవలెఁ,
గానిపించు బృంద ♦ కడ నతండు. 115

వ. అని సోలి భూమిపై వ్రాలఁ, దల్లి మోముపై నీళ్లు చల్లి తేర్చ;
నంత నాతండు కనువిచ్చి పూర్వస్మృతిం బొరసి యతిస్నేహయుక్తజనని
వదనుం డై వెండియు నిట్లనియె. 116

సీ. ఇలయెల్ల దుఃఖభూ ♦ యిష్ఠ మై యున్నది
మనుజులు దేవుని ♦ మఱచుకతనఁ;
దన్నును దనపరి ♦ శ్ర్తత్వంబు నేఁ జాట
వలెనని శ్రీకృష్ణు ♦ వాంఛ, యాన;
సన్న్యాసి నై నేను ♦ జనవలె నింటింటి
కందుల; కేల స ♦ న్నైహికసుఖ
భోగులయొద్దకుఁ ♦ బోవరు పెక్కుఱు
కృష్ణభక్తిని స్వీక ♦ రింపఁ గోరి

ఆ. నేను గోరుకోర్కె ♦ నెఱవేర్చితేఁ గృష్ణుఁ
డవనిజనులదుఃఖ ♦ మార్పఁ గలఁడు.
చెప్పుమమ్మ! యింకఁ ♦ జేయు మట్టులె యందో,
నిన్నుఁ బాయ కింట ♦ నిలువు మనెదొ. 117

వ. ఈ యాడినపల్కులును గౌరాంగువిలోకనంబులును శచిమనంబున
నుండునైహికచింతామలంబుఁ గడిగివేయ నామె యత్యద్భుత
భక్తిజ్ఞానపరవశ యై భేదబుద్ధిరహితమనస్క యై శ్రీకృష్ణుండు

సర్వలోకంబు ననురాగపాశంబుల నాకర్షించుచున్నట్లు పొడ
గాంచి పరిశుద్ధచిన్మహాహర్షసంజాతబాష్పతోయంబులు చెక్కుల
పైఁ గాల్వలుగట్టి స్రవియింప ని ట్లనియె. 118

చ. నిజము నిజంబు నీనుడువు♦నేఁ గనులారఁగఁ గాంచుచుంటి; నా
త్మజ! యవివేకచిత్త నయి♦హాన్విత యత్నము నింతదాఁక;నా
వ్రజజనపూర్వపుణ్యపరి♦పక్వఫలం బగుకృష్ణుభక్తి స
ర్వజనుల కొప్పగాఁ గఱపి ♦ వారలదుఃఖము వాపఁ బోవుమా.

క. త్వరగాఁ జను గౌరాంగా!
చరాచరసమూహసృష్టి♦సంరక్షణసం
హారణకరణోజ్వలశ్రీ
హరి వీవే కావె? మఱపు♦నందితి నయ్యో! 120

క. నాగర్భగోళ మయ్యెను
నీగృహ, మే నంబ నైతి ♦ నీరజనేత్రా!
సాఁగె నొకకొంతకాలం
బీగతి, జనతారణార్థ♦మింక నరుగుమా! 121

క. పిల్ల నగునన్ను నజ్ఞను
దల్లీయని పిలిచి తీవు ♦ దయఁ జిత్రముగాఁ;
జెల్ల దికఁ నట్లు; తక్కిన
పిల్లలఁ బ్రోవంగఁ జనుము ♦ వేగమ కృష్ణా! 122

ఆ. ధన్య నైతి నేను; ♦ ధన్య మా నికముందు
సర్వజనవితాన ♦ మూర్ధ్వపైని;
హృదయశుద్ధితోడ♦నే కాక యానంద
గరిమఁ బంపుచుంటి ♦ నరుగు తండ్రి. 123

వ. అంత నిమి పూర్ణకృపానందద్యోతకంబును జగన్మహావేశకరంబు

నగునొక్కచిఱునవ్వు తల్లిపైఁ బఱపి యి ట్లనియె. 124

ఆ. ఈపురంబునందు, ♦ నీచోట, నీవేళ,
సకలచిత్రలోక♦సముదయమున
కధిపుఁ డైనకృష్ణుఁ ♦ డయ్యె నీ కథమర్ణుఁ
డమ్మ! యెంతపుణ్య ♦ రాల వీవు. 125

వ. అని నిమి తల్లిమనంబునుండి జ్ఞానతేజంబు లాఁగివేయ నామె పునర్విషాదచిత్త యై యి ట్లనియె. 126

గీ. జగదతీతమనోజ్ఞతా♦శాలి, బుద్ధి
శాలి, యావనశాలి, యా♦సత్కుమారుఁ
జేతులారంగఁ బెంచి యీ♦చెట్టతల్లి
యడవిపాల్సేయుచున్న ద♦య్యయ్యొ! యిపుడు. 127

వ. అని వలవల దుఃఖించుచున్నతల్లి నోదార్చి నిమి యి ట్లనియె.

ఆ. అంబుజాక్షునెడల ♦ నపచారమును జేయు
దాన వౌదుసుమ్ము! ♦ తల్లి యిట్లు
లేడ్చుచుంటివేని; ♦ యేడ్వఁగాఁ దగదు నాఁ
కొఱకు; ఫలములేని♦కుందు మాను. 129

గీ. కృష్ణుకై బాష్పములు రాల్పు♦మెడసిపోవఁ;
దున్న నాతండు సర్వంబు♦నుండు నీకు
నన్ని యున్నప్పు డింక నీ ♦ యాత్మజుండు
మాత్ర మేలుండఁడో వెఱ్ఱి♦మాత! చూడు. 130

వ. ఇంకను దల్లిదుఃఖం బుడుగకుంట చూచి నిమి యి ట్లనియె. 131

సీ. ఏగుమటంచుశ్రీ♦కృష్ణుండె మానినీ!
యనిపించె నీచేత ♦ నది నిజంబు;

తల్లి! యూఱడుము నే • తరలిపోవుట యింత
లోఁ గాదు; నీవంటి • లోకమాన్య
యానమ్మ సుఖపెట్ట • నే నొనర్చిన దేది
లే; దిఁకింతటినుండి • లేచిపోవు
వఱకు నే మనయింట • వర్తింతు నందఱ
నలరించి సమ్యగ్గృ • హస్థపగిదిఁ;
ఆ. దల్లి! యిద్ది యంత • దైవంబుతోడుగాఁ
జెప్పుచున్నవాఁడఁ; • జింతఁ జిక్కి
వెక్కివెక్కి యేడ్చి • వికలమానస వౌచు
ముదిమియందుఁ గష్ట • ములను బడకు. 132

వ. అని యామె చేయి పట్టుకొని నిమి వెండియు నిట్లనియె. 133

ఉ. దైవము సాక్షిగా నుడివె • ద న్వినుమమ్మరో! లేచిపోయిన
న్నీ వెపుడేని నన్నుఁ గన • నెమ్మది నెంచెదవేని యాయెడ
న్నే వసియించుచున్న వెస • నీతలఁపు గ్రహియించి చెందము
న్నే వడిఁ జొచ్చి తాపము శ • మింపఁగఁ జేసెద నిన్నుఁ గాచెదన్.

క. మాతా! విష్ణుప్రియ కడు
లేఁతవయస్సునను మెలఁగు • లేమ గనుకఁ దద్వ
త్సూతాశీర్వాదంబుల
చేత, శ్రీకృష్ణభక్తి • చేత, మనవలెన్. 135

ఆ. ఉవిద విడిచిపోవు • చున్నాను; బాపమో
యమ్మ! దానిదుఃఖ • మపనయించి
కొడుకుఁ జూచినట్లు • కోడలినిం జూచి
కఱపు కృష్ణభక్తిఁ • గరుణతోడ. 136

ఆ. నన్నుఁ జూడ నెపుడు♦నాతి కాంక్షించునో
యచటనున్న వడిగ ♦ నేగుదెంచి
యామెయుల్లమందు ♦ నగపడుదును నేను;
గృష్ణభక్తి సుఖము♦నిచ్చు ననుము. 137



క. మతములు సూచిన బోధక
వితతిప్రసంగములఁ బోయి ♦ వినిన నారీమా!
మతిచెదరు; భక్తియేసుమి
గతి నా కది యెట్లు నీవు♦గట్టిపఱిచెదో! 138



శ్రీరామః.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### తృతీయాశ్వాసము.

ఉ. భూసుతనాఁ బరంగునల ♦ భూజనయిత్రిని బూర్ణగర్భవ
ద్భాసురగాత్రి ఘోరవని ♦ పాలొనరించి త్యజించి తంచు ము
న్వ్రాసినగ్రంథము ల్చదువ ♦ భక్తులగుండెలు తల్లడిల్లు; నా
యాసురకృత్య, మార్తిదమ ♦ నా! యెటుసల్పితివయ్య! రాఘవా!

ఉ. యాదవవంశదీపకుని ♦ స్వాంతనిబద్ధుని జేసికొన్న, నాఁ
డాదిగ మిశ్రసూనుఁడు గృ ♦ హవ్యవసాయమునందుఁ జిక్కి స్నా
నాదుల నాచరించి సద ♦ నాగతుల న్ననిగా గృహస్థమ
ర్యాదలఁ దన్పి తా జనని ♦ రంజిలఁజేయుచు నుండె నిత్యమున్.

ఆ. తల్లి నొప్పఁజేసెఁ ♦ దా సన్యసించుట ;
కడ్డ మింక నొండె ; ♦ యది కళత్ర ;
మగ్గి చేతనిడిన ♦ నది యే మననిపదు
నేనువత్సరముల ♦ గృహిణి, సాధ్వి.   3

చ. ఇరువదినాల్గువర్షముల ♦ యేపున నున్నయువప్రకాండ మే
తెఱఁగునఁ బిన్నప్రాయపుస ♦ తీతిలకంబు, మరుద్విలాసినీ

సురుచిరదేహతుల్యతను♦శోభిత, సద్గుణరత్నపేటిఁ, గ
న్నొఱ్ఱఁగి పతి న్యతీంద్రునిగఁ♦బుచ్చుట కిచ్చపడంగఁ జేయనో?

క. చారుహృదయానురాగో
దారయుఁ దనధర్మదార ♦ యగుచెలి యంగీ
కార మొసంగును దన కని
గౌరాంగుం డుండె భావి♦కార్యజ్ఞుండై. 5

వ. గౌరాంగుఁడు సన్న్యాసంబునకుఁ దల్లియనుజ్ఞఁ బడయుతఱి విష్ణుప్రియ పుట్టినింట నుండెఁ; దనభర్త పూర్ణవిరాగుఁడై సర్వంబుఁ ద్యజించి పోవనున్నాఁ డనుకింవదంతి విని విచారగ్రస్తయై తపించుచున్నను మఱల నామె యిట్లు సమాధానపఱచుకొనుచుండె. 6

ఉ. నాపతి ప్రేమమూర్తి, కరు♦ణామయుఁ డంచితరూపవంతుఁ; డె ట్లోపును నన్నుఁ దల్లి విడి ♦ యొండొకచోటికి లేచిపోవ? నిం కీపురి నున్నభక్తు లటు ♦ లెట్లొనరింపఁగనిత్తు? రుల్లమా! తాపముచేతఁ గొట్టుకొని ♦ తల్లడ మందక యూఱడిల్లుమా! 7

క. పురుషులు స్త్రీలుం బురువులుఁ
దరుగుల్మలతాదివస్తు♦తతి నాపతికిన్
బరమప్రేమాస్పదములు;
తరుణియుఁ దల్లియును భక్త♦తతి గారె యటుల్. 8

వ. అట్లనుకొనియు మనసుఁ బట్టఁజాలక మార్గశీర్షంబుమధ్యంబున నొక్కసాయంకాలంబునం గనుచీఁకటివేళఁ జివ్వునఁ దలిదండ్రుల నిలయంబు వీడి పాదచారిణి యై నిజగృహంబు సొచ్చి యప్పుడే తనముద్దుమగండు శయనాగారంబునకుం జనె నని తెలిసికొని. 9

క. సామాన్యగృహిణి మీఱుచు
నే మెలఁగుదు నింట నంచు ♦ నిమి తల్లికి మున్
బ్రేమ న్బల్కుట తెలియఁగ
రామి న్గంజాక్షి కడువె ♦ ఱంగుం జెందెన్. 10

చ. వడివడి యన్నము న్మెసవి, ♦ పచ్చనిపావడ గట్టి, చేత గి
న్నెడు కపురంపుగందము, వి ♦ నిర్మలసౌరభరమ్యమాలికల్,
బొడిగ నొనర్చినట్టిమృదు ♦ పూగఫలంబులుఁ, దెల్లనాకులున్,
బడఁతి గ్రహించి వల్లభుని ♦ పజ్జకుఁ బోయె సుఖాభిలాష నై. 11

చ. తలఁచుచుఁ గృష్ణకీర్తనలఁ ♦ దద్దయు భక్తిని రేల నిద్దురన్
బొరయక జాగరూకుఁ డయి ♦ ప్రొద్దును బుచ్చెడుపుణ్యమూర్తి ద
ట్టరకపుముద్దుదుప్పటిని ♦ డాఁచి మెయి, న్నిదురించుచుండె, సుం
దరశశిబింబకల్పవద ♦ నం బదిమాత్రము పైకిఁ గన్పడన్. 12

వ. అది చూచి విష్ణుప్రియ యి ట్లనుకొనియె. 13

ఉ. ఎన్నఁడులేనినిద్రఁ బడె ♦ నేలొకొ కాంతుఁడు నాసుఖేచ్ఛ నే
తెన్నునఁ దీర్చికొందు? నిఁకఁ ♦ దీవరపాటును గట్టిపెట్టి యీ
పున్నమరేయిజాబిలిని ♦ బోలెడుమోముఁ దదేకదృష్టి నా
కన్నులు చల్లఁగాఁ గని సు ♦ ఖంపడెద న్బరితృప్తచిత్త నై. 14

క. హరిభజనల నిజభక్తో
త్కరపరివృతుఁ డౌచు నెప్డు ♦ కను మూయఁడు రా
తురులందు; నింతనిద్రం
బొరసిననాథుసుఖ మెట్లు ♦ పోఁగొట్ట సగున్. 15

క. నిదురింపు ప్రాణనాథా!
కదిరెను సుఖసుప్తి యింత ♦ కాలంబు సకున్;
మది గుదురుపఱచుకొని యుం

డెద మేల్కొనువఱకు నీవు ♦ నీరజనేత్రా! 16

క. ఈనిద్రయు నాభాగ్యమె;
నే నింతటివఱకు నీదు♦నెమ్మొగ మటిచే
కాని నిరభ్యంతరముగఁ
గానఁగలేనైతిఁ దృష్టి♦గా భర్మాంగా! 17

క. హాయిగ నిద్రింపుము! య
చ్చాయతలోచన! మదీయ♦హార్దాకృతివై;
నీయడుగు లొత్తుదును భ
దాగ్రయితభవదాననంబు ♦ దర్శించు చిటన్. 18

మ. అని జీవేశుని పాదపద్మముల నొ♦య్యన్జేరి కూర్చుండి, వా
నిని మెల్లంగ నిజాంకపీఠమున నే♦ణీనేత్రి సంధించి ధా
త్రిని నన్బోలెడుపుణ్యరాశి యిఁక నే♦ది! యంచు నుప్పొంగుచున్
దన లేఁజేచిగురాకుటొత్తుదుల నొ♦త్తంజొచ్చె మోదాశ్రులన్.

ఆ. పూతపదము లంటి ♦ మూగొని ముద్దాడి
మొక్కి మొక్కి వెండి ♦ మొక్కి పొలఁతి
మునిఁగి తేలుచుండె ♦ మోదాబ్ధిఁ బెన్నిధి
దొరకినట్టిపేద♦గరితపగిది. 20

వ. ఇట్లుండి యుండి. 21

ఉ. ఈకమనీయగాత్రరుచు ♦ లీకమలోపమపాదయుగ్మమున్
నా కెటు లబ్బుఁ? బత్తునజ♦సప్రభవం బగుమాట సిక్కమే;
లోకులు శోకమోహముల♦లోఁ బడి స్రుక్కుచు నుండ, నాగికై
పోకిఁక వల్లభుండు తన♦పొల్తి సుఖంబున కింటఁ జిక్కునే? 22

క. అని విష్ణుప్రియ యెంచుచు
ఘనదుఃఖార్తిమెయి వేఁడి♦కన్నీ ళ్లోడిం

చెను ; రెండు మూఁడు బొట్టులు
మునుకొని గౌరాంగుపాద♦ములపైఁ బడియెన్. 23

క. నులివెచ్చగఁ బడుబాష్పం
బుల చేతనొ వేఱొకకత♦ముననో యంతన్
జలజాక్షుఁడు గౌరాంగుం
డులికిపడుచు లేచి యెదుర♦నువిదం గాంచెన్. 25

మ. కని కాంతామణిఁ గౌఁగిట న్గొని జలా♦క్రాంతంబులౌ కన్నులన్
దనచేలంబున నొత్తి చెక్కులను జే♦త న్నొక్కి ముద్దాడి యో
వనజాతాక్షి! సతీలలామ! సుగుణ♦ప్రాజ్ఞా! ప్రవాళాధరీ!
వనటం జెందెద వేల? యంచడిగెఁ దా♦పం బొప్పఁ బ్రాణేశ్వరిన్.

క. ఉపలాలనకృతి నూఱడ
క, పతిని గుపితయయి చూచి ♦ కాంతుని కెదురుగ
చెపుఁ డీపురి నేవినుచి
త్రపుమాటలనిజ మటంచుఁ ♦ దరుణి వచించెన్. 26

మ. విని యీమాటలు మిశ్రసూతి తరుణీ!♦వీట న్జను ల్వల్కువా
నిని బాటించినఁ జిత్తశాంతతను గాం♦తే? యీప్రపంచంబునం
దని యెన్నండును జూడనట్టి వగలున్ ♦హావాదులు న్జూపఁగాఁ
గినుక న్మాని మెలంగె సాధ్వి పతితోఁ ♦ గేళీవిలాసంబులన్. 27

ఆ. ఇంతప్రేమగల్గు♦కాంతుఁడు త న్నెట్లు
వీడఁగల్గు నంచు ♦ వెఱ్ఱివనిత
తనశరీర మధిపు♦తనువునఁ గీలించి
యధికదివ్యసౌఖ్య ♦ మందుచుండె. 28

వ. అట్లున్నను పౌరజనప్రవాదంబు మఱల తనమనంబునం జొరం
బడ నరసనల్లాపోల్లాసంబున నున్నత్రిలోకనాథుండగుప్రాణనాథు

కరంబు శింజితమంజుమణికనకకంకణశోభితం బగునిజకరంబున
నొడిసి పట్టుకొని కాటుకకంటియు బ్బుంజూపులు నాటిచి యుల్లస
నిట్లనియె. 29

క. నను—నది పోసిం—డలమీ
జననీమణి వీడి మీరు ♦ సన్న్యాసంబుం
గొన నున్నారని పురిమె
ల్లను మోగెడుఁ; జెల్వఁ డందు♦లంగల నిజముల్. 30

శా. ఆమాటల్విని పెద్దనవ్వొకటి గా♦రాంగుండు తా నవ్వి, యో
భామారత్నమ! యిన్నినాళ్లపిదప ♦ న్బత్నీపతుల్గూడి కే
ళీమోదామృతపానమత్తు లయి వ♦ల్లీవృక్షసంకాశులై
ప్రేమోద్రిక్తత నుండుచో నడుగ కీ♦ వేరంపుఁబ్రశ్నం బనన్. 31

శా. పైపైచేఁతలు నవ్వులు న్వలపు లి♦బ్భంగి న్బ్రసాదించినన్
బాపం! బీకడు లేఁత ముగ్ధ సుగుణ ♦ ప్రఖ్యాత వంచించి క
ట్టా! పర్వెత్తుట యెట్టిటన్నవగ నా♦టంజొచ్చె డెందంబు; నీ
కాపట్యార్తి కలంక మాస్యశశిపైఁ ♦ గల్గె న్నచీసూతికిన్. 32

క. వల పనెడు దూరదర్శని
బలమునఁ జిగురాకుఁబోఁడి ♦ పతియుల్లమునన్
దులకించుముదమునడుమ
న్నెలకొని మఱుఁగుపడియున్న ♦ నెవ్వగఁ గనియెన్. 33

క. ఈతాపలక్షణంబులు
శాతోదరి గాంచి బెగడి ♦ చయ్యన నాథా!
నాతో సుఖమందుచునే
యీ తెఱఁగున దుఃఖపడెద ♦ రేలని యడిగెన్. 34

క. అందులకుం గౌరాంగుం
డిందీవరనయన ! దుఃఖ ♦ మెందులకగుఁ ద్వ
న్మందస్మితసంశ్లేషా
నందాంబుధిమధ్యమందు ♦ నన్నా కనియెన్. 35

వ. ఆపల్కులు విశ్వసింపఁజాలక విషాదసంకుచితవదనారవింద యై
విష్ణుప్రియ యిట్లనియె. 36

సీ. గట్టి కౌఁగిళ్లలోఁ ♦ బట్టి నన్నొత్తుచో
గుండె తప్పెటమ్రోఁత ♦ యుండ నేల?
చెక్కిళ్లు కొనగోళ్ల ♦ నొక్కి చొక్కించుచో
సుడివడి యంగుళు ♦ ల్వడఁక నేల?
పెదవులుం బెదవులు ♦ గదియ ముద్దాడుచో
నిట్టూర్పువడగాడ్పు ♦ గొట్ట నేల?
వలపుఁ గ్రేగంటిచూ ♦ డ్కులు చిమ్మ నవ్వుచోఁ
గన్నుఁదమ్ములు చెమ్మఁ ♦ గ్రక్క నేల?

గీ. మంటికిని మింటికిని జాలు ♦ మహితవిద్యఁ
గఱచి కఱపి వాదంబుల ♦ గండ్రయైన
పండితేంద్రుఁడు భార్యతో ♦ నుండునపుడు
మాటలందున నీత్రొట్రు ♦ పాటు లేల? 37

ఉ. తిన్ననివాఁడ వంచు నెటు ♦ తృప్తిని జెందుదు? నాత్మలో విషం
బు న్నుడుల న్సుధారసముఁ ♦ బూని చరించెదు; పైకి నవ్వ చా
పన్నునిపోల్కిఁ గుందు దెదఁ; ♦ బాడియె నన్నిటు మోసపుచ్చ? నే
విన్నవదంతి సత్య మిఁక ♦ వేయి వచింపఁగ నేల వల్లభా ! 38

గీ. హృదయగతమును దెల్పఁగా ♦ నిదియె యదను;
చేడె నిఁక మోసపుచ్చుట ♦ కూడ దనుచుఁ

దలఁచి వ్యాకులవదనుఁ డై ♦ పొలఁతి నతఁడు
గాంచి యనె నిట్లు గద్గద♦కంఠమునను. 39

క. నిజము గ్గనఁగల్గితి వో
గజగామిని! సర్వలౌకి♦కసుఖంబుల నేఁ
ద్యజియించి భిక్షుకుఁడ నయి
ప్రజలకు హరిభక్తి బోధ♦పఱుపం బోదున్. 40

వ. ఈయశనిఘాతంబు నిక్కవంబో కల్లయో యని నిజశ్రోత్ర విశ్వాసంబుఁ దొఱఁగి పతివంక మోము నిగిడించి నిశ్చేష్టయై చూచుతరుణీరత్నంబుతో గౌరాంగుండు వెండియు నిట్లనియె. 41

సీ. సతి! నీకు నాకుండు♦సంబంధ మతిశాశ్వ
తం బది యెడసినఁ ♦ దప్పు మనది;
స్వసుఖపరాఙ్ముఖ♦త్వమున నిష్కల్మష
హృదయంబునను బల్కు♦హితునిహితము
విని యాచరించి నీ♦విష్ణుప్రియాఖ్యను
సార్థకపఱిచి కృ♦తార్థ వగుము;
లోకైకపురుషార్థ ♦ మోకాంత! శ్రీకృష్ణ
పదసేవ; యిర్వుర ♦ మది యొనర్త

ఆ. మనవరతము; భక్తి ♦ యనుపృథుగుణముచేఁ
గృష్ణుఁ గట్టిపెట్టి ♦ హృదయమందు
సకియ! జీవయాత్ర ♦ సత్ర మట్లుండుని
మహిసుఖంబు లెల్ల ♦ మఱచిపొమ్మ! 42

వ. నిజాశాభంగకరంబు లగునీమాటలు విని మూర్ఛం గూలవలసిన విష్ణుప్రియ, వానిభావంబు సంపూర్ణంబుగ నెఱుంగంజాలకో లేక త్రిలోకరక్షణాధురంధరుం డగుగౌరాంగుసాన్నిధ్యంపుబలంబుననో

ధైర్యంబున నిల్చి కొంతసేపు ప్రత్యుత్తరం బీయ నోరాడక
యిన్నకుండి పిమ్మటం బతికిం జేమోడ్చి యల్లన నిట్లనియె. 43

మ. కరుణాసాగర! నన్ను వీడు మది నా◆కర్మంబు; నీవంటిసుం
దరమూర్తి న్పతిఁ గూడినిత్యసుఖ మొం◆ద న్నేన నర్హం; ధర్మ
బరమప్రేమను గాంచి పెంచినభవ◆న్మాత న్శచి న్వృద్ధ దు
ర్భరశోకాబ్ధిని ముంచి పోవఁ బురివా◆ర ల్నిన్ను నిందింపరే? 44

వ. అంత వ్యథాభారంబునం దల గిఱ్ఱునఁ దిరుగ నిమిషమాత్రం
బక్షులు మూసికొని, యించుక తెలివిచేసికొని రాలనేనిం గరఁ
గింపఁజాలు దీనాననంబుతో నామె మఱల నీరెలుంగున ని
ట్లనియె. 45

క. ననుఁ బెండిలియాడెదొ యొ
ల్ల ననెదవో నీ వటంచు◆లలితాకారా!
దిన మొక్కయుగముగను నేఁ
గని పూర్వము క్రాఁగి క్రాఁగి◆ కడ కిట్లైతిన్. 46

ఆ. కష్టపడినయంత◆కాల మైనను సౌఖ్య
పడఁగఁ జాలనైతిఁ◆ బతిని గలసి
యయ్యొ! యీయబలయె◆ యడ్డమ్యోనె నీవు
పోవుమార్గమునకుఁ◆ బురుషసింహ! 47

ఆ. నిగళమైతిఁ గాన◆నే నీకుఁ బ్రాణేశ!
యిల్లువదలి పుట్టి◆నిల్లు చేరి
శేషకాల మెట్లొ◆ చెల్లింతు సుఖపడు;
మత్త విడిచిమాత్ర◆ మరుగవలదు. 48

వ. గౌరాంగుండి ట్లనియె. 49

సీ. ననఁబోఁడి! యిహచింత◆లను మాను; మనోవ్యస్య

గాఢానురాగంబు ♦ గలదు మనకు;
నిన్దుఃఖితను జేయ ♦ నేఁ జపలుఁడఁ గాను,
గష్టం బధికము నీ♦కంటె నాకు,
బాధించి నిన్ను నే♦బాధ నొందుట యేల
నా నొందుమార్గంబు ♦ లేనికతనఁ;
బోవనెంచితిఁ గృష్ణ♦సేవకై యది మన
యుభయులకును మేలె ♦ యొసఁగుఁ జుమ్మి;
గీ. కానఁ బ్రియురాల! నిష్కళం♦కహృదయమునఁ
బూర్ణసంతోషమున నన్నుఁ ♦ బుచ్చు; భార్య
సమ్మతిని బోవుచుంటి న♦న్నంతసంబు
మాత్ర మొసఁగుము వికచాబ్జ♦నేత్రి! నాకు. 50
వ. విష్ణుప్రియ యి ట్లనియె. 51
క. నాయనుమతి యెందులకో?
మీయిష్టము వచ్చినట్లు ♦ మెలఁగఁగవచ్చున్;
గాయముఁ జిత్తము మీయవి
నాయడ్డం బేమి ప్రాణ♦నాథా! యిచటన్? 52
వ. గౌరాంగుం డి ట్లనియె. 53
ఆ. అట్లు పలుకఁగూడ♦దరుగ నంగీకార
మీవొసంగుదాఁక ♦ నింతి! నాకుఁ
నీవు పత్నివౌట ♦ నిర్బంధమునఁ గాక
యాత్మశుద్ధి నన్ను ♦ నంపవలయు. 54
వ. అంత విష్ణుప్రియ యి ట్లనియె. 55
సీ. నిజముగా విడిచి చ♦నెదవె! న న్నీవడంగ
నొప్పునే ప్రాణ మ♦య్యో! శుభాంగ!

జరుగ ద ల్లెన్నఁడు ;◆ శచి యత్త, మీతల్లి
యసువు లేదను విన్న◆యంతలోన ;
నామెను వదలుదు◆నం చన, ఊహింప
కయ్యా! మహాత్మ! నీ◆ వరిగితేని
యీనవద్వీపంబు◆లో నందఱుం గూడ
వత్తురో నీవెంటఁ,◆ జత్తురో కద!

గీ. చేడెతోడుతఁ బరిహాస◆ మాడు దంతె ;
కానిచో నిప్పుడే యత్త◆కడకుఁ బోయి
ఘోరవచనంబు లాడుచు◆న్నా రటంచుఁ
జెప్పెదను మీకుఁ గినుక వ◆చ్చినను సరియె. 56

క. అంగన యి ట్లని శ్వశ్రువు
చెంగటికిం భీతి లేచి◆ చెచ్చెరఁ జనఁ జూ
డంగనె యామరుముల్కిఁ గ
వుంగిట బంధించి యిట్లు◆ ప్రోడ వచించెన్. 57

ఉ. తత్తఱపాటుఁ జెందకుము◆ తామరసాక్షిరో! చెప్పినాను మీ
యత్తకు నాదుతల్లి కిది◆యంతయుఁ బూర్వమె; ఘూర్ణసత్కృపా
యత్తమనస్క యై యొసఁగె◆నామె యనుజ్ఞయటన్నఁ, గోకతోఁ
బిత్తరి మూర్ఛవ్రాలె భయ◆విహ్వల యై తననాథున దిటన్. 58

వ. ఇట్లు తుపాకిదెబ్బం గూలినకపోతిచందంబున నిజబాహుపంజరంబున నిశ్చేష్టిత యై యున్నయాకల్కిని బహుకష్టంబునఁ దేర్చి నిమి బుజ్జగింప నామె యెట్టకేలకుఁ గనువిచ్చి చూచి బాష్పధారాసిక్తకపోలయుగళ యై యల్లన నిట్లనియె. 59

గీ. నేను గడుభాగ్యశాలినిఁ◆ బ్రాణనాథ!
యైన సౌఖ్యముపడితి నం◆చనఁగ రాదు.

వలచి యెన్నాళ్లో లోలోనఁ ♦ బరితపించి
పరిణయం బైన నాథుండు ♦ దొరకఁ డయ్యె. 60

గీ. కేల శ్రీశానుగ్రహమునఁ ♦ గృష్ణభక్తి
పరవశత నుండఁగా మీరు, ♦ పఱపుమీఁద
గాలివానను గడలిపైఁ ♦ గలముకరణి
నెట్లు నేఁ గొట్టికొంటినో ♦ యెఱుఁగఁ గలరె ? 61

క. కేలని పవలని జనులకుఁ
గాలవిభాగంబు గలుగఁ ♦ గాంతుఁడ ! యయ్యో !
రేలు పగలయ్యెఁగా ! యీ
గోలకు నొకయింతసేపుఁ ♦ గునుకఁగ లేమిన్. 62

క. మన్నాథా ! యీవేసలి
నున్నసుకేశంబు లెన్ని♦యో ! యన్నినిశల్
సున్నగద నాకు నిద్దుర ;
కన్నుల కగపడవె ? నీదు♦కాంతయవస్థల్. 63

క. హారికీర్తనకలనాసం
తరమున నిలుసొచ్చి యుండు♦తఱిఁ గనులారన్
దెఱపిగ నీమోముం గనఁ
గఱవయ్యె ; నిఁ కింతకంటెఁ ♦ గష్టము గలదే ? 64

ఆ. అందరానిపండు, ♦ నాకసంబునఁ గ్రాలు
చందమామ, లోఁతు ♦ నందు నున్న
పద్మ, మురగఫణము♦పై నొప్పుమానిక,
మయ్యె మీదుమోము ♦ ప్రాణనాథ ! 65

ఆ. ఇంత కష్టపడిన♦యింతిని, యువతిని
ద్రోసిపోదు నంచుఁ ♦ దొరపడ్డెదరు.

సతిని, వినయవతిని, ♦ సహధర్మచారిణి
మఱచి యరుగుమనెదు ♦ మతము మతమె? 66

ఉ. తల్లి యనుజ్ఞ యిచ్చెనని ♦ తప్పక పోదువె? యామహాత్మురా
లుల్లము ఱాయిచేసికొని ♦ యొప్పిన నొప్పును గాక! నేఁడొయిం
కెల్లియొ మృత్యువామెఘన ♦ హృద్వ్యథఁదీర్చిసుఖంబుఁగూర్చునో
వల్లభ! యెన్నియేండ్ల కెల ♦ ప్రాయపుటింతికి నద్ది లభ్యమౌ. 67

గీ. బ్రతికి యుండియు లేనట్టి ♦ పతిని దలఁచు
కొంచు నెన్నాళ్లు మృతికినై ♦ క్షోణి నుందు?
సమ్మతించిన మీయమ్మ, ♦ సమ్మతింపఁ
జాల నామాడ్కి నోదయా ♦ శాలి! నేను. 68

క. ధీరయు, వృద్ధయుఁ, జితో
దారయు నగునమ్మగానఁ ♦ దనయుఁ జను మనెఁ
వైరాగ్యమార్గమున; నీ
భీరువు మి మ్మట్లు పంపి ♦ వేయంగలదే? 69

క. మీమాటను జవదాఁటను;
బ్రేమకు మితి లేదు నాకు ♦ విభుపైఁ; ద్వత్సే
వామృతపానమె మోక్షము
స్వామీ! న న్నిట్లు వీడి ♦ పర్వెత్తెదరో! 70

ఆ. బ్రదుకలేను మీరు ♦ వదలి న న్నరిగిన,
నంచు సాశ్రునయన ♦ యై కరములు
మొగిచి కంపితాంగ ♦ మున విభుమోలను
వ్రాలె మించు నేల ♦ వ్రాలినట్లు. 71

వ. ఇట్లు పడి పతిపాదంబు లొకకొంతసే పంటి యుండి విష్ణుప్రియ
గన్నులు పైకెత్తి చూచె, నంత. 72

సీ. శార్ఙ్గకౌమోదకీ♦శంఖనందకచక్ర
యుతచతుర్బాహుదీ♦ధితులు మెఱయ,
నేత్రగోళాయిత ♦ మిత్రకైరవమిత్ర
బింబంబు లానన ♦ పీఠి వెలుఁగఁ,
బద్మాలయాదేవి ♦ ప్రథితకౌస్తుభమణి
కమ్రవిశాలవ♦క్షమునఁ జెలఁగ,
దివ్యనీలాంబుద ♦ దీప్తిచ్ఛటోపేత
పృథుకాయ మాకాశ ♦ వీథి వెలయఁ,
గీ. దళుకుముత్తెపుఁజాయల ♦ తల్లి, పరమ
పావనాత్మక, జాహ్నవి ♦ పాదములను
మొరయుచుం బ్రవహింపఁగఁ ♦ దుఱఁగలించు
విగ్రహం బొందు కన్పట్టె ♦ వెలఁదిమెదుట. 73

చ. తొలఁకుచు లోమెలంగెడు చ♦తుర్దశలోకములు, సురర్, లమ్రపో
త్మలుఁ, జరము, స్థిరంబులును,♦భూతవితానము,మిన్కు లీన తా
రలు, గ్రహము, లపృహించెడువి♦రాడురుతేజము,విశ్వరూపమా
జిలుకలకొల్కి యేబెగడుఁ ♦ జెందక కాంచెను సమ్ముఖమ్మునన్.
వ. కాంచి నతశిరస్కయై యంజలి పట్టి యిట్లనియె. 75

గీ. కంటఁబడితివి స్వామి! య♦ఖండతేజ!
పతితపావన! నాకొక♦వర మొసంగు
మచ్యుత! యనంత! కృష్ణ! ద♦యాసముద్ర!
నామగని వెండి నాకి మ్మ♦ నాథనాథ! 76

వ. అందులకు విశ్వరూపంబున నుండుగారాంగుండు 77

క. జలజాయతాక్షి! పొందం
గలిగితి వీవు నను నన్య♦కాంక్షలెఁ కేలా

కలుగు నన, న్విష్ణుప్రియ
యలుకక శ్రీవిష్ణువునకు ♦ నని నీపగిదిన్. 78

చ. సకలజగత్ప్రభూ! కనులు♦చల్లఁగ ని న్గని ధన్య నైతి; వీ
డక నిను నిత్యమున్ గరపు♦టంబులుమోడ్చిసన్మరించికొల్తు; మా
మకపతిభిక్ష పెట్టుముర♦మాధవ! నాథుని బాసి మేనిలో
నొకనిమిసంబు నిల్చుటకు ♦ నొల్లదు జీవ; మొసంగుమాతనిన్.

వ. అంత మాయలమారిగౌరాంగుండు విశ్వరూపంబు చాలించి మఱల నిజమానవాకారంబుఁ దాల్చి విష్ణుప్రియం గౌఁగిలించుకొని యి ట్లనియె. 80

ఉ. బాపురె! యీధరాతలము♦పైఁ గలకాంతలలో నొకర్తుకే
నోపదు నిన్నుఁ బోలుటకు ♦ నొప్పులకుప్ప! త్రిలోకమాన్య! న
న్నీపతి యైనవిష్ణునకు ♦ శ్రేష్ఠుని జేసితి; విట్టిరత్నమున్
బ్రాపుగఁ జేసికొన్నపతి♦భాగ్యమువంటిది యెందు లే దిలన్. 81

క. అని తన చెక్కును జెలిచె
క్కునఁ జేరిచి కుమ్మరించెఁ ♦ గుండెడుకన్ని
ళ్లను; గల్కి యద్ది గని తా
నును బెల్లుగ నీళ్లు కనుల♦నుండి వెడల్చెన్. 82

వ. ఇట్లు కొంతసేపు భార్యాభర్త లంటియుండి యన్యోన్యదుఃఖోపశాంతిఁ గావించుకొనినపిదప గౌరాంగుండు వెండియు నిట్లనియె.

సీ. అతివ! మదర్ధాంగి; ♦ వధికవు నాకంటె?
యోగ్యతలోఁ; గాన ♦ నొకటి వేఁడె
దను నిన్నుఁ; నీవు కా♦దనక తోడ్పడవలె
నీకార్యమం; దేను ♦ లోకమునకు

హరినామ మొసఁగుట ♦ కరుగుచున్నాఁడ ; నీ
పని తిన్నఁగాఁ జేయ ♦ వలనుపడదు
నేను సన్న్యాసిని ♦ గానిచో ; నా, సంత
సధిపున కలివేణి ♦ యడ్డువచ్చి

ఆ. దయిత ! యట్లుపోక ♦ తప్పదే, నను ధర్మ
పత్నిఁ గూడ వెంటఁ ♦ బాదసేవ
కొఱకుఁ దీసికొనుచు ♦ సరుగరాదా ! యన
నవ్వి చెలువుఁ డిట్లు ♦ నాతి కనియె. 84

సీ. వెఱ్ఱిప్రాణేశ్వరి ! ♦ వీలుగా దటు సల్ప ;
భక్తపాళిని దల్లిఁ ♦ భార్యఁ గూడ
నేడిపింపఁగవలె ♦ నెద లవియంగ ; న
ల్లేడ్పించి ధరలోని ♦ యెల్లజనుల
కలుషసంచయము మీ ♦ కన్నీళ్లవఱదలఁ
గడిగివేయఁగవలెఁ ♦ గంబుకంఠి !
యింత సేయఁగ వారి ♦ యంతరంగక్షేత్ర
సంహతి చక్కఁగా ♦ జాలి మెత్తఁ

గీ. బడును ; బిమ్మట శ్రీహరి ♦ భక్తిబీజ
ములను బాగుగ నాటఁగా ♦ వలనుపడును ;
వేసినటువంటిగింజలు ♦ వేగ మొలచి
పెరుఁగు సుమఫలభరితోరు ♦ వృక్షములుగ. 85

క. ఒకతక్కెడ నీకష్టము
నొకతక్కెడ ధారిణీజ ♦ నోత్కరపాప
పరికరహరభక్తిసుఖ, మిం
చుక సకియా ! పెట్టి తూఁచి ♦ చూడఁగ రాదే ! 86

గీ. నన్ను బంధింపఁ గోరుట ♦ నాతి! స్వసుఖ
కాంక్షమెయిఁ గాని కాదొండు ♦ కారణమున;
నిలను జను లందఱుం దరి ♦ యించుకొఱకుఁ
గష్ట మించుక పడలేవె ♦ కాంత! నీవు? 87

వ. అన విష్ణుప్రియ పర్యాలోచనంబు సేసి తల పంకించి యిట్లనియె.

గీ. మిమ్ముఁ బోనీక యడ్డుట ♦ మిగులఁ బాప
మే; యిపుడు ప్రాణనాయక! ♦ యెఱుఁగఁ గల్గి
తిని; సరే! కాని మీ రేగు ♦ వెనుక నెట్లు
నిలుపఁ గల్గుదుఁ బ్రాణము? ♦ లేన్న మహాత్మ! 89

వ. గౌరాంగుం డిట్లనియె. 90

చ. తల దటు నీవు వల్కఁ బిక♦వాణిరో! నిల్వమ మేరుధీరవై
యిలఁ బతి వోవువెన్క; మన♦నే నినుఁ బాయుచు నేను? భక్తికై
వలసినవిప్రయోగములు ♦ భార్యకు భర్తకుఁ గీడు సేయ; వీ
పలుకుల మంచిచెడ్డలను ♦ బాగుగ నీమది నెంచి చూడుమా! 91

క. ఎడఁబా టెడఁబా టనెదవు
కడుఁ బరమార్థంపుటుచిత ♦ కార్యంబులలో
నెడయిక వియోగ మౌనా?
చెడునే? శ్రీకృష్ణువలనఁ ♦ జెలిమి లతాంగీ! 92

సీ. ఉభయుల మెటు విడి♦యుందుమో యూహింపు;
తుత్రిటిలో నశించునీ ♦ తోలుదక్క
నాసర్వమును నీది; ♦ నారీమచర్చిక!
నీయిష్ట మైనట్లె ♦ నే మెలఁగుదు;
మనపరస్పరమైత్రి ♦ మహితానురాగంబు
నెప్పటిమాడ్కినే ♦ యెసఁగవచ్చు;

మఱియు నాక్షేమస ♦ మాచారము ల్నీకు
ననుదినంబును వచ్చు ♦ న ట్లొనర్తు ;

గీ. నీహృదయపీఠమున నన్ను ♦ నిలుపుకొనుచు
నిత్యసంగమసుఖమున ♦ నెగడు ; మెపుడు
నన్నుఁ జూడఁగఁ గోరెదో ♦ నాతి ! యపుడె
చూతు వెదఁ ; జర్మచక్షుల ♦ చేతఁ గాదు. 93

ఆ. ఆత్మ మనసు, నాత్మ ♦ నంతరంగంబును
జేర్చి కృష్ణుఁ గొలువఁ ♦ జెందఁగలము
ముక్తిసుఖముఁ ; దనువు ♦ పొందికచే నద్ది
కలుగు టెన్నఁడేనిఁ ♦ గాంచినావె? 94

చ. మఱియొకసారి చెప్పెదను ♦ మానిని ! నాజనయిత్రికట్లు నీ
కరయఁగఁ దీవ్రవాంఛ మది ♦ యందుఁ జనించినఁ దత్క్షణంబ నేఁ
జొరఁబడి కానిపించెదను ♦ సుందరి ! నీహృదయాంతరంబునన్ ;
బొరయ నవేనియాపదలు ♦ పోవఁగఁజేసి ప్రశాంతి నిచ్చెదన్. 95

వ. అని భార్యవంకఁ గన్రెప్పలు వ్రాల్పక తేఱిచూచి యామహా
మహుండు వెండియు ని ట్లనియె. 96

సీ. అలివేణి ! యొకరహ ♦ స్యంబు చెప్పెద విను
దేహధారులకుఁ ద ♦ ద్దేహధర్మ
ములను దాఁటుట కష్ట ♦ ము ; గనుక నపుడప్డు
పతిఁ దలంచుక గాసి ♦ పడెదవీవు
కాని, సర్వజనోప ♦ కారార్థ మిల మహా
త్మలు వడుకష్టవి ♦ తానములకుఁ
బరిపూర్ణ మాప్రతి ♦ ఫల మొసంగక పోఁడు
సకలదుఃఖధ్వాంత ♦ శమననిత్య

గీ. దివ్యసుఖరూపమునఁ గృష్ణ ♦ దేవుఁ డింతి !
పరిజలఁ బోవంగ వారికై ♦ పడెను జెప్ప
రానికష్టము లీసతీ♦రత్న మనెడు
కీరితిని గాంచు మాచంద్ర♦తారకముగ. 97

క. హితము విను కృష్ణమూర్తిని
సతతము ధ్యానించి కొల్చి ♦ సౌఖ్యపడుము; నీ
పతికడయుపదేశం బిది;
క్షితి శాశ్వతకీర్తి వఱలు ♦ శ్రీహరికరుణన్. 98

గీ. అంతఁ దత్తఱపడుచు మ♦హాత్మ! యిపుడె
పోవుదురె మీరు కొన్నాళ్లు ♦ పోలఁతి కిడక
యింక నీజన్మమందుఁ దా ♦ నెనయలేని
త్వత్సుసాన్నిధ్యసుఖ మని ♦ తరుణి వలికె. 99

వ. అంత గౌరాంగుండు భార్యం జేరఁదీసి తొడప్రైఁ గూర్చుండఁ బెట్టుకొని కొనొకకరంబునం జుట్టి వేఱొక కరంబునం దువ్వుచు నిట్లనియె. 100

ఆ. కాంత ! యింతలోనఁ ♦ గాదు నిన్నొడఁబాసి
పోవు ; టెల్లవిషయ ♦ భోగములను
జక్క నిన్నుఁ దనిపి ♦ చొక్కించి పోవుదుఁ
దోయజాక్షి ! నీవు ♦ దుఃఖపడకు. 101

వ. అని వంచకశిఖామణి యగుగౌరాంగదేవుండు మనుష్యప్రకృతిం దాల్చి, భార్యమట్టంబునకుం దిగి యామెకంఠం బాలింగించి వల వల విలపించుచు నిట్లనియె. 102

సీ. క్షమియింపు మింతచ♦క్కనిభార్య విడనాడి
యరుగుచున్నందున ♦ కలరుఁబోఁడి!

నే నాకు వశుఁడను ♦ గాను సుందరి! దీని
కంతకుఁ గారణం ♦ బతఁడు! గృష్ణుఁ!
డతఁడు లేనిప్రదేశ ♦ మడవిగాఁ జూపట్టుఁ
దదభావదేహంబు ♦ తరుణి! విగత
జీవకాయం బట్లె ♦ చెన్నఱు; నాబుద్ధి
చిత్తంబుఁ గోర్కులుఁ ♦ జితరి! మెండ
గీ. కాలమందలి కుట్టేళ్ల ♦ కరణి నింకి
వట్టిపోయెను నే నెట్లు ♦ బ్రతుకఁ గలను?
శూన్య మావీని వెండియు ♦ సుష్టుపఱిచి
నింప నెవఁడోపు? శ్రీకృష్ణ ♦ నేత దక్క. 103

వ. అనుతోడన. 104

ఆ. ఇట్టివానిభార్య ♦ యెట్టు లుండఁగవలె
నట్టు లుందు నంచు, ♦ సఖిలజనన
మూహమోహశోక ♦ ముల నాస్పృశుసక్తి
యెదుట నాత్మదుఃఖ ♦ మెంతయనుచు. 105

క. నాతి తలపోసి పతితోఁ
"జేతోమోదమున నస్య ♦ సించుట కిదిగో!
భూతదయాపర! యనుమతి
యీతన్వి యొసంగుచున్న ♦ దేగుం" డనియెన్. 106



క. మాలిమి యొడల నడపెడు
పోలిక జీవాంతరంగ ♦ ముల భవజలధిన్
గీ లెఱిఁగి తిప్పి నీ కను
కూలంబుగఁ బనులు దీర్చి ♦ కొనుదే! రామా! 107



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### చతుర్థాశ్వాసము.

ఉ. వీరుఁడవై పురి న్విడి, వివిక్తము లౌవిపినంబులందు సం
చారము సేయుచుండినను ♦ జల్పితి వెన్నియొ కార్యము,ల్మహో
దార! త్రిలోకరక్షణము ♦ తప్పదు నీ కెట నున్న ; నింత సం
సారభరంబుఁ దాల్చియును ♦ సంగివి గావఁట నీవు రాఘవా! 1

క. నెఱజాణ, మాతృభార్యల
యురరీకృతిఁ బడసి యిట్టు ♦ లూరం గలనె
య్యురి నాత్మబంధువుల నె
ల్లరఁ దాఁ జన నొప్పఁజేసె ♦ లలితోక్తులతోఁ. 2

క. ఐన నొకమాసకాలము
తా నందఱ మఱపుఁగొల్పి ♦ తన్వెను నిమి ని
త్యానందంబున భుక్తి
స్నానశయనసాహచర్య ♦ సరసోక్తులచేఁ. 3

క. కమ్మఁగ వండుము కూరల
నమ్మా! యని తల్లి వేఁడి ♦ యతిసక్తిం దై

యిమ్మగఁ దిని యవి యన్నియు
సమ్మోదాంబునిధిఁ గొడుకు ♦ జననిం దేల్చెన్. 4

క. ఉల్లాసముగా నిమి యిటు
లిల్లాలి న్భక్తసమితి ♦ హితబాంధవులన్
దల్లిం గని మెలఁగుటచే
నెల్లరు మఱపొంది రాతఁ ♦ డేగెడుమాటన్. 5

క. ఎందఱు మఱచి యమందా
నందంబున నున్న నబ్జ ♦ నయనుఁడు నిమి తా
నెందులకు మఱచు నుల్లం
బందున స్థిరపఱుచుకొన్న ♦ యట్టితలంపున్. 6

క. చనఁదలఁచుకొన్నయాదిన
మునకుం బూర్వదినమందుఁ ♦ బొద్దువొడుచుతో
డనె యెప్పటిపగిది నమ్మ
జ్జన మొనరిచె నతఁడు పుణ్య ♦ జాహ్నవిలోనన్. 7

క. స్నానము చేసినపిమ్మటఁ
దా నింటికి వచ్చి తల్లి ♦ తనయావ్యాజా
నూనపేమను వండిన
వాని న్భుజియించె నామె ♦ వడ్డింపంగన్. 8

క. పలుకులుఁ జూపులుఁ జర్యలుఁ
దిలకించిన యెట్టిసూక్ష్మ ♦ ధీశాలికి న
వ్వలినాఁడు వోవు నిమి యని
తెలియకపోయె; నతఁ డట్టి ♦ తీరున నడచెన్. 9

సీ. భక్తలోకార్పిత ♦ ప్రథితసౌరభవర్ణ
మృదుపుష్పదామము ♦ లెమ్మెనఁ దాల్చి

బంగారుతళుకుల ♦ వలువలు దేహము నిండ
డంబుఁగర్పూరగం ♦ ధంబుఁ బూసి
సుందరవదనార ♦ విందంబుపై ముద్దు
సిందూరతిలకంబుఁ ♦ బొందుపఱిచి
కౌశేయచేలంబు ♦ కటిఁ గట్టి యొకపచ్చ
వలువ నీటుగ వల్లె ♦ వాటు వేసి
గీ. హరిహరిధ్యానము లైన ♦ లందు మ్రోఁగ
నాప్తభక్తాళి తనవెంట ♦ నంటి రాఁగ
జలజలోచనుఁ డపరాహ్ణ ♦ సమయమందుఁ
జక్షురానందముగ నూర ♦ సారి వెడలె. 10
ఉ. ఆతఁడు సూచె బాల్యమున ♦ నాడినచోటులు, సౌమ్యశీలసం
పూతచరిత్రుల న్బ్రగరుఁ ♦ బోతుఁదనంబున వెక్కిరించి యె
న్నో తలవంపుఁజేఁతలను ♦ నొవ్వఁగఁ జేసినచోటు, లవ్యథా
స్ఫీతముదాత్తచిత్తమునఁ ♦ జిందులు ద్రొక్కినచోట్లు క్రమ్మఱన్.
సీ. శ్రీకృష్ణకథనంబు ♦ సేయుచు గౌరాంగుఁ
డేగుచో నతనితో ♦ నేగి రెంద
ఱో! మూఁకమూఁకలు ♦ గా మూఁగి, కొందఱు
పాదపద్మములపైఁ ♦ బడిరి భక్తి;
నింటిపనులు మాని ♦ యిందీవరాక్షులు
పైకరు దెంచి యా ♦ పరమతేజుఁ
గనులారఁగను గాంచి ♦ కమ్రలాజాక్షత
సూనరాసులు వాని ♦ పైని జల్లి;
గీ. రంగడులు మూసి బేహారు ♦ లంద ఱతనిఁ
గాంచి చేమోడ్చి రక్షులు ♦ గరఁగి కాఱ;

నిడిరి తోఁ ప్రవను దవ్వుల; ♦ నిట్లు తిరిగ
వీథులను దృశ్యదైవంబు ♦ వీఁక సతఁడు. 12

క. కొందఱఁ గనులం జూచుచుఁ
గొందఱపై మందహాస ♦ కుందచ్ఛవులన్
జిందించుచుఁ బురవీథుల
యందు స్గడసారి నిమి వి ♦ హారము సల్పెన్. 13

చ. ఇటు సడయాడి యాడి తుద ♦ కిందునిభాస్యుఁడు భవ్యజాహ్నవీ
తటమున కేగుదెంచి సత ♦ త ప్రమదావహపారిఁ గాంచి, య
చ్చట నిజభక్తమిత్రజన♦మండము గొల్వఁగఁ గూరుచుండె; సం
తటఁ దనపూర్వచేష్టితవి ♦తానము జ్ఞప్తికి వచ్చెఁ బెల్లుగన్.14

వ. పూర్వవృత్తాంతంబు లన్నియు స్మృతికి రాఁగ గౌరాంగుండు న
ద్దైసలు గలయం దిలకించి యాత్మగతంబుగా నిట్లు చింతించె.15

సీ. అనుదినంబును స్నాన ♦ మాడితి నెన్నాళ్లో
గంగాసవంతి నీ ♦ఘట్టమందె;
శైశవక్రీడలు ♦ సల్పితిఁ దోడిబా
లురఁగూడి యీగంగ ♦ దరినె వెనుకఁ;
గొంటెతనంబులు ♦ కోటులకొలఁదిగాఁ
జేసితి నీగంగ ♦ చెంత మున్ను;
విద్యార్థిగా నుండి ♦ వేనవేలుగఁ బండి
తులఁ బ్రౌఢి నిచటనే ♦ గెలిచినాఁడఁ;

గీ. జాలకాలము మిత్రశి ♦ ష్యాళితోడఁ
గూడి యిచటనె హాయిగాఁ ♦ గూరుచుంటి;
నల్ల కేశవు నోడించి ♦ హరిని బాడి
వఱలినది యిట గంగాభ ♦ వానియెదుట. 16

మ. తరులారా! సుమనోమనోహరలతా ♦ తన్వంగులారా! పురం
దరముఖ్యామరవందితాంబుచయపూ♦తా! జాహ్నవీమాత! చె
చ్చెర సర్వంబును వీడి యేగుతఱి వ♦చ్చె న్బంపుఁడీ నన్ను; నీ
పురి మిమ్ము న్విడనాడిపోవుదును రే♦పో మాపో సన్యాసి నై. 17

వ. ఇట్లు భావనావీథిం దిరిగి తిరిగి. 18

చ. అనువుగఁ గొంతసేపు సచి♦వాదులతో సరసోక్తు లాడి చి
వ్వున నటనుండి లేచి నిమి♦వోయె గృహంబున; కంత నూరిలో
జనములు మూఁకమూఁకలుగఁ♦జక్కెరఁ బాలును బండ్లు వెన్నఁ జ
క్కనిపువ్వుదండ లాతనికిఁ ♦ గానుకలుగాఁ గొనివచ్చి రింటికిన్. 19

క. దరహాసచంద్రికలతోఁ
బురజనదత్తోపహార♦ముల నందుక, శ్రీ
హరిఁ గృష్ణుని సేవించుట
మఱవకుఁ డనిపల్కె లోక♦మాన్యుం డంతన్. 20

క. నాయెడఁ గలమీ ప్రేమం
బీయనువునఁ జూపవలయు♦ హితులారా! "కృ
ష్ణాయనమః కృష్ణాయన
మో" యనివచియింపుఁ డెల్ల♦ ప్రొద్దును మీరల్. 21

క. అనునంతఁ బౌరవారము
"వనజాక్షా! సర్వపాప♦ పరిహారి! శచీ
తనయా! కృష్ణా! శ్రీహరి!"
యని కేకలు వెట్టె నుదువు♦ లాకస మంటన్. 2

ఆ. అంత భక్తి వినతు♦లన్నియుఁ గైకొని
కౌఁగిలించుకొని య♦ఖర్వకృపను

గోపబాలు మఱవ ♦ కుండని చెప్పి పం
పించె మిశ్రసూతి ♦ వీటిజనుల. 23

ఆ. భక్తిభరితహృదయ ♦ పంకేజులై పౌర
జనులు సెలవుఁ బడసి ♦ చనిరి యిండ్ల;
కంత నిమి వసార ♦ నాప్తులతోఁ గడ
సారి కొంత సేపు ♦ కూరుచుండె. 24

ఉ. వందుము నీ, వివర్వియని ♦ బాగుగఁ దిన్న నిరస్తశోకయై
యుందును దల్లి యం చెఱిఁగి ♦ యోరెములోనికి నవ్యంజనాదులె
ట్లుండిననిష్టమో తనకు ♦ నొప్పగఁ జెప్పి సమస్త మున్వాడే
వండఁగఁ జేసి, పూత సుఖ♦వార్నిధి నందనుఁడోలలార్చెఁదాఁ.

గీ. తల్లియును దానుఁ దక్క నీ ♦ ధర మఱెవరు
లేని తెఱఁగున నుల్లాస ♦ లీల, మాట
లాడుచుం బరితృప్తిగా ♦ నారగించె
నమ్మ వెట్టినభక్ష్యాదు ♦ లన్ని సుతుఁడు. 26

గీ. భోజనం బైనవెన్క నం ♦ భోజనయనుఁ
డరిగి పడుకయింటికి వేగ, ♦ నచట వేచి
యుండెఁ బతి నన్వసించి పో ♦ నుండె నన్న
మాట మఱచి మెలంగెడు ♦ బోటికొఱకు. 27

శా. కైసేయన్వలయుం బరస్పరము శృం♦గారంబుగా నీనిశా
వాసంబం దని తొల్త బాసలను జ♦ల్పంబట్టి, కంజాక్షి నీ
రాస ల్డెందముఁ గ్రమ్మ వల్లభున క♦త్యంతంబు నిష్టంబు లౌ
వాసోభూషణపుష్పము లమ్మది యెల♦ర్ప న్దెచ్చి చొచ్చె న్గదిన్. 28

వ. తొల్దొల్త విష్ణుప్రియ పిల్లియు నలంకరింపవలయునని యేర్పాటు
చేసికొనిరంత. 29

సీ. దివ్యాలికమ్ముమీఁదఁ ♦ దిలకంబు సొగసుగా
దిద్ది మోవిని బుణ్కి ♦ తీపిఁ గ్రోలి,
వలపుసంపెఁగనూనెఁ ♦ దలరాచి పెన్నెఱుల్
దువ్వి దూముడి వేసి ♦ తుష్టి నొంది,
నిసిని జుక్కలమాడ్కి ♦ నీలాలకములందు
సితపుష్పగుచ్ఛము ♦ ల్చెరివి మురిసి,
బంగారునకుఁ దావిఁ ♦ బట్టించినట్లు క
ప్రంపుగంధము మేనఁ ♦ బ్రామి కులికి,

గీ. గ్రీవమున సూనదామము ♦ గ్గీలు కొల్పి,
మోహమున మెయి మూర్కొని ♦ ముద్దు లుంచి,
వ్రేళులం గిలిగింతలు ♦ వెట్టి నవ్వి,
చెలియ యానందదుగ్ధాబ్ధిఁ ♦ జెలఁగి యాడె. 30

వ. అంత గౌరాంగుండు. 31

ఉ. నన్ను నలంకరించితివి ♦ నాతిరొ! మామగవారి కేల యీ
వన్నెలుఁ జిన్నెలు? స్నహాజ♦పల్లవకోమలలై మనోజ్ఞలై
యున్నవిలాసినీమణుల ♦ కుండవలె నొసఁగ నంచు నవ్వి యా
యన్నులమిన్న లాగి కడు♦నాదటఁ గౌఁగిట గ్రుచ్చి ముద్దిడెన్.

క. ముద్దిడి, నస్దీర్చితి వీఁక
దిద్దంగావలయు నిన్నుఁ ♦ దిన్నఁగ నే నం
చుద్దవిడిఁ జేయి పట్టుక,
ముద్దియ నిలఁబెట్టి చూచి ♦ పూర్ణప్రేమన్. 33

సీ. ఆపాదమస్తప ♦ ర్యంతంబు తళుకులఁ
గ్రాలుభూషావళు ♦ ల్గీలుకొల్పిఁ

బెళుకులు గుల్కఁగను ♦ నెన్నడఁగుబంగరుజరీ
పట్టుచీర నొయారిఁ ♦ గట్టఁ జేసి,
కలయఁ బూఁచినతీఁగె ♦ కరణిఁ గాన్పింప మై
నొఱపు గల్గినకమ్మ ♦ విరులఁ గూర్చి,
గుమగుమతావుల ♦ గుప్పునత్తరువుఁ బ
న్నీరుఁ గల్పినసుప ♦ టీర మలఁది,

గీ. యట్లు చూడుము నావంక ♦ నిట్లుచూడు
మంచుఁ బుట్టంబుఁ బూల్నవ ♦ రించి తీర్చి
ముద్దులాఁడిని జొక్కించి ♦ ప్రోడ దివ్య
లక్షణాంచితశృంగార ♦ లక్ష్మిఁ జేసె. 34

మ. అలివేణి న్నిమి కొనువట్టి నిజవా♦మాంకంబున జేర్చి వే
నలి ముప్పాయలు చేసి బారెఁడుజడ ♦ దట్టంబుగా నల్లి చు
ట్టి, లలి న్వన్నెలపూలఁ గ్రొమ్ముడిని బె♦ట్టి న్బోటి మెప్పించి; యి
ట్టులె త్రైగుణ్యపుసృష్టిఁ జల్పుజనకో♦టులో క్రమముం బొందఁగన్.

ఉ. చిమ్మసుఖంబు సొమ్మసిలఁ ♦ జేయఁగ నాథుఁడు పల్వినమ్ముగన్,
గొమ్మ స్మరాహవశ్రమవి♦కుంఠితసత్త్వశరీర యై, పిశా
లమ్మును సుందరమ్ము నల♦లచ్చికి నిమ్ముగు వెచ్చవెచ్చను
నొర్ముమ్మపయి న్నిర మ్మిడి వి♦రుద్ధపుగాఢసుషుప్తిలోఁబడెన్. 36

క. అరి యగువైరాగ్యము పతి
యురమునకుం గ్రిందనుండె; ♦ నురువిషయానం
దరుచి న్నెలి పైనొరగెను,
హరియు న్గింక యొకచోట ♦ నాడెడుపగిదిన్. 37

క. ఒం డందు రాత్రి మేల్కని
యుండె; నెర్గిండవది సుప్తి♦నుండెను; భేదం

బుండె నిటు ; నిండె సమ్మద
భాండము ; భావిగతి యెట్లు ♦ పరఁగునో చెలికిన్? 38

చ. అనిమిషరాట్ప్రభుండు తన♦యంగన, సుప్తినిమగ్నఁగాంచి, మె
ల్లన బిగికౌఁగిటి న్గడుమె♦లంకువచే సడలించి లేచి, మె
త్తని యుపధాన మొండుగొని♦తన్విశిరంబున కూఁతవెట్టి, ని
ద్రను జెడఁగొట్ట, కామెముకు♦రంపుఁగపోలము నంటి ముద్దిడెన్.

వ. ముద్దువెట్టి, యెక్కుడించి పడవేసినమరుచాపంబుచాడ్పున శయ్య
పై నిద్రంబడి యున్నసుందరాంగి నొకించుకసే పీక్షించి,
గౌరాంగుండు చటాలున మొగంబుఁ దిప్పి దీపం బాఱిచి. 40

శా. భూషాభూషణ మౌనిజాంగముపయి♦న్బొల్పారుభూషావళుల్,
యోషిత్కల్పితమంజుపుష్పచయము,♦న్పొంబట్టుఁబుట్టంబు, ని
శ్శేషం బాగతి డుల్చి, వానిపరితిగా♦జీర్ణంబు రూక్షంబు నౌ
కాషాయాంబరతుల్యవస్త్ర మొకటి ♦ న్గట్టె న్గటి న్జీఁకటన్. 41

ఆ. కట్టి, దొంగభంగి ♦ నిట్టె గొండ్లెము దీసి,
తరలి పైకి వచ్చి,♦తలుపు మూసి,
మెల్ల మెల్ల నరిగి, ♦ తల్లి నిద్రించెడు
గదికి నెదుట నిలిచి, ♦ కైమొగిడ్చి. 42

క. అమ్మ! ని న్నిపుడు లేపిన
నమ్మలికము చెంది నన్ను ♦ నొండొకకడకుం
బొమ్మనఁ జాలవు; గావున
నిమ్మాడ్కినె సెలవుఁ గొంచు ♦ నేగెదఁ జుమ్మా. 43

మ. అని కే లౌదలఁ బెట్టి మ్రొక్కి గృహసిం♦హద్వారము న్దీసి చ
య్యన గంగాతటమార్గ మంటి చని తా♦నచ్చోటఁ దీరంబునన్

గనె "నీ వేగకు" మంచు నూరక శిరఃకంపంబుఁ గావించుచా
నిని, వాతోద్భవవీచికాకృతలన న్నృత్యాంచితంబౌ లతల్. 44

ఆ. రేవుపడవమీఁదఁ బోవ, జాడను బట్టి
వెంట వెదకి వత్తు రింటివారుఁ,
బురమువార లనుచుఁ, బూర్వము తనయున్న
సనినయట్లె తానుఁ జనెద ననుచు. 45

చ. తలఁచి శచీసుతుండు మొలఁదా ధరియించినగుడ్డపక్క. నే
వలువయు లేక యుండి, హిమవంతపునెన్నడిశీతకాలమం
దలినడిరేయి యీఁది నది దాఁటి చనన్ గమకించి గంగనే
పలఁ జొరఁబారెఁ జిత్తపరిపాకతితిక్షలు గానిపింపఁగన్. 46

చ. సతియుపగూహనంబునను, జక్కనిపాన్పున, వెచ్చనైనటు
వితతసుఖానుభూతి శయనించినపుష్పమృదూష్ణలంగుఁ, దే
గతిఁ గడుమోటచర్మపుమృగంబులుఁగూడ సహింపలేనిశీ
తతమపుఁగాలమందు దిగి దాఁటునొ యూవిపులాంపగాంబుపూర్ణ?

క. జనతారణాభిలాషం
బనులోపలితీవ్రవహ్ని యూఁపెను గాఁబో
లును గరకాసంఘాతం
బును బోలెదుఁగ్రూరతోయములన్నైత్యంబుల్. 48

ఉ. బారలు వేసి యీఁది నిమివల్లభుఁ డవ్వలిగట్టు నిట్టు తాఁ
జేరెను గంగ దాఁటి యొక చేఁప తెఱంగున నద్భుతంబుగా;
ధారిణి దేవతాసదవతారములందునుఁ దప్పరాక్రతా
వారితకర్మవాసనల పాటవము ల్వొడసూపకుండునే? 49

క. జిగిమైనుండియు దీర్ఘం
బగుచికురోత్కరమునుఁడిడి యూఁపో ధారల్

తెగఁగాఱఁగఁ జలి క్రోడక
జగతీవిభుఁ డవలిగట్టు • చయ్యన నెక్కెన్. 50

గీ. పారవారము వెదకుచు • వచ్చునెడఁ
భీతి మదిఁ జొర గౌరాంగ • విభుఁడు నిలువ
కటను, బులి దఱుమంగఁ బ్రా • ణావనోత్సు
కతను బరువెత్తుహరిణంబు • కరణిఁ బాఱె. 51

వ. ఇట్లుండ నవద్వీపంబున. 52

చ. విపులం బాపతివక్షమట్లు నునుపు, • న్వెచ్చ, న్సుఖం బాత్మ కా
యుపబర్హం బిడకుంటఁ జేసి నవలా • యుల్కంది మేల్కాంచి లే
చి పతి న్బక్కను గానలేక కలయం • జేదోయిఁతో శయ్యపై
వపురాకంపముతోడుత న్దడవెఁ బా • పం! బంధకారంబునన్. 53

క. వెదకి యెచటఁ బతిఁ గానమి
సుదతీమణి "చిత్తజాత • సుందర! నాథా!
హృదయము తటతట గొట్టుక
చెదరెడు నెట డాఁగినావొ • చెపుమా" యనియెన్. 54

గీ. ఉవిద యాక్రందమున కేమి • యుత్తరంబు
లేమిఁ జెచ్చెరఁ దలుపు గొం • డ్లెంబు నూఁచెఁ;
దీసి తలుపుంటఁ గాంచి యా • తెఱవ వెడలి
యరసెను వసార; నచ్చట • నతఁడు లేఁడు. 55

వ. అంతఁ గరపల్లవంబు ఫాలంబునం గీలించి విష్ణుప్రియ దీనానన
యై యిట్లనియె. 56

క. ఈయర్ధరాత్రమున నీ
వేయెడ కేగితివొ యెట్టు • లెఱుఁగఁ గలుగుదున్?

నీయెదపై నాశిర మిడి
హాయిగ నిద్రింప మోస ♦ మయ్యెను నాథా! 57

క. ఆవలపులు నాసొలపులు
నీవిధమునఁ జేసి పోవ♦నేనా? యయ్యో!
యేవేళ వత్తువో యని
నే వేచుక యుండుదాన ♦ నిద్రం బడితిన్. 58

ఆ. నింబవృక్షపరిస♦రంబున జన్మించి
నెగడలేదు నీవు ♦ నిమిసమాఖ్య;
వేఁపతీపిచిత్త♦వృత్తులు గలవాఁడ
వౌట నిన్నుఁ బిలుతు ♦ రట్లు నాథ! 59

వ. అని విలపించుచు నంత. 60

మ. పతి సన్యాసకథాస్మృతు ల్నిజమృదు♦స్వాంతంబున న్నాటఁ, బో
యితి దుర్మార్గపునిద్ర; నందు గని పో♦యె న్ప్రాణనాథుండు; దు
ర్గతి వచ్చె న్గద! యంచుఁ జక్కనివిరు♦ ల్గ్రందంబు వల్వ ల్నగల్
సతి నాన న్వగనూడ్చి తాల్చెఁ బ్రతిగా♦స్వల్పార్ఘవస్త్రాదులన్.

క. ఎడ నడలఁగఁ గడుఁజిడిముడి
పడి చని శచిగూర్కు-గదిక♦వాటముఁ జేఁజ
ప్పుడు చేసి కొట్టి యత్తా!
వడి లెండని కేకవేసెఁ ♦ బడఁతి వడఁకుచున్. 62

గీ. పిలుచునది యెవ్వ? రని శచి ♦ యులికిపడుచు
లేచి, విష్ణుప్రియవె? యేల♦లేమ! యీయ
వసరమున వచ్చితివి? కుఱ్ఱ ♦ వాఁడు సేమ
మునను లోపల నున్నాఁడె? ♦ యని యడిగెను. 63

ఆ. వెఱ్ఱితల్లి! పైకి ♦ వేవేగ రావమ్మ!
మీసుతుండు మనలఁ ♦ బాసి చనియె,
నంచుఁ గోడ లనఁగ ♦ నరిగెనే? యెచటికిఁ?
దెలియఁ జెప్పు మంచుఁ ♦ బలికె వృద్ధ. 64

ఆ. పలుక లేక నత్త ♦ వట్టినదానిపో
లికను దన్వి నుడువ ♦ లేచి వచ్చి
తలుపు దెఱచి యామె♦వలన సర్వంబు నె
ఱింగి దుఃఖపడియె ♦ వృద్ధమాత. 65

వ. శచి దీపంబు వెలిగించి పట్టుకొని ముందునడ, వెనుక విష్ణుప్రియ యామెబట్ట వట్టుకొని యంటి రాఁగ, నిర్వురు నిల్లు కలయం బరికించి బహిర్ద్వారంబు తెఱచి యుంటఁ గాంచి యాతం డవ్వలి కిం జనె నని కృతనిశ్చయ లై చింతాక్రాంత చిత్త లై వీథిం బడి కొంతదవ్వు సనిరి. శచి బిగ్గరగా 'నిమా' యని పిలుచుచుఁ బ్రత్యుత్తరంబు గానక యీవైపు వావైపు వెఱ్ఱిదానివలెఁ జూచు చు నెట నెవ్వరు లేకుండినను 'నాయనా! మాగౌరాంగుఁడిచ్చట నున్నాఁడా?' యని పృచ్ఛించుచుండె; నిట్లు చని చని విఫల మనోరథ లై వేసారి కాల్లీక ముందునకు సాఁగ కుంటచే నిర్వురుం దిరిగి మఱల గృహంబుఁ బ్రవేశించి రంత. 66

ఆ. చేయుచప్పుడు గని ♦ సేవకుం డొక్కఁడు శ్రీ
శానుఁ డనెడువాఁడు ♦ సరగ లేచి
శ్రీమను బైటిగదిని ♦ జతికిలం బడి యేడ్చు
శచిని గాంచి భీతిఁ ♦ జనియె దరికి. 67

వ. చని వంతకుం గలకతం బెఱింగి దాని నాప్తులకుఁ దెలియంజేసె.

శా. ఎంతో యత్నమున న్బందాబుజముల ♦ న్నేమాంగి విష్ణుప్రియా
కాంతాతల్లజ మీఁడ్చికొంచునవిని ♦ ష్క్రాంతాశ్రునేత్రద్వయిన్
జింతావిగ్రహమట్లు లోనిగది సొ ♦ చ్చె; న్జొచ్చి నిల్చుండలే
కంతం గూలె మహార్తి విహ్వలమతి ♦ న్నా! యంచు రిక్తావనిన్. 69

వ. ఇట్లుండఁ గొంతసేపటికి శ్రీవాసాదిభక్తప్రకాండకాండంబు
లింట మూఁగి జరిగినయావద్వృత్తాంతంబుం దెలుసుకొనిగారాం
గుపోక మఱల రానిపోకయే యని యెఱింగియు నేదెసకుం జననో
యెఱుంగక యాఁడువారియెదుట నాసంగతి ప్రస్తావింప నొల్లక
మిన్నకుండె నంత శచీదేవి. 70

ఉ. ఫాలము చేతఁ గొట్టుకొని ♦ పైకి వచింపఁగలేక నందనుం
డాలిని దన్ను వీడి చనె ♦ నన్నయుదంతము హస్తసంజ్ఞ భ
క్తాళికిఁ దెల్పి యశ్రువుల, ♦ నంతటఁ దెప్పిఱి పల్కె నిట్టు లు
ద్వేలవిరక్తి మాటలను ♦ దీటుకొన న్గనిపించువారితోన్. 71

మ. ధనధాన్యాంబరభూషణావళులు స ♦ ద్మంబందుఁ బూర్ణంబుగాఁ
గనుపట్టు న్హరిభక్తులార! కొడుకు ♦ న్గాంచంగ నేఁబోదు నిం
ట నిఁ కేమున్నది నాకుఁ? బంచికొనుఁడం ♦ తన్మీరు; మీదేశికుం
డును దేవుం డగువానిసద్వనిత నెం ♦ తో భక్తిఁ గాపాడుఁడీ! 72

వ. అంత శ్రీవాసుం డిట్లనియె. 73

ఉ. ఎందున కేస్థలంబునకు ♦ నీశుఁడు వోయెనొ చూడ కీగతిన్
గుందుట వట్టిపిచ్చిపని; ♦ గూఢముగా నొకకొంతసేపు మ
మ్మందఱ దీనిఁగూర్చి యిపు ♦ డారయనిమ్మని భక్తసంచయం
బందలిబుద్ధిమంతుల స ♦ యజ్ఞులఁ గొం చొకచోటఁ గూడెఁదాన్.

వ. 'నీ వేమితలంచెద' వని నితి శ్రీవాసు నడుగ నాతం డింక

దాఁప నేల? జరుగవలసినయనర్థం బంతయు సంభవించె నని తలంచెదు' నన నితి 'నాకు నట్లే తోఁచుచున్న' దనియె; నంత భక్తులు సముచితభాగంబులుగఁ దమ్ము విభజించుకొని దేశం బున నెక్కడెక్కడ సన్యాసులయునికిప ట్లున్నవో యచ్చ టచ్చటికిఁ జని ప్రభుం గాని ప్రభుసమాచారంబుం గాని తీసి కొనివత్త మని నిశ్చయించుకొని. 75

క. కనవలె స్వామినో మరణం
బునో; గౌరాంగుండు లేని♦పురిలోఁ గాలం
బును గడప నశక్యం బని
యనుకొనునంత నితి యిట్టు♦లనె వారలతోఁ. 76

సీ. చెలులార! నా కిప్డు ♦ స్మృతికి వచ్చిన; దొండు
సెప్పె వెన్కను బ్రభు♦శేఖరుండు;
కాత్వాపురంబు చ♦క్కటిని గేశవభార
తీసంయమికులప్ర♦దీపకుకడఁ
గొనునఁట సన్యాస♦ము; నది నవద్వీప
పట్టణంబున కొక ♦ పదియు నాఱు
మైళ్ల దూరంబులో ♦ మన గంగపై నుండు;
నచటి కాదిని బోయి ♦ యరయ వలయు;

గీ. నంచు వచియింప, నానంద♦మంది చంద్ర
శేఖరుని, ముకుందుని, నితిఁ ♦ జెలులను మఱి
కొందఱం గూడ నిమి వెద♦కుటకుఁ బంప
నెల్ల రేకమనస్కత ♦ నెంచుకొనిరి. 77

ఆ. స్వామి యుండెనే న♦చట, మనయీపురం

బునకుఁ దిరుగ రాఁగ ♦ బుద్ధి వోఁడము
నేనిఁ, బోయి తెత్తు ♦ మేర్తౌర నసర్మన్న
యనచకోరకువల♦యాప్తు నిటకు. 78

వ. అని యందఱు ధైర్యయుక్తులై గౌరాంగాన్వేషణాసక్తచిత్తులై యుండ నంత నిఱి శచీదేవిసమ్ముఖమ్మున కేతెంచి గృహాంతరంబున డిల్లపడి యున్నపూజ్యురా లగువిష్ణుప్రియకు సుశ్రుతం బగునట్లు పేరెలుంగున నిజధైర్యస్థైర్యంబులు ప్రకటితంబులు గాఁగ నిట్లనియె. 79

ఆ. వేగ వెండి వచ్చు♦లాగున నే నిమి
యరిగినాఁ డటంచు ♦ ననుకొనుదము.
ప్రభునియిచ్ఛ యెట్లొ ♦ వర్తింత మట్టు; లా
పదల ధైర్య ముండ♦వలయుఁ గాదె? 80

గీ. శచిని విష్ణుప్రియను గడు ♦ జాగరూకుఁ
డాచు శ్రీవాసపండితుం ♦ డరయుచుండు;
నేను మఱికొందఱం గొని ♦ నిమిమహాత్ముఁ
డల్లకాత్వాకుఁ జనె నేమొ ♦ యరసి వత్తు. 81

వ. అని యాత్మగతంబుగా. 82

చ. సురిఁగి విభుండు నామెడకుఁ♦జుట్టెన యో! గృహభారమంతయుస్;
మరణము నొందుస్త్రీద్వయము♦ క్రమంగి యతండగపడ్డఁ గాని; స
త్వరగతి నేగి వానిఁ గనఁ ♦ బ్రాణమునేనియుఁ గోలుపోవుదుస్;
సరి యగునిట్టికార్యమున ♦ సారసనేత్రుఁడు తోడు గాఁ డొకో?

క. అనుకొని "యమ్మా! నిమినిం
గొని తెచ్చెద నిదిగొ యందు♦కొఱకే చనెదస్

వసరకు" మని శచితో సని
చనెఁ గౌత్వాదెసకు నతఁడు సనహాయుం డై. 84



క. దరిలేని జన్మబాధలఁ
బొరయుచు మలమల మఱుంగు పురుషుల మనముల్
పరితుష్టిఁ జల్ల నౌ నీ
పరమపవిత్రాఖ్య నోటఁ బల్కిన రామా! 85



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయ భాగము.

### పంచమాశ్వాసము.

చ. వడిగలవాఁడ వయ్యు, నర♦పాలక పాలనశాలి వయ్యు, నా
విడిముడిచేఁడె నీయనుఁగుఁ♦బ్రియసి యయ్యును, జేత నొక్కఁడ
మ్మిడియును లేనిదీనుకిప్రియ♦మేసుగ మారయ, కుండరానికా
అడవులఁదాఁటియుంటకఁడు♦నచ్చెరు వౌఁగద! తండ్రి! రాఘవా!

సీ. గంగచెంగట నొకవట♦క్ష్మారుహంబు
క్రింద నుటజంబుఁ గట్టిక♦యందు నున్న
భారతీస్వామిప్రమోలఁ గ్రొ♦క్కారుమెఱుఁగు
తెఱఁగునను నిల్చి పదముల♦కెఱఁగె విభుఁడు. 2

వ. అంతఁ గేశవుండు. 3

క. ద్యుతలచ్యుతదివ్యాభా
యుతకాయుఁడ వీ వెవండ♦వో! నాచే సం
స్తుతులం గొనుటకు మాఱుగ
నతులం గావింతు నా క♦నర్హున కనియెఁ. 4

వ. హస్తపద్మంబులు జోడించి గౌరాంగుం డిట్లనియె. 5

ఉ. దాపున నున్నవాఁడు నిమి; ♦ దర్శన మిచ్చితి రీరు మున్నవ
ద్వీపమునందు నా; కట య♦తిత్వ మొసంగెద నంచుఁ గూర్మినీ
పాపికిఁ జెప్పినందున భ♦వత్పదపద్మము లంటి చిత్తసం
తాపతరంగసంసరణ♦దారుణవార్ధిఁ దరింప వచ్చితిన్. 6

మ. అనునంత న్స్మృతి కేఁగుదెంచెఁ జనని ము♦న్నావిటఁ దా నెట్లొచే
సినబాస ల్సకలంబుఁ; గాని యతఁ డా♦చిత్రప్రభాక్రాంతన
త్తనుశోభాయుతయౌవనాఢ్యుఁ గనినం♦త న్దైవమా! నేను బ
ల్కినయ ట్లెట్టులు సల్పనేర్తు నని దుః♦ఖించె న్మది న్బెల్లుగన్.

క. ఆడినమాటం దప్పిన
వాఁ డిందును నందుఁ గూడ ♦ వాసిఁ దొఱఁగు నాఁ
గూడునె సన్యాసికిఁ దా
నాడినటు ల్సేయకుంట ♦ యని చింతిల్లెన్. 8

క. ఉత్తర మెటు లిచ్చుటకున్
జిత్తం బొప్పమిని గొంత♦సే పుండుము నీ
కిత్తును బ్రత్యుత్తర మని
పుత్తడిడాల్ప్రోడతోడ ♦ బోడ వచించెన్. 9

క. వెనుక నవద్వీపంబునఁ
గని నప్పుడె భిక్షువునకు ♦ గౌరాంగమహా
తనుదీప్తి యక్షిగత మ
య్యె; నయిన నతఁ డద్ది యెల్ల♦నేలో మఱచెన్. 10

క. మునుపటికి నెక్కు డౌదీ
ప్తిని జిమ్మను దేహ మిప్డు; ♦ దివ్యాకారం
బును గాంచిన, సామాన్యపు
మనుజుఁడు గాఁ డీతఁ డంచు ♦ మది యతి తలఁచెన్. 11

సీ. అడుగకే యాహార ♦ మలవడవలయును ;
మహి సర్వభోగము ♦ లామ్రసవలయుఁ ;
గటికినేలను నిద్రఁ ♦ గాంచఁగావలయు ; నూ
ర్జితచిత్తశాలి వై ♦ బ్రతుకవలయుఁ ;
గామాదిదుర్ద్విష ♦ త్కాండంబుఁ జెండాడి
చేడెల విషమట్లు ♦ చూడవలయుఁ ;
బుడమి నిష్టానిష్ట♦ముల నేకదృష్టిని
దిలకించి యిలఁ బ్రవ ♦ ర్తింపవలయు ;
గీ. నిట్టి యతిధర్మములఁ గటా! ♦ యెట్లు జరుపఁ
జాలు నీనవయౌవన♦శాలి ? యీశు
భాంగుఁ, డతి సుకుమారుఁ, డ♦ బ్జాయతాక్షుఁ,
డంచుఁ జింతించెఁ గర్మంది ♦ స్వాంతమందు. 12
వ. ఇట్లు తలపోసి తలపోసి తుదకు ధైర్యంబుఁ దెచ్చికొని యాతండు నిమి కిట్లనియె. 13
శా. నే వాగ్దాన మొనర్చితి న్నిజము; దా♦ ని న్నిల్పుకో నెంచి యా
త్రోవం బోవ ననర్థ మా; యువవయ♦స్థు న్మస్కరిం జేసినన్
భావస్థైర్యము లేమిఁ జిక్కువడు న♦వ్వాఁ; డీజగంబందుఁ జే
తోవృత్తు ల్నిమి! యేఁబదేండ్లవఱకు ♦ న్దుర్దాంతశత్రు ల్సుమీ.
క. అరిషడ్వర్గముడాకకు
వెఱచి గృహస్థుండె చిక్కి ♦ వీఁటిఁడి యైనం
బోరయు నష్టముఁ; బారా
శరిదుర్గతి యెవఁడు తెలియఁ ♦ జాలు నయినన్ ? 15
క. నిమి! యక్షంతవ్యము సం
యమి చేసినస్వల్పదోష ♦ మైన; న్గానన్

క్షముఁడు యతిత్వంబున కల
శమదమపంచాశదబ్ద ♦ శాలి యొకండే. 16

వ. అంత శ్రీకృష్ణచింతానిమగ్నచిత్తుం డై యున్నగౌరాంగుం డులికి
పడి లేచి కేశవభారతివాక్యంబులభావంబు గ్రహియించి యల్లన
ని ట్లనియె. 17

శా. ధన్యాత్మా! పలుకంగ లే నెదుటఁ; బె♦ద్ద ల్మీరు; నే బాలుఁడన్;
సన్యాసంబు నొసంగ నీ కనుట నా ♦ శక్తి న్పరీక్షింప నం
చు న్యోజించెదఁ; గానిచూడఁగఁ గడు ♦ న్జోద్యంబులౌ మీనుడుల్;
సన్యాసంబునకు న్వయఃపటిమకు ♦ న్సంబంధ మే మున్నదో! 18

క. గురుకులచంద్రమ! యెందఱు
మరణించుచున్నవారు ♦ మహిఁ బ్రతిదినముల్
దరుణవయస్కులు? మృత్యువు
గరుణించునె పిల్లవాండ్రఁ ♦ గబళింపక? తాన్. 19

శా. సంసారప్రతిబంధకంబుల, నకృ ♦ ష్ణవ్యర్థచేతస్కతన్
హింసం గాసిలుచుంటి; వానిఁ గన నే ♦ నేగన్వలె న్బృందకున్;
గంసారిం గనకున్నఁ జచ్చుటయె ని♦శ్చ్యం; బాదుపీ వొండె మ
త్సంస్మృత్యుత్కటతాపసంచయముల ♦ న్జల్లార్చి రక్షింపఁగన్. 20

క. ఆకస్మికసన్మరణము
నా కబ్బిన సంతసంబె; ♦ నందసుతానా
లోకననిశితార్తులు గవ
రాకయె యుఱుఁదెవులుమాడ్కి ♦ మ్రగ్గించు నన్. 21

క. నీపాలఁ బడితి నా కీ
యాపదఁ దప్పింపు మనుచు; ♦ నాశాభంగం

బాపాడిల్లఁగఁ జేయకు;
గోపాలుని నన్నుఁ గూర్చి ♦ కోను పున్నెంబుల్. 22

వ. అందునకు భారతీస్వామి యి ట్లనియె. 23

క. లలనయు మాతయుఁ గద ! శృం
ఖలములు గౌరాంగ ! పుట్టి ♦ కట్టిన యాగో
లల నంటి యుంట విధి యను
నలుకునఁ గద! వారి వీడ ♦ నార్తిపడె దిటుల్. 24

చ. పరమపవిత్రమైనయను♦బంధముఁ ద్రెంపి యువప్రకాండమా!
యరుగుము తీర్థయాత్రలకు ♦ నాశ్రమముం గ్రహింయింపుమిత్తునే
నుఱవగుపున్నె మబ్బు నుభ♦యు ల్గృహమందున నేడ్చుచుండినన్
ద్వరపడుమంచుఁ బల్కి నినుఁ ♦ బంపు మటంచ నెదే?శచీసుతా!

ఉ. ఒల్ల నటు ల్పొనర్చుటకు; ♦ నుల్లము వ్రయ్యునయో! తలంచినన్
గుల్లి మనంబున న్గసుమ♦కోమలి నీసతి, వృద్ధ మాతయున్
గొల్లున నేడ్చి, పాపి విడఁ♦గొట్టె సతీపతులన్ ; గుమారునిన్
దల్లిని బాపివేసె; నని ♦ దారుణకర్ముని న న్నపింపరే? 26

క. ఉత్తమవనితలముందట
నిత్తాపసుఁ డెంతవాఁడు ♦ హింసాకృత్యా
యత్తుం డైనను? దేవుఁడుఁ
గ్రొత్తయె? దుష్టకృతిఁ గాంచి ♦ కుద్ధుఁడు గాఁడే? 27

ఉ. అంతట భక్తపంచకము ♦ నచ్చటిపౌరకదంబకంబు న
త్యంతము వేగ మాగతిని ♦ దండువలె న్జనుదెంచి సంయమి
ప్రాంతమునందు నిగ్గుటప♦రంజిని బోసినబొమ్మరీతిఁ దె
న్వంత శిరంబు జానువుల♦పై నిడి యున్నశచీసుతుం గనన్. 28

ఉ. అల్లతఁడే కనంబడెనటంచు నితిప్రముఖు లొసరంబడన్
వల్లభుఁ డెత్తి యాదలను ◆ వారిని గాంచె సుఖప్రదాననం
ఫుల్లసితారవిందనిభ◆పూజ్యతమాక్షివిలోకనంబులన్ ;
జల్లనిచూపు పైఁ బడఁగ ◆ శాంతిని బొందిరి భక్తశేఖరుల్. 29

వ. భక్తులు గౌరాంగోపగూహనశుభావలోకనమహానందమగ్నులై తారు వచ్చినకార్యంబు మఱచిన ట్లుండి రంత. 30

చ. తరుణకళత్రము న్ముసలి◆తల్లిఁ ద్యజించి యొకండు మారసుం
దరుఁ, డెలప్రాయపుంబురుష◆తల్లజ,హూమరభవ్యతేజుఁ డీ
పురి కరుదెంచి కేశవుని◆ముందఱ సంయమి గాఁగఁ గోరి తాం
దరపడుచున్నవాఁ డఁట! క◆న న్వలె రం డనివచ్చి రెందఱో. 31

క. స్త్రీపురుషవృద్ధబాలకు
లాపోవఁగ నిమిని జూచు ◆ సత్యాసక్తిన్
వే పారాశరియాశ్రమ
మేపారఁగఁ జొచ్చి కాంచి ◆ యెసఁగిరి ప్రీతిన్. 32

ఆ. మంచితేనెఁ గనిన ◆ మధుమక్షికలమాడ్కి,
నగ్నికీల లరయు◆నలయిసుళ్ల
కరణి, నిమిని జూడఁ ◆ గాత్వాజనావళి
జోగియాకుటిల్లు ◆ సొచ్చి మూఁగె. 33

శా. భక్తిప్రేమము లాకృతిం బడసి కా◆త్వాయందు నున్నట్లు సం
త్యక్తప్రాకృతసౌఖ్యకాండుఁ డయి గౌ◆రాంగుండు పొల్పార నా
ముక్తస్వాంతుని దల్లు లారసి మహా◆మోదానుభూతి న్సుతా
సక్తి న్దాఁటినప్రేమ మొందు గని ర◆చ్ఛం బైనడెందంబులన్. 34

వ. అంత ముల్లోకంబుల మోహితంబులం జేయునెలనవ్వొండు గెమ్మోవిం దులకింప గౌరాంగుండు భక్తులం గాంచి యిట్లనియె.

సీ. మిత్రులు వచ్చినందున క♦మేయపుమోదము గల్గె; జేపు తా
పత్రియశృంఖలంబులను ♦ బ్రద్దలుగొట్టి, విమోహముఖ్యదు
శ్శాత్రివుల జ్జయించి, పటు♦సంసరణాంబుధి దాఁటి, దైహికా
ముత్రికభోగము ల్దొఱఁగి, ♦ పోయెదఁ గృష్ణపదాబ్జసేవకై. 36

వ. అని మహానందచంద్రికలు వెదచల్లుముఖచంద్రబింబంబు ముకుం
దుదిక్కు ద్రిప్పి గౌరాంగుం డిట్లనియె. 37

గీ. మానసము చల్లఁబడ హరి♦గాన మొందు
సేయుము ముకుంద! యిటఁ గొంత♦సేపు; కృష్ణ
నామకథనామృతాస్వాద♦నంబుకొఱకు
వేచి యున్నవి దప్పి నీ♦వీను లకట! 38

వ. అంత ముకుందుండు. 39

ఉ. చక్కనికంఠనాదమున ♦ శ్యామలగాత్రుని గూర్చి పాడఁగాఁ
జొక్కి శచీసుతుండు తను♦శోభలు నల్దెసలందుఁ బర్వఁగా
దృక్కమలంబు లాస్యము ను♦దీర్ణపుభక్తిరసంబు వెల్వఁగా
వాక్కులఁ గృష్ణనామము న♦వారిగఁబల్కుచు నాడె నాట్యముల్.

గీ. దివ్యభక్తిప్రకటకత♦ద్భవ్యనృత్య
ములను దిలకించి యచ్చటి♦పురజనాళి
యిండ్లు వాకిళ్లు మఱచి హ♦రీ! యటంచు
పాడి యాడెను గూడి య♦పారభక్తి. 41

మ. సకలోర్వీతలవస్తుజాతములు, సం♦సారప్రియాసంబులున్,
వికటాంతఃకరణప్రవృత్తులును, వి♦ద్వేషంబు, లోభంబు, సాం
ఘికవైషమ్యము, లన్నియు న్నరఁగి యే♦కీభావముం జెంది, సం
దకిశోరాంఘ్రినిబద్ధచిత్తపరమా♦నందాబ్ధి యయ్యె న్సదా! 42

క. వైకుంఠవాససుఖ మీ
లోకముననె విష్ణుభక్తి లోలాత్మకులై
చేకొనెదరు నరపుంగవు
లీకరణిని విషయవాంఛ లెల్లఁ దొలఁగుచున్. 43

ఆ. జనులు తారు సూచి సంతసించుటె కాక
యిట్టిసుఖము పుడమి నెట్లు లబ్బ
ననుచు వారి వారి తనయుల నాప్తులఁ
దోడి తెచ్చి చూపి తుష్టి నిడిరి. 44

వ. నిత్యానందచంద్రశేఖరు లంత నిమిం బట్టుకొని యించుక వి
శ్రాంతిం గొనుమని చెప్పి నర్తనం బాఁపివేయఁ గేశవుం డానం
దబాష్పప్లుతలోచనుం డై గౌరాంగుం జూచి యి ట్లనియె. 45

మ. నరజన్మంబును గొన్నవారలకుఁ గృష్ణప్రేమమే ముఖ్య మౌ
పురుషార్థం; బయిన, స్వధర్మమును సంపూర్ణంబుగాఁ గాంచి నా
పురుపుణ్యాత్మక! మా తెగ న్గొరఁగనే లో నన్నుఁ బ్రార్థింతు? వి
ద్ధర నెందేనియు భాగ్యశాలి నిజుపేద నొ్బయి యాచించునే?

క. తనయాత్మ న్బరిశుద్ధము
గను గావించుకొనఁ గోరి కర్మంది యగున్
మనుజుం; డిఁక సర్వాత్మా
వనచణుఁడవు సన్యసింప వలయునె నీవున్. 47

వ. అంత గౌరాంగుండు చేతులు జోడించి బాష్పపూరితంబు లగు
కీ్రఁగన్నులతో భారతీస్వామి కి ట్లనియె. 48

శా. ఈమాట ల్నిశితాస్త్రసన్నిభము లై యేఁచున్మదిస్సంయమీ!
మోమోటం బొకయింత లేక నుతులం బోకార్తు వి; ట్లందుకై

యే మీపొంతకు రాను; రక్షణముకై ♦ యే తెంచితి న్నీనతన్;
ప్రేమోదారత శిష్యవత్సలత గా♦న్పింప న్ననుం బ్రోవుమా! 49

క. శ్రీకృష్ణుఁడు జీవేశుఁడు
రాకున్నాఁ డిటకు; హృదయ♦రంగము శూన్యం
బై కడుబాధం జెందెడు;
నీకష్టాత్మకుని జూడ ♦ నెదగరఁగదొకో! 50

వ. అంతఁ గేశవుం డి ట్లనియె. 51

శా. నీగుట్టు న్దెలియంగఁజాల ననుకొం♦టే! సుందరాకార! ది
గ్భాగంబు ల్దులకించుచున్నవి భవ♦ద్భవ్యప్రభారాజిచే;
యోగు ల్భక్తులు దొంగ వీ, వెవనిదృ♦శ్యం జేసికోనంతురో
యాగోవిందుఁడుఁ గృష్ణుఁడు న్హరియుఁద♦థ్యంబీవె! గౌరాంగుఁడా!

వ. అంత నిమి యి ట్లనియె. 53

ఉ. ఉంటి సగంబు సచ్చి క స♦వో! యతిపుంగవ! యిట్టిదీను నీ
వంటిమహాత్ముఁ డుల్లసపు♦వాక్కులఁ బూర్తిగఁ జంపరాదు;కా
లంటిన నిట్టి గిట్టి పురు♦వట్లు పరంగెడువీఁడు సాధవుం
డంట యిఁ కేను బల్కవలె♦ నా! హరిదూషణ మంచు నీకడన్.

శా. క్రూరపరిస్తుతులం బొనర్చి శ్రమణా!♦కుట్ర న్ననున్యాచకున్
ఘోరార్తి న్బడవైతు విద్ధి తగునో♦క్కో! యంచు గౌరాం గుఁడ
వ్వారి న్బాష్పముల న్విడల్చి తపియిం♦ప, న్భారతీస్వామి ప్రే
రారాటంబును జెందెఁ; గాని యతిఁ జే♦యన్జంకెబాలున్నిమిన్.

వ. జంకి నిమితో ని ట్లనియె. 56

క. నను మన్నింపుము నిమి! ని
న్ననఁగూడనిమాట లాడి ♦ యంతఃకరణం

బును నొప్పించిన; సన్న్యా
సినిగా మాత్రంబు నిన్నుఁ ♦ జేయం జాలన్. 57

క. ఒకపుత్త్రుఁ గాంచి, నీమా
తకు దారకు నచ్చుఁ జెప్పి, ♦ తల్లి మనఃపూ
ర్వకముగ 'సరి' యన,రా! కొం
చక యపు డొసఁగుదును నీకు ♦ సన్న్యాసంబున్. 58

వ. అన విషణ్ణవదనుం డై గౌరాంగుం డి ట్లనియె. 59

మ. గురువర్యా! సెలవిచ్చినా రుభయులు♦న్గొంకింతయు న్లేక; నా
తరుణత్వంబె యిఁ కున్నయడ్డ; మకటా!♦దాక్షిణ్యముం జూపునే
మరణం బల్పవయస్సు నెంచి? శిశువు♦ల్నమ్రందించెడు న్వృద్ధు న;
క్లైబుఁగంజాలు నెవండు మృత్యు వది యె♦ప్డేసందున న్వచ్చునో?

క. కావున మరణము నిక్కము
జీవించుట సందియంబు ♦ జీవుల కెపుడున్
జావునకు సిద్ధపడవలెఁ;
గావుము న న్బాధవెట్ట♦క యతివరేణ్యా! 61

వ. భారతి యి ట్లనియె. 62

సీ. మన సిచ్చి మాటాడె♦దను విను మిఁక నిమి!
నేను గాని యొరులు ♦ గాని నిన్నుఁ
బోలుపూరుషు నెప్డుఁ ♦ బొడగాంచఁగా లేదు;
సుకుమారతరుఁడవు ♦ సుమముకంటె;
నల్లారుముద్దుగా ♦ నెల్లర కుంటివి;
సన్న్యాసి వడెడుక♦ష్టంబు లెవియొ
యెన్నియో యెఱుఁగవు; ♦ చిన్నతనమున నా
కడగండ్లఁ బడి బ్రతు♦కంగఁ జాల

గీ. వెండలో నిడ్డపూవట్టు ♦ లీల్గు ; దంత
నిన్నుఁ జంపినపాపంబు ♦ నన్నుఁ జుట్టు
కొనును ; నీతల్లి భార్యయుఁ ♦ గనలి శాప
దగ్ధునిగఁ జేయుదురు నన్నుఁ ♦ దథ్యముగను. 63

వ. ఇదియునుం గాక. 64

సీ. మోక్షార్థి వై నీవు ♦ రూక్షసన్యాసంబుఁ
బడయఁ జూచుట యనా ♦ వశ్యకంబు ;
పురుషుల మించిన ♦ పురుషోత్తముఁడ వీవు ;
ము న్నెవ్వఁ డీస్థితిఁ ♦ బొరయ లేదు,
విశ్వసింపఁగఁ జాల ♦ వెనుక నీ వాడిన
మాట; య దేదినా, ♦ "మాత సెలవు,
భార్యసమ్మతి నేను ♦ బడసి వచ్చితి" నంట ;
యది మనఃపూర్వక ♦ మైన దగునె ?
గీ. వారు నావలె నీయపూ ♦ ర్వంపులక్ష
ణంబు లారసి, హృద్వ్యమో ♦ హంబు నెనసి,
యవశతాస్థితి నీ కెదు ♦ రాడ లేక
మంచి దని రంచు నెంతు నో ♦ మాయకాఁడ ! 65

గీ. కనిన తల్లియుఁ జేసికొ ♦ నినకళత్ర
మెట్టు లొప్పుదు రయ్య ! నీ ♦ వెడసిపోవ ?
నెట్టిసంబంధములు లేని ♦ వృద్ధభిక్షు
కుఁడను నే నింతమనసులోఁ ♦ గుందుచుండ. 66

శా. రాగద్వేషజయప్రధానతను, బ్రి ♦ వ్రిజ్యాప్రివేశంబునన్
యోగోపార్జితచిత్తసత్వగురుతా ♦ యుక్తి, న్వయోవృద్ధతన్,

రాగిల్లం గలనాకె నిన్నుఁ గనినం ♦ దన్గుండెనీరయ్యె ; నెం
తో గాసిల్లుచు లోన, బాష్పము లడం ♦ తున్దుర్యశోభీతిచేఁ. 67

గీ. నిజము సెప్పెద సన్యాసి ♦ నియతి నున్న
యేను నినుఁ జూచుతోడనే ♦ యేకపుత్త్రి
వద్గృహస్థానురాగసం ♦ భరితహృదయుఁ
డ నయి దుఃఖించుచున్నాఁడ ♦ ను నిమి ! సముత్రం 68

ఆ. ఏడ్చుచున్నవాఁడ ♦ నే నొక్కఁడనె కాను ;
కనఁగ వచ్చినట్టి ♦ జనులకనులు
కరఁగి బాష్పవృష్టిఁ ♦ గురియు చెట్లున్నవో
ప్రావృడబ్దపాళి ♦ పగిదిఁ జూడు. 69

గీ. అంతఁ దలయెత్తి యాయసం ♦ ఖ్యాక మైన
పౌరబృందంబు నిమి సూడ ♦ వఱద లట్లు
కాఱె నశ్రులు వారల ♦ కనులనుండి ;
వెక్కు లేడ్పులు వెనుకటి ♦ కెక్కు డయ్యె. 70

వ. ద్రష్టృసంఘంబులోని స్త్రీపురుషు లంద ఱేకగ్రీవంబుగ సతనితో
నిట్లనిరి. 71

గీ. తండ్రి ! క్రమ్మఱఁ జనుమయ్య ♦ తల్లికడకు,
భార్యకడకును వేగ ; సం ♦ బంధ మేమి
లేనిమే మూర కడలు చీ♦లీల నుంటి ;
మీ ల్గుదురో యేమొ యాయమ్మ♦లింటిలోన. 72

వ. అందుఁ గడుసమీపంబున నున్నయొకం డిట్లనియె. 73

శా. క్షోణిన్గాత్రతమంపుఁబాతకియు సం ♦ క్షోభించి వర్జించెడుణ్
ప్రాణంబు ల్నిను బోడఁగాఁ గన ; భవ ♦ ద్రాజద్వపుర్లక్షణ

క్రశ్రేణి నగ్నపుటి కావిగుడ్డలను ల ♦ క్ష్మీత్రకాంత ! దృక్పర్వస
న్మాణిక్యం బొకగోంచిపాంతేం గొని దా ♦ న నట్టి సల్లాంజుమీా. 74

క. ఈయంగకమును జోగుల
హేయపుంగాయంబుంజేత ♦ యింకనిస్తులము
ధ్యాయకమంజుపదార్థము
నీయిలలో నుండనీయ ♦ కెడలించుటగో. 75

వ. ఈమాట లాలకించి నీళ్లు దొరంగునాకర్ణాంతనయనంబులతోం ముకుళితకరపద్మంబులతోం గ్రిక్కిఱిసి యెదుట నున్నపౌరజనం బువైపు దిరిగి గౌరాంగుం డిట్లనియె. 76

సీ. తోడ్పులారా ! కన్న ♦ తల్లులారా ! భ్రాతృ
సోదరీమణులార ! ♦ యాదమాని
శ్రీకృష్ణసంప్రాప్తి ♦ నా కగునట్టు లా
శీర్వదింపుండి బాధ ♦ కోర్వలేను;
నమ్మరు చెప్పిన ♦ నాప్రస్తుతావస్థ ;
యెచ్చటనుండిన ♦ నేమి నాకు ?
హర్మ్యంబు, వని, గుహ ♦ సరయుదు నొకరీతిం ;
గృష్ణవ్యపేత మై ♦ హృదయపీఠి

గీ. వట్టి దయ్యెను; శ్రీహరి ♦ వచ్చి చొచ్చె
నేని యానంద మగు నాకు; ♦ లేనియెడల
నుర్వి దుఃఖంబె కానియిం ♦ కొండు లేదు;
కానం గాపుండి దీవించి ♦ పీనివేగ ! 77

క. యౌవనముం బచ్చరంగును
గావా!మీా కింతవంతం ♦ గలిగ్గించెను, నా

కే వున్నవా మంచివి యవి
శ్రీవిష్ణున కర్పితంబు ♦ సేయం దగదే? 78

శా. జాలింగొల్పెడుముద్దుమోముఁ, గనులు, ♦ స్నిగ్ధామహత్త్వంబు, శ్రీ
లోలాసంగమభూతవిక్లబత, యా ♦ లోడింపఁ బౌరాంతరం
గాళి, న్వారలు మాఱుపల్కఁగ నశ ♦ క్యంబాటచే వెండి ♦
న్నీళు ల్గార్చిరి నీలమేఘవిగళ ♦ న్నీరంధ్రధారాగతిన్ 79

గీ. ఎట్లు జీవించుఁ దల్లి యం ♦ చేడ్వఁ జొచ్చి
రచటి వృద్ధాంగనలు; భార్య ♦ యయ్యొ! తనువు
విడుచు నీ నవమన్మథు ♦ వీడలేమి,
నంచు నేడ్చిరి లేఁతప్రా ♦ యంపుఁ జెలులు. 80

గీ. పట్టి కొంపోవ వచ్చిన ♦ భక్తపంచ
కంబుఁగూడను వింతవా ♦ గ్బంధ మొంది
కూడ రమ్మనుమాటయుఁ ♦ గూడ నాడఁ
జాలకుండెను బ్రతిమల ♦ లీలనచట. 81

వ. ఇట్లు కొంతసే పయ్యె; నంత ద్రష్టృవారంబున నైహికవిచారం
బులెల్ల నుడిగి, మనంబులువిలక్షణభావకలితంబులును నిర్వేద
పశ్చాత్తాపాయత్తంబులునుం గాఁగ వా రి ట్లనుకొనిరి. 82

శా. మాయాలోకనిబద్ధచిత్తతను స ♦ మ్మాన్యాధికారార్థదు
ర్వ్యాయామంబులఁ జిక్కి, ముఖ్యతమమో ♦ క్షార్థప్రమాదంబుమై
నాయాసంబులఁ జెందుచుంటి; మవిసౌ ♦ ఖ్యంబీయ నెందున్; వృథా
దాయు, ల్వచ్చిన తోడ రావు, యమబా ♦ ధావారణాశక్తముల్.

క. చీ! చీ! పశువులవలె నన
మీచీనపుబ్రదుకు బ్రతికి ♦ మేదిని నరజ

నోర్మచితహరిభక్తిజ్ఞా
నాచరణంబులకు దూర • నైచెడితి మయో ! 84

క. అవనిం జేసినపాపము
లెవరివి యవ్వారెయనుభ•వింపవలయు ; నిం
కెవనికి నెవఁ డెవ్వతె యగు?
నవివేకము లాలుమగల • యనుబంధంబుల్. 85

క. ఎవ్వానినుండి వచ్చితి
మివ్వసుధకుఁ ; బుట్టి పెరిగి • యీాల్గి మఱల నిం
కెవ్వానికడకుఁ బోదుమొ
యవ్వాని స్మఱచి పడితి • మజ్ఞానమునన్. 86

ఉ. మంచిది సన్యసించు టను•మానము లే ; దిఁక నీమహాత్మునిన్
వంచనసేసి యాఁపు టది • పాపము ; పోవఁగ నిండు; సత్యమున్
గాంచి గృహంబు వీడి యరు•గంగలవేఱొకఁ డుండెనేని, వ
ర్జించి సమస్త మేగు మని• చెప్పుట దోషముగాదు; పుణ్యమౌ.87

గీ. అని యుదాసంబుఁ గృతపాప•జనితతాప
మును బొరసి పెక్కు రుండి ; రా•జనులలోన
నల్పసంఖ్యాకు లౌకొంద • అచ్యుతపద
భక్తిభవపరమానంద•భరితులైరి. 88

ఉ. నల్లనిగొల్లవాఁడు నయ•నంబులముందఱఁ జూపువెన్నెలల్
చల్లఁగఁ జల్లుచుండ నిఁక • సంసృతితాపము లేలకల్గెడున్?
గల్లలు వట్టిమాయలును • గష్టము లెక్కడ? హాయి! హాయి! శ్రీ
వల్లభ ! కృష్ణ ! యంచుహరి•భక్తులు నాట్యములాడి రత్తఱిన్.

వ. ఇట్లుంబఁ గేశవభారతి యేతద్భక్తికల్లోలమహాప్రవాహంబులో
నేనుం గొట్టుకొనిపోయి సన్న్యాసంబు నిత్తునసెద నేమోయని జంకి

యేలాగునైన గౌరాంగు మోసపుచ్చి మఱల నవద్వీపంబున
కనిపి వెన్వెంటఁ దాను గాత్వానుండి పాఱిపోఁ దలంచి యా
బంగారుబొమ్మతో ని ట్లనియె. 90

శా. శ్రీకృష్ణప్రతిమాన! చాలను యతి♦జ్ఞేయంగని న్నిప్పు; డూ
రీకారంబును బొందు మేగి జనయి♦త్రి జ్ఞాయను న్వేఁడి; యం
దాఁక న్వారలు సమ్మతించి రని నే♦నమ్మంగలే; నిద్దఱుక్
రా కడ్డంబుగ వల్లె యన్నపుడు ప్ర♦వ్రిజ్య న్నినుం జొన్పెదక్.

చ, అన విని భారతి న్గని ని♦జాస్యము గార్కొన మిశ్రసూతి చి
ర్వ్వనఁ బురివంకకు న్దిరిగి ♦ పోఁదొడఁగె న్బరువెత్తి; యంత, మే
మును జనుదెంతు మందఱము♦పోవకు మాఁగు మటంచుఁ గేకవే
సెను సఖివర్గ; మంతట శ♦చీసుతుఁ డాఁగెను వారిరాకకై. 92

చ. చను మని చెప్పినంత, నిమి ♦ శారదచంద్రనిభాననంబు రా
హువునిహతపూర్ణి మేందుగతి ♦నొప్పఱి కందఁ, బ్రిధావనంబునక్
జనినశుభాంగుఁ జూడఁగనె ♦ సంయమి ధైర్యముదక్కి పొక్కెలో
న, నిశితవేధ కాళుగము ♦ నాటినయ ట్లైద తీపువెట్టఁగక్. 93

ఉ. పాపము గట్టికొంటిఁ గద ♦ బాలుని సాత్వికు మోసపుచ్చి; త
ద్రూపముఁ జూడఁ గృష్ణునిసు♦రూపముగాఁ గనిపించు నా,కతం
డాపరమాత్మయో యతని♦యంతటియుజ్వలభక్తసింహమో
తాపసవృత్తి నుండి పెడ♦దారిని ద్రొక్కితి బుద్ధిహీనతక్. 94

క. అనుకొని యతి యిటు, చనునిమిఁ
దనచేతుల నెత్తి పిలిచి ♦ తండ్రీ! రా! రా!
చనవలదు పురికి మఱలక్;
గొను మిచ్చెద నాశ్రమంబుఁ ♦ గోరికదీరక్. 95

క. అనుభారతిమాటలు విని
చనుదెంచెను బ్రీతిఁ దిరుగ ♦ శచికొమరుం; డం
త నచటిజనసముదాయ మ
శనిహత మైనట్లు నేలఁ ♦ జదికిలఁబడియెన్. 96

ఉ. పోయినవాని రమ్మనుచు♦బోడ, యయో! స్మరసుందరాంగునిన్
జాయను బాపి లేబుడుత ♦ సంయమిఁ జేసెదు నెంతపాపమో!
యీయతికి స్మృతిస్థిరత ♦ యేమియు లేదుగదా! యటంచు, వా
పోయిరి స్త్రీలుఁ బూరుషులుఁ ♦ బొంపిరిబొప్పము లుప్పతిల్లఁగన్.

క. ఓపక యీపాపని నే
లా పిలిచితి నింద జిట్లు ♦ లంపటవడ, నీ
పాపం బే? మని తాపసుఁ
డేపటి తలవంచుకొనియె ♦ హ్రీతాపములన్. 98

వ. అంతఁ బునరాగతుం డై యమందానందంబుతోఁ గృతజ్ఞతా
సూచకంబుగ గౌరాంగుండు కేశవభారతిపదంబుల కెఱఁగి లేచి
విలపించుచున్నభక్తబృందంబుం గాంచి యిట్లనియె. 99

ఉ. ఏడుపు లేల మీ కిచట?♦నిద్దియె మీయను బాగ నుంతయున్?
నేఁ డెటొ వెళ్లఁబుచ్చి యిహ♦నీరసభోగముల త్యజించి మా
మోడక సర్వబంధముల♦నొక్కటఁ ద్రెంపి నిరస్తశోకతన్
గూడఁగఁబోదు నెల్లి యల♦గోపకుమారుని ముద్దుఁగృష్ణునిన్.

క. నామీఁద మీకుఁ గలదే
ప్రేమలవం, బిట్టులుదుర ♦ పిల్లక యపవ
ర్గామోదాశీస్సుల నిడి
స్వామికడకుఁ బంపుఁడయ్య ♦ సంతోషమునన్. 101

వ. అని పిమ్మటఁ బౌరజనానీకంబుదిక్కు మొగంబుదిప్పి చేతులు జోడించి యి ట్లనియె. 102

గీ. లోకసంబంధతతి రేపు ♦ నాకుఁ దెగును;
గృష్ణసందర్శనంబును ♦ రేపు గల్గు;
మంచిదీవన లిచ్చిపం♦పంగ మీకు
దండ మొనరింతు నాతలి♦దండ్రులార! 103



క. ఎందఱొ పతితులు పరమా
నందంబును బొందినారు ♦ నలినాక్ష! భవ
న్మందస్మితచంద్రిక; నా
యం దెప్పుడు కరుణ వచ్చు♦నయ్యా? రామా! 104



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### షష్ఠాశ్వాసము.

ఉ. జ్ఞానమయుండ వీవు నృప • చంద్రమ! యైనను బారమార్థిక
జ్ఞానము నావసిష్ఠువల • న గ్రహియించితి వంచుసూరిన
మ్మానితపూతకోశముల • మధ్యమున న్గనుపట్టు టేల? య
మ్మా! నినుఁ బోలుప్రోడలును • మాయలమారులు లేరు రాఘవా!

గీ. భారతీస్వామి తన్నుఁ బ్ర • వ్రాజితుఁ జేయ
సమ్మతించినదాది వి • శ్వంభరుండు
పారరహితప్రమోదవి • హ్వలతఁ జెంది
యంతయానంద మిడె ద్రష్ట • లందఱకును. 2

ఉ. వచ్చినకార్యము న్మఱచి • భక్తులు, సంసరణార్థవిస్మృతిన్
జొచ్చి పరిజనసమూహమును • సుస్వరమర్దళతాళధారు లై
హెచ్చిలుకృష్ణభక్తి నిసి • యెల్లను మేల్కని మిశ్రసదనం
గ్రిచ్చుక గానసృత్యము ల • ఖండముదంబునఁ జేసి రచ్చటన్. 3

వ. అంతటఁ దెల్లవాఱఁ గృష్ణకీర్తనంబుఁ జాలించి గౌరాంగుండు
తనపినతండ్రి యగుచంద్రశేఖరుం గాంచి యిట్లనియె. 4

ఆ. బాబు! నేఁడు సర్వ♦బంధవిమోచనం
బొంద గంపెఁడాస ♦ నుంటి; నీశు
భోత్సవమున కెల్ల♦యుచితసంభారముల్
వేగ సిద్ధపఱుపు ♦ మేగి నీవు. 5

సీ. యౌవనవంతుండు, ♦ నసదృశసౌందర్య
వంతుండు, వాణీని♦వాస మైన
పురి నింతవార లె♦వ్వరు లేరనుసుకీర్తిఁ
గాంచినపండితా♦ఖండలుండు,
ధనికులు విబుధులుఁ ♦ దత్త్వవేత్తలుఁ బెద్ద
లితఁడె యీశ్వరుఁ డని ♦ యెంచు మేటి,
యఱువదియాఱేండ్ల♦యమ్మ యొక్కసుతుండుఁ,
బంచదశాబ్దయౌ♦మించుఁబోఁడి

గీ. ముద్దుమగఁ, డంచితప్రేమ♦మూర్తి; తల్లి
భార్యయును నమ్మకం బుంచి ♦ పంపినట్టి
తండ్రితరువాతఁ దండ్రియం♦తటిసమీప
బంధువునితోడ నీరీతిఁ ♦ బలికెఁ గాదె? 6

సీ. మృదుమధురాహార♦పృథుసౌఖ్యములకన్న,
సురుచిరాంబరచయ♦సుఖముకన్న,
లలితభూషాపుష్ప♦ములపరిమోదముకన్నఁ,
గలపంపుటాహ్లాద♦గరిమకన్న,
బంధుమిత్రాదుల♦వలనిహర్షముకన్నఁ,
దులలేనికలిమిసం♦తుష్టికన్నఁ,
నాయురారోగ్యక♦ల్యాంగమోదముకన్న,
సమితరాజ్యోపభో♦గములకన్న

సీ. నవ్యతారుణ్యసౌందర్య♦భవ్యమత్త
కాశినీనిత్యసంగసౌ♦ఖ్యంబుకన్న,
భక్తియానంద మెక్కుడై ♦ వఱలదేని
భర్మకాయుండు తహతహ♦పడునె యిట్లు ? 7

శా. అయ్యా ! మానిమి యెక్కడంచు శచిపు♦త్రాలోకనాపేక్షన్
గ్రియ్యంబాఱినమోముతో నడుగ నా♦కుం బల్కనేమున్నద
య్యయ్యో ! యింటికిఁదెచ్చిచూపుమనిన♦న్నంపంగఁ గ్రూరుండనై
న్యాయ్యంబే నిమి సన్యసింప నిటుసా♦హాయ్యంబుఁగావించుటల్ ?

క. అని చంద్రశేఖరుఁడు మదిఁ
బెనువంతను జెందెఁ ; గాని ♦ వివశుం డై కా
దనఁజాలక మంచిది చె
ప్పినయట్లొనరింతు నంచు♦వెడఁగై పల్కెన్. 9

గీ. చెంత నున్నట్టిసర్వని♦యంత యిట్లు
సేయుమన శేఖరుం డొండు ♦ సేయఁ గలఁడె ?
యతని నెపపెట్టు టెందుల ? ♦ కచట నున్న,
నట్లె సేయుదు రంబ, భా♦ర్యయును గూడ. 10

క. పరమాత్మేచ్ఛకు నడ్డము
సొరఁ గల్గునె యెట్టిచిత్త♦శూరుండే ? ను
ప్పరమున కెగయం గలఁడే
నరుఁడు ధరాకర్షణంబు♦నకుఁ జిక్కక తాన్ ? 11

క. ఓయీ ! వలసిన వన్నియు
నాయిత్తము సేయు మంచు♦నడుగ శుభాంగుం
డాయితపెట్టిరి శేఖరుఁ
డాయాసము నొందకుండ ♦ నన్నియు ద్రష్టల్. 12

ఉ. బాలురు, వృద్ధు, లంగనలు, ♦ బాలికలు న్హరిభక్తియుక్తులై
పాలుఁ బెరుంగు వెన్నయును ♦ బక్వఫలంబులుఁ బుష్పరాసులన్
జేలలుఁ దండులంబులును ♦ జెచ్చెరఁ దెచ్చిరి కాంతిఁ గ్రక్కుచున్
మ్రోలఁ జెలంగునాప్రభుని ♦ ముచ్చటఁ దీర్చెదు కౌతుకంబునన్.

క. అవతారపురుషుఁ డొక్కఁడు
సువయస్కుఁడు సుందరుండు ♦ సుకుమారుఁడు గే
శవునొద్ద నేఁ డిదె యపూ
ర్వవిరాగత సన్యసించు ♦ రండ రయంగన్. 14

క. అని వీఁడు వాని, కతఁ డొ
క్కని, కాతం డతని, కిట్లు ♦ కాత్మచుట్టుం
జని పల్లెలఁ జెప్పఁగఁ బొం
గెను జనతతి పార్వణాబ్ధి ♦ క్రియ నచ్చోటన్. 15

క. పదులుగ వందలు వేలుగ
నెదుగుచుఁ బ్రతినిమిషమునకు ♦ నేతెంచిరి భ
ద్రదుసన్యాసముఁ గన జను
లది యేమివిచిత్రమైన ♦ యాకర్ణనమో! 16

సీ. పిల్లలతల్లులు ♦ బిడ్డల విడనాడి,
కర్షకు ల్నాఁగేళ్లఁ ♦ గట్టిపెట్టి,
వణిజులు వాణిజ్య ♦ వర్జనం బొనరించి,
తినుచున్నవారలు ♦ తిండ్లు మాని,
స్నానమాడెడువారు ♦ స్నానము ల్ముగియించి,
బాలకు ల్క్రీడలు ♦ వదలివేసి,
శ్రోత్రియు ల్విహితక ♦ ర్మములను వర్జించి,
పనివాండ్రు చేసెడు ♦ పనుల విడిచి,

గీ. యూళ్లలో నున్నపూరుషు, ♦ లుగ్రములును
మత్తుమందులు చల్లిన♦మనుజులువలె
నుచితకృత్యంబు లన్నియు ♦ నుజ్జగించి
ధర్మతేజుని జూడఁగా ♦ వచ్చి రటకు. 17

క. అరుదెంచి యరసినంతనె
పరమానందంబు గలిగెఁ ♦ బ్రజలకు; నిమిమో
మురుచింతారోగార్తుల
కరుదగుసద్యఃఫలంపు♦టౌషధ మయ్యెన్. 18

ఉ. భారతిపర్ణశాలకు ను♦పాంతముగాఁ జనుపాంథుఁ డచ్చటన్
జేరినమూఁకఁ గాంచి యవ♦శీకృతుఁ డై యటకేగి లోపలన్
దూఱి శచీజుఁ గాంచి పరి♦తోషతరంగితకృష్ణభక్తివి
స్ఫారమనస్కుఁ డై వెనుక ♦ వచ్చినవారలయట్లె నిల్చెడున్. 19

క. ఎడమై చనుపథికులఁ దన
కడ కాకర్షించి భక్తి♦కల్లోలాబ్ధిన్
బడి మునుఁగఁజేసె గౌరాం
గుఁడు సుడిగతి; నతఁడు గాఁడొ♦కో! యీశుఁ డిఁకన్. 20

వ. అయినను. 21

ఉ. సృష్టిని నిస్తులంబు లగు♦చిత్రమనోజ్ఞశుభాంగకంబులన్
ద్రష్టలు గాంచి యేద్దు రెటు♦తప్పను వీనికి సంయమిత్వపుం
గష్టము లంచుఁ; గాని ముఖ♦కంజము గ్రక్కుడుకృష్ణభక్తియు
త్కృష్టపుఁదేజ మారసి యు♦దీర్ణముదంబును గాంతు రంతలోన్.

క. ఇపుడు మహోదాసస్థితి
యపుడే యైహికవిచార ♦ మందుచుద్రష్టల్

తపనాతపవర్షముల
ట్లు పరమమోదంబు నశ్రు♦లు న్వొల్తు రొగిన్. 23

క. వనజాక్షుపూర్ణభక్తిం
గనినప్పుడు ప్రజలు భక్తి♦కలితాత్మకులై
వనటను విడి యతికర్మం
బునకుం దోడ్పాదు రెంతొ♦మోదముతోడన్. 24

వ. ఇట్లుండ సన్న్యాసగ్రహణంబునకు సర్వ మాయిత్తంబయ్యె; నంతఁ జూప తైహికవిషాదోల్బణాంతరంగంబులఁ బట్టఁజాల కార్తధ్వానంబు లొనరించుచుండి, రం దొక్కమాంసలుం డగు పడుచువాఁడు క్రోధారుణలోచనుం డై యిట్లనియె. 25

సీ. ఈవృద్ధతాపసుం♦ డింతకుఁ గారణ
మేల సన్న్యాసంబు♦ నిత్తు నంచుఁ
బలుకంగవలయు నీ♦భానుతేజునితోడఁ?
బేరు సన్న్యాసి పె♦న్వేఁపవిత్తు
రాకాసిజోగి, ని♦ర్దయుఁడు, చండాలుండు,
సన్న్యాస మీయను♦ జను మటంచు
నిపుడై నఁదాఁ జెప్ప♦నే, మనదుఃఖంబు
వోవు; నీకూళ యా♦పుంతఁ బోఁడు;

గీ. సామముల మూర్ఖుఁ డెట్టులు♦ చక్కఁబడును?
నోరు తెఱవఁడు పలుకఁ, డీ♦ క్రూరచిత్తు
నదియవలిగట్టునకుఁ గొని♦ చిదియఁ గొట్టి
శీఘ్రముగ మృత్యువున కెర♦సేయవలదె? 2

క. మే లీతఁడు సెప్పినపని
యాలాగునఁ జేయుఁ డంచు♦నందఱు శిష్యా

లోలుపులై వేశ్లార్చి రు
డాలోడన మంది పలికి ♦ రాడుగ అచుచుర్. 27

వ. అంత భారతీస్వామి యాంపరిజారణ్యంబున కెదురుగ నిలఁబడి యి
ట్లనియె. 28

క. బాగుగఁ దలపోసితి; రీ
జోగికిని నేర్మలుగూర్చుఁ♦జుఁడి మీాశిక్షల్ ;
నేఁ గిట్టిన నీయువమణి
జోగి నొనర్చినయఘంబు ♦ చుట్టుకొనదు నన్. 29

వ. అంతఁ బ్రజాసంఘం బేకగ్రీవంబుగ ని ట్లనియె. 30

గీ. ఇంతయెందుల; కీబాలు♦ చెంత ‹‹ నీకు
నొసఁగ సన్యాస ›› మని లేచి ♦ యొక్కసారి
పల్కనను జాలుఁ గద దుష్ట♦వర్గమునకు;
నీల్గు టది యేల ? వధియించు♦టేలయిచట ? 31

వ. అందులకుఁ గేశవుం డి ట్లనియె. 32

ఉ. నిన్ను వధింతు మంచు నను♦నిష్ఠురవాక్యము లాడువారుమూ్ర
ల న్నిమి యుండె; వానియెడ♦ల న్గడుఁ బ్రేమము గల్గనేని యీా
తెన్నునఁ బోవరాదు యతి♦తీవ్రపువృత్తము నీకుఁ గా; దయో !
తిన్నఁగ నింటి కేగుమని ♦ దిద్ది శుభాంగుని బంపరాదొకో! 33

వ. ఇది మంచియాలోచన యని వారలలోఁ బెద్దలుం దార్కికులు
వక్తలు వేదాంతులుఁ బండితశార్దూలంబులు నగుమేధావంతు
లనేకులు నని వాదించి, పరాజితులై తిరిగివచ్చి వాదపర్యవసాన
శ్రవణాతికుతూహలు లై యున్నప్రజ లేమయ్యె ననియడుగ
ని ట్లనిరి. 34

ఉ. సుందరకాయుఁ డాడునవి♦సూనృతవాక్యము లింక మేము వ
ల్కందొరఁకొన్న వన్నియును ♦ గల్లలు ; వేయి వచింప నేల మీ-
ముందఱ ; నైహికార్తిచయ♦ము ల్భవబాధలుదాఁటిమోక్షముం
జెందెదమో ప్రియమాతనిదె;♦ చిక్కువుసౌఖ్యములొందుచాడ్పునన్.

క. జగదనుభోగము లన్నియు
మృగతృష్ణాసన్నిభములు ;♦ మే లెటుగల్గున్
భగవంతుఁడు గౌరాంగుం
డగు మా కాతనిపథంబు ♦ నంటి చరింపన్ ? 36

వ. సన్యాసప్రవిష్టుండు గాకమున్నె గౌరాంగుండు శిరోముండనంబు గావించికొనవలయుఁ గాన నాయూరిపెద్దమంగలి హరిదాసుఁ డనువానిం బిలిపించి ; రంత నతండు వచ్చి గౌరాంగప్రభునకు దండంబు వెట్టి తన్నుఁ బిలిపించుటకుఁ గతం బెఱింగి యి ట్లనియె. 37

ఆ. కాళ్లు వట్టుమన్నఁ ♦ గనకాంగుపదము లౌ
దలను దాల్చి యట్లు ♦ సలుపువాఁడఁ ;
గాని నల్లపట్టు♦కరణి నున్నట్టియీ
వెండ్రుకలను క్షురికఁ ♦ బెట్టలేను. 38

ఉ. అంత సెబాసు ! నాపితకు♦లాగ్రణి ! పల్కఁగ నోరులేక చి
త్తాంతరము ల్మ్రుంగ నిటు ♦ లందఱుముంబడియేడ్చుచుండ మా-
వంతలు దీర్చినాఁడ; వి టె♦పల్కుమ! యొం డనకుండ ; వైదుషీ
మంతుల కెక్కుడైతి! యని♦మంగలి మెచ్చిరి ద్రష్టలెల్లరున్. 39

క. వెస నీసంక్షోభము, క్షురి
యసమాధానంబు వారి♦జాయతనేత్రుం

డు సరస నారసి యంతా
వసాయితో నిట్టు లనియె ♦ బాష్పనయనుఁ డై. 40

గీ. ఏను బృందావనంబున ♦ కేగ నెంతొ
తహతహను జెందుచున్నాఁడ ♦ దయను జూపి
సరగ నా కిహపాశమో♦చనముఁ జేసి
కాచి హరిదాస! పున్నెంబు ♦ గట్టుకొమ్మ! 41

వ. హరిదాసుండు తల యడ్డంబుగ నూఁపి యిట్లనియె. 42

ఆ. అందకాండ్రజుట్టు ♦ లందకత్తెలవేను
లవనిఁ జూచినాఁడ ♦ నమితములుగఁ,
గాని చీఁకటులను ♦ గ్రమ్మునీవెండ్రుక
లట్టి వెన్నఁ డెచట ♦ నరయలేదు. 43

మ. హరినీలచ్ఛవు, లంబుదాభములు, కా♦లాహిద్యుతు, లభ్రాంబం
భరతేజంబు, లమాసరేయిరు, లన♦ల్పస్నిగ్ధదీర్ఘంబులై
మిఱుమిట్లొందఁగఁ జేయుఁ జూపఱకను♦ల్మిత్రాత్మజా! నీనెఱుల్;
క్షురికన్వానిని దాఁకఁ గల్గుదునె నేఁ♦గ్రూరుండనై యెమ్మెయిన్?

గీ. కత్తి నీతల నుంచినఁ ♦ గనకతేజ!
కల్గు దుర్భర మహాధో♦గతులు నాకుఁ;
గనుల జొబ్బిల్లునశ్రులఁ, ♦ గంపమొందు
చేత నీ కెట్లు క్షౌరంబు ♦ సేయఁగలను? 45

క. తడఁబడెడుమానసంబున
వడఁకుకరంబునను గేశ♦వారముతోడన్
వెడలింతునేమొ రక్తము,
కడయుండదటేని నాదు♦కలుషంబులకున్. 46

శా. ఈకత్తి న్దలఁ గోసికొమ్మనిన నట్లే నీకడ న్జేయుదున్;
దూఁకంగావలె గంగలో ననిన నందుం దూఁక సంసిద్ధుఁడన్;
వీఁక న్బాతక మన్య మెంతదయిన న్వేవేగఁ గావింతుఁ; బి
ర్వ్యాఁ గాఁగాని భవచ్ఛిరోజభర ముర్విన్ న్వైవ నాయాత్మకున్. 48

వ. అంత గౌరాంగుం డి ట్లనియె.

గీ. ఐహికార్థంబులను నన్ను నంటఁగట్టు
కేశభారంబు నాపితాగ్రేసరుండ!
నిజముగాఁ గాలభుజగసన్నిభమె; కాన
నీవు చెచ్చెర దాని ఖండింపు మయ్య! 49

వ. అని మఱికొన్ని కాలకార్యోచితంబు లగుమాటలు, యుక్తులు సెప్పి యాదివాకీర్తిచిత్తార్తులు వాపి తుదకు 'వల్లె' యనిపించె.

సీ. కన్నతల్లిని గన్నుఁగప్పి యొప్పించి స
మ్మతిఁ గొని వచ్చినమాయకాఁడు,
తియ్యంబులాడి వర్తించి విస్మృతిఁ గొల్పి
భక్తులనుండి వీడ్వడినవాఁడు,
నడిరేయి భార్య నానందవార్ధిని, నిద్ర
ముంచి యేతెంచినమోసగాఁడు,
పండితప్రవరులవాదఖేలాప్రౌఢిఁ
దల లూఁపఁజేసినతక్కులాఁడు,

గీ. త్రిజగతీసృష్టిఁ గైబొమ్మరీతి నిచ్చ
వచ్చినట్టులు త్రిప్పెడువన్నెకాఁడు,
మఱలుపంజాలఁడా? తనమార్గమునకు
వశముపఱుచుక యొక్కయంబష్టుమనము. 51

వ. అంత. 52

వ. ఎదురుగఁ గూరుచుండి క్షురి యిందునిభాస్యునియందవక్రశిరం
బుఁ దడిపి తా క్షురంబునను మూర్ధజము ల్స్పృశియించినంతనే
చెదరి జనోత్కరాక్షితతి జేవులుగ గ్రక్కుచు రాల్చె బాష్పముల్;
రుదితము లెక్కడయ్యెను; దిరోహిత మయ్యె ముఖాళిబట్టలన్. 

ఉ. ఆఁగు మొకింతసేపని శుభాంగుఁడు క్షౌరకు వేఁడి యాఁపి, యా
భోగిశయానుపైఁ గలప్రపూర్ణపుభక్తి మనంబులోపలన్
వేగిరయి లోఁగకుండఁ గని పింప, సముత్థితుఁ డౌచుఁ దృప్తచి
త్తాగత మైనసంతసము నాటలఁ బాటల వెల్చెఁ బెల్లుగన్. 54

సీ. పులి మీఁదఁబడ నున్న పుడు రక్షితుం డైన
పురుషుమోదముఁ దలపోసి చూచి,
పార్శ్వశూలోద్భూత బాధావిముక్తుఁ డౌ
తాత్కాలికానందంబుఁ దలఁచి చూచి,
ఘోరకారాబద్ధ పూరుషమోచన
కాలానుభూత సౌఖ్యంబు సూచి,
యనిశానశనపీడి తాకించనాకస్మి
కప్రాప్తసంపత్సుఖంబుఁ గాంచి,

గీ. మంజుహారిగానములచేత మహితదివ్య
నృత్యములచేత నాజనానీకమునకు
నంబుజాక్షుండు చూపించి నట్టిముదము
న, లవ మట్టిట్టు గ్రహియింపఁ గలమొ యేమొ! 55

వ. ఇట్లొక్కసారిగాక పల్మఱు క్షౌరం బాఁపి నృత్యంబులు సేయు
గౌరాంగుఁ గాంచి యింత నిర్వేదంబు మనుష్యమాత్రున కెట్లు
గల్గునని తలపోసి దైవమా! యీలేఁతప్రాయంపువాని,కీయనన్య
సామాన్యసౌందర్యరాశి, కీదివ్యతేజున కింతవైరాగ్యం బెట్లు

తెచ్చిపెట్టితివో యని పొక్కి పొక్కి ప్రజలు నిమింగాంచి యి
ట్లనిరి. 56

చ. జననిని ముద్దుటాలిని వి♦చారమహాంబుధిఁ ద్రోసి వచ్చినా
నని యనుకోక ముఖ్య మగు♦నైహిక సౌఖ్యము లీయతిత్వమం
దున నిఁక సున్న యెట్లుపడు♦దు స్దనుకష్టము జీవయాత్రనం
చును మది నుమ్మలింపకిటు♦చోద్యముగానొనరింతె సృత్యముల్.

క. నీవిపరీతానంధము
మావంతను హెచ్చు సేసి ♦ మనము లీనల్చుచ్
నీ వొకమా ఁడేదువుమా,
మావంత యొకింత తగ్గ ♦ మది కుదురుపడున్. 58

ఆ. అంతఁ గేశవుండు ♦ చెంతకు నేతెంచి
చాలఁ బ్రొద్దువోయె; ♦ క్షౌరమున కె
యింత సేపువట్ట ♦ నితరకర్మములకు
వేళ చాల దనియె ♦ విభునితోడ. 59

క. మంగలికడ నంతట గౌ
రాంగుఁడు గూర్చుండెఁ; గాని ♦ యామంగలి యు
త్తుంగానందంబున మై
పొంగఁగ వెస లేచి విభుని♦ముందర నిలఁబడెన్. 60

చ. నిలఁబడి పిచ్చివానిగతి ♦ నృత్యము లాప్రభువర్యుముందఱన్
జలుపఁగఁదొడంగి బిట్టుగను ♦ సంతసము న్వెడలించి ముందువె
న్కలకును బోవుచు న్మొగము ♦ కంజదళాక్షునివైపు వెట్టి; మం
గలి నిఘ గూడి చేతులను♦గల్పి యొనర్చిరి నాట్య మంతటన్. 61

వ. అంతఁ గేశవుండు గౌరాంగునితో నాట్యంబులు మానినంగాని
యభీష్టంబు నెఱవేఱ దని నొక్కిచెప్ప నాట్యంబు లాఁగ

ష్కారంబునుఁ గొంతవడికి ముగిసె నంత. 62

శా. స్నానం బాడఁగ గంగలోని కరిగె ♦ న్జామీకరాంగుండు; పౌ
రానీకంబును వెంట నేగె హరినా♦మాంచన్మహావాక్యస
ద్గానంబు ల్పచరించు; చొక్కగురుఁడే ♦ తారాకయుండె న్శచీ
సూను న్సంయమిఁ జేయఁగావలయు వ♦స్త్రవ్రాతము న్జూచుచున్.

క. కృష్ణశ్రీహర్యాద్యఘ
జిష్ణుమహాఖ్యలు జనులు వ♦చించుచు నుండన్
గృష్ణాఖిలశుభగుణరో
చిష్ణుఁడు నిమి స్నానములను ♦ జేసె న్గంగన్. 64

ఆ. చేసి చేసి కరఁగి♦పోసిన బంగారు
ప్రతిమరీతి వెడలి♦వచ్చి యార్ద్ర
వస్త్రమునను గేశ♦వస్వామియెదుటను
నిమి గరములు మొగిచి ♦ నిలువఁ బడియె. 65

వ. అంత. 66

ఉ. హాయిగ సర్వలోకముల ♦ నర్మిలిఁ బ్రోచెడుభూరిసౌఖ్యసం
ధాయికిఁ బుష్కలార్థచయ♦దాయికి మాయికి శేషశాయికిన్
దోయిలి యొగ్గ విక్లబత♦తో నట భారతి యుంచె రూక్షకా
షాయయుగంబు ద్రష్టృజన♦షండముకన్నులు నీరు గ్రక్కఁగన్.

క. ఆకావిగుడ్డల న్నిమి
గైకొని యొత్తికొని వానిఁ♦గన్నుల, నెదన
స్తోకమయి పొంగుభక్తిని,
వీఁక, న్వినయగరిమమునఁ, ♦ బెట్టుకొనెఁ దలన్. 68

వ. అంత నవ్వి ధరింపకమున్ను జనసంఘంబువైపు తిరిగి గౌరాంగుం
డి ట్లనియె. 69

క. జననీతిలకములారా!
జనకకులవతంసులార! ♦ సన్న్యాసంబున్
గొని తదుచితచేలంబులఁ
దనువునఁ దాల్చెదను దల్లి ♦ దండ్రులయెదుటన్. 70

క. కాషాయాంబరలాంఛిత
వేషానర్హంపుగర్హ్య♦వృత్తంబున సం
శోషిల్ల, కాత్మచిత్సం
తోషంబున నేఁ జెలంగఁ♦దోడ్పడుఁడి దయన్. 71

క, ఆరీతి నుండఁజాలను
దూరం బైయున్న దురిత♦దూరుఁడు గృష్ణుం;
డారాజీవాక్షుని నేఁ
జేరునటు ల్దీవనలను ♦ జేయుఁడి కూర్మిన్. 72

క. సరసిజనేత్రుం డంతట
ధరియించెను మేన సుగురు♦దత్తాంబరముల్
మెఱసెడుబంగరుజేగుఱు
బురదం బొరలించి చూపు♦పోలిక నచటన్. 73

ఉ. భారతివామపార్శ్వమున ♦ వారిజనేత్రుఁడు గూరుచుండఁగా
వారిని జూడ మౌనమున♦వచ్చి ప్రజాతతి మూఁగె; నంత బం
గారుమెఱుంగు లొల్కునిమి♦కర్ణపుటంబున నూఁదె నానిరా
బారి నిగూఢ మైనయొక♦పావనమోక్షదమంత్రరాజమున్. 74

సీ. త్రిజగతీమోహకర మైన♦దివ్యకేశ
భార మంతయుఁ దెగె, నెల్ల♦బంధములును
వీడె, జందెంబు జాఱెను ♦ వెనుకటి విఁక
మిగిలె రెం; డవి బంగారు♦మేనుఁ జేరు. 75

క. పేరును మాఱఁగవలెఁగద
యీరూపసి కెట్టినామ ♦ మీయందగునం
చారసి యారసి యూరక
భారతి కొట్టుకొనుచుండె ♦ స్వాంతమునందున్. 76

వ. ఇట్లు కొంతసే పుండ నంత నాతనియంతరంగంబున. 77

క. కవులకు భావములుఁ, దితీ
ర్షువులకు స్వప్నావబోధ♦సూక్తులు; ముక్త
ప్రవరులకు వేదశిఖలు; నొ
దవిన ట్లొకభవ్యనామ♦తల్లజ మొదవెన్. 78

గీ. అంత భారతి నూత్నస♦న్న్యాసియురము
పైని దనకుడియఱచేయి ♦ వఱచి పెట్టి
యింతవఱకును నిమి పండి♦తేంద్రుఁడ, విఁక
ముందు శ్రీకృష్ణచైతన్య♦మూర్తి వనియె. 79

ఆ. జనులహృదయములను♦శ్యామసుందరుఁ గృష్ణు
లేపుశక్తి గలని♦లింపతేజుఁ
డౌట మిశ్రసూతి ♦ కలవడె సన్న్యాస
మందుకొన్నవేళ ♦ నట్టిపేరు. 80

క. ముగిసెను గేశవుకృత్యము;
జగతీశుఁడు సన్న్యసించె; ♦ జనతతి యంతన్
భగవదవతార! స్వామీ!
నిగమాంతవిహారి! యంచు ♦ నెట్టన యార్చెన్. 81

గీ. పతితపావన! రక్షింప♦వా? యటంచు
భక్తు లందఱు నిమికాళ్ల♦పైని బడిరి;

కట్టకట్టలుగా వచ్చి ♦ కావు మనుచు
మ్రోలఁ బ్రిజ లెల్లరును జాఁగి ♦ మ్రొక్కు లిడిరి. 82

మ. వెనుక న్లేచి శచీజుఁ డాత్మపరితృ♦ప్తి న్భారతీస్వామిమో్రి
లను సాష్టాంగనమస్కృతు ల్సలుప వా్రి♦ లంజ్ఞోపఁగాఁ గేశవుం
డు నిమి న్లేవఁగ నెత్తి 'చాలు నీకఁ డా♦టోటు ల్మహాతేజ! వం
దనము ల్గట్టి శుభోపగూహనమహా♦నందంబు నా కిమ్మనెః. 83

క. అంత న్నిజగురునకు దు
ర్దాంతమనస్తాపపటల♦దమనపటుమహా
సంతోషకరాశ్లేషము
నంతేవాసి యిడె నదుప♦హారముగ నటః. 84

సీ. ఏ మని చెప్పుదు ♦ నెదఁ గేశవుఁడు వొందె
నట్టియానంద మా♦యవసరమున ;
నుప్పుబొమ్మను గొని ♦ యుదధిలో ముంచిన
కరణిఁ జూపట్టె మ♦స్కరియవస్థ ;
తానుసన్యాసి య♦న్దలఁపు లో నశియించె ;
గురుఁడ నన్భావంబుఁ ♦ గూడఁ బోయెఁ ;
గృష్ణభక్తిప్రేమ♦కీర్ణాంతరంగుఁ డై
భారతి సంపూర్ణ♦పరవశతను

గీ. స్వాశ్రిమాభిమానమును దే♦హాభిమాన
మును విసర్జించి దుఃఖవి♦ముక్తిగరిమ
నందనందన ! సచ్చిదా♦నంద ! యంచు
నాట్యమాడెను గేహ లో♦న్మత్తుపగిది. 85

గీ. సందడిని గృష్ణచైతన్య♦శబ్దమందు
నాదిభాగము వినరామి, ♦ నచటిపౌ్రజలు

దవిలి కేకల నిడిరి చైతన్య! యంచు
మహితరోదోంతరాళంబు మాఱు మ్రోఁగియె. 86

87

వ. అంత.

గీ. నందనందన! బృందావనమున కేను
వచ్చుచున్నాఁడ శ్రీకృష్ణ! వాసుదేవ!
యనుచుఁ జివ్వున లేచి గౌరాంగుఁ డరిగెఁ
బరువులను జూపనిర్ముక్తబాణమువలె. 88

క. భయభక్తుల నచటివ్రజా
చయ మతనికిఁ ద్రోవ నీయ నమకట్టిన, స
ద్దయి రరుగ వార, లంతటి
రయమునఁ బరువెత్తె భక్తరత్న మరుదుగన్. 89

గీ. త్రోవఁ గానక యెచటను దొట్రుపడెడు
సారసాక్షుని భారతీస్వామి గాంచి
మహితతేజస్వి! దండకమండులువుల
నయ్యొ! దిగఁబెట్టి పోయెదే యంచు నఱచె. 90

గీ. విస్మృతిని బోవుచున్న నివ్వేదమూర్తి
నరగ స్మృతికిని దెచ్చెఁ గేశవుని కేక;
లంత, వెన్కకు మఱలి గౌరాంగుఁ డేగి
కనుల నద్దుక యారెండుఁ గొనియె వేగ. 91

మ. వలచే దండముఁ బాత్రి డాకయి నఖర్వప్రీతి సంధించి, పు
ష్కలవైరాగ్యసుఖప్రభూతముఖతేజఃపుంజ మేపార యో
గిలలాముండు ప్రజాంతరంబున వెలింగె న్నున్నతాకారమం
జులతౌన్నత్యసువర్ణగోపురమహాశోభాఘృణు ల్నిమ్మడన్. 92

క. దండముపై మైయానఁగ
నుండి నిమేషంబు, ప్రేమ♦మూరెడుచూపుల్
మెండుగఁ బ్రజపైఁ బఱపుచు,
ముందుం డి ట్లనియె మోద♦పూర్ణాత్ముండై. 93

క. తలిదండ్రులార! వికచో
త్పలలోచను ముద్దుఁగృష్ణుఁ♦ బావనబృందన్
దిలకించి పడయున ట్లిడ
వలయు న్దీవనలు నాకుఁ♦ బరమప్రీతిన్. 94

వ. అంత ద్రష్టృవారంబు కన్నీళ్లు గార్ప నించుక సేపుండి గౌరాంగుండు వెండియు ని ట్లనియె. 95

క. తలిదండ్రులార! సంయమి
కులము న్జొచ్చితిని; నేను♦ గూడనిపనులన్
జలిపి కలంకము యతివం
డలికి న్దేకుండ దీవ♦నల నీవలయున్. 96

వ. ప్రజలదుఃఖం బెక్కుడై కాన్పింపఁ గొంతతడ వూరకుండి క్రమ్మఱ యోగికులావతంసం బి ట్లనియె. 97

క. భిక్షుఁడ నైతిని; మిము నిఁక
భిక్షకునై వేఁడవచ్చు;♦ వేఁడెదను; జగ
ద్రక్షకు శ్రీకృష్ణు రమా
వక్షు న్మఱవకుఁడి యెపుడుఁ♦ బ్రీణతార్తిహరున్. 98

వ. అంత. 99

క. మఱవ మెపుడు శ్రీకృష్ణున్
మఱవఁగలే మనుచుఁ బ్రజలు♦ మది దుఃఖము వాం

పిరివోవఁగ డగ్గుత్తికఁ
బరఁగెడుకన్నీళ్ల వెక్కి • పల్కిరి నిమితోఁ. 100

క. అంత నవద్వీపము, నిజ
కాంతామణి, జనని, నిమిష • కాలము శుద్ధ
స్వాంతమునఁ దోఁప, లక్ష్మీ
కాంతుఁడు శేఖరుని జూలిఁ • గని యిట్లనియె. 101

క. పినతండ్రీ! నాపలుకులు
గను వేఁడుమ జనని సన్ను • క్షమియింపు మటం,
చనిశం బందఱితోఁ గృ
ష్ణుని గొల్వుఁడటంచు తండ్రి! • నొక్కి పలుకుమా. 102

మ. అని పూర్వస్మృతియంత వీడి హరిభ • క్త్యావిష్టచిత్తంబునన్
వనజాక్షా! త్రిజగజ్జనావన! హరీ! • భద్రప్రదా! కృష్ణ! స
న్మునిహృత్పద్మనివాసి! వత్తు నిదె నిన్నుం జూడ బృందావనం
బున కంచు న్నిమి యార్చు చేగ జలద • ప్రోద్భూతశంపాగతిన్. 104

వ. అంత.

సీ. చుంబకాకృష్టసూచీక • దంబ మట్లు
మిహిరబింబానుయాయి యగా • మింటిగ్రిహస
మూహ మట్టులు జనతతి • పోవఁ దొడఁగె
నాఁగు వత్తు మటంచు గా • రాంగు వెంట. 105

మ. అతులోదాసమనస్థితి స్సృజలు స • ర్వార్థంబుల న్వీడి భా
రతితో స్త్రీశిశుభూరిబృందములతో • రాకేందుబింబాస్య! యి
ట్లతివేగంబునఁ బోకు నీపరువు మే • మందంగలే మంచు శ్రీ
పతివెంట న్జని రార్చుచు న్మదవుతోఁ • బర్వెత్తు కేల్పుల్వలెన్.

ఆ. మొగము ద్రిప్పి మీరు ♦ పోవుఁ డిండ్లకుఁ, బోయి
కృష్ణపాదభక్తి ♦ నెసఁగుఁ డనుచుఁ
బలికెఁ గాని విభుఁడు ♦ వార లామాటలు
వినక వదలలేక ♦ వెంటఁబడిరి. 107



క. కన్నులు దెఱచిన మూసిన
నిన్నే దర్శించుచుండి ♦ నీశుభనామం
బు న్నుడువుచుండు ధన్యుల
తెన్నున కెపు డీవు నన్నుఁ ♦ దెత్తువో రామా ! 108



శ్రీరామా.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయ భాగము.

### సప్తమాశ్వాసము.

శా. కామక్రోధమదాదిదుష్టరిపువ♦ర్గం బందఱన్ బట్టి పో
రాము ల్వెట్టిన, నీకు లెంకలయి స♦ర్వ(శ్రేయము ల్గూర్చు; నె
న్నోమార్గంబుల నిన్నుఁ గొల్చి, పడియుం♦డున్గచ్చి(వేల్పూన; శ్రీ
రామా! నీవు బహిర్విరోధులను ద్రో♦ర్పంగల్గు టాశ్చర్యమే! 1

ఆ. చేసికొన్నమగఁడు ♦ జీవాత్మ కలపర
మాత్మ; డొప్ప నతని ♦ నంటి యుంట;
విటునివంటిమేని ♦ వెన్నాడి తిరుగుట
జననమరణదుఃఖ ♦ జనక మౌను. 2

చ. ప్రకృతిగ మానవాత్మ తను♦బంధపుసంస్మృతిమాయలందుఁ జి
క్కి కడుమదంబున న్విభునిఁ ♦ గృష్ణుని విస్మృతినొంది వానిచెం
తకుఁ జనకుండ జారసుఖ♦తత్పరత (నమియించి దుఃఖదా
యకబహుదేహసంతతుల ♦ నందుచు పీడుచుఁ గీడు నెందెదున్.

సీ. దిక్కుమాలిన యీపుట్టుఁ ♦ జిక్కులను ద్రో
చ్చి సుఖించు దేహము లా♦భయకుమగని.

పోత్తు విడనాడి హృదయస్థ♦పూతసచ్చి
దాత్మశుభనిత్యసంగమ ♦ మందవలయు. 4

సీ. చెడిపచేఁతలఁ జేసెడు ♦ జీవకాంతఁ
గ్రిమ్మఱం బతితోడఁ గూ♦ర్పంగఁ జాలు
కరణములె యోగములు ; తదా♦చరణలబ్ధ
దివ్యచిత్తస్థితియె సమా♦ధి యనఁ బరఁగు. 5

వ. అం దొక్క యోగంబు. 6

ఉ. యుక్తులతోఁ, బ్రమాణకలి♦తోక్తులతో, బహుసూక్ష్మశేముషీ
యుక్తబలిష్ఠవాదముల ♦ నొప్పెడుపల్కులతో, యథార్థతన్
వ్యక్తము సేసి జీవునికి ♦ నైహికభోగముకంటెఁ గాయసం
సక్తతకంటె నీశ్వరసు♦సంగమ మెక్కుడటంచుఁ దెల్పెడున్. 7

వ. మఱియొక్క యోగంబు. 8

శా. దేహంబు ల్క్షణభంగురంబులని ధా♦త్రి న్నిత్యము న్జూచుచున్
మోహోద్వృత్తి నహర్నిశంబుఁ దనుదు♦ర్మోదేప్సపాల్గాక వ్య
ష్టాహారాదివివర్జనంబులను జీ♦వా! నీవు వర్తించి దే
హాహంభావము వీడు మంచుఁ దనుహే♦యత్వంబు బోధించెదున్.

వ. ఇంకొక్క యోగంబు. 10

ఉ. అక్షరతేజుఁ డైనపర♦మాత్మునిచెంతకు జీవుఁ గొంచుఁ బ్ర
త్యక్షము సేసి వాని, వని♦తా! పతియందము, జారురూపు, నీ
యక్షులఁ బోల్చి చూచికొను♦మా! యని సిగ్గునుగొల్పి యాజగ
ద్రక్షకుఁ డైనభర్తపరి♦రంభముఁ గూర్చును అంకుటాలికిన్. 11

క. ఇదె భక్తియోగ మనిచె
ప్పుదు రార్యులు; కృష్ణభక్తి ♦ వాదముసుకృతికిన్

బ్రిదిలి తొలుత, నశియించును
బిదప నసర్వేంద్రియముల ♦ వృత్తు, లీవ్వఁకల్. 12

క. కనవు కనులు ; కర్ణంబులు
వినవు ; రసగ్రహణశక్తి ♦ వీడు రసన ; త్వ
క్కెనయదుస్పర్శము ; గంధం
బు నాస గనలేదుభక్తి♦పూర్ణాత్ములకున్. 13

వ. శ్రీగౌరాంగదేవుండు పరుగెత్తినప్పు డించుమించుగ నిట్టిస్థితిం బొరసియుండె. 14

ఆ. కనులు సూచుచున్నఁ ♦ గర్ణము ల్వీత లయ్యె
నిమికి ; బృంద కేగు ♦ నిరతిచేతఁ
దోడవచ్చుప్రజకు ♦ దొరకనివడితోడ
నతఁడు పరువువెట్టె ♦ ననిలగతిని. 15

క. నిమి పరువు వట్టుకొనఁజా
లమి రోఁజుచు భక్తజనల♦లాములుఁ గూడన్
గ్రమముగ వెనుకంబడి కీ
యమితపువేగంబు నెచట♦నరయ మటంచున్. 16

వ. ఈ వెనుకఁబడ్డవారలలోఁ గేశవుండు నుండె; ని ట్లొకనితరువాత నొకఁడు దిగజాఱి చదికిలంబడ, నిఁక నిత్యానందుండు, చంద్రశేఖరుండు, ముకుందుండు, గోవిందుం డనుభక్తచతుష్కంబు మాత్రము మిగిలి యుండె; నంత వారు. 17

ఆ. గ్రామబాహ్యనిబిడ♦కాంతారభూముల
లోనఁ జొరఁగఁ బద్మ♦లోచనుండు,
తండ్రి! పరు వొకింత♦తగ్గించు మని యార్చి;
నైన నొక్కమాట ♦ నతఁడు వినఁడు. 18

వ. ఈరీతిఁ బ్రధావించువానివెన్నాడి యరణ్యరోదనంబులు సేయుచు భక్తచతుష్టయంబు వోవుచుండ రాత్రియు సమీపించె; నంత దూరంబుగఁ దొలకరిమెఱుంగులంబోని మైతళ్కులు దక్క వారికి ప్రభునాకారంబుగూడ స్పష్టంబుగఁ గానిపింపమిఁ, జేతు లెత్తి గద్గదకంఠంబుతో నిట్లు పిలిచి విలపింపందొడంగె. 19

ఆ. అన్న! యనుచుఁ బిలిచి ♦ నన్ను మన్నింతువు
తమ్ముఁడా! యొకింత ♦ త్వత్ప్రధావ
నంబు తగ్గఁజేసి ♦ నన్ను వీరలను నీ
తోడఁ గొంచుఁ బోవఁ♦జూడవయ్య! 20

వ. దాని కేమియుఁ బ్రత్యుత్తరంబు రామి నతం డిట్లనుకొనియె. 21

మ. అనుజా! యంటినిబిచ్చివాఁడఁగద! స♦న్యాసంబుఁగైకొన్నయీ
ఘనతేజం డెటు నాకుఁ దమ్ముఁ డగు? రా♦గద్వేషబంధంబులూ
డినమాన్యుం డటువంటిపిల్పులను బా♦టింపండు; సంబోధనం
బును యుక్తంబుగఁ జేసి వేఁడిన నిటు♦ల్పోకాఁగునంచెంచెదన్.

మ గురుఁడా! వల్లభ! రక్షకా! యతిమణీ!♦గోవింద! పాపాంతకా!
దురితార్తప్రకరాప్తరత్నమ! కృపా♦దుగ్ధాబ్ధి! జీవప్రభూ!
పరువుల్వెట్టకుఁ బాపి మైననిటి యా♦హ్వానంబు నిజ్జేసెదన్;
దరికి న్జేరఁగనిమ్ము మ, మ్మొకముహూ♦ర్తం బాఁగి దేవర్షభా!

వ. అని యెంత గొంతు బ్రద్దలగున ట్లఱచిన నొక్కమాటయు గౌరాంగదేవుచెవిం దూఱదయ్యె. 24

ఆ. రెండునాళ్లొకింత ♦ తిండియు నీరంబు
లేక భక్తు లరిగి ♦ రీకరణిని;
దొలుతఁ బ్రజలు, వెనుక ♦ సెలయేళ్లు వృక్షంబు
లడ్డమైన నాఁగ ♦ కరిగె విభుఁడు. 25

వ. గౌరాంగునకు మూఁడునాళ్లు శుష్కోపవాసం బయ్యె వేగం బించుకేని తగ్గదయ్యె; నంత, నుదయం బయ్యె; భక్తుల కతండు చూపుమేరదూరమున నుండెఁ గాని వారతని డగ్గఱలేరైరి; ట్లు చనఁజన సూర్యాస్తమయసమయంబున గౌరాంగుఁ డెచ్చటను గాన రాఁడయ్యె. 26

ఉ. భక్తులు దారిఁ గన్పడిన ♦ వారల మీరలు సూచినారె సంత్యక్తసుఖు, న్మహోన్నతశు ♦ భాంగునిఁ, గాంచనతేజు, గోపికాసక్తనితాంతకీర్తనవ ♦ చఃకలితు, న్బరువెత్తునొక్కని ర్ముక్తవతంసు, నంచుఁ గడుఁ ♦ బొక్కుచుఁ బృచ్ఛనుజేసి రల్లెడన్.

క. మే మెఱుఁగ మంచుఁ బథిక
స్తోమము వచియింప నెదలు ♦ తొట్రువడఁగ నె
మ్మోములు వాడఁగ నోపిక
లేమి న్బల్కి రిటు విహ్వ ♦ లించుచు భక్తుల్. 28

క. స్వామీ! నీశుభమూర్తిని
మే మరయుచు నుండు నంత ♦ మేరయు బలముల్
వోమిని రాఁగల్గితి; మిఁకఁ,
జామీకరగాత్ర! యుడిగె ♦ జవసత్వంబుల్ 29

క. విడువను నాభక్తులనని
నుడివితి కదె! యిట్లు సేయ ♦ నుడు లుడివోవున్;
జెడె ధైర్య మింక నీ వగ
పడవేఁ బ్రాణములు నిలువఁ ♦ బడవయ్య! ప్రభూ! 30

క. మము విడిచి పాఱిపోవకు
నిమి! మాప్రాణములు సమ్మ ♦ నీవే సుమ్మా!

శ్రమ మెంతయైన భరియిం
తుము నిన్నొడఁగాంచుచున్న ♦ దూరంబున నేఁ. 31

వ. ఇట్లు చనుచుండ. 32

ఆ. దారి నున్నయూళ్ల ♦ వారలు భక్తుల
నతిథిసత్కృతులను ♦ నందికొనుఁడ
టంచు నెంత నొక్కి ♦ ప్రార్థించినను వారు
మెతుకు నొక్కలేని ♦ మెసఁగ మనిరి. 33

క. గౌరాంగుఁడు సుకుమారుఁడు
నీరాహారవ్యపేత ♦ నియతిఁ దిరుగుచో
నో రేము తెఱచి నీరం
బోరెము గొనఁజాల మసువు ♦ లూడఁగ నున్నన్. 34

క. మాతండ్రి! మాదుదైవము
చైతన్యుని జూచువఱకుఁ ♦ జచ్చిన సరియే
చేత నొకనీటిబొట్టును
వాత నొసికొన మనిరి ♦ పట్టున భక్తుల్. 35

క. దండకమందులువులు పడి
యుండఁగఁ బథమందు భక్త ♦ లొత్తుక కనులన్
రెండుఁ గొని రవ్వి యాయతి
మండనున కొసంగ నతని ♦ మాట దెలిసెనేఁ. 36

గీ. రాత్రియెల్లను గృష్ణ! భ ♦ ద్రప్రదాత!
పూనిమిని మాకుఁ జూపింపు ♦ మా! మహాత్మ!
యంచుఁ బ్రార్థించు చేగె భ ♦ క్తాళి; యంతఁ
దూర్పుదెసఁ దొంగిచూచుచుఁ ♦ దోఁచె నినుఁడు. 37

వ. అ య్యవసరంబున. 38

క. కాఱడవి నొక్కఘూలను
దూరంబుగ ఱాలఁ గరఁచు ♦ దుర్భరకరుణా
పూరిత మానొకఘూలుగు
వారికి వినఁబడియె హృదయ ♦ పాటనకర మై. 39

ఆ. స్వరముజాడఁ బట్టి ♦ సారసాక్షుని గొంతు
నీరెలుం గిదియని ♦ యెఱిఁగి భక్త
లచటి కేగి రంద ♦ ఱాకులచిత్తు లై
ప్రభున కెదియొ చిక్కె ♦ వచ్చె నంచు. 40

చ. చని కనిరొక్కమఱ్ఱికడ ♦ శైత్యపుఁ బీడకు నోడ కొక్కగోఁ
చిని మొలఁ దాల్చి దేహమును ♦ సీతునకు న్వొలిపుచ్చి వీఁపుప్రమా
నిని గదియించి యానుకొని ♦ నెత్తిని డాకయిమీఁదఁ బెట్టియు
స్సను చటఁ గూర్చుచుండి కడు ♦ నారటమందెడుమిత్రినందనుఁ.

క. ఘాతుకమృగతతి యవనీ
జాతంబులుఁ బర్వతములు ♦ జాలింబడ, న
శ్రోతవ్యముగాఁ గూయిడి
యాతఁడు విలపించుచుండె ♦ నల్పస్వరుఁడై. 42

ఆ. ఆతఁ డేడ్చుచుంట ♦ యమ్మకోసముగాదు ;
భార్యకొఱకుఁ గాదు ; ♦ పడఁగరాని
కాయకష్టమునను ♦ గాదు ; విత్తంబు కై
కాదు ; వనట యీపరి ♦ కార మొప్పె. 43

ఆ. నన్ను విడిచిపోకు ♦ నలినాక్ష ! శ్రీకృష్ణ !
బ్రతుకలేను నిన్నుఁ ♦ బాసినేను ;
సైఁపు మయ్య ! మదప ♦ చారము; ల్లెవట్టి
యజ్ఞడింభకుఁడ, ద ♦ యాబ్ధివీవు. 44

చ. జలము ఘనీభవించు పటు ♦ శైత్యమునందు దిగంబరుండుగా
మెలఁగుచు డప్పి నాఁకటిని ♦ మేనుగ మెంచక నాల్గునాళ్లు లో
పలి కొకబొట్టునీర మొక ♦ పట్టెడుతిండియుఁ బోవనీక పు
ష్టిలవము నేఁ దొఱంగఁడఁట! ♦ శ్రీహరియానిమి? లేక మర్త్యుఁడా? 45

కం. భారముఁ బూర్తిగ హరిపై
నే రుంచి తదేకనిష్ఠ ♦ నెనసి నిలుతురో
వారి విడ కోముఁనతఁ డని
ధారిణిఁ బ్రకటింప నిట్లు ♦ తండ్రి నటించెన్. 46

సీ. ఆసీనుఁ డై తొల్లి ♦ యజ్ఞాత్ముఁ డుండిన
వటము నేఁటికిఁ జూడ ♦ వచ్చుమనము;
తత్పవిత్రస్థలిఁ ♦ దర్శింపఁ గల్గెడు
గౌరాంగవిభునివి ♦ గ్రహమొకండు;
దేవాలయంబున ♦ సేవకై యొకవైష్ణ
వుం డర్చకుండుగా ♦ నుండు నచట;
యాత్రికు లీకాల ♦ మం దామహాక్షేత్ర
మును జూడ నెందఱో ♦ పోవుచుందు;

ఆ. రరిగి దేవదేవు ♦ నర్చించి, ఘోరతా
పత్రయంబుఁ దొఱఁగి, ♦ పాపమోచ
నంబు నెనసి, మిశ్ర ♦ నందనదర్శనో
ద్భూతభక్తిసుఖముఁ ♦ బొందుచుంద్రు. 47

క. గురుదర్శనంబు భక్తో
త్కరమున కానంద మిడెను; ♦ గాని మనంబుల్
దరదారితంబు లయ్యెను
దొరకినప్రభుఁ డొందుచున్న ♦ దురవస్థఁగనన్ 48

వ. అంత నిత్యానందుండు బాష్పలోచనుండై యిట్లనియె. 49

క. లోకావనైకదీక్షను
రాకేందునిభాస్యనీవు ♦ గ్రహియించితి ; వీ
పోకలు చూపఱ యసువులు
పోకార్చును గాని సాఁకఁ ♦ బోవు మహాత్మా! 50

వ. ఈమాట లేమియుఁ బ్రియోజనకారులు గాలేదు; కాని యేకతం బుననో స్వామి చటాలున లేచి ముందునకుఁ బోవందొడంగెఁ; జెవులవలెఁ గన్నులుఁ గూడఁ జేష్టలు దక్కి పడియుండె. నల్ల గ్రుడ్లు పైఱెప్పలలోఁ దూఱిపోవ నయనంబులు కేవలధవళ వర్ణంబులై చూపట్టె. గమనంబు మందం బాటచే భక్తులనా యాసంబుగ వెంట రాఁగలిగిరి. శ్రీగౌరాంగదేవుల తత్కాలసమా ధ్యవస్థ శ్రీచైతన్యచంద్రోదయగ్రంథంబున నిట్లువర్ణింపంబడియె.

సీ. కృష్ణసేవార్థమై ♦ బృందావనంబున
కేగుచుంటి నటన్న ♦ వృత్తిదక్క
నొండువృత్తులు లేక ♦ యుండెఁ జిత్తము ; లోక
ముండియు లేకయే ♦ యుండె నిమికిఁ;
దారకల్పక్ష్మలాం ♦ తస్థంబులై యుంట
దారిఁ జేదోయితోఁ ♦ దడవ నయ్యెఁ;
బసిబిడ్డకైవడిఁ ♦ బడుచు లేచుచు నుంట
హాటకాంగుఁడు ధూస ♦ రాంగుఁడయ్యె;

గీ. ముండ్లు విఱుగును గుంటల ♦ మునుఁగు విభుఁడు
చెట్లు పొదలును దేహంబుఁ ♦ జీరు ననుచు
నెంతజాగరూకత భక్తు ♦ లేగుచున్న,
నప్పుడపు డట్టికష్టము ♦ ల్దప్పవయ్యె. 52

గీ. కుల్యలందును నీర్నిల్చు ♦ గుంటలందుఁ
దప్తకాంచనశకలవి ♦ తాన మంబు
పాత్రలను ముంచఁబడునట్లు ♦ పడుశచీజుఁ;
డాప్త లంతటఁదీయుదు ♦ రతనిఁ బైకి. 53

గీ. ఇంద్రియవ్యాపృతులు సర్వ ♦ మేదెఁగాని
యొడయనికిఁ బనిసేయుచు ♦ నుండెఁ గాళ్లు;
నందజాలోకనార్థబ్రం ♦ దావనప్ర
యాణభావప్రపూర్ణత ♦ నందెమనము. 54

గీ. నగము స్మృతియును నగమువి ♦ స్మరణ మెనసి
యున్నచాంపేయకాయుని ♦ యునికి సూచి
తమ్ముఁ గాంచినఁ జీవాట్లు ♦ తప్పననుచు
నరుగుచుండిరి భక్తులు ♦ పిఱుదఁ బిఱుద. 55

శా. గౌరాంగుండు ప్రతీచికిం జనెడుమా ♦ ర్గం బంటి పర్వెత్తినన్,
దారింగల్గినవారకాంధ్యములయా ♦ నంబొప్పఁగాఁ జేయలే
కారాజీవదళాక్షుఁడిష్టిటకు న ♦ ష్టాచాయకుం దప్పియె
ట్లో రాఁజొచ్చెస్వవాసముండు దెనకే ♦ యుద్వేలమౌవిస్మృతిన్ 56

వ. అద్యుద్దిష్ట మార్గంబునం బోక తద్వ్యతిరిక్త పథం బంటి వివశుండై శ్రీగౌరాంగప్రభుండు, పాఱిపోయిననవద్వీపపురంబుదరికే మఱల నరుదెంచుటకుం గలకారణంబు లోచనదాసవిరచితం బగు శ్రీచైతన్యమంగళగ్రంథంబునందుఁజక్కఁగావర్ణింపంబడియె. 57

సీ. శచియువిష్ణుప్రియా ♦ సతియుఁ బొందునవస్థఁ
జెప్పఁత నెవ్వఁడు ♦ చెప్పఁ గలఁడు?
కనులు కాత్వాదెస ♦ మనములు గౌరాంగు
పైఁ బెట్టుకొని యుప ♦ వాసములను

గాసిల్లుచుండిరి; ♦ గాని నాల్కల నొక్క
యుదకబిందువు నేని ♦ యుంచి తడుప;
రాయమ్మలవగకు ♦ నంతరాయము లేదు
సంతతబాష్పని ♦ శ్వాసములను;
గీ. స్నానపానసుషుప్తిభో ♦ జనములను దొ
ఱంగి యన్నాళ్లు పడియున్న ♦ యంగనామ
ణులయసువు లెట్లు తనువుల ♦ నిలువఁబడెనొ
యది యెఱుఁగమాత్ర మెవరికి ♦ నలవి గాదు. 58

సీ. పద్మాక్షుకై నిమి ♦ పరితపించుచు నుండ,
నడలుచుండిరి వార ♦ లతనికొఱకు;
బృందవై పాతఁడు ♦ వీక్షించుచుండఁ, గా
త్వావైపు వెట్టిరి ♦ వారికనులు;
నిమి గృష్ణుఁగూర్చి చిం ♦ తించుచుండఁగ, వారి
మనములు గౌరాంగ ♦ మయము లయ్యెఁ;
గంసారి తనవైపు ♦ గౌరాంగు నీడ్వ, నా
కర్షించుచుండిరి ♦ కాంతలతని;
గీ. నిదియె కారణ మాదిని ♦ గదలి బృంద
కరుగవలెనని పోవఁగా ♦ నవశతమెయి
నరుగలేక నవద్వీప ♦ పురముదరికె
వచ్చుచుంటకు వెండి ♦ విశ్వంభరుండు. 59

వ. వారిద్దఱలో ముఖ్యంబుగ విష్ణుప్రియాదేవి యాశేయి పతి తన్ను
దివ్యానందపయోరాశి నోలలార్చి మోసపుచ్చి చనిసగదిలో
నుత్తనేలనప్పుడనిర్వాచ్యభోగస్థానంబై యిప్పుడత్యంతశోకమూలం
బైనమంచంబుక్రిందఁబరుండి త్రిలోకసుందరుం డనేకవిధంబులఁ

గ్రసేసిసుఖపెట్టిననిజాంగకంబులఁ జూచుకొనిచూచుకొని తెరలు
తెరలుగఁగన్నీరు పొరలి కాఱ నిట్లు పలవింపం దొడంగె. 60

సీ. కన్నులారా! మీరు ♦ కరఁగి ప్రాణుఁడు ప్రియ
దర్శనం బొక్కండుఁ ♦ దారె నెటకొ;
వాతెఱా! నీ విట్లు ♦ వడఁకుచునే యుండు
లభియింప దింక వ ♦ ల్లభునిముద్దు;
మంద భాగ్య పురం ♦ బా! తల్లడిల్లుము
నాథుని కౌఁగిళ్లు ♦ నాఁడె పీడె;
ప్రాణులారా! చచ్చి ♦ పడియుండుఁడిట లేఁడు
చెలువుఁడు హాయిగా ♦ సేవసేయ;
గీ. చిత్తమా! నీవుమాత్రము ♦ చిన్నతనము
నుండి యెటులుంటివో యట్లె ♦ యుండు మిపుడుఁ;
బతిసనిన నేమి? యాతనిఁ ♦ బట్టి లాగి
చక్క మెత్తని నీచేఱ ♦ సాలఁ బెట్టు; 61

సీ. పరుగెత్తునఁట తాను ♦ బరుగెత్తఁ గల్గనే?
వెనుకఁ బ్రహ్లాదుని ♦ విడిచిపెట్టి;
పరువిడునఁట తాను ♦ బర్విడఁ గల్గనే?
ద్రౌపది పిల్పులఁ ♦ ద్రోచిపుచ్చి;
పరువు వెట్టునఁట మఱి ♦ బరువు వెట్టెనె? శంక
రాచార్యుఁ డూఁతని ♦ మ్మనిన యపుడు;
తుఱ్ఱునఁ జనునఁట ♦ త్రోసి పోయెనె? తొల్లి
గొల్లచేడెలు తన్నుఁ ♦ గోరినపుడు;
గీ. వారలందఱు నొక్కప్డు ♦ వరలి ధరణి
నుండిరే, గ్రంథముల సత్య ♦ ముండు నేని,

నన్నుమాత్రము విడనాడి ♦ సలిననేత్రుఁ
డెట్లు పోఁగల్గునో చూతు ♦ నిపుడు నేను. 62

ఉ. వెన్నను బోలుమేనఁ గని ♦ పించుఁ గదా! విభుఁ; డామనోజ్ఞునిన్
నన్నపుఁ జొక్కటంపుఁజెఱ ♦ సాలను బెట్టుట యొప్పఁగాని పు
ష్టి న్నెరవైన యీమెయిని ♦ జిక్కఁగఁ జేసిన నొప్పివెట్టుఁ; గా
న న్నవయింతు నాతనువు ♦ నాథునికై యుపవాసపీడలన్. 63

క. అనుకొని నీరాహారము
లను దొడఁగి తదేకచింత ♦ లలనామణి భ
ర్తను మది బంధింపఁగ, నెటు
చనఁగల్గును బృందకడకు ♦ జలజాక్షుఁ డిఁకన్? 64

ఉ. లోఁగఁడు వేదపాఠముల; ♦ లోఁగఁడు సత్క్రతుకర్మసంహతిన్;
లోఁగఁడు తీర్థయాత్రలను; ♦ లోఁగఁడు సంతతతర్కచర్చలన్;
లోఁగఁడు ముక్కుమూఁతలఁ, వి ♦ లోకనభేదముల, న్గృపాక్షిపా
పాంగుఁడు; కాని నిష్కపట ♦ భక్తుల కాహరి కింకరుం డగున్.

వ. ఇంక నట గౌరాంగుండు దృష్టితిన్నఁగనుండఁ ద్రోవ దప్పినప్పు
డతికష్టంబునఁ గ్రమ్మఱ సరియగుమార్గంబునకు వచ్చుచుండు
వాఁ డిప్పు డక్షులులేనివాడుంబోలె నడచుచుంటచే నొకసారి
తప్పినదారిని మఱలఁ బ్రవేశింపంజాలకుండెఁ; దనకాళ్లెటకుం
గొంపోవు నట కేఁగుచుంటంజేసి బృందావనంబునకుఁ జనుటకు
బదులు క్రమక్రమంబుగ స్వస్థానం బగునవద్వీపంబు సమీ
పించుచుండె; ని ట్లుండఁ బూర్వవయస్సున నైహికలోలుం డై
తిరిగి, వార్ధకంబున భక్తిప్రేరితుం డై బృందావనంబున శ్రీకృష్ణ
సేవ సేయుచు శేషకాలంబు గడప నిశ్చయించుకొన్న యొక
బాడబశ్రేష్ఠుంగూర్చి శ్రీమద్భాగవతమునందు వ్రాయఁబడిన

రియొందుశ్లోకంబు జ్ఞప్తికిరాఁగ నబ్జాక్షుం డది వేమాఱు చదువు
కొనుచు ని ట్లనియె. 66

గీ. ఎంతశ్లాఘ్యుండో కద! యామ ♦ హీసురుండు
విప్రనిశ్చిత మెంతవి ♦ వేకవంత!
మతనినిర్ణయ మఘహర ♦ మాట, ధారి
ణి నది సర్వజనాచర ♦ ణీయ మాను. 67

వ. ఈరీతినాశ్లోకంబుఁ బొగడుచుఁజదువుచుఁ, జదువుచుంబొగడుచు గౌరాంగుండు నవద్వీపంబునకుఁబదిపండ్రెండుమైళ్ల దూరంబులోని కేతెంచె; నప్పటి కింటినుండి యతఁడు పాఱిపోయినదిమొదలుకొని నాల్గుదినంబు లయ్యె; నంత నయిదవదినంబున. 68

సీ. వనము లన్నియు దాఁటి ♦ బయలుగా నున్నట్టి
చోటొండు గని యందుఁ ♦ జొచ్చె విభుఁడు;
భక్తులు, కనఁబడ్డఁ ♦ బ్రభుఁడు గోపించి త
మ్మప్పుడే పొం డని ♦ చెప్పు ననెడు
నడలున, వెనుకగా ♦ నరుదెంచుచుండిరి,
శిరములు ముసుఁగుల ♦ మఱుఁగుపఱచి;
పసులకా పరులంత ♦ బయటిపై బిగ్గరఁ
గేకరించిరి హరీ! ♦ కృష్ణ! యనుచు;

గీ. వారియంతట వారె యా ♦ పగిదిఁ జేసి
నారొ, కాకిఁక నితియతి ♦ పేరితు లయి
చేసిరో యట్లు విస్మృతు♦స్మృతికిఁ దేర,
స్పష్టముగఁ దెల్పమాత్రము ♦ వశము గాదు. 69

క. హరిశబ్దము నిమికర్ణా
వరోధముం దెవ్వఁజేయుఁ ♦ బ్రభుమణి గనులన్

దెలిచి తదమృతనిభధ్వని
యరుదెంచిన దెసకు నిగిడి ♦ యరయుచునుండెన్ 70

క. వికచాబ్జనయను గోపా
లకు లారసి చిత్తవిహ్వ ♦ లత పుట్టంగా
నొకనితరువాత నొకఁడు వి
డక యార్చిరి వెండి యంత ♦ ట న్హరియంచున్. 71

క. ఆమధురనామమును విని
హేమాంగుఁడు వారి చెంత ♦ కేగుచు నమిత
ప్రేమప్రకటనకరసం
జ్ఞామైత్రింబిలిచె రండు ♦ నాకడ కంచున్. 72

ఆ. వారు రాఁగ మొదటి ♦ వాని నొసల్గేల
నంటి నిమిరి యీమ ♦ హాపవిత్ర
నామ మెట్లు కఱచి ♦ నా? రేరు నేర్పిరి?
కాఁపురంబు బృంద ♦ కాదె? యనియె. 73

వ. వారు దాని కుత్తరం బీయకుంట గాంచి గౌరాంగుండు తనలోఁ
దా నిట్లనుకొనియె. 74

క. బృందావనవాసులొ, లే
కందుల కఱుత న్వసించు ♦ నమలాత్ములొ యీ
మందలఁగాచెడుబాలకు;
లందంగాఁ గలరె యొరులు ♦ హరినామంబున్? 75

గీ. తాఁజనఁదలఁచుకొన్నబృం ♦ దావనమున
కరుగ మానద్వయంపుఁబ్రి ♦ యాణ మైన
వచటికే పోవుచున్నాఁడ ♦ ననెడుబుద్ధి
దాపుగా వచ్చె నిమి నవ ♦ ద్వీపమునకు. 76

వ. బృందావనంబు కడుఁజేరువ నున్నదియనుతలంపున నిమి మ్మొట్ట
మొదటిగోపబాలుశిరంబుఁ దనకరంబునం దువ్వుచు ని ట్లనియె.

మ. హరికి న్గాదిలిబిడ్డ లీరలు; మనో ♦ జ్ఞాకారు; లీకర్ణగ
హ్వరయుగ్మంబును నింపినా రమృతతు ♦ ల్యం బైనశబ్దంబుతో;
దొరకె న్నాకదియిన్నినాళ్ల ;కగునెం ♦ తోమీకుఁబున్నెంబు ; దు
ర్మరణం బొందుదుఁగాదెమీరిటులు సం ♦ రక్షింపకున్నన్ననుఁ!

క. ఇన్నాళ్లనుండి శ్రీహరి
పున్నెపునామంబు వినక ♦ పోవుటచేతన్
జెన్నటి పెద్దగఁబడి చా
నున్నయతనిచెవుల నమృత ♦ ముంచితి రహహా! 79

ఆ. ఇప్పు డన్నమాట, ♦ యిక్షుమాధురిమూట,
పాపతాపములకి ♦ వంపుటూట,
మరగి ముక్తికాంత ♦ మట్టాడుపూఁదోఁట,
నోట మఱొకమాటు ♦ నుడువుఁ డయ్య! 80

వ. అనునంత నాగోపబాలురు కృష్ణభక్తిపరవశు లై "శ్రీహరీ! శ్రీకృష్ణా!" యనికేకలువేయగౌరాంగదేవుండు "తండ్రులారా! మఱియొకతేప, యొకసారి, యింకొకతూరి, యొక్కపరి, యొకపారి, యొక్కమాఱొక్కతడవ, యనికొసరికొసరినోరారఁబలికించి, చెవులారవిని, వారినుతించి, దీవించి, మీబృందావనంబునకుమార్గం బెట్లని యడిగె. వెనుకనున్ననిత్యానందుం డిది మంచియదను నని హస్తసంజ్ఞలం, గనుసన్నల, వక్త్రచాలనంబుల నాబాలురతో శాంతిపురపథంబుఁ జూపింపుఁ డని చెప్ప, వారలట్లు గావింప, నిమిషప్రభుండుసమ్మిలితాక్షుండు నానతశిరస్కుండు నై యాత్రోవం బట్టి యేగుచుండె. 81

సీ. అంతట నిర్ణనె ♦ నాలోచనము సేసి
నితి, శేఖరునితోడ ♦ "నీవు వేగ
నడ్డుమార్గం బంటి ♦ యరిగి శాంతిపురికి,
నద్వైతుం బొడగని, ♦ యతండునీవుం
బడవ నొక్కటి సిద్ధ ♦ పఱిచి, యీవలియొడ్డు
నకుం దెండు చెచ్చెర ♦ నదిని దాంటి;
యింతలో నెట్టులో ♦ యేం బొల్లుపడి తెత్తు
నవశుం డై యున్నమ ♦ హాత్ము నటకు;
గీ. శాంతిపురి నుండం డేని యా ♦ చార్యుం, డీవు
వెంట నాంగక చని నవ ♦ ద్వీపమునకుం
గలసికొని వాని,సర్వంబుం ♦ దెలియం జేసి
యేను బ్రార్థించినట్లు కా ♦ వింపుమనుము" 82
గీ. చంద్రశేఖరుం డేగెడు ♦ శాంతిపురము
దనరు భాగీరథీపూర్వ ♦ తటమునందు;
నింక గౌరాంగుండును భక్తు ♦ లేగుమార్గ
మేటిపడమటి గట్టున ♦ నివల నుండె. 83
ఆ. భాగవతమునందు ♦ బ్రాహ్మణుం గూరిచి
వ్రాయంబడిన శ్లోక ♦ రత్నమును మ
ఱవక చదువుకొనుచు ♦ రాజీవనయనుండు
శాంతిపురపథమునం ♦ జనుచు నుండె. 84
మ. నిమిచిత్తంబు నెఱుంగుంగాన నితి దా ♦ నిస్బుద్ధి నూహించి సం
యమివర్యుండు పునస్స్మృతిం బొఱయుచి ♦ హ్నంబు ల్వీలోకించి నే
ర్పుమెయి న్దా నట నున్నయట్లు తెలిపె ♦ న్బృణ్యప్రభా రాశికిౕ
సుమనోభర్తకు నల్కిడు ల్సలిపి యా ♦ చోం దుమ్ముల న్ధగ్గులౕ 85

క. నితి యని యెఱుఁగక తన్ను వె
నుతవులుచున్నాఁ డెవండొ ♦ నుడువఁ దలఁచి యర్౯
మతి బృంద యిచటి కెంతటి,
గతి నుండు నటంచుఁ దిరుగ ♦ కయె నిమి యడిగె౯. 86

వ. ఈప్రశ్నంబువలనగౌరాంగుండు బృందావనంబునకుసమీపంబుగా నున్నాననుతలంపుతోడ నున్నట్లు వెనుక నున్ననితి గ్రహించి మంచి దనుకొని తద్భ్రమపోషణానుకూలంబుగ. 87

క. ఇందులకుం గడుఁజేరువ
బృందావన; మెంతొదూర ♦ మేగఁగఁ బనిలే;
దిందీవరాక్ష! యనె నితి;
యందున కానంద మందె ♦ యతివర్యుండు౯. 88

క. తలఁ ద్రిప్పి చూడ కలవి
ప్రిలలామముం దొందినట్టి ♦ ప్రాజ్యసుఖముఁ దా
నలవఱచు కొనఁగవలె నని
జలజాక్షుం డరుగుచుండె ♦ సత్వరగతితో౯.

క. తను నానవాలువట్టెడు
నునికికి వచ్చెనతఁ డంచు ♦ నూహించుచుఁ జ
ట్టనఁ బర్విడి నిమిమ్రోల౯
బనివడి నిలిచె నితి వంగి ♦ బద్ధాంజలి యై.

క. తలయెత్తి చల్లక్రొవ్వె
న్నెలచూడ్కులు చిమ్మె విభుఁడు ♦ నితిపైఁ; జంద్రో
పలము లటు లతనికన్నులు
జలజల కరఁగి జలబిందు ♦ సంహతి రాల్చె౯.

తే. విభుఁడు ముందుఁ డైన ♦ వెనుకను గనులార
నారయుట కిదె తొలి ♦ సారి నితికిఁ;
గానవచ్చె వంత ♦ గర్భనిర్భేదక
మాచుఁ; గాని దాని ♦ నడ్డెనతఁడు. 92

క. సందియ మాశ్చర్యంబుం
డెందంబునఁ గ్రిందుకొనఁగ ♦ నిమి,రొుచటనొ ని
న్నుం దిలకించితిఁ గద! యం
చుం దొట్రిలునాల్క నత్రి ♦ జొబ్బిలఁ బలికెన్. 93

వ. అంత నితి యెలనవ్వు లొలయ ని ట్లనియె. 94

క. అరవింద నేత్ర! యయ్యో!
పురుషాధము దుష్టకలు ష ♦ పూర్ణాత్ము భవ
త్కరుణకుఁ బాత్రుని దీనుని
గుఱుతే పట్టంగ లేవొ ♦ కో? నీదాసున్. 95

వ. ప్రభువర్యుం డి ట్లనియె. 96

క. నీవల శ్రీపాదుండవు
కావుకదా! యెట్టులొదు? ♦ కడుఁ దొలనితి
న్నే వంగమున విడిచి బృం
దావనపరి సరమునందు ♦ నన్నెలఁగుదుఁ గా! 97

వ. దానికి నితి యి ట్లనియె. 98

క. కనకాంగ! నీవు బృందా
వనమునకుం బోవుచున్న ♦ వాఁడ వటంచు
న్విని, నీతోడను నేనుం
జనవచ్చితి; బృందవంటి ♦ స్థలములు గలవే? 99

వ. గౌరాంగుం డి ట్లనియె. 100

క. ఆలాగుననా! సోదర!
మేలగు నట్లేని మనకు; ♦ మిత్రత నింకన్
శ్రీలోలు బృందఁ గొలుచుచుఁ
గాలముఁ బుచ్చంగవచ్చుఁ ♦ గడు సౌఖ్యమునన్. 101

ఆ. ప్రాణమిత్రుతోడఁ ♦ బ్రాణనాథుని, కృష్ణు
శ్రీల కిక్కయైన ♦ బృందలోనఁ
దలచి కొలిచి కొలిచి ♦ తద్దయు సుఖియింతు
నింతకంటె సౌఖ్య ♦ మేది భువిని? 102

గీ. కాని శ్రీపాద! బృందలోఁ ♦ గాలు వెట్టు
టెప్పు డెప్పు డంచుఁ దహతహ ♦ నెనయుచుంటి;
నీవటకు నెన్నిసారులో యేగితికద!
ముందు నని దారి చూపు; వే ♦ పోద మటకు. 103

వ. నితికిం గావలసినది దియేకావున నతండుకడునంతసిల్లియద్వైతుని బడవతో వేచియుండుమన్నకడకుం దొలుతఁ గొంపోయిన నెట్లో యాయాచార్యుండునుం దానుఁ గలసి శచీపుత్రునచటినుండి శాంతిపురంబునకుం దీసికొనిపోయి భోజనం బైననిడవచ్చుననుతలంపుతో ముందుండి నిమి నాదారిని నడపించుచుండఁ గొంతసేపటికి నితిం బిలిచి గౌరాంగుం డిట్లనియె. 104

క. సురుచిరబృందావనపరి
సరకాంతారములలోన ♦ సఖ్యముతో ని
ద్దరముఁ గడపుదముకాలము
హరిసేవాకృత్యములను ♦ హాయిగ నెపుడున్. 105

వ. సరియే తప్పక యట్లకావింతమనినితివలుక, వెండియుగౌరాంగదేవుం డిట్లనియె. 106

సీ. భవ్యరాధాకృష్ణ ♦ పదపద్మసంస్పృష్ట
భూమిపై మనమును ♦ బోద మయ్య!
కౌపీనములఁ బెట్టి ♦ కలుషసంసృతి మట్టు
పెట్టి నిర్వృతి జే ♦ వింత మయ్య!
యాఁకలి దప్పియు ♦ సరికట్టి బాధింప
మధుకరవృత్తిచే ♦ మనుదమయ్య!
సంతత శ్రీకృష్ణ ♦ సత్ప్రసంగానంద
జలరాశిఁ గ్రీడింపఁ ♦ జనుదమయ్య!

గీ. బృందలో నుండుపురుషుల, ♦ స్త్రీల, మృగచ
యముల, బాదలను, దీఁగల, ♦ నవనిజముల,
వెనుక రాధయు శ్రీకృష్ణ ♦ విభుఁడు నెచటఁ
జెలఁగి యాడిరో పోయి పృ ♦ చ్ఛింత మయ్య! 107

క. దీనుల మై యడిగిన నా
స్థానముఁ జూపింతు; రద్ది ♦ దర్శించినవాఁ
డేనాఁ డెచ్చట నెఱుఁగని
యానందం బంది ధన్యుఁ ♦ డగు శ్రీపాదా! 108

క. ఈవసుధలో నిజనులకుఁ
గావలసినసౌఖ్య మొండు ♦ గలదే నితి? నాఁ
గేవలసత్యము దేవర!
నీవాడినమాట యనుచు ♦ నితి తల యూఁచెఁ. 109

వ. కాని యీప్రసంగంబులోఁ జొరఁబాఱిన విస్మృతింబడి గౌరాంగుం
డు తన కవశుం డగుననుభీతిచే మితప్రత్యుత్తరం బాసఁగి నిత్యా
నందుండు మిన్న కుండెఁ; నంత బృందావనవిషయకం బగుసంభా
షణంబు చాలించి నిమి కొంతదూరంబుచని మఱలనిట్లనియె. 110

ద్వి. రయమున సత్కృపా ♦ రాశి కృష్ణుండు
ప్రియసోదరా! కాని ♦ పించునే నాకు? 111

వ. ఇంకమాటలాడ నిచ్చినం జేటు వాటిల్లు ననుభయంబునఁ జట్టన నిత్యానందుండుకృతకక్రోధాంధకారచ్ఛన్నవదనంబుతోఁ బ్రభున కెదురుపడి యి ట్లనియె. 112

ఉ. ఆఁకలి దప్పియు న్గలుగ ♦ వయ్య మహాత్ముఁడ వౌట నీకు; దు
ష్ప్రాకృతజన్మగ ర్హ్యతను ♦ బద్ధుల మాామము వీడ వవ్వి; నా
కాఁకలి దప్పి దుర్భరము ♦ లై కనుపట్టెడు; వానిఁ బాపునం
దాఁకను గృష్ణభక్తిపర ♦ తంత్రపుమాటలు గట్టిపెట్టుమా! 113

క. నకనకఁబడునాకడుపున
కొకపట్టెడు తిండి, బొట్టె ♦ డుదకంబు నోసం
గక మాటాడం జాలఁ; గ
నుక న న్నిటువంటినుడుల ♦ నొప్పింపకుమా! 114

వ. క్షుత్పిపాసాప్రసంగంబు గౌరాంగుమనంబుఁ గృష్ణునుండి మఱల్చి యన్నపానాసక్తిం జొన్ప ననునభిప్రాయంబు ననితియాపన్నగడం బన్నెంగాని యతితిక్షుం డగుటం గాదు. నెయ్యునకుఁ గోపము వచ్చెనని నిమి కొంతసేపూరకుండెఁ; గానిపిమ్మట నితి మనంబు నొచ్చునేమో యనుసందియంబున బెదరుచుం బెదరుచు "బృందావన మింక నిచ్చటి కెంతదూరం?" బనియడిగె; దానికి "సమీపించుచున్నా"మనియానందుం డుత్తరం బిచ్చె నంత. 115

మ. అలభాగీరథితళ్కుటద్దపుఁబ్రవా ♦ హం బక్షిపర్వంబుగాఁ
దిలకింపంబడె మ్రోల; లోఁగలఁచుసం ♦ దేహంబు పోకాడ, హె
చ్చిలె నానందునిధైర్య; మిట్లునిమియు ♦ న్శ్రీపాదుడుఁ న్వేఱుఁద్రో
వల చిత్తంబులఁ బోవుచుండి రొకత్రో ♦ వంబట్టి మానంబునన్.

వ. అంతం గొంతసేపటికి గౌరాంగుండు శ్రీకృష్ణదర్శనోత్కంఠాకీర్ణం బగునిజాంతరంగంబుం బట్టఁజాలక మౌనముద్ర సడల్చి యి ట్లనియె. 117

ఆ. బృంద యిదిగో! యంటి ♦ వెంతదూరము చెప్ప
వెందుచేత? మనసు ♦ కందువోవ
బృంద సరిగ నిచటి ♦ కింతదవ్వన నుండు
నం చెఱుంగఁజెప్ప ♦ వయ్య సఖుఁడ! 118

వ. దానికి నితి యి ట్లనియె. 119

క. ముం దేమున్నదొ చూడుమ!
యెందుల కుత్తలము వొందె? ♦ దెదుటఁ గనులకున్
విందుగ నొక వాఃపూరముఁ
గందో కనవో వచింపు ♦ గాంగేయాంగా! 120

ఉ. "ఆనదియేది?" "యద్దియము ♦ నాపగ చెప్పఁగ నేల" "నిక్కమా?
మానస వేదనాదమన ♦ మంజుమృషాపరిహాసవాక్యమా?"
"యే నితినంట నిక్కువమ ♦ యే, నదియు న్యమునాస్రవంతియే"
నా, నిమిషాత్రె ముందు జవ ♦ నంపుగతి న్ముదితాంతరంగుఁడై. 121

క. పరుగిడి యమునామాతా!
కరుణార్ద్రవిలోకనములఁ ♦ గనుమా నన్నున్!
ధర భక్తిముక్తు లొసఁగెడు
వరవాహిని వీ, వటంచు ♦ వారిం బడియెన్. 122

క. భాగీరథిలోఁ దృష్టిగఁ
దోఁగి శచీసుతుఁడు బాష్ప ♦ తోయము లురలం
గాఁ గనులు మూసికొని దరి
పైఁ గేల్గవ మోడ్చి యెత్తి ♦ పట్టుక నిలిచెన్. 123

గీ. స్నానఘట్టంబునొద్ద నా ♦ చార్యుఁడు తరి
తోడ నుండుటఁగనలేదు ♦ తోయజాక్షుఁ;
డతని నద్వైతుఁడుంగూడ ♦ నానవాలు
పట్టలేఁ డయ్యె మాఱుగా ♦ వమున నుంట. 124

వ. ఈకాంచనశోభావిరాజమానుం డగుయువసన్యాసి యెవండో
యని యద్వైతుండు వెఱంగుపడి చూచుచుండునంత, నిమి
యనిలవేగప్రధావనంబునకు సమంబుగ రాఁజాలమి వెనుకం
బడియున్ననితి యేతెంచె. వానిం గాంచి యాతేజస్వి తప్పక
గౌరాంగుండే యని నిశ్చయించుకొని దుఃఖాక్రాంతచిత్తుండై
వడవడ వడఁకుపాదంబులతో నద్వైతాచార్యుండు ప్రభుని దగ్గఱి
యిట్లు చింతించె. 125

గీ. మొన్నమొన్నటిదాఁక స్త్రీ ♦ పుంసనయన
కైరవంబుల కలశీత ♦ కరుఁడువోలెఁ
జల్లఁగాఁ దోఁచి యానంద ♦ జలధి వారి
ముంచి చొక్కించినతఁడే యీ ♦ ముండుఁడయ్యె! 126

గీ. అలరుకంటెను లేఁజిగు ♦ రాకుకంటె
మృదులతరమైనచొక్కింపు ♦ మేనితండ్రి;
యింట రాజాధిరాజుల ♦ కంటె నెక్కు
డుగను బెరిఁగినసుకుమారుఁ ♦ డో యితండు. 127

వ. అని పెక్కువిధంబుల వృద్ధాచార్యుండు బిగ్గర విలపించుచుండ,

ఉ. బృందకు వచ్చినాఁడఁ గృత ♦ కృత్యుఁడనైతి నటంచు సచ్చిదా
నందనిమగ్నచిత్తుఁత, ఘ ♦ నాఘనవృష్టినిరంతరాశ్రు ని
ష్యందసమున్నగండముల, ♦ నక్షినిమీలన మందియు, న్సదా
క్రందము లాలకించి నిమి ♦ గన్నులు విప్పి మహీసురుం గనెన్.

క. కని నీవా? యాచార్యా?
యన, గద్గదనిస్స్వనమున ♦ నౌ నను సతఁ; డం
త నిమి,నితి నతని గనియు
ట్లనెఁ బరమాహ్లాదవికసి ♦ తాస్యాక్షులతోఁ. 130

ఆ. అమలచిత్తుఁ డైన ♦ యద్వైతగురుతోడఁ
గృష్ణభక్తనితియ ♦ తీంద్రుతోడ
బృంద సేవచేయు ♦ చుందును శ్రీకృష్ణా;
ధరణి నన్నుఁబోలు ♦ ధన్యుఁ డేడి? 131

సీ. వెనుకను జరిగిన ♦ వృత్తాంత మేమియు
నెఱుఁగమి వృద్ధుఁడు ♦ వెఱఁగు జెంది
యుండ, మిశ్రాత్మజుం ♦ డోయి యాచార్య! నా
కంటె ముందుగ బృంద ♦ కడకు నెట్లు
వచ్చితం చడిగె; నా ♦ వచనము ల్కాలవర
పెట్టెను మఱియింత ♦ విప్రమనముఁ;
బ్రత్యుత్తరము సెప్ప ♦ వలనుగానమి, నితి
వంకకు దిరిగియ ♦ ద్వైతుఁ డుండె;

గీ. నిద్దియంతయు నారసి ♦ స్మృతికి వచ్చి
జరిగినటువంటిమోసము ♦ తెఱఁగుఁ జూచి
నితిని నద్వైతుఁ గాంచి యిం ♦ దీవరాక్షుఁ
డెంతయోవంత యడరంగ ♦ నిట్లు పల్కె. 132

సీ. ఔర! భాగీరథి ♦ యమునయంచు వచించి,
మ్రోలఁగన్పడుశాంతి ♦ పురముబృందఁ
జేసి, శ్రీపాద! న ♦ న్మోసపుచ్చితి కదె!
తమ్ముతో మేలము ♦ తగునె నీకు?

శ్రీకృష్ణుఁ బ్రాపింపఁ • జేసితినే నింత;
సన్యాసి నైతిని • సర్వము విడి;
యన్నయే యడ్డయ్యె • నయ్యయ్యొ! నేఁ బోవు
త్రోవకు విఘ్న మెంత • దుష్టుఁ డయ్యె!
గీ. నంచు వాపోవు టారసి • యధికమైన
సిగ్గుచేతను నితితన • శిరము వాంచి
గ్రుక్కుమిక్కనకుండ నా • గుట్టు ముసలి
పాటుఁడు గ్రహించి నిమితోడఁ • బల్కె నిట్లు. 133
ఆ. నిన్ను మోసపుచ్చ • నేరఁ డెవ్వఁడు; భా
గీరథికిఁ బడమటి • కెలఁకునందు
యమున గల దటంచు • ననుశాస్త్రములు; గాన
నందు నీవు మునిఁగి • తంట నిజము. 134
వ. అంత గౌరాంగుండు కోపించి యి ట్లనియె. 135
ఆ. దీనిమాట కేమి • దేశిక! యిద్ది బృం
దావనం బటంచు • నాకుఁ జెప్పి
మోసపుచ్చినాఁడు • పుణ్యాత్ముఁ డీనితి;
దాని కేమి చెప్పఁ • దలఁచినావొ. 136
వ. అంత.
సీ. భాగీరథీనదీ • పశ్చిమతీరంబు 137
ప్రిక్కగాఁ గాళింది • పాఱు ననెడు
నొక్కశ్లోకంబు, నిం • కెక్కడ శ్రీకృష్ణుఁ
డుండునో యచటనే•యుండుబృంద
యనెడుశ్లోకం బొండు, • నాచార్యుఁ డతిభక్తి
నొకపూర్వపూతపు • స్తకమునుండి

చదివి బృందావన ♦ మిది గాదె సర్వేశ!
యీ వెటనుం దదె ♦ బృంద సుమ్మి;
గీ. నీవు సర్వనియంతవు ;♦ని న్నతిక్రమి
మించి యేపని జరుగదు ♦ మేదినిపయి;
మమ్ము రక్షింప వచ్చితి ♦ మఱల నిటకుఁ;
గపటకోపంబు సూపించి ♦ కష్టపడకు. 138

క. నీవనిత, తల్లి, భక్తులు
చావంగా నున్నవారు ♦ చాంపేయాంగా!
నీ వైదునాళ్లనుండియు
శ్రీవర! పస్తులను జిక్కి ♦ చేడ్పడితి పయో! 139

చ. అని కుడిచేయి వట్టుకొని ♦ యాతనిఁ బోతము నెక్కఁజేయఁగాఁ
గొనగ గమకింప దేశికుఁడు, ♦ కోపము మోమున నివ్వటిల్లఁగా
వనజదళాక్షుఁ డాగురుని ♦ పట్టు విదుల్చుకొనంగ లాగి,, రా ''
ననె నరుణప్రభాపటలి ♦ యక్షులకోనలు చిమ్ముచుండగన్. 140

వ. అని వెండియు ని ట్లనియె. 141

ఉ. ఎంతస్వతంత్రతాబలవి ♦ హీనుఁడ నైతిని! జోద్య మయ్యెదుర్ ;
శాంతివహించినందులకు ♦ శాస్తిని బాగుగఁ జేసినారు; నే
శాంతిపురంబుఁ జేరితిని ♦ జక్కనిబృందకుమాఱు ; నెగ్గ మీ
పంతము ; మీకరంబులకుఁ ♦ బచ్చని బచ్చెనబొమ్మ నైతిఁగా!

వ. అని సంజకెంజాయచూపులు నితిపైఁ బఱప, ధైర్యంబు దెచ్చికొని
యతండు చైతన్యస్వామి కి ట్లనియె. 143

సీ. మోసపుచ్చితి నిన్ను ♦ ముమ్మాటి; కది నిజం
బబ్జాయతాక్ష! యిం ♦ కందున కగు
పాపశిక్షను నేను ♦ భయరహితుండ నై

భుజియింతు శ్రీకృష్ణ ♦ మూర్తి వైన
నీవల్ల ; నాలింపు ♦ నేఁ జెప్పుమాటలు,
పురిలోనఁ దల్లియుఁ ♦ బొలఁతి వంత
స్రుక్కి చానున్నారు; ♦ చూపింపు మొకసారి
సంజీవని, త్వదాస్య ♦ చంద్రబింబ;

గీ. మదియుఁ గాకన్నగతజీవు ♦ లైనమాదృ
శు లెటు లైదుదినంబులు ♦ సురుఁగ కల్ల
నీరజాక్షునిపై ప్రేమ ♦ నీర మన్న
ముగను బ్రతుకంగ నేర్తు రీ ♦ జగతిలోన? 144

గీ. రక్తమాంసాదికృతశరీ ♦ రంబుతోడఁ
గూర్కు కిన్నాళ్లు త్రావక ♦ కుడువ కుంట
కేను నీవంటిదేవుఁడఁ ♦ గాను, రమ్ము
వెంట; భుజియింత మాచార్యు ♦ నింటిలోన. 145

వ. అంత నద్వైతాచార్యుండును జని గడ్డంబంటి బతిమాలుకొన, గౌరాంగుం డొండనలేక వారికి వశుండై పడవ యెక్కె. నితికిఁ గొండంతబరువు హృదయంబునుండి తొలఁగ, నతండు మహానంద భరితచేతస్కుండై యాచార్యుం బిలిచి మందహాసంబుతో ని ట్లనియె. 146

ఉ. ఐదుదినంబు లయ్యెఁ జుమి ♦ యన్నము నీరముఁజూచి; క్షుత్పిపా
సాదిశరీరబాధలకు ♦ నందని యాత్రిజగత్ప్రభుండు పెం
పేదమి నిల్పెఁ గాక; నను ♦ నేఁ చెడునాఁకలినీరువట్టు;లం
బోదర మెట్లు నింపెదవొ ♦ యుత్తమభోజ్యపదార్థరాసులన్. 147

వ. దానికద్వైతుండు కృతజ్ఞతాసూచకవిలోకనంబుల నిట్లనియె.

కం. ఎట్టివిందు చేసి ♦ యెంత పెట్టిన నీఋ
ణంబుఁ దీర్చుకొనఁగ ♦ నాతరంబె?
యంతశ్రమముఁ జెంది ♦ యంత మేలును జేసి
తయ్యా! నాకు భక్తు ♦ లందఱకును. 149

వ. అంత నితి యిట్లనియె. 150

ఉ. తప్పక పోవునట్టి పెడ ♦ దారులు ద్రొక్కకు భూసురేంద్ర! నీ
విప్పుడు గంగసాక్షిగఁ ♦ దృప్తిగ విందు నొసర్తు నంచిటుల్
జెప్పుము యొట్టు పెట్టుకొని; ♦ చెప్పక పోయిన నీగృహంబులోఁ
జప్పనిగంజి కూడు గొను ♦ సంబర మేయిఁక మా కెఱుంగుదుర్. 151

వ. ఇట్లు పరిహాసంబు లాడుకొనుచుండఁ బడవ శాంతిపురంబున కేతెంచె; నంతఁ బ్రభునకుఁ బరివారంబున కాప్యాయనంబుగ భోజనం బిడి గౌరాంగదేవు బడలిక వాప నాచార్యుం డతనిఁ బడుకగదికిం గొంపోయి పరుండఁబెట్టి కాళ్లు పట్టనుద్యమింప నాతండు నితిపూర్వకృతప్రతారణంబువలనఁ గలిగిన కోపం బింక మనంబు విడువకుంటచే నాచార్యుఁ జూఱుకుఁజూపులం గాంచి యిట్లనియె. 152

గీ. చేత నాడించు ప్రతిమగాఁ ♦ జేసినారు
నన్ను నితి యును నీవుఁ; బ్ర ♦ ణామపాద
సేవ లిఁకఁ జాలు నాచార్య ♦ లేవవయ్య!
వీఁడు వెంగలియంచు భా ♦ వించినావా? 153

వ. రాత్రి యేతేర నద్వైతుండు శ్రీచైతన్యస్వామి కారతిసమర్పించు తఱిఁ దాను గృష్ణసంకీర్తనంబు బాగుగ శిష్యులకుం గఱపుచున్నట్లు ప్రభునకుఁ దెలియవలయునని భక్తవారంబు రావించి తాళమృదంగ మనోహరధ్వనులతోఁ గీర్తనం బారంభించె. స్వామియు నిత్యా

నందుండును దత్కీర్తనశ్రవణాలోకనకుతూహలులై వసార నధిష్ఠించి యుండి; రంతఁ దొలుతనాచార్యుండు శ్రీకృష్ణాగమన ప్రముదిత యైన రాధాదేవి చేటికతోఁ బలికిన పలుకుల శ్రీ విద్యాపతి ప్రణీతప్రసిద్ధగీతి కారూపంబున నున్నవాని నిట్లుపాడం దొడంగె. 154

ద్వి. ఎట్టకేలకుఁ గృష్ణుఁ ♦ డేతెంచె నమ్మ
మట్టుమీఱినది నా ♦ మది సంతసంబు;
నను వీడి పోనీయ ♦ నాథు నే నింక
వనజాక్షు బంధించి ♦ వైతు నాకడనె
చందమామా! యిది ♦ సమయంబు విభుని
మందహాసముఁ బోలు ♦ మంచి నీచల్ల
వెన్నెలల్గాయంగ ♦ వేగ రా రమ్ము;
సన్నాయి నొక్కుల ♦ శారికలార!
మేళగింపుఁడి! తఱి! ♦ మీనాదములను
శ్రీలోలు మృదువచ ♦ శ్రీఁ గిలారించి. 155

క. నిమి పునరాగమజనిత
ప్రమదము గర్భితముగాఁగఁ ♦ బాడినపాటన్
దమిలేని నిశ్చలంపుమొ
గముతో మిన్నకయ వినియె ♦ గౌరాంగుఁ డటన్. 156

వ. అది గాంచి ముకుందుండు ముందునకువచ్చి యిట్లు మఱియొకగీతిం బాడనారంభించె. 157

ద్వి. వినముఁ బూసినతూపు ♦ విధ మయ్యె నాకు
రసికుఁ డౌకృష్ణుండు ♦ రామి యయ్యయ్యో!
నెచ్చెలీ ప్రాణము ♦ ల్నిలువవు చెప్పు

మెచ్చోటి కేగుదు ♦ నీక్షింప నతని
నెవ్వఁడే తెక్కలు ♦ నీఁ గలఁడేని
చివ్వన నెగురుదు ♦ శ్రీకృష్ణుకడకు. 158

వ. ఇది వినినతోడనే చైతన్యస్వామి మూర్ఛవడి కొంతవడికి లేచి మహానందమదిరాపానప్రమత్తుండై నాట్యమాడందొడంగె; నంత నితియు నాచార్యుండు నైదుశుష్కోపవాసదినంబులపిదప నిట్టట్టు భుజియించినకుసుమకోమలుం డలసి మఱల సోలిపడు నేమో యను భయంబునఁజట్టినసంకీర్తనం బాఁపి స్వామింబట్టుకొని శయనాగారమునకుఁ దీసికొనిపోయి నిద్రింపు మనిబలవంత పెట్టె;రచ్చటి నుండియంద తేగిన వెనుక నిత్యానందుండు గౌరాంగుడగ్గఱియల్లన నతనితో ని ట్లనియె. 159

క. “నను క్షమియింపుము స్వామీ!
మనవి యొకటి చేసికొనెద” ♦ “మంచిది చెప్పుమా”
“నినుఁ జూడఁ గోరుచున్నా
రునవద్వీపంబువారు ♦ రుదితము లడరన్. 160

క. చత్తురు తల్లియు భక్తులు
వ్యాత్తాపంబునకుఁ జిక్కి;♦ యీశా! వారిన్
జెత్తు నిటకు నినుఁ జూడ, న
దుత్తర మిచ్చి ననుఁ బంప ♦ నూహించెదవే” 161

మ. అననాలోచన సేసి కొంత నిమి ని ♦ త్యానందుతో వెన్క ని
ట్లనియె, న్గాంచిదిపొమ్ము మద్విరహశో♦ కాక్రాంతచిత్తంబులన్
జననీభక్తసుహృజ్జనాదులు గద్ను ♦ స్సంతాపముం జెంది భో
జనము ల్నిద్రలుమాని చిక్కి తనువు ♦ ల్చాలింతు రేమోనితీ!162

గీ. ఉండి యుండి చటాలున ♦ నూరు విడిచి
పోవఁగాఁ బోలు, వారట్లు ♦ పోకు చున్న
వారు; వారిని దీసిక ♦ వచ్చితేని
సావకాశంబుగా సెల ♦ వడుగువాఁడ. 163

క. కని కలసి మెలసి యుండిన
వెనుక న్సెలవొంది పోవ ♦ వెతఁజెంద రటం
చనుకొనియెద; నదిగావునఁ
జని కొనిరమ్మటకు వారిఁ ♦ జయ్యన సఖుఁడా! 164

క. కనఁగల్గితి, నే బృందకు
జన లేమికిఁ గారణంబు; ♦ సజ్జను లావా
రిని నందఱ నేడ్పించిన
మనుజాధముకోర్కి సిద్ధి ♦ మంతంబగునే? 165

చ. అనుమతి యిచ్చినందులకు ♦ సంతస మెక్కనయంతసంతసం
బెనసి పరోపకారి నితి ♦ యెవ్వరి నెందఱఁ దోడితేరఁగా
ననిచెద వన్న "నన్ను నెవ ♦ రారయఁగోరుదు రట్టియందఱన్
గొని వడిరా"న్నటంచుయతి ♦కుంజరుఁ డుత్తరమిచ్చె దానికిన్. 166

గీ. నిశ్చితంబె కదా! యని ♦ నితి వచించెఁ;
దప్పునే నిశ్చిత మని చైత ♦ తన్యుఁ డనియెఁ;
జూడఁదలఁచువా రెల్లరుఁ ♦ జూడవచ్చు
నా! యని నితి దారెేంచి ♦ యడిగె నిమిని. 167

క. నితి, యావిష్ణుప్రియయదు
గతి మతిఁ దలపోసి యడిగె ♦ గౌరాంగు నటుల్;
కృతకనరాకృతి, యాసం
గతి మొఱఁగి యటు లనె భాష ♦ గర్భోక్తులతోన్. 168

తే. ఒక్కప్రాణి దక్క ♦ నొరు లెంద ఱీక్షింపఁ
గోరుదురో యిఁకీవు ♦ వారిసంద
అను వయస్సు లింగ ♦ మును దలపోయక
తోడ్డి తెమ్ముత్ర, నన్నుఁ ♦ జూడనిమ్ముత్ర 169

ఆ. ఒక్కప్రాణి యొద్ది ♦ యో యెఱుంగనుగాన
మాఱువలుక కశుప్రి ♦ వారికలుష
వీక్షణముల నిమిని ♦ వీడ్కొని నితి సవ
ద్వీపమునకు నేగెఁ ♦ దెల్లవాఱ. 170



క. బొబ్బలు వెట్టిను, నేఁ బదు
సెబ్బరల స్వప్నములను ♦ జెప్పవలెనె? నీ
నిబ్బరపుబిరుదు నాయెడ
దబ్బఱసేయకు మహాత్మ! ♦ దశరథరామా! 171



శ్రీరామా.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### అష్టమాశ్వాసము.

చ. వివిధములైన వేషములు ♦ వేయుచునీమటుమాయ సర్వమా
నవసుఖదుఃఖకార్యము ల♦నారతమీవొనరించుచుండ, నా
వవి, యివి యేనుజేసినవి ♦ యంచుచుగర్వమునొందుమూఢులన్
భువిఁ దిలకించి నవ్వుకొన ♦ వో! రఘురామ! త్రిలోకపాలకా! 1

గీ. సర్వమద్వైతగురుతోడఁ ♦ జంద్రశేఖ
రుండు నిటియును జెప్పి యి♦ ర్వురును జనిరి;
కాని యత్రకోదండ్రను ♦ గాంచ మొగము
చెల్లకయ పోయెఁ బాపము! ♦ శేఖరునకు. 2

చ. ఇల నవతార మెత్తి నయ ♦ హీనశయానుఁడు మిశ్రసూతి పే
శలతనుఁ డర్థబంధుముఖ ♦ సంసృతిబంధములెల్లఁ ద్రెంపి జో
గుల తెగఁ జొచ్చినాఁడని స♦ఖు ల్విని; రంతియకాని యేరికిన్
దెలియఁగరా దిఁకందుఁగల ♦నిక్కువమెంతయొనిశ్చయంబుగన్.

చ. మఱలఁ గనంబడు న్సదన♦మ్మండనుఁ డానిమియంచు నాసతో
నరయుచు, నంతలోనె యిఁక ♦ నాతఁడు వచ్చునె! రాఁదలంచెనే

నరుగునె యర్ధరాత్రమున ♦ నట్లని యుండిరి యింట నేడ్చుచున్
నిరశనపాననిద్రలయి ♦ నిశ్వసనంబులఁ గోడలత్తయున్. 4

గీ. శచిని వృద్ధాంగనలును, లే ♦ జవ్వనంపు
సతులు విష్ణుప్రియనుఁ జేరి ♦ సంతతంబు
సకలదుఃఖోపశమనవా ♦ క్యంబు లాడి
యెంత సేసిన వారల♦వంత వోదు. 5

క. విని విని పల్కినమాటలు,
కనుఁగొనలనుండి బాష్ప ♦ కణములు రాలన్
వనజాక్షు నిచ్చ వచ్చిన
యనువునఁ గర్మంబు నడచు ♦ నందు రిరువురున్. 6

మ. ఇటు లుండ న్దైలవాఱునప్పు డొకనాఁ ♦ డేతెంచి శ్రీపాదుఁ డు
త్కటనాదంబునఁ'నమ్మ!యమ్మ! 'యనుచు ♦ న్దట్టెగ్గవాటంబు;నం
తటఁ దద్దృష్టినె యున్నతల్లి యతఁడా ♦ నందుండటం చెంచి వా
కిటికి న్వచ్చి కవాటముం దెఱచి ప ♦ ల్కె న్నావినితో నిమ్మెయిన్.

క. తెచ్చితె నిత్యానందా!
వచ్చెనె నిమి? యన్న నతఁడు ♦ వల్కెన్దల్లీ!
తెచ్చితిని గాని యాతం
డిచ్చట లేఁ డిప్పుడంచు ♦ నెలుఁగు తడఁబడన్. 8

వ. అంత శచియు నితియు వసారలోని కేతెంచిరి. విష్ణుప్రియ దడదడఁ గొట్టుకొనుగుండెతో నేమి జరిగెనో యేమి చెప్పునో వినఁగోరితలుపుతెక్కలచాటునంబొంచియుండె. నిత్యానందుండు రోఁజుచు మహాప్రయత్నంబున నెట్టకేలకు నిట్లు వచించె. 9

గీ. తల్లి! నిమి సన్యసించెను ♦ దథ్యముగను;
గాని నిను నిజభక్తులఁ ♦ గాంచఁదలఁచి

శాంతిపురమందు నిప్పుడా • చార్యునింట
వేచియున్నాఁ డిటకు నన్ను • వీడుకొలిపి. 10

గీ. చెప్పినటువంటిదుర్వార్త • చివరభాగ
మును వినెనో లేదో శచి కాని • పూర్వభాగ
మును వినినతోడ హా!పుత్త్ర! • పుత్త్ర!యంచు
నశనిహత జంతువట్లు తా • నవనిఁ గూలె. 11

గీ. అత్త మూర్ఛిల్లుటను గాంచి • యమ్మ! యమ్మ!
యంచు విష్ణుప్రియాదేవి • యామెకడకుఁ
బోవఁ దొడఁగెను గాని త • త్పూర్వమందె
యామెఁ దేర్పఁగ నానందుఁ • డరిగె నటకు. 12

క. మది చెదరఁగ విష్ణుప్రియ
గదిఁ జదికిలఁబడియె నిలువఁ • గా నోపక తా
నెదఁ జేతులువెట్టుకనై
న్యదరక్లేశమయవిగ్ర • హాంబో యనఁగన్. 13

ఉ. వారికి వీరికి న్దెలిసె • వారిజనేత్రుఁడు సన్యసించి తా
నూరికో యూరిచేరువున • కో యరుదెంచె నటంచు, నంతటన్
బౌరులు మూఁకమూఁకలుగ • వచ్చిరి సత్య మెఱుంగ నింటికిన్;
వైరులు నాస్తికు ల్గలరు • వచ్చినద్రష్టలగుంపులోపలన్. 14

క. మిత్రులు వచ్చుట సహజమె;
శత్రులుదాసీనజనులు • సైతమును శచీ
పుత్త్రుని సేమముఁ గనుగొన
నాత్రముతో నిల్లు సొచ్చి • రఁట!చిత్రంబౌ. 15

సీ. కందర్పదర్పంబుఁ • గడపునద్ధంబంది,
శారద మీఱిన • చదువరి యయి,

రాజోపభోగరా ♦ రాజితజీవుఁడై
భక్తాళిసేవల ♦ వఱలుచుండి
శస్త్రదిగంతవి ♦ శ్రాంతాత్మకీర్తి యై
మ్రొక్కించుదివ్యస ♦ న్మూర్తిఁబడసి
బంగారుబొమ్మ యా ♦ భార్యప్రేమము గల్గి
హంసతూలీశయ్య ♦ లందుఁ బండి

గీ. యివ్వియన్నియు నిమి విస ♦ ర్జించిపోయె
నందువలన లాభము లేవి ♦ యన్న నివ్వి—
కట్టియును, బుట్టయుఁ, గఱకుఁ ♦ గావిగుడ్డ,
లడవి మెకములపొత్తు, న ♦ ష్టప్పుపస్తు. 16

క. నడలం బడలుట వానలఁ
దడియుట సూర్యాతపములఁ ♦ దప్తుఁ డగుట యొ
క్కెడ నుండక తిరిమ్మరి యయి
పుడమింపయిం దిరిగి చిక్కి ♦ పోరివోవుటయుణ్. 17

గీ. ఇన్నికష్టం బులును భరి ♦ యింప సిద్ధ
పడిమె నిమి; యవలీలఁ బరి ♦ వర్జితుఁ డయ్యె;
నింతస్వసుఖపరిత్యాగ ♦ మే, యొనర్చె
శత్రుపక్షంబువారిని ♦ మిత్రులుగను. 18

క. పరిహాసపరత, యీసును,
గరువం, బేవయును నాస్తి ♦ కత్వము, వైరం
బఱుగువడి కరఁగి తొరఁగెను
బోరిఁబోరి నరినయనవారి ♦ పూరంబులుగణ్. 19

చ. శచిస్మృతి కేగుదెంచి నలు ♦ చాయలు నూచి గృహాపరిష్కృపా
రచయము పెంపు నారసి వె ♦ ఱంగుపడె స్సనమందు; నంతటణ్

రుచిరపవిత్రహేమనిభ ♦ రూపు నిమి స్థనగర్భమందుఁ దా
లిచినమహాత్మురాలి కిల ♦ లే దెనయం చట నార్చి రందఱుఁ. 20

చ. పయికొని వెల్లిగొన్న హరి ♦ భక్తిని వచ్చినవార లెల్లరుఁ
జయము! త్రిలోకసుందరుని ♦ జక్రిని నందనుఁజేసికొన్నపూ
జ్య యగుశచీసతీమణికి ♦ సార్థకజన్మకుఁ బుణ్యరాశికిఁ
జయ! మనిహస్తతాళముల ♦ శబ్దము చేసిరి నింగి మ్రోయఁగ౯.

వ. కొందఱు శ్రీవిష్ణుప్రియాదేవి యున్నగదిదిక్కునకుందిరిగి బద్ధాంజలులై బాష్పప్లుతలోచనులై యిట్లనిరి. 22

చ. వయసున లేఁత యయ్యు జన ♦ పాలనశీలమునందు వృద్ధవై
భయమును జెంద కాత్మసుఖ ♦ భంగకరంబుల కింతయేనియుఁ,
బ్రియు నఘదగ్ధు లౌతనదు ♦ బిడ్డలఁ గావఁగఁ బంపి సుశిక్షసా
ధ్వియగుత్రిలోకమాత సుద ♦ తీమణి దిగ్విజయంబు గాంచుత౯.

వ. కొందఱు వయసు గడచినశిష్టులు శచింజూచి యిట్లనిరి. 24

చ. ఇలు విడి సన్యసించి యొకఁ ♦ డేగఁ గుటుంబములోనియందఱుఁ
సులభముగాఁ దరింతు రఁట ♦ సుశిక్షక, యీభవదుఃఖమోచనం
బలవడుఁ దప్పకుండఁ బురు ♦ షాంతరము ల్పదునాలు గేగుదాఁ
క, లసదశేషదివ్యగుణ ♦ కాండుఁడు ముండుఁడు సూనుఁడయ్యెఁగా!

క. జలజాక్షుఁడు శ్రీకృష్ణుఁడు
కలిగెను నీ కర్భకుఁడుగ ♦ గౌరాంగుండై,
యలరక యీభాగ్యమునకు
విలపించుటకంటె వెఱ్ఱి ♦ వేఱుగఁ గలదే? 26

ఉ. అంతట సందుచేసికొని ♦ "యమ్మరో! నీవును లోననున్నయా
కాంతయుఁబస్తుపీడి మెసఁ ♦ గన్వలె లెం డిఁకఁ బొందు వండికో,

శాంతిపురంబు పోవవలెఁ ♦ జయ్యన, నీకయి చూచుచుండు న
త్యంతకుతూహలంబున మ ♦ హాత్ముఁ" డనెన్నిఁ తి,మిశ్రుభార్యతోఁ.

చ. తినుటకు నిచ్చ లే దయినఁ ♦ దేఁకువమైఁ బచనంబు సేయఁబో
యెను శచి, కోడలుం గుడువ ♦ దేఁదినకున్ననటంచు, సంతఁబ్రా
య్యని రగులించి వండి భుజి ♦ యించిరి కొన్నికణంబు లిర్వు, రే
న్దినములవెన్కఁ నట్టిసితిఁ ♦ దిండియు నీరము లోని కేగునే? 28

క. పెందలకడ శచిఁ గొంపో
వం దలఁచి నితిపరిభృతులు ♦ వడి నొకయిమహా
నాందోళిక బోయిలతో
డం దెప్పించి యది ముంగి ♦ ట న్బెట్టింపన్. 29

చ. వడివడి చేయి కడ్గుకొని ♦ వచ్చెను బిడ్డను జూచువాంఛ దం
డడి యయి లోఁ గలంప శచి, ♦ తల్లిఁ గనుంగొన భక్తకంఠముల్
నిడివడి శ్రీహరీ! యనుచుఁ ♦ బెట్టెను గేకల; నందలంబు నె
క్కెడుకడ నామె దానిపయిఁ♦ గేలిడి నిల్చెముహూర్త మత్తఱిన్.

ఉ. మేలిమునుంగు వైచికొని ♦ మెల్లగ వచ్చెను మిశ్రసూనుప్రో
యాలు శచీదుకూలమును ♦ హస్తమున న్గ్రహియించి; మించుమై
డాలు మనోజ్ఞచేలమున ♦ డాఁచి శిరంబును వంచి, చెక్కులన్
ఫాలము జేవురింప, నిజ ♦ వల్లభుఁ జూచెడుకౌతుకంబునన్. 31

క. వెనుకఁ దిరిగి విష్ణుప్రియఁ
గనె శచి యావలకుమఱచి,♦ కాంతుని జూడ
న్ననుఁ గూడఁ దీసికొని పో
మ్మని యడుగక యడుగునట్టు ♦ లగపడుదానిన్. 32

క. అది యేమో! శ్రీవాసుఁడు
మొదలగుసజ్జనులు పైన ♦ మును మఱచిరి నా

ల్గుదెసల బిత్తరిచూపుల
నెదఁ జల్లువిభీతహారిణ ♦ వీక్షణ నచటన్. 33

వ. అంత శచి కోడలిబుజంబుపైఁ జేయివెట్టి యనురాగంబు పెంపు
గాన్పింప జల్లనిచూడ్కులతో ని ట్లనియె. 34

క. తల్లీ! ని న్నరఁబవను; నే
వెళ్లుట నిజమేని నీవు ♦ వెంబడి రా కే
వెళ్ల; నన న్నితి యది విని
యల్లన శచితోడ నిట్టు ♦ లనె దుఃఖమునన్. 35

క. అమ్మరో! నిమి విష్ణుప్రియ
రమ్మని సెల వీయ లేదు ♦ రామామణితో
నిమ్మాట చెప్పుటకు దుః
ఖ మ్మగు; నెద చీలు ఖండ ♦ ఖండమ్ములుగన్. 36

మ. చెదరె న్నోళ్ళితలగుండె లానుడుల; వ♦చ్చె న్బాష్పము ల్పెల్లుగన్;
గదిరె న్జెమ్మట; కంప మొందఁదొడఁగె ♦ న్గాయంబు సర్వంబు; నం
తదయాక్రోధవిచారయుక్త శచి యా ♦ నందు న్విలోకించి కు
ట్రది రాకుండఁగ నేను దాను నితి! మ♦ర్యాద ల్పనరే! పొమ్మనెన్.

వ. అంత 38

చ. ఒకచెలికత్తె యూఁతగొని, ♦ యుగ్మలి యత్త చెఱంగు వీడి, ప
ల్కక, మొగ మోరచేసికొని, ♦ గ్రక్కున వెన్కకుఁ దిగ్గి, కర్ణమో
దకరనిజాంఘ్రిభూషణవి ♦ తానరవంబులు చెంగలింప, ద
ర్పకశితసాయకంబుగతి ♦ వచ్చి యగారముసొచ్చెఁ గ్రమ్మరన్.

వ. తనగదిలో స్నేహితురాలుం దానును గూరుచుండి విష్ణుప్రియాదేవి
యవశచిత్తంబుతో నిట్లు వితర్కింపమొదలువెట్టె. 40

క. మాతకుఁ బురివారలకును
జేతోమోదముగఁ జూడఁ ♦ సెలవిచ్చియు, నా
వ్రాఁతయె నను రావలదని
చేతోవిభుఁ డాజ్ఞ యిచ్చుట ♦ చెలియా! చెపుమా. 41

క. తనకొఱ కాబాల్యంబే
నెనసినకష్టముల కిద్ది ♦ యే? ఫల మయ్యో!
కనులార నొక్కమా టేఁ
దనుఁ గాంచిన నష్టమేమి ♦ తరుణీ! చెప్పుమా. 42

క. మఱచెనె తనదారను నను?
మఱచె ననుచుఁ జెప్పలేను; ♦ మఱచినచో న
న్నరుదేరవలదు వలదని
దురాయి యిడు టెట్లు గల్గుఁ ♦ దోయజనేత్రా! 43

క. ననుఁ బత్త్రికము రావల
దని నుడువుట చూడ నన్ను ♦ నాతఁడు మనమునం
దున నిడుకొనియే యున్నాఁ
డని తోఁచెడు నిజము కాదె ♦ యంబుజవదనా! 44

ఉ. కర్తయు భర్త హర్తగద ♦ కాంతుఁడు గాదిలిసంగడీనిచే
వార్తను బంపినాఁడు నను ♦ భార్యను రావలదంచు నెచ్చెలీ!
హర్తృగుణంబు లింతియెడ ♦ నాదట నిండుగఁ జూపి, శేషమౌ
భర్తృగుణాదుల న్బ్రజల ♦ పట్టునఁ జూపఁదలంచినాఁ డొకో! 45

వ. అని వలవల యొక్కసారి దుఃఖించి తెప్పిఱిల్లి వెండియు ని ట్లనియె.

క. పాపాత్మురాల నజ్ఞత
నీపగిది న్వెసనువుఁ జెంది ♦ యిందునిభాస్యా!

బాపాంతకు శ్రీకృష్ణుని
నాపతి దైవంబు దాఁటి • నా నయ్యయ్యో! 47

క. హృదయేశ్వరు నభయప్రదు
సదయాత్మకుఁ దిట్టి నీవు • సౌఖ్యపడుదువే?
విదళింతు నిన్నుఁ బేర్చిలిన
వదరకుమా యెన్నఁ డిట్లు • పాపపుజిహ్వా! 48

గీ. సన్యసించినవాఁ డాత్మ • సతినిజూడఁ
దగ దనియె నన్నుఁ దనమ్రోల • నగపడవల
దనుచు శాసించెఁ బతి; దీనిఁ • గనక యురక
కాఱు లఱవకు నాకినా • ల్కా! మహాత్ము. 49

చ. చెలియరో! పాలుగాఱునునుఁ • జెక్కులుఁ గెంపులుగ్రక్కుమోవియుఁ
బెళుకులు గుల్కుసోయగపు • బేడిసకన్నులు, నవ్వుమోము, గా
సిలవె యతిత్వకష్టములఁ? • జిక్కెవె యాఁకట దప్పిఁ ద్రిప్పలఁ
మెలఁకువఁ జూచువార మిట • మే మెపు డాతని వేయికన్నులఁ.

గీ. ఇన్నికష్టంబు లాత్మేశుఁ • డెనయుచుండ
నింట హాయిగ వసియించు • చింతమాత్ర
మిలను బాధను భరియింప • వలదె నేను?
నాథుకష్టంబులోపల • నాదియెంత? 51

గీ. ప్రజలపాపంబు హరియించి • భక్తిబోధ
పఱచి సుఖపెట్టనేగెను • వల్లభుండు;
దుఃఖమేఁ జెంది యాతని • దుఃఖపెట్ట
కుంటయే సాయ; మది సేయ • కుంట తగునె? 52

క. జగదవనోద్యముఁడయ్యెను
మగఁ డాతనిభార్య యంచు • మహి నుతికెక్కన్

దగవిట్టితుచ్ఛచింతలు
తెగటార్చుము స్వసుఖవాంఛ ♦ తెలివా!యింకన్. 53

క. వర మిచ్చి వెనుక నాపతి;
యరుగంగావలెనె దూర ♦ మాతనిఁ గాంచన్
సరి!సరి! యని విష్ణుప్రియ
దరహాసము చేసి కన్నుఁ ♦ దమ్ములు మోడ్చెన్. 54

వ. ఇంచుక సేపట్లుండితటాలునఁబులకాంకితశరీరయైఫాలఫలకంబునఁ
దనవ్రేలు గీలించి యి ట్లనియె. 55

సీ. అల్లదే నాకాంతు ♦ నాస్యేందుబింబంబు;
వెన్నెలలను జిమ్ము ♦ కన్ను లవిగో;
యల్లవే బంగారు ♦ టాజానుబాహువుల్;
రాజిల్లు నదిగో వ ♦ రాలనవ్వు;
మూరెడు మెత్తని ♦ చారువక్షం బదె;
యురముపై నదిగో నా ♦ యుత్తమాంగ;
మవిగో యీబుగ్గల ♦ నంటి నొక్కెడు వ్రేళ్లు;
లివిగో నన్వలపించి ♦ యిడెడుముద్దు;
గీ. లంత యిట నుండ నాకేల ♦ శాంతిపురము?
కైవసం బయ్యె నాపతి ♦ గన్ను మూయఁ;
గాని, చేయెత్తువన్నెకాఁ ♦ డీనెలంత
చిలుతతలఁజొచ్చు టది యెంత ♦ చిత్రమమ్మ! 56

మ. తరుణీ! నాప్రియుఁ డీగదిన్నిజకళ ♦ ద్రవ్యేమమై నుండ, నే
పురికే నత్తయు భక్తవర్యులితరుల్ ♦ వోనేల? యబ్రిం బగున్!
బోరసె న్సంఘపువెట్టి; మంచి దటులే ♦ పోనిత్తు; మెవ్వారికిం
బరమానందము గాదె వా రెనయును ♦ న్నాదంబు శాతోదరీ!57

ఆ. నాతి! విభునియాజ్ఞ ♦ నాయాదలను దాల్చి
యింట నుందు; వారి ♦ వెంటఁబోను;
వంతఁ జెంద మగఁడు ♦ పంపినపంపున;
కర్త శాంతిపురికి ♦ నరుగుమనుము. 58

వ. అని విస్పష్టంబుగ నవ్యాజచిత్తంబుతోఁ జెప్పి ప్రియసఖిని శచి కడ కాత్మనిశ్చితం బెఱుంగంజేయ నంపె;నామెయు నట్లుగావింప, విష్ణుప్రియాదేవిపతిభక్తియుం,బరోపకారవృత్తియు, నాత్మసుఖత్యాగోదారగుణంబును,వేనోళ్లఁ బొగడుకొను చందఱుశాంతిపుర ప్రయాణసన్నద్ధులై యుండి రంత. 59

శా. ఆందోళంబునఁ గాలువెట్టె శచి, గౌ ♦ రాంగా! హరీ! కృష్ణ! గో
విందా! సంసరణాబ్ధితారక! యురు ♦ ప్రేమాశయా! సచ్చిదా
నందా! యానతతాపనాశన! మము ♦ న్రక్షింపఁగా నైనక
ర్త్రందీ! యం చటఁ గేకరించిరి మహా ♦ రావంబుతో నందఱున్.

సీ. బాల్యంబుననుపీరి ♦ వారిని వెక్కిరిం
చెడువాఁడు, పురిఁబేరు ♦ పడినవాఁడు;
మంచిశాస్త్రము లభ్య ♦ సించి మించినవాఁడు,
గురులకుం గురు వయి ♦ వఱలువాఁడు;
పండితాగ్రణులను ♦ బట్టి పాలార్చువాఁ,
డసదృశధీశాలి ♦ యైనవాఁడు;
కందర్పనందంబు ♦ గలవాఁడు, శీవితోఁ
బురిని విచ్చలవిడిఁ ♦ దిరుగువాఁడు;

ఆ. మొలకనవ్వువాఁడు, ♦ పూర్ణచంద్రునిఁ బోలు
మోమువాఁడు, కావి ♦ మోవివాఁడు;

సన్యసించి వచ్చి ♦ శాంతిపురంబును
జొచ్చి రమ్మనె నఁట ♦ చూడ రండు. 61

క. ఉరుభక్తి న్వివశత్వముఁ
బొరసి సఖుల్ శేఁటి చుట్టు ♦ మొనసి కొలువఁగా
హరి! కృష్ణా! యని యాడెడు
సురుచిరచాంపేయకాయుఁ ♦ జూతము రారే! 62

ఉ. చూచితి మమ్మ! మిశ్రజుని ♦ సుందరరూపము శైశవంబునన్;
జూచితి మక్షిపర్వముగ ♦ సుందరి నాతనిఁ బెండ్లిపీఁటపైఁ;
జూచితి మింతలోఁ బెరిఁగి ♦ చూఱకొన న్హరిభక్తికీర్తియున్;
జూచెద మిప్డు శాంతిపురిఁ ♦ జొచ్చినసంయమి యెట్టు లుండునో. 63

వ. ఇట్లు శ్రీగౌరాంగప్రభుపూర్వచర్యలం దలపోసికొనుచు నవద్వీప స్త్రీపురుషు లందఱుం బెరలి శచి వెంబడించి చనిరి. శత్రువర్గంబువారు శత్రుత్వంబంతయు వీడిపశ్చాత్తప్తచిత్తంబులతో గౌరాంగు శుభపదంబులపైఁబడి తమపూర్వాపచారంబు లన్నియు క్షమియింపుమని వేఁడికొని భక్తులుగా మాఱుతమకంబునం జనిరి; రిదివఱకే భక్తులైనవారిమాట యిఁకఁ జెప్పనేల? యిట్లు భక్తిభవబాష్పపూరంబుల మార్గం బంతయుఁ దడుపుచు శచితో నప్డు జేగిన యొక్కభక్తవతంసం బగు 'వసుఘోషు' రచించినగ్రంథరాజంబు నందు శ్రీగౌరాంగదర్శనకుతూహలాయత్తచిత్తు లగుభక్తులవివిధాలాపంబు లిట్లు వర్ణింపంబడియె. 64

ద్వి. సర్వరక్షక! పాప ♦ శాంతిఁ గావింపు;
ముర్వి లేఁ డీఁక శర ♦ ణ్యుండు మాకెందు. 65

ద్వి. అతిదయాశాలి వం ♦ చం ద్రుని న్బుధులు;
వితసేయకయ్యా యమా ♦ బిరుదు మాపట్ల. 66

ద్వి. సంసారగంభీర ♦ జలరాశి మునిఁగి
హింసింపఁబడుచుంటి; ♦ నెగరోఁజు పుట్టెఁ;
నివె నాశిరోజము ♦ లోకృష్ణ! వేపట్టి
భవదంఘ్రితరి వైచి ♦ బ్రతికింపు నన్ను. 67

ద్వి. పుట్టువు లనెడుని ♦ ప్పాల మాఁడి మాఁడి
గిట్టుచున్నాఁడ శ్రీ ♦ కృష్ణచైతన్య!
కరుణామృతాబ్ధివి ♦ గాన నన్గాంచు
నురవడి నందులో ♦ నోలలాడింపు. 68

ద్వి. మఱల వచ్చితివయ్య ♦ మాతండ్రి! నీవు
దురితార్తులను గాచి ♦ దుఃఖంబుమాన్ప.
దొరకఁడు నావంటి ♦ దుష్టుండు నీకుఁ;
దఱిదాఁట నీక చై ♦ తన్య! రక్షింపు. 69

ఉ. శాంతిపురంబు సొచ్చెను బ్ర♦శాంతుఁడు మిశ్రిజుఁ డంచెఱింగి త
త్ప్రాంతపురీజనాళి శచి ♦ వచ్చుటకు న్మను పేగుడెంచె న
త్యంతకుతూహలంబునను ♦ ధారిణి యీనినభంగి; దేశికుం
డెంతయొభీతిఁ జెందెఁ బురి ♦ యిందఱి కెట్టులు చాలు నంచుఁదాన్.

గీ. దోమకుత్తుక నేనుంగు ♦ దూఱె నంట
సత్యముగఁ దోఁచెఁ గద చిన్ని ♦ శాంతిపురపు
టలఁతియిండ్లను వీథుల ♦ నన్నియాళ్లు
నుండుజనతతు లిఱికి య ♦ ట్లుండుకతన. 71

ఉ. వారల కాత్మ దర్శన మ ♦ వారిత మాగతి నీయ దేశికా
గారముక్రింద నేమయితి ♦ గాదని తావడి మేడనెక్కి బం
గారపుఁ గ్రమకాంతులను ♦ గ్రక్కుచు నిల్చె శచీజుఁ ;డశ్రువు
ల్గాఱఁగ నంతఁ దృష్టిగను ♦ గాంచిరి వచ్చినయంద ఱాతనిన్. 72

శా. భానుక్షిప్తమరీచికాండమిలలో ♦ భానూపలం బంటి య
ద్దానిం దూఱి సముద్గతం బయి సమ ♦ స్తంబొక్కచోఁ గూడున
ట్లై నిర్ముక్తవతంసుపైఁ గలసె ది ♦ ప్యప్రీతచిత్తాళి, యు
ద్యానం బంది తదక్షిగోళతతిఁ; బై ♦ తన్యుండు సామాన్యుఁడే ?

గీ. ఇంక నొకచిత్ర మచట నీ ♦ క్షింపఁబడియె;
వచ్చి చూచెడువారిలోఁ ♦ బ్రతిజనంబు
నొక్కతనదిక్కె నిమిచూచు ♦ చుండె నంచుఁ
దలఁచె నఁట! యింద్రజాలంబు ♦ గలదె వేఱ! 74

మ. బహుజనార్జితపుణ్యసంచయతపో ♦ భవ్యప్రభారాసులన్
గుహనాసౌఖ్యగభీరకూపములలోఁ ♦ గూలంగఁబో కల్లపా
పహరు న్మిశ్రిజుఁ గాంచి, భక్తిసుఖము♦ల్ప్రాపించి రానాఁటివా;
రిహలోకార్థపరాయణాధముల కే ♦ వీ ! యాసదానందముల్.75

వ. జనసంఘాతంబు శ్రీగౌరాంగావలోకనమహానంద నిమగ్నమై
యుండ నంత. 76

శా. కర్ణాచుంబితచారునేత్రయుగముల్, ♦ గంబూపమగ్రీవముల్,
స్వర్ణాభాతతవక్షు, మున్నతపరి ♦ ప్రాడ్భవ్యదివ్యాంగముల్,
శీర్ణం బౌనదు మొప్ప దిప్పలదెన ♦ జ్జైసాఁచి గౌరాంగుఁ డా
కర్ణింతు స్మారి నామ మొక్కపరి వ ♦ క్కాణింపుఁడం చడ్గినన్.77

క. ధరణియు నింగియు దెసలున్
"హరి హరి" యని మాఱుమ్రోయ ♦ నఱచిరి వారల్
కరతాళంబులతోఁ దుల;
నరసెడువస్తుతతియెల్ల ♦ హరిమయ మయ్యెన్. 78

వ. ఇట్లుండ. 79

క. రుచిరైతజనకృతహరి
వచనప్రతిరవము లనఁగ! ♦ బహుళముగ హరిన్
వచియించు చటకు వచ్చిరి
శచియు నవద్వీపపురపు ♦ జనతతి యంతన్. 80

శా. పౌరస్తోమముతోడ వచ్చుశచి దా ♦ పల్యంకికన్ భక్తులన్
దూరంబందునఁ గాంచి యచ్చటిజను ♦ ల్లోడ్తో మహాభక్తితో
దారిం జేసిరి సంభ్రమంబునను; జై ♦ తన్యుండుఁ బ్రేమంబులో
నూరన్ గ్రిందికి వచ్చెఁ దా శచికిఁ బ్ర ♦ త్యుత్థానము ల్సేయఁగన్.

గీ. తల్లి కెదురేగి నిల్చెఁ జై ♦ తన్యుఁ డెంతొ
దోషివలెఁ దలవాంచి యాం ♦ దోళముకడ;
నంత శ్రీవాసుచేయూఁత ♦ నామె దిగిన
వెంటఁ గేలోడ్చి చాఁగిలె ♦ విశ్వవిభుఁడు. 82

గీ. అట్లు సాష్టాంగవందన ♦ మాచరించి,
యంబపదములు చేదోయి ♦ నంటి, వాని
పయిని దనదివ్యతమఫాల ♦ ఫలక మిడియెఁ
బూర్ణభయభక్తులను జగ ♦ న్మోహనుండు. 83

గీ. సచ్చిదానందమూర్తి యై ♦ ఛద్మమాన
వాకృతిని గొన్నయెదుటిమ♦హాత్ముఁ గాంచి
చీఁకటులు గన్ను లెనయ వి♦తాకుఁ జెంది
వనిత దెప్పిళ్లి యంతఁ దాఁ ♦ బలికె నిట్లు. 84

ఉ. నాయన ! నాకు వందన మొ♦నర్తువు చాఁగిలి న్యాయమయ్యె?భ
ద్రాయితమూర్తి, వార్తజన♦రక్షణశాలివి, సర్వసౌఖ్యసం
ధాయకసంయమీంద్రుఁడ, వు♦దారుఁడ వీవు, దురాత్మనుం, బళు
పాయను నేను; సెబ్బరలు♦ఁగావొకొ నా కిటు లీవు మ్రొక్కినన్?

సర్వసంగపరిత్యాగ♦శాలివియును,
బ్రివిమలజ్ఞాని వౌనిరా♦బారి వీవు;
పటుతరైహికరజ్జుని♦బద్ధురాల,
ననవరతదుఃఖమగ్న నే♦నయ్య స్వామి! 86

క. ఏమహితవ్రతముం దొలి
బాముల నేఁ జేసినానొ♦ పరమపవిత్ర
స్వామివి, నాకుం గొమరుఁడ
వై మెలఁగితి కొన్నినాళ్లు♦ లంభోజాక్షా! 87

క. మ్రొక్కుట తప్పని నే నిటు
స్రుక్కంగా నేల? యొక్క♦క్షుద్రవనిత కీ
వెక్కుడుకావా ప్రాజ్ఞత?
నిక్కట్లొనరింతె కన్న♦యింతికిఁ? దనయా! 88

ఆ. చూచినంత నిన్ను♦శుభపరంపర గల్గుఁ;
గష్ట మెగిరిపోవుఁ♦ గమలనయన!
ముక్తిఁ జేతఁ బెట్టు♦ప్రోడముందఱ నిట్లు
పలికి యెంతమూఢ♦వనిత నైతి! 89

వ. అని యవశురాలై యామె యేమేమో యాడి యంత మాతృప్రేమరసం బగ్గలం బై యుబ్బఁ బుసరజ్ఞానతిమిరపరివృతాంతరంగ యై చదికిలంబడి 'తండ్రీ! యొకసారి నీమోముచూపు' మని లేవనెత్తి గాఢాలింగనంబుఁ గావించుకొని యొడలు నిమిరి మూర్ధం బాఘ్రాణించి మొగంబువంకఁ దేఱిచూచి కొమరుశిరంబు తనకరంబునం దడవుచు గద్గదకంఠ యై యి ట్లనియె. 90

సీ. మననవద్వీపపురపున♦మస్తజనుల
నిత్యలోచనపర్వ మా♦నీదుశిఖను

గట్ట! గొఱుగ నాకటికమం♦గలికిఁ జేతు
లాఁకపడ కెట్లువచ్చెను♦రా! కుమార! 91

క. కేశవభారతియుం గూ్రా
రాశయుఁడే! యెట్లు చేసె♦యతిగా నిన్నున్
బేశలకాయుని బాలకు
నాశాభంగం బొనర్చి ♦ యాలికి నాకున్? 92

వ. ఈమాటలకు నిమి గుర్రుక్కుమిక్కునక చేతులు జోడించుకొని తలవంచుకొని శిక్షాధికారియెదుట బద్ధపాణి యైయుండుమహాదోషివలెఁ గూర్చుండె; నంతఁ బొరలి పొరలి వచ్చుశోకం బాఁకపెట్టఁజాలక శచి మఱియు నిట్లనియె. 93

సీ. వెలఁది నై వృద్ధ నై ♦ విధవ నై పడరాని
పాట్లెల్ల నిను నమ్మి♦ పడితిఁ గాదె?
పే్రమతో నినుఁ బెంచి ♦ పెద్దవానిని జేసి
విద్య లన్నియును నే♦ర్పించితి కదె?
పడినకష్టములకుఁ ♦ బరిపూర్ణఫలమును
దయచేసితే కన్న♦తల్లి కిట్లు?
కావిచింపి యొకండు ♦ కటిఁ గట్టికొని యుంటి;
కనఁ గన్ననాకను♦ల్గాలిపోవె?

గీ. నిముసమేనియు నినుఁ బాసి ♦ నిలువలేని
నేను సన్యాసి వై నీవు♦గానలందుఁ
దిరుగుచు, వసింప నిలులేక, ♦ తిండికొఱకు
బికిరమెత్తుదు వన్న జీ♦వింపఁ గలనె? 94

వ. అంత దుఃఖాతిరేకంబున మాటాడనేరక యించుకసే పూరకుండి తెలివి సేసికొని శచి వెండియు నిట్లనియె. 95

చ. ఇలు విడిపోవుచు న్జనని ♦ కిచ్చినయాస్తి యదేదొ పుత్త్రికా!
తలఁచితె యెప్పుడేని? వని ♦ తామణి, మానవతీలలామ, ని
న్వలచినధర్మపత్ని, కర ♦ పద్మములందున నిప్పువెట్టినన్
బలుకక యుండునట్టివర ♦ వర్ణిని, ముగ్ధయు, సాధ్వియుం, జుమీ. 96

క. ఆలలనఁ జెఱుతప్రాయపు
గోల న్నన్మడకుఁ జట్టు ♦ కొమ్మంటివి; గో
ల్గోలున నేడ్చుచు సతి యె
న్నాళు ల్గడపంగ జీవ ♦ నము కడముట్టున్? 97

గీ. జంటయెద్దుల నిర్వుర ♦ మింట నెట్లు
బ్రతుకఁగల? మామెదుఃఖ మూఁ ♦ పంగ్రఁదరమె?
యీవు సన్యాసి వై పోవ ♦ నెంచితేని
యమ్మ చచ్చెడువఱ కుండి ♦ యరుగ రాదె? 98

ఉ. తన్ను నెపంబువెట్టుచును ♦ దల్లి యిటు ల్విలపించుచుండఁగా
మిన్నక యుండెఁ గేల్మొగిచి, ♦ మేదినివంకకు వాంచి యాదలన్,
జిన్నమొగంబుతోడుత, శ ♦ చీసుతుఁ; డంతట నిష్ఠురోక్తులన్
గన్నులఁ గాఱునీరమునఁ ♦ గాంతకు భారము తగ్గ లోపలన్. 99

క. ఇందాఁకనుండి, యాయర
విందాక్షుఁడు తల్లిఁ జూచి ♦ ప్రేమయు దుఃఖం
బుం దననెమ్మొముపయిన్
గందోయి న్గానిపింపఁ ♦ గా ని ట్లనియెన్. 100

చ. ఎఱుఁగక పిచ్చియెత్తి యొన ♦ రించితి నే నిటు; లింతమాత్రకే
పొరిఁబొరి నేడ్వకమ్మ! యిఁకఁ ♦ బోవను ని న్విడి యెడకేనియున్
హరుసముతోడ నీవె చను ♦ మన్ననుగాక యనుజ్ఞ యిచ్చి; నేఁ
బరువిడి యాత్రకేగ కిటు ♦ వచ్చుటయే కడు సేమ మయ్యెఁగా. 101

సీ. అమ్మరో! యీతను♦వంతయు నీయది;
నీయిష్ట మెటు లటు♦ చేయవచ్చు;
నీసమ్మతిని గాక♦ నే నెట కేగుట
కధికార మింత లే♦ దరయ నాకు;
సన్యాసి యైనాఁడు ♦ సంసారమున వెండి
చొచ్చుట యెట్లని ♦ చూడకమ్మ;
యటు సేయుమనుదేని ♦ యాశ్రమంబును వీడి,
తిరుగ నుందును నవ♦ద్వీపమునను;

గీ. కన్నతల్లిని నే నెంత♦కరుణ మాలి
యేడిపించితి ; క్షమియింపు; ♦ యింక నిట్టు
లెన్నఁడును జేయ; నని గ్రుడ్ల ♦ నెన్నొ బాష్ప
ములను నింపుచు శచి వేఁడె ♦ మోసకాఁడు. 102

వ. తల్లియుం గొడుకును గలసి మాటాడుకొనుచుండఁ దొల్త
నంద అక్కడ నుండక, పోవనెంచిరి; గాని, జరుగుసంభాషణం
బాకర్ణింప హృదయంబులు గరఁగి యక్కడనే స్థాణువులట్లుండిరి.
శచిని లోనికిం గొంపోవ నద్వైతాచార్యభార్య సీత కొంతసే
పచ్చట వేచియుండి లోపలికి దయచేయుదురే!యని ప్రార్థింప,శచి
యియ్యకొని యామెబుజం బానుకొని నడచి సకలపరిజాకృత
హరిహరిధ్వానంబులమధ్యంబున నాచార్యగృహంబు సొచ్చె
నంత. 103

గీ. విశ్వవిభునకుఁ జక్కగా♦విందు సేయ
సీత సంభారముల నింటఁ ♦ జేర్చు టరసి,
తానె బిడ్డకు వండి వి♦స్తరిని బెట్టి
మనసుపడి, శచి యామెతో♦ ననియె నిట్లు. 104

శా. అమ్మా! సీత! దినంబు లెన్నొ చనె న♦మ్మా! బిడ్డకుం బెట్టి; య
న్నమ్ము న్గూరలు సూపచోష్యములు నా♦నాభక్ష్యము ల్నేనె పా
కమ్ముఁ జేయుట కియ్యకో; మ్మిఁక నెదీ♦గౌరాంగ! నాచేతితో
నెమ్మి న్వండి భుజింప నీ కిడుటయు♦న్నీ వింపుగాఁ దింటయున్?

వ. అని విచారంబుతోఁ బలికి శచి తదేకచిత్తయై పాకంబు సేయం దొడంగె. 106

మ. శచితో వచ్చినభక్తకాండమున కా♦చార్యుండు విత్తార్థ్యశి
ష్యచయప్రాప్తిని దా దరిద్రుఁ డయిన♦న్సర్వోపచారంబులన్
బచరించె న్ధనవంతుకైవడిని, సం♦బాళించి వేర్వేఱుగన్
బచనంబు ల్విడుదు ల్తదన్యబహుస♦మ్మానంబు లవ్వారికిన్. 107

క. అద్వైతుం డతిథుల నే
తద్విధమునఁ దన్పుచుండఁ♦దండ్రికడను హ
స్తద్వయము మోడ్చి యుండిరి
ముద్వివశత నగముకంటి♦మూఁతల భక్తుల్. 108

వ. శచి సనినకొంతసేపటికి శ్రీవాసుం డిట్లనియె. 109

క. అవతారపురుష! కేవల
శవములగతి నుంటి మీవు♦చనినదిమొదల; ల
ట్టివిగతజీవతనువుల న
సువుల న్బోసితివి మఱలఁ♦జూపట్టి ప్రభూ! 110

వ. ఇట్లసంఖ్యాకులగు భక్తులు వారివారిసంతసంబు లనేకస్తోత్రంబుల వెలువరించుకొనిరి. భోజనవిశ్రమంబు లయ్యెఁ; బ్రొద్దుగ్రుంకె; నంత నద్వైతాచార్యుండు సాయంతనసంకీర్తనంబు విరివిగఁ గావింప నుద్యమించి దానికిం గావలయునన్నియు సిద్ధపఱిచెఁ; దత్కీర్తనంబు విలోకింప సీతాసమేతయై, విష్ణుప్రియ తనయొద్ద

లేకపోయెఁ గదా! యనులోనివిచారంబున విన్నఁబోయిన వద
నంబుతో, శచి వసారపైఁ గూర్చుండె. 111

శా. కాషాయాంబర ముజ్జ్వలోన్నతవపుః కాండంబుమీఁద న్నహో
న్నేమంబు ల్తొలఁకింపఁ గీర్తనములో మిశ్రాత్మజుం డుండఁ, ద
ద్వేషం బొప్పెను బూర్వరూపమునకు న్వేరెట్టు లుద్వేలమై;
యోషాపూరుషచిత్తము ల్మునిఁగెభక్త్యుద్భూతమోదాంబుధిన్.

ఉ. చూచుట కృష్ణభక్తిఁ గొని చొక్కుట; యందఱ కంబుదోల్లస
న్మేచకదేహుఁ డావిజయమిత్రుని కౌఁగిట నున్నయట్టులే
తోఁచెను; సన్యసించె మన తోయజనేత్రుఁ డటన్నమాటయున్
దోఁచుట లేదు; విస్మృతుల తో నిమితోడుత నాడి రెల్లరున్. 113

శా. సన్యాసంబును గొంటి నన్నతలఁపు న్జాలించి, బృందావనా
నన్యోపాత్తవిచారము ల్వదలి, కృష్ణాలాపభక్తిప్రభా
జన్యానందము మోముపైని గనుల న్సంచారము ల్సేయఁ జై
తన్యస్వామి యొనర్చి నృత్యముల నంత న్సోలి వ్రాలె న్ధరన్.

గీ. కొడుకు వ్రాలి గుబేలునఁ బడుటఁ గాంచి,
యొడలు చెడి లోనిముడుసులు సడలి విఱిగె
నేమొ! యని శచి భీతిల్లి ప్రేమగరిమఁ
గృష్ణుని నిమీలితాక్షి యై యిట్లు వేఁడె. 115

వసంతతిలక.

నాతండ్రి! కృష్ణ! నిమి నర్తనమూర్ఛలందున్
బాతోదితశ్రమము వానికిఁ గల్గకుండన్,
జేతోవికాసము నశించెడునట్లు నాకున్,
నేతా! మహాత్మ! కరుణింపు; మిఁకొండు వేఁడన్. 116

చ. సుతునవనీతకోమలపు♦సుందరకాయము బాధ చెందు నట
మతి నిటు ప్రార్థనల్సలుపు♦మాత; కుమారుఁడుమూర్ఛనొందుచో
నతిభయసంకులాత్మ యయి♦యక్షులు మూసికొనున్నిజాంగుళుల్
శ్రుతిపుటయుగ్మమందు నిడి ♦ సూనునివేదనఁ గానలేక తాన్.

గీ. ఎంత శచి చూడలేక తా ♦ నెడసియుండఁ
దలఁచినను దప్ప దయ్యెఁ గీ♦ర్తనము గనుట;
మెన్నిహరికీర్తనంబులో ♦ యింతి సూచె
నొరులయింటను దనయింటఁ ♦ బురములోన. 118

వ. విశ్వవిభుఁడు సన్యసించి పోవుచున్నాఁడని విచారించుచు శచి పార్శ్వంబునఁ దత్కీర్తనంబున నున్నమురారిభక్తుం డతని గ్రంథంబున నప్పుడు జరిగినవృత్తాంతంబును శచీమనస్థితియు నిట్లు వర్ణించె. 119

ద్వి. అయ్యయ్యొ !నాబిడ్డఁ ♦ డలసి యున్నాఁడు
చయ్యనఁ జని వాని ♦ శయనింప నిండు. 120

ద్వి. తండ్రి ! నిత్యానంద ! ♦ తమ్ముని గావ,
వీండ్రిచే భజన మాఁ ♦పింపుము వేగ. 121

వ. భక్తిప్రమోదాంభోధినిమగ్నచిత్తుం డగుశ్రీపాదు చెవి నిందొక్క మాటయుఁ దూఱకుంట గాంచి శచీదేవి బిగ్గర నద్వైతుం బిలిచి యతనితోనుం బ్రజాసమూహంబుతో ని ట్లనియె. 122

ద్వి. చాలరాతిరి యయ్యెఁ ♦ జాలుఁ గీర్తనము;
బాలు రాపాడింపఁ ♦ బాడియే మీకు? 123

ద్వి. కంఠెఁ గాయంబెల్లఁ ♦ గందున కయ్యొ!
యెందాఁకఁ గావింతు ♦ రీభజనంబు? 124

ద్వి. ఇసుమంత దయయు మీ ♦ యెదలలో లేదె?
పసిబిడ్డ! మెఱుఁగరే ♦ పాపాత్ములార! 125

ద్వి. నిమి యింక నిట్లాడి ♦ నేలపైఁబడిన
నెముకలు విఱుగవే? ♦ యీల్గఁడే బిడ్డ? 126

వ. ఎంత యఱచిన నందఱుం గూడ భక్త్యానందామృతపానప్రమత్తులై యుంటచే నొక్కండేని విని ప్రత్యుత్తరం బీయఁడయ్యె; నంత మురారి దీనాననంబుతో నిమివంకఁ జూచి యిట్లనియె. 127

ద్వి. ఓతండ్రి! గౌరాంగ! ♦ యొకసారి నీవు
తొంగిచూచి నీతల్లి ♦ దురవస్థఁ జూడు. 128

వ. ఇట్లు కొన్నిదినంబులు గడచినపిదప నొకనాఁడుతనభక్తు లందఱం జేరంబిలిచి దగ్గరఁ గూరుచుండఁబెట్టుకొనినిమియిట్లనియె. 129

సీ. పొరపాటుచే నేను ♦ బోయితి నాకస్మి
కముగ మిమ్మందఱఁ ♦ గన్నొఱంగి;
బృందావనంబున ♦ కేఁ బోవఁ జాలమి
కారయ నిద్దియే ♦ కారణంబు;
తల్లి నేడ్పించితి ♦ దయమాలియని నేను
బోయినప్పటినుండి ♦ పొక్కుచుంటి;
ననురాగమున నన్నుఁ ♦ గననిచటికి రాఁగ
నవశుఁడ నై బుద్ధి ♦ యంతరింప;

ఆ. నెట్లు నీవు చెప్పు ♦ దట్లుచేసెద నని
మాటయిచ్చినాఁడ ♦ మాత ; కిప్పు
డామె యేమిచేయు ♦ మనిచెప్పునో నన్ను
నెఱుఁగవలయు, దాని ♦ నెఱపవలయు. 130

గీ. వీడి యత్యాశ్రమంబును • గూడి భార్య,
మఱల గార్హస్థ్యమునఁ జొచ్చి • తిరుగు మంచు
నంబ సెలవిచ్చెనేని, యే• మనక యటులె
చలుపుదును ముదలను శిర • సావహించి. 131

క. నేనే చని జననీమణి
యానను గైకొందుఁ; గాని • యటు చేసినచో
నానతి మోమోటంబున
నీనోపదు నాయెదుట య • థేచ్ఛంబుగఁ దా౯. 132

ఉ. కావున మిత్రులార! చని • కన్గొనుఁ డామెయభీప్సితం బదే
దో! వడి దానిఁ జేసెదను; • ద్రోసి యతిత్వము తన్నుఁ గోడలి౯
మైవడిఁ జూచుచుండు మని • న, న్నరిగా నటె నే నొనర్చెద౯;
దేవుఁడు మాత్ర మెక్కుఁడగు • నే? కన నన్గనినట్టితల్లికి౯. 133

గీ. తనువు సర్వంబు నామెదే • యనుఁడి; తల్లి
యెట్లు చేసిన నాకదే • యిష్ట మనుఁడి;
తిరుగ గార్హస్థ్యమున నన్నుఁ • జొరఁబడు మనఁ,
బత్రనంబున కామెతో • వత్తుననుఁడి. 134

వ. ఈవిపరీతవాక్యంబులాలకించి భక్తులునివ్వెఱపడి యిట్లు తర్కించుకొనిరి. 135

సీ. కూడనిపని యేలొ • కో! చేయ నున్నాఁడు
సర్వసచ్ఛాస్త్రవి • శారదుండు?
తల్లి సంతసపెట్ట • ధర్మశాస్త్రవిరుద్ధ
చేష్టితం బెవఁడేనిఁ • జేయనగునె?
యతి యయి మఱల గృ • హస్థుఁడౌ వాఁ డైహి
కాముష్మికార్థుల • హాతుఁడు గాఁడె?

యవనిలో దేనికే ♦ నవధి యుండు గాని
పారంబు గలదె యీ ♦ పాపమునకు?

గీ. సర్వసౌందర్యసద్గుణ ♦ శాలి యైన
కొమరుఁ డీరీతి నడిగిన ♦ నమితపుత్ర
వత్సలయు నఱువదియేడు♦వత్సరముల
తల్లి యేమనునో యది ♦ తెల్లమె కద! 136

వ. అంతలో శ్రీగౌరాంగుదేవత్వమహాత్వంబులు స్ఫురణంబునకురాఁగ వారలే మఱల నిట్లనుకొనిరి. 137

క. మనుజునికె విధినిషేధం
బనుభేదము గాని యట్టి♦యభ్యంతరముల్
పనుపడునె కృష్ణునంశం
బున జగతిని బుట్టినట్టి♦పుణ్యాత్మునకుఁ? 138

గీ. ఇంతకాలంబు పురిలోన ♦ నింత పొత్తు
నెనసి యున్నట్టిమనము జీ♦వింపఁ గలమె
వీడి మనలను, మనవీడు, ♦ విభుఁడు ననినఁ?
గాన దీనను గడు మేలు♦గలుగు మనకు. 139

సీ. పాపకఠినచిత్త♦పాళి మెత్తఁగఁ జేసి
హరిభక్తిబీజంబు ♦ లందు విత్తి
రక్షింప గ్రహియించె ♦ రాజీవనయనుండు
సన్యాసపదము క♦ష్టముల నెలవు;
పాపాత్ము లగునర♦పశువులె యఖిలేశు
నిటు బిచ్చగాని గా♦వించినారు;
శ్రీకృష్ణు నిటు సేయ ♦ సిగ్గులేదొకో మన
కతఁడేడ? నశనప♦ర్యటన మేడఁ?

ఆ. జాలుఁ జాలు నన్న • చేలంబు లందఱ
కిడెదుప్రభుని సర్వ•సృష్టికర్త
నెల్లయెడల బిచ్చ • మెత్తించి గోఁచిని
బెట్టఁజేసి కష్ట • పెట్ట నగునె? 140

గీ. ఎంతవేగము సన్న్యాస • వృత్తి వదలి
యతఁడు క్రమ్మఱ వచ్చి గృ • హస్థుఁ డౌనొ
యంతవడిగను బ్రజలచే • సంతరింపఁ
బడినయపకీర్తిమాలిన్య • ముడిగిపోవు. 141

ఉ. కన్నుల నద్దుకొంచు సుమ • కాండముల న్గొని పూజసేయుచున్
మన్ననతో సువర్ణమణి • మండితడోలికఁ బెట్టి యూఁప నా
నున్ననిముద్దుపాదములు • నొవ్వఁగఁగొంచక యూళ్లఁద్రిప్పినన్
దున్నలకు న్మనుష్యులకుఁ • దోఁచదుభేదము వర్తనంబునన్. 142

క. మెత్తనివాతెఱ ముద్దుల
నొత్తినఁ గందెడుకపోల • యుగళంబయ్యో!
యెత్తెఱఁగున భరియించును
క్షుత్తృడ్వాతోష్ణశీత • శోషణబాధల్? 143

క. మనపుణ్యంబున నిమి తాఁ
జనవలయుపథంబుఁ దెల్ప • శచి నర్థించెన్;
జననీమణి తప్పక ర
మ్మనును నవద్వీపమునకె • యబ్జాతాక్షున్. 144

వ. ఇట్లతిసంతోషంబునం గేరుచు భక్తులందఱు శచీదేవికడకుం జని యామెపాదంబులకుం బ్రణమిల్లి కూర్చుండ, నిమి ముందఱకుం జరగి వికసితముఖారవిందుం డై యి ట్లనియె. 145

సీ. వినుమమ్మ! యొకసువా♦ర్తను దెచ్చితిమి మేము;
ప్రభుఁడు నీయిష్టంబు ♦ వచ్చినట్లు
కావింతు నంట ము♦ఖప్రీతికొఱకు నై
నోటఁ బల్కిన బెల్లి♦మాట గాదు;
చని మమ్ము నీయభీ♦ష్టముఁ గనుఁగొని రండ
టంచంపె; వచ్చితి♦మందుకొఱకె;
తెలుగ నవద్వీప♦పురమునకు నిమి ర
మ్మనియందు, వంతెకా♦కనెడె యొండు?
గీ. త్వరగ నీయాజ్ఞ యేదియో ♦ పలుకు తల్లి!
యడలుచును శాంతిపురమున ♦ కరుగుదెంచి
నట్టిమే మందఱము నవ్వ ♦ చాడు చేగు
దుము నవద్వీపపురికిఁ జే♦తోముదమున. 146

వ. ఇది విని యద్వైతాచార్యుం డనంగీకారసూచకసంకుచితభ్రూ
యుగంబున నిత్యానందు నవలోకించి యిట్లనియె. 147

ఉ. తప్పది స్వామియానతిని♦దాఁటి వచించుట; బూటకంబులన్
జెప్పకు; తల్లి కిష్ట మెటో♦చేయఁగని మ్మటు; లామెచిత్తమున్
ద్రిప్పకు నీసుఖాభిరతిఁ ♦ దెల్లము సేయుచు నీదుకోరికల్;
చెప్పుము స్వామి నీ కెటులు♦ చెప్పెనొ తిన్నఁగనట్లయీ మెతోన్.

వ. అని శచితోఁ దా నిట్లనియె. 149

సీ. శచి! భవదిష్టాను♦సారంబుగా నిమి
వర్తించుటకు సిద్ధ♦పడుట నిజము;
పోయెను నీసెల♦వును గొన, కందుచే
శ్రీకృష్ణుఁ డతని శి♦క్షించి యిటకుఁ

దిరుగఁ బంపించె మి ♦ మ్మరసి దుఃఖం బార్పఁ;
దనయునితనువు నీ ♦ ధనము; దాని
నెట్లు చేయఁగ నెంతో ♦ యట్లు చేయుము; నీకు
వ్యతిరేకముగఁ జేయ ♦ వలనుపడదు;

ఆ. నీమనంబు నెఱుఁగ ♦ నిమిపంపె మమ్ముల;
సరిగ దానిఁ బట్టి ♦ జరుగుఁ బనులు;
బాగుగా నివన్ని ♦ పరికించి యాజ్ఞ ని
ర్బంధరహితఫణితిఁ ♦ బలుకు మమ్మ! 150

క. నీసెల వటులైనను, స
న్న్యాసము విడి మఱల నిమి గృ ♦ హస్థుండై, వేం
చేసి, నవద్వీపంబున
వాసము చేయంగ నున్న ♦ వాఁ డో తల్లీ! 151

ఆ. అమ్మ! తానె వచ్చి ♦ యడిగినఁ బుత్త్రివ
త్సలతఁ జేసి యస్వ ♦ తంత్రురాల
వగుచు లోనితలఁపు ♦ నగపడనీ వని
పంపె నిటకు మముఁ గృ ♦ పామయుండు. 152

శా. ఈవార్త న్విని తల్లి యుల్లమున నెం ♦ తే సంతసం బందునం
చావేదించిరి భక్తు;లైన శచి చిం ♦ తాలోడనం బంది దుః
ఖావిర్భూతము లైనలక్షణము లా ♦ స్యంబందుఁ జూపంగ, నా
శావిధ్వంసము నొంది పల్కిరి మహా ♦ శ్చర్యార్తుల న్వారిటుల్.

ఆ. తల్లి! యూర కెట్లు ♦ తలపోయుచుంటివి;
వెలుపరాదె లోని ♦ తలఁపు వేగ?
కొడుకు నొద్ద నుండ ♦ కడవులఁ బడి పొమ్మ
టంచుఁ జెప్పి మమ్ము ♦ నంప నెంతె? 154

వ. అది విని శచీదేవి దుఃఖవిక్షేపంబొనర్చునొకనవ్వునవ్వియిట్లనియె.

చ. తనయునిగూడఁ దీసికొని ♦ తల్లి చనన్వలె నింటి కంచుమీా
రనెదరె? భక్తులార! నను ♦ నంతదురాత్మగ నెంచినారె? యా
పని యొనరింపఁ జాల; నిఁకఁ ♦ బ్రవ్రజితుం డయి యేడ నున్నవాఁ
డనువగు నాకు వానికి న ♦ టంచుఁ దలంచుచునుంటి నెమ్మదిన్.

వ. భక్తు లిది విని యాశాభంగంబున మనంబు లెరియ నామెతో
ని ట్లనిరి. 157

ఆ. ఈవు నోటఁ బల్కు ♦ టే కొ యంతగ నింటఁ
జొచ్చి మఱల మనల ♦ సుఖము పెట్ట
నిచ్చపడినబిడ్డ ♦ నిట నుండనీయక
తఱిమి వెళ్లఁగొట్టఁ ♦ దలఁచినావె? 158

వ. ఈకుపితవాక్యంబులు విని కొంతసేపు మిన్నకుండి వెండి శచి
మందహాసంబుచేసి యి ట్లనియె. 159

సీ. నిమిఁ గొనిపోయితి ♦ నేని నాకును వేన
వేలకుఁ గలుగు ను ♦ ద్వేలముదము;
గాని నవ్వాడు రిల ♦ వానిని బ్రజలెల్ల;
రది భరింపఁగ శక్య ♦ మగునె మనకు?
దానికే? మదియునుఁ ♦ బోనిండు; పూతుఁ డై
గ్రహియించె నొక్కవా ♦ రమ్ముమున్న
సన్యాస; మపుడన్న ♦ సత్ప్రతిజ్ఞావాక్య
మట్టిట్టిదే యలం ♦ ఘ్యంబుగాక?

ఆ. దాని నిలుపుకొనక ♦ తప్పెనే, నిమి యధః
పతితుఁ డగుచు నష్ట ♦ పడఁడె యిహాను

ఖమున కల్లపరసు ♦ ఖమునకుఁ గాకుండ?
నించుకంత దీని ♦ నెంచినారె? 160

గీ. నన్ను విడి నిమి వోవఁ బ్రా ♦ ణములు వోవు,
నది నిజమె; యీభయంబున ♦ సతనిమోక్ష
మార్గమున కడ్డురాను; దు ♦ ర్మరణము లవి
ప్రతిదినము నాకు వేలుగా ♦ వచ్చుఁ గాక! 161

ఉ. నాశిశు వేగినట్టిమఱు ♦ నాఁ, డట సంయమి గాకపూర్వ, మేఁ
గేశవునాశ్రమంబుకడ ♦ కే చనియుండిన, నేడ్చి మద్వ్యథా
పాశముల న్గుమారుని ని ♦ బద్ధునిజేసి మఱల్తు నేమొ పా
రాశరి గాకయుండ; నది ♦ రట్టగు నిప్పుడు చేయఁబూనినన్. 162

గీ. కార్యములు సేయవలె యుక్త ♦ కాలములను;
దనయు రక్షించుకొనుసట్టి ♦ తఱి గతించె;
నిప్పు డతనిగృహస్థుఁ గా ♦ వింపయత్న
పడుట యది గతజలసేతు ♦ బంధనంబు. 163

ఆ. అతనిమేలు గోరు ♦ నమ్మ నే నైనచో
నమ్మఁ గలసి యింట ♦ మను మటంచుఁ
జెప్పఁ జనదు; వెన్క ♦ సెలవు గూడను వాని
కిచ్చినాను సన్య ♦ సించి పోవ. 164

క. తల్లి యిడునాజ్ఞ నెన్నం
డుల్లంఘింపండు పుత్త్రుఁ ♦ డుత్తముఁ డౌటన్;
వెళ్లుమని చెప్పకుండిన
వెళ్లక గృహమందె యుండు ♦ వీడక నమ్మన్. 165

క. కావున నాకై యెన్నఁడు
నావంతయుఁ దాను వంత ♦ నందవల; దివే

నావాక్యములుగ మీారలు
వేవే చని చెప్పుఁడయ్య • విశ్వంభరుతోఁ. 166

వ. అని శచి యొక్క మహాదివ్యతేజం బాపాదమస్తకంబు క్రమ్మ దనశరీరంబు వెంచి యాశ్చర్యనిమగ్నులౌ భక్తులపైఁ దీక్ష్ణావలోకనంబులు నిగిడించి వెండియు ని ట్లనియె. 167

సీ. కోపమా నామీాఁదఁ • గొడుకు నింటికి రమ్మ
టంచు వచింప లే•దంచు మీాకు?
నను నమ్మి యుండఁడే • తనయుఁ? డదేల నా
యం దంతవిశ్వాస•మతని కుంట?
యాత్మసుఖేచ్ఛ నే • నతనిమార్గంబున
కెపు డడ్డురానని • యెఱుఁగుకతన;
వాఁడు న న్నెఱుఁగును; • వాని నే నెఱుఁగుదు;
నమ్మ వచ్చునని న • న్నమ్మె బిడ్డ;

గీ. యమ్మ విశ్వాసఘాతుకు•రాలు గాదు,
" నీవు సన్యాసమును బొచ్చి•నావు గాన
నవనిఁ గష్టములకు నోడ • కాశ్రమమున
స్థిరుఁడ వై యుండు " మని పోయి • చెప్పుఁ డయ్య. 168

వ. ఈమహోపన్యాసంబునకు భయభక్తిసంభ్రమాశ్చర్యసంకులాంతరంగు లై భక్తులు తమలోఁ దా మి ట్లనుకొనిరి. 169

ఉ. ఎంతమహాత్మురాలొ శచి • యిప్పుడు తెల్లముగా నెఱింగినా;
మంతటిబిడ్డఁ బొమ్మనియె•నాత్మసుఖం బొకయింత చూడ; కీ
కాంతప్రభావము న్దెలిసి•కా తనతల్లిగఁ జేసినాఁడు, పా
పాంతకుఁ డైన స్వామి; నిమి•యంబ యనన్దగు నీమె నన్నిటన్.

వ. శచి యాప్రస్తుతివాక్యంబు లొకింతయు వినక మౌనంబున

దీర్ఘాలోచనంబుగావించి యంత నల్లన మఱల నిట్లనియె. 171

సీ. నిమి శ్రీజగన్నాథ♦నిలయమందున నుండు
మందునా? యది లేదు ♦ బృందయంత
దూరంబు; మీ కేమి♦తోఁచునో చెప్పఁడు;
యాత్రాస్థలంబు, స♦న్యాసు లధిక
ముగ నుండువచ్చెడు♦పూతపురం బది;
యిటనుండి మెందఱో ♦ యేగుచుందు్రి;
నిమి వోయి యచటనే ♦ నివసించి యుండిన,
నతనిక్షేమం బప్పు♦డప్ప డెఱుఁగ

ఆ. వచ్చు నాకు మీకు; ♦ వాఁడును సన్యాస
నియమములను విడక ♦ నెఱపవచ్చుఁ;
బోయి చూత మన్నఁ, ♦ బోవచ్చు మూఁడువా
రములలోన నంద♦ఱమును గూడ. 172

ఆ. ఊరి కింతకంటెఁ ♦ జేరువలో నున్న
మేలె, కాని నేను ♦ మీరు నంద
ఱతనినిష్ఠఁ జెఱిపి ♦ యాశ్రిమభంగంబుఁ
జేయఁదలఁతు మేమొ ♦ చెప్పలేను. 173

ఉ. ఇంటికి రమ్మటంచు నుతు♦హింసను బెట్టెదనేమొ నేను; దా
రెంటికిఁ గాకపోవు నటు♦త్రిప్పితినే; నదిగాక, తాపసుం
డంటయె కాని, ఛద్మయతి,♦ హాయిగఁ బూర్ణగృహస్థుమాడ్కి నీ
ల్లంటుక యున్నవాఁ, డనుచు♦నాఱడిపెట్టుదు రేమొ దుర్జనుల్.

క. సందియఁ దగదు దుష్టుల
నిందకుఁ; గంకణము కట్టి♦నిద్ధి యీభువిలో

సంచలించి దరింపఁ జేయఁగ;
సందులఁ గే స్వసుఖపరత ♦ సంకిలి సేయన్. 175

ఆ. నాయభీష్ట మేగి ♦ నాయనతోఁ జెప్పఁ
డని ధరిత్రి వ్రాలి ♦ యధికదుఃఖ
సంకులాత్మ యగుచు ♦ "సత్పుత్త్రు నీరీతిఁ
బంపుచుంటి నెంత♦పాపురాల" 176

వ. అని కన్నీరు మున్నీరుగా వెక్కి వెక్కి యేడ్చుచుంట గాంచి భక్తులును సీతయు "నమ్మా! శ్రీకృష్ణుమాత వైననీ కీపామర దుఃఖంబు తగదు; లె" మ్మని యూఱడించి లేవనెత్తిరి. పిమ్మట భక్తులు నిగూఢగాఢశోకభరితాంతరంగంబులతోఁ జని ప్రభువునకు మాతృసందేశం బంతయు విన్నవించి రంత. 177

గీ. భక్తులు దనకుఁ దెచ్చిన♦వార్త నపరి
మితపుటానందమున విని ♦ మిశ్రసూతి,
నవ్యదరహాసవికసితా♦ననముతోడ
నెదుటివారలఁ బోడగాంచి ♦ యిట్లు పలికె. 178

గీ. అమ్మచిత్తమ్మె ధర్మశా♦స్త్రమ్ము నాకు;
నామె జంగమవేదం బ♦టంచు నెంతు;
మీకు వర్తింప నగు నామె♦జోక నెపుడు
కొంక, కని చెప్పి యద్వైతు♦వంకఁ జూచి. 179

క. నినుఁ గృష్ణుఁడు రక్షించుత !
చనెద జగన్నాథమునకుఁ ♦ జయ్యన నిపుడే
యన వాతఁడు 'చనుటా ? యే
మనె' దనివిలపింపఁ జొచ్చె ♦ నధికార్తి మెయిన్. 180

వ. తక్కభక్తులుం గూడ గోలుగోలున గొంతసే పేడ్చి "స్వామీ!

శచీజనని వచ్చుచున్నయది యామెకడఁ గడపటిసెలవుఁ దీసికొని మఱి పో, మ్మన వల్లె యని నిలిచె; నంద ఱీఁగలు మూఁగినట్లు భక్తిప్రేమాతిశయంబునఁ బ్రభు దగ్గఱం జని రంత. 181

స్రగ్విణి. ఒక్కచే దండ మిం ♦ కొక్కచే గిండియున్
జక్కఁగాఁ దాల్చి య ♦ జ్ఞాత నేతు్రిందు. తా
మ్రొక్కఁగాఁ దల్లికిం ♦ బోయె ముం; దామె రా
గ్రిక్కున న్వ్రాలె నా ♦ కాంతపాదంబులన్. 182

దోదకము. డెందమునందుఁ గ ♦ డింది విచారం
బుం దరిలేనివి ♦ మోహము రెండున్
గ్రిందుకొనం, బలు ♦ క న్నిలువన్నే
మిం, దడ వృద్ధయు ♦ మేదినిఁ గూలెన్. 183

వ. ఇది యంతయు భక్తు లాలోడితచిత్తంబులతో నవలోకించి పెద్ద వడి యాలోచించి పిదపఁ జైతన్యస్వామితో నిట్లనిరి. 184

గీ. ఉత్కలావని నేలుమ ♦ హోగ్రుఁ డైన
యలప్రతాపరుద్రాంకిత ♦ క్ష్మానిపునకు
ముసలిమాన్వంగదేశాధి ♦ పునకు నిపుడు
జరుగుచున్నది పో; రది ♦ మఱచినాము. 185

క. మనవారి నోఢ్రదేశం
బునకు న్రాసీఁడు రుద్ర ♦ భూపుఁ; డతనిపా
లన నున్నజగన్నాథం
బున కెటు లీ విచటనుండి ♦ పోఁగలవో ప్రభూ! 186

వ. అది విని యొకచిఱునవ్వు నవ్వి గౌరాంగుం డిట్లనియె. 187

ఆ. ఇప్పు డైన నేమి ♦ యిఁకఁ గొన్నిగంటల
కైన నేమి చనుట ♦ యొఁగధు కద!

తరలి పోవనిండు; త్వరగఁ బోవలయును;
మిత్రులార! కృష్ణపుత్త్రులార! 188

క. నీలాచలచంద్రుని నే
జాలము కాకుండఁ జూడఁ జనవలయు; స్త్రీ
లోలుం డాతఁడె త్రోవను
బాలించెడుఁ, దొలఁగఁ జేసి బాధల నెల్లన్. 189

వ. శచీదేవి, యుండుమన్న స్వవచనవ్యాఘాతం బగునని మిన్నకుండె; నంత నద్వైతాచార్యుండు చేతులు జోడించుకొని "స్వామీ! మఱికొన్నినాళ్లు మీదర్శనలాభంబు మా కీయరా" యని దీనాలాపంబుల బతిమాలుకొననిమి,దాని కియ్యకొనియె. మబ్బుపోయి వెన్నల వచ్చినట్లు శాంతిపురంబునం బునరానందంబు గలిగెఁ; జైతన్యస్వామి భక్తమధ్యంబున మఱి యైదుదినంబు లుండెనంత.

క. వెంట న్భక్తుల నెవరినిఁ
గొంటకు నొల్లండు గాని గోపాలుఁడు, త
న్నొంటిగఁ బంపుట కీకొన
కుంట న్దనవారు, దాని కొప్పఁగవలసెన్. 191

వ. వేనవేలు భక్తులు "మేము వచ్చెదము, మేము వచ్చెద" మని పోరాడుచుండ, నందు నిత్యానంద, ముకుంద, జగదానంద, గోవింద, దామోదరు లనుభక్తపంచకంబు మాత్రము కూడ వచ్చుట కంగీకరింపఁబడియెఁ; బిన్నవయస్సువారగు గదాధర,నరహరులనుఁ,గుటుంబు లగు మురారి,శ్రీవాసాదులను స్వామి రావల దని శాసించెఁ; బ్రతాపరుద్రమహారాజురాజ్యంబున మహామ్మదీయుఁ డెవండేని కనంబడెనేని శత్రుచారుఁడుగ నెన్నంబడి శిక్షితుం డగుననుభయంబున నెంతయో శ్రీగౌరాంగానుగమన

చికీర్షు వగుహరిదాసుండుఁగూడ నిరోధింపఁబడియె నంతనాతండు కరంబులు మొగిచి ప్రభువునెదుట నిలువంబడి బాష్పంబు లురల ని ట్లనియె. 192

గీ. అందఱను గృపఁ జూచి యానందమూర్తి!
వీనిఁ గష్టాత్ము దయమాలి విడిచితి కద;
యయ్యొ! నీతోడ రానీయ వైతి నన్ను;
నెట్లు బ్రతుకుదు నే నిట నింకఁ దండ్రి! 193

వ. అని గౌరాంగుపాదంబులపైఁ బడ నాతం డతని లేవనెత్తి యి ట్లనియె. 194

గీ. దుఃఖ ముడుగుము హరిదాస! తోడితెత్తు
ముందు, నే నుండుచోటి కిబ్బంది లడఁగి
పోవుటను జూచి, యెటో వెళ్లఁబుచ్చు కాల
మంతవఱ కని, నిమి చెప్పి, యట్లె చేసె. 195

వ. తల్లికడఁ గడసారిసెలవు దీసికొనంబోయి యామెపాదంబుల కెఱఁగి గౌరాంగుం డిట్లనియె. 196

సీ. పిచ్చిచే, నోతల్లి! విడిచితి సంసృతిఁ;
గొడుకు గావించిన కొంటెతనము
క్షమియింపు మమ్మ! నీ నిమిని నే నెప్పుడు;
నరయ నీకడ కేను మఱల వత్తు;
వినెదవు తఱచుగాఁ దనయుయోగక్షేమ
ములు; నీయొడల నాత్మమును మెలఁకువఁ
గాచుభారము నాది; గట్టిగా నమ్ముము;
నాకొఱకై చాల నేవసిపోదు

గీ. నీవు నన్న్యాలు; నేలుఁగుదు ♦ నేను దల్లి!
యట్టిచింతల నడఁచివే♦యంగవలయు;
నెపుడు నిశ్చలమతిని శ్రీ♦కృష్ణుఁ గొలువ,
నెనయుదువు కష్టపడక య♦భీష్టసిద్ధి. 197

వ. ఇదియునుం గాక. 198

గీ. మఱలఁ జెప్పెద విను తల్లి! ♦ యరితి నన్నుఁ
జూడఁగోరినవా రెల్లఁ ♦ జూడఁగలరు
తలఁచినప్పుడె, తన్మనో ♦ దర్పణముల,
సర్వదుఃఖవిముక్తులై ♦ సంతసమున. 199

క. ఏతద్వర మొసఁగుట యొక
మాతకు భార్యకును గాదు, ♦ మఱి హరిభక్తిన్
జేతో నైర్మల్యంబున
భూతలమం దున్నయెల్ల♦పూరుషతతికిన్. 200

క. పూరుషు లననేటికి? నను
నారయ శుద్ధాత్ములగుచు♦నర్థిం జెడుకృ
ష్ణారాధనతత్పర లగు
నారులు నరయంగఁ గలరు ♦ నన్ను మనములన్. 201

వ. అని పల్కి హరిహరిధ్వానంబులనడుమ శ్రీచైతన్యస్వామి దక్షి
ణాభిముఖుం డై చనియె. 202

ఆ. వృద్ధమాత వెతను ♦ వీక్షించుచుండెను
బోవుచున్నపుత్త్రుఁ ♦ బుణ్యమూర్తి;
నంత నొద్దనుంచి♦రంధలంబును నవ
ద్వీపమునకు నామె ♦ వే కొనంగ. 203

వ. సంతత ధారాపాతంబులుగఁ గన్నీళ్లు గార్చుచు వెక్కి వెక్కి యేడ్చుచు శచియుం దక్కుస్త్రీపురుషులందఱును శాంతిపురంబు నుండి కదలి చని మఱల నవద్వీపంబు ప్రవేశించిరి. వారిరోద నంబులు విని నిలువెల్లఁ జెవులుగా నున్నశ్రీవిష్ణుప్రియాదేవి, వేఱుగఁ జెప్ప నక్కఱలేకయే నిజవల్లభుండు సర్వసంగపరిత్యాగి యై తన్నుఁ దప్పిపోయెనని తెలిసికొనియె. 204



క. కొత్తది యిమ్మని యడుగను;
హృత్తాపము లార్పు మంచు ♦నే వేఁడుదు; నీ
చిత్తమున కెట్లు తోఁచునొ
యత్తెఱఁగున నింకఁ జేయు♦మయ్యా! రామా! 205



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.



## ద్వితీయభాగము.



### నవమాశ్వాసము.

చ. ఒడలగగుర్పు, నశ్రువులు, ♦ నున్నసమస్తమనోమహావ్యథల్,
మఱియుఁ, తత్ప్రశాంతిజవి♦లక్షణమోదముఁ, గల్గఁ జిత్రకా
రుఁడు లిఖియించుబొమ్మఁ గన, ♦ రుచ్యపుఁబేరు వచింప ; నింక నీ
యడుగులతాఁకునన్నిల, ల♦తాంగిగమాఱుట, రామ! చిత్రమా?

గీ. శాంతిపురమును వదలిన♦క్షణమునుండి
కృష్ణునకు జగన్నాథున ♦ కేమిభేద
మును గనక మిశ్రసూనుఁడు ♦ పోవుచుండెఁ
బరుగు పరుగున భక్తిఁ, ద♦త్పురముదెసకు. 2

క. నీలాచలనాయక ! గో
పాలక ! శ్రీకృష్ణ ! యిదిగో ♦ వచ్చుచునున్నా,
నాలస్యము లే, దనునొక
యాలాపము దక్కఁ బలుకఁ ♦ డన్యము నోటన్. 3

గీ. దేనఁ జిత్తంబు వెట్టునో ♦ దానియందె
లగ్నమగు నది ; యితరము ♦ ల్లయము నొందు;

నొకనితో మాటలాడిన • నకల మతఁడె
యని తలంచుచుఁ బ్రేమించు • నతనిఁ బ్రభుఁడు. 4

ఉ. చక్కఁగ భోజనాదులను • జల్పి నశాంతిపురంబునందు, నా
చక్కని వీడు టాదిగను • సారసనేత్రుఁడు సంయమిత్వపుం
జిక్కులు బుద్ధిపూర్వముగఁ • జేకొని పొందెను, బట్టెడన్న మే
మెక్కుచు నుత్త దాకటకు • మేదినిపై శయనించుచు న్ధృతిన్. 5

ఉ. స్నానముమీఁదికి స్శయన • సౌఖ్యముమీఁదికిఁ దిండిమీఁదికిన్
బానముమీఁది కార్త జన • బంధుఁడు చిత్తము వోవనీయ, కో
యానతతాపనాశన! మ • హాత్మక! పిల్చితికాదె న న్నిదే
నేనును వచ్చుచుంటి హరి! • నీలనగాధిప! యంచుఁ బర్వెడున్. 6

గీ. బాలుఁ డెగిరిపోయెడుగాలి • పడగ వెంట
మీఁదిచూపుల నక్షిని • మీలనంబు
లేక, క్రిందను బర్వెడు • లీల, గంగ
యొడ్డునను వేగ పరుగెత్తు • చుండె విభుఁడు. 7

వ. ఈరీతిఁ బ్రధావించుచు నాకాలంబునఁ గేవలారణ్యంబుగ నుండు కలకత్తాపత్తనంబుఁ గడచి గంగాతరంగిణి పాయలైసముద్ర గామినిగాఁ బాఱుట కారంభించినప్రదేశంబగు 'ఛత్రిభాగు' కడకు వచ్చి చైతన్యుండు శిష్యులతో నాఁకపడి యట నిలిచె. 8

గీ. వంగవిషయంబు గా, దిఁ కా • వలిప్రదేశ;
ముత్కలోత్తరావధియె యీ • యూరు; దీని
దాఁటి మఱికొంత దూరము • దాఁక నెచటఁ
గనఁగ మానుషవాస మొ • క్కటియు లేదు. 9

క. ఈపాయ లెట్లు దాఁటఁగ
నోపునొకో స్వామి యంచు • నుండఁగ భక్తుల్,

దాపునకు మహాప్రభువుగఁ
జూపట్టునొకండు వచ్చి • చూచెను వారిన్. 10

వ. ఈవచ్చినయతండు మహమ్మదీయుఁ డగువంగదేశాధిపతిక్రింద నుద్యోగంబు సేయుతత్ప్రదేశపాలకుఁ డగు 'రామచంద్రఖా' ననువాఁ; డాతం డాభాగం బుత్కలశత్రుజనపీడితంబు గాకుండ జాగరూకుఁడై లెస్సగ నధికారంబు సేయుచుండె. సువర్ణవిగ్రహంబుంబోని దివ్యరూపంబున నున్నయొకసన్న్యాసి యామెల్లకు విచ్చేసియున్నవాఁ డని యానోట నానోట విని, తద్దర్శనాతికుతూహలాయత్తచిత్తుండై యతం డంత నచటికి వచ్చె; వచ్చి, 11

సీ. సచ్చిదానందంబె • సన్న్యాసమును గొని
వచ్చినయట్లు చూ • పట్టువాని,
రూక్షకాషాయంబు • రూక్షతరంబుగాఁ
జేయుబంగారపుఁ • జాయవాని,
శిరము మోకాళ్లపైఁ • జేర్చుక శతము గ
న్పడనట్టివనటను • వనరువాని,
నేవురుభక్తుల • కేండ్లలోఁ జిన్నయై
యోజోధికుండయి • యొప్పువాని,

గీ. గురుఁడ నని చెప్పకయె చెప్పు • హొరువువాని,
రామచంద్రుండు సూచి వె • ఱంగుఁ జెంది
భక్తి నిండార మ్రొక్కెఁ ద • త్పాదపద్మ
ములకుఁ; బ్రజ వచ్చి యంతట • మూఁగెఁ జుట్టు. 12

వ. చైతన్యస్వామి యంతర్ముఖుండై నిజదర్శనాగతజనసమూహంబుం గనక, కనిన నరకుగొనక, యట్లు విలపింపఁదొడఁగె. 13

శా. నాతండ్రీ! యదువంశమండన! జగన్నాథా! హరీ! రక్షకా!
చేతోనాయక! జీవజీవమ! నినున్నీఘ్రింబుగాఁ జూడనీ!
యేతత్పాతకవిద్ధచిత్తు; నిఁక నన్వీక్షింపనీవేని వి
ఖ్యాతత్వచ్ఛుభమూర్తి, నీల్గుదు దిదృక్షాతృణ్మహాబాధచేఁ. 14

గీ. ఎగిరి నీప్రోల వ్రాలనెంతేని గలదు
వాంఛ ; యట్టులు నేఁజలుపంగఁజాల
నోజగన్నాథ ! శ్రీకృష్ణ ! యొసఁగవయ్య
పక్షులకువలె నాకును బక్షములను. 15

క. ఆరూపము నీయెడ్డ వి
చారమపారముగ రామచంద్రుమదికిఁ దో
తేరఁగ, వినయంబున నిమిఁ
జేరం జని యతఁడు వలికెఁ జేమోడ్చి యిటుల్. 16

క. స్వామీ ! యెందుల కడలెద
రీమాడ్కిని? మీరు చెప్పుఁ; డేసాహాయ్యం
బే మీకుఁ జేయవలనగుఁ?
గామిత మీడేర్తు నెంత కష్టం బైనన్. 17

వ. బాహ్యప్రపంచజ్ఞానవ్యపేతుం డగుశ్రీగౌరాంగదేవుండు దాని కే
మియు నుత్తరంబీకుంట కాంచి నితి నడుగ, నాతండు రామచం
ద్రునితో నిట్లనియె. 18

ఆ. మాన్యపురుష ! యీసు మంగళవిగ్రహుం
డగును గురువు మాకు నధిపతియును;
గనఁగలేమి నాజగన్నాథదేవు, ని
ట్లుడికి యుడికి యేడ్చుచున్నవాఁడు. 19

గీ. "అయినఁ గానిమ్ము; నేను సహాయపడుట
కేదియేఁ గలదేని వచింపు" మనినఁ,
"గలదు లేకయే? మమ్మలిగట్టుఁ జేర్చు
మయ్య! మము గంగ దాఁటించి" యనియె నతఁడు. 20

ఉ. వంగమువాని నుత్కలము, వంగము నుత్కలదేశవాసి, నె
బ్భంగిఁ జొరంగ నీకు మని వంగవిభుం డిడ నాజ్ఞ, దాని దాఁ
టం గడుఁ గొంకె నా ప్రభు వెఱందను గొంచెము సేపు; గానిని
స్సంగు వెత నగనంగ భయసంగతి బ్రుంగెను, బొంగె ధైర్యముల్.

వ. కొంతవడి యాలోచనంబు సేసి రామచంద్రఖానుఁడు నిత్యానం దునితో నిట్లనియె. 22

శా. ఈమాన్యుం డ్వడి నోఢ్రదేశమున కెంతేయత్నము జేసి, నా
కే మైన న్నరె, పంప నెంచితిని; మీ హేమాంగు నీరాత్రియే
యీమందాకిని దాఁటఁజేసెద; నిఁకీ వృత్తాంత మాలించినన్
జేత్రిమహోత్కటమూర్తి చింతవిడి సంప్రీతి న్బిసాళించునే? 23

వ. ఈమాటలకు నిత్యానందుండు కొండంత యానందం బంది, యిది యంతయు నాకస్మికంబుగఁ గాకతాళన్యాయంబుగ సంభవించినది గా దనియు, శ్రీగౌరాంగదేవు దుర్గాహ్యచేష్టితంబ యనియు రూఢిగ నమ్మియుండె; నంతవాగ్దానంబు చేసినట్లె యారేయి రామచంద్రప్రభుండు గౌరాంగు నతని భక్తుల నేఱుదాఁటించి యుత్కలంబునం బ్రవేశపెట్టె.

గీ. ఉత్కలంబున పారేగు చూడ జరిగి
నట్టివిషయంబులను ముఖ్యమైనవాని
వ్రాసియుంచెను గోవిందభక్తుఁ; డందుఁ
గలదు కడుఁ జిత్రమైనట్టి కథ యొకండు. 25

చ. పడిఁ జనుచుండ వారి కొక ♦ బండపయి న్మలినాంబరంబు, లొం
డెడకును దృష్టినిం జెదర ♦ నీయక, కొట్టెడునొక్క చాకి క
న్పడెఁ బథమందు; నంతఁ బ్రభు ♦ వర్యుఁడు విస్మృతివీడి, చెంతకు
న్నడచి, వచింపు శ్రీహరిని ♦ నాప్రియమిత్రమ! యొక్కమాటనెన్. 27

వ. అది విని యాచాకలి.

క. ముష్టికొఱకు నే తెంచిరి
ముష్టింపచు, లంచు వారి ♦ మోములపైకిన్
దృష్టిని ద్రిప్పక, శష్టికి
ముష్టి యిడుట కేమి యుండుఁ ♦ బోం, డని పలికెన్. 28

క. ఈమాటలు విని మిశ్రిజుఁ
డేమియు నీవలదు రజక! ♦ యే మర్థులమై
రా మిటకు; నొక్కపరి హరి
నామముమాత్రము వచింపు ♦ నాయన! యనియెన్. 29

ఆ. ఆతఁ డనినయట్లు ♦ లాడిన నేమైన
నర్థ మీయవలయు ♦ ననెడు భీతి,
వారిబారిదప్ప ♦ వలనేది? యని యెంచి
యెంచి, చాకి యనియె ♦ నిట్లు తుదకు. 30

ఉ. నే నిఱుపేదఁ, గష్టపడి ♦ నిల్పుదు నింటిజనంబు ప్రాణముల్,
మానితినే క్షణంబుఁ బని, ♦ మగ్గుదు మేనుఁ గళత్ర మర్భకుల్,
దీను ననుగ్రహించి యిఁకఁ ♦ దిప్పలు పెట్టకపొండు చెచ్చెరన్,
మీనుడివల్కులోపలను ♦ మేవడి గుంజుదు నొక్కచేలమున్. 31

మ. అది యా నీభయ? మంచు నవ్వుచును గా ♦ రాంగుండు నిర్ణేజకా!
యుదుకం జేతులఁ బూనినట్టివసనం ♦ బొక్కింతనే పిమ్ము నా;

కది సంక్షాళిత మానుసావలన; నీ ♦ వాసందునందొక్కమా
టెద రంజిల్లఁగ శ్రీహరీ! యనఁగ లే ♦ వే! యంచుఁ బల్కెన్దయన్.

వ. అంత నాచాకలవాఁడీయపూర్వప్రార్థనాబలాత్కారంబుదప్పించు
కొనుమార్గంబుఁ గానమి నిష్టంబుగాకున్నను దన చేతిబట్టగౌరాంగు
చేతి కిచ్చి, యొప్పుకొని, నిగూఢం బగుకోపంబు విసుగును మాట
లం దోఁప ని ట్లనియె. 33

గీ. గట్టి దాపట్టె పట్టితి; ♦ పట్టు విడువ
వయ్య! నీవంటివాని నే ♦ నరయ నెచటఁ;
జెప్పు మింకనాలస్యము ♦ సేయ కేను
బలుకవలయుపలుకుఁ, జేయ ♦ వలయుపనియు. 34

చ. "హరి యనిపల్కు మయ్య" "హరి" ♦ "యద్దియె యింకొక
సారి పల్కుమా"
"హరి" "మఱియొక్కమాఱనుమ ♦ హాయిగ విందుమువీరు, నేను," "నా
"హరి హరి శ్రీహరీ! యనుచు ♦ నారజకుం డని యాడఁ జొచ్చెను
దురగతిఁ జేతు లెత్తి పరి ♦ తోషతరంగితచిత్తవిస్మృతిన్. 35

క. కని యిది భక్తులు దూరం
బున నుండిరి వెఱగుఁ జెంది; ♦ మోదవివశుఁ డై
తనియక యూరక హరి! హరి!
యను చాకలిఁ జూడ నవ్వ ♦ లాటగ నుండెన్. 36

క. ఇటులుండఁ గొంతవడి క
చ్చటి కన్నపుఁజట్టితోడఁ ♦ జాకిత వచ్చెన్
బటుభక్త్యావేశంబున
నిటు నటు నట్టాడుమగని ♦ నీక్షించి నగెన్. 37

వ. నగి దగ్గఱకుం బోయి 'నీవు నట్టువకాఁడ వని నే నెన్నఁ డెఱుంగనై

తి, నన దానికాతం డేమియుఁబ్రిత్యుత్తరం బీయమి మఱింత చేరువ
కుం బోయి పేరుపెట్టి పిలిచి దానికింబదులుమాటరామిఁదేఱిచూచి
పూర్ణవిస్మరణంబుం బొరసి పిచ్చివానివలె హరి!హరి! యనియాడు
చున్నమగనివాలకంబునకుం బెగడువడి 'యయ్యో!యయ్యలారా!
నామగని నేదోభూతంబు పట్టుకొన్నది' యని యార్పు చేయుచు
గ్రామంబులోనికిం బరువెత్తె నంత. 38

గీ. ఆరజకురాలితో వచ్చి ♦ యూరివారు
మడుపు లుతుకుటమాని యు ♦ న్మత్తువడువు
నను సముద్ధృతబాహుఁడై ♦ నాట్య మాడు
చాకిఁ గని పిలువసాగిరి ♦ కేక లిడుచు. 39

గీ. పట్టపగ లైన, దయ్యంబు ♦ పట్టె ననెడు
తలఁపునను జంకి రందఱు ♦ దరికిఁ బోవ;
వారిలో నొక్కసాహస ♦ వంతుఁ డంత
వడిగఁ జని వానిచేతులు ♦ పట్టుకొనియె. 40

మ. కరము ల్దాఁకినమాత్రనే యతఁడు లో ♦ కజ్ఞానము న్వీడి, య
చ్చెరువు న్జెందుచు నూరివారు నిలువ, ♦ న్జేయెత్తి రమ్మంచు నం
దఱకు న్సన్నలుసేయు చాడఁదొడగె ♦ న్నాట్యంబు చిత్రంబుగా
హరినామోచ్చరణాంచితం బగుచుజి ♦ హ్వాగ్రంబునట్టాడఁగన్.41

ఆ. వానిఁ గౌఁగిలించు ♦ వాఁడు, వానిని దాఁకు
వాఁడు, వాని నంటు ♦ వారుఁ, జిందు
ద్రొక్కి రఁట! హరియను ♦ చొక్కఫకీరుని; నిమి
నరుఁడొ వేల్పొ యింక ♦ నరయలేమె? 42

క. విద్యుచ్ఛక్తిని, మాదక
మద్యమహారసముఁ, బోలి ♦ మైమఱపించున్

సద్యఃఫలదాయక మయి
హృద్యశ్రీకృష్ణభక్తి • నెవ్వనినైనన్. 43

ఆ. గ్రామవాసు లంద • ఱీమాడ్కి హరి! హరి!
యనుచు నర్తనముల • నలరుచుంటఁ
గాంచి నిమియు భక్త • కాండంబుఁ గడునవ్వ
కొంచునుండి రచటఁ • గొంత సేపు. 44

క. క్రమ్మిన శ్రీహరిభక్తిసు
ఖమ్ముక్రిమిదులు టరసి చనిరి • గ్రామమ్మునకున్
గ్రమ్మఱ నందఱు; భక్తులుఁ
బిమ్మటఁ జని రచటనుండి • విశ్వంభరుతోన్. 45

గీ. దర్శనస్పర్శముల, బట్ట • తాఁకుచేత
నిట్టి శ్రీకృష్ణభక్తి వి•స్మృతిసుఖంబు
నెందఱెందఱకో నిమి • యిచ్చె నంచు
వ్రాయఁబడి యుండెఁ బెక్కుస • ద్గ్రంథములను. 46

క. అంటునతని కొకని కెకా,
కంటినతని నంటువారి, • కవ్వారలమై
నంటినవారికి, నెల్లర
కంటించెనఁట! నిమి భక్తి • యానందంబున్. 47

మ. ఒకనాఁ డంబుధి స్నానమాడుతఱి భ • క్త్యుద్రిక్తచిత్తుండు మి
శ్రకుమారుం డురువిస్మృతిం బడె హఠ • పాత్రయుండుగా నందులో;
నొక కైవర్తుఁడు వైచి జాలకము మ • తోత్కంఠతో దానిలా
గికొన, న్వింతగ నొక్కచేఁపవలెఁ జి • క్కెన్ని ప్రకుం డందులోన్.

క. ధీవరజాలంబులకున్
శ్రీవరునకుఁ గల్గినట్టి • స్పృష్టిమహిమ భ

క్త్వావిష్టుం డయిజాలరి
గోవిందా! శ్రీహరి! యను ♦ గొంచు నటించెన్. 49

సీ. ఇట్టియద్భుతచర్యల ♦ నెవఁడు సలుపఁ
గలఁడు సామాన్యమనజుఁ ♦ డై కలిగెనేని?
యిల జనులఁ బ్రోవ నవతార ♦ మెత్తినట్టి
తండ్రి నిమి గాన, నట్టిచి♦త్రములు సేసె. 50

గీ. పోవుమార్గమందలిగ్రామ ♦ ములను గలవు
సత్రదేవాలయంబు; లా ♦ స్థలము లన్ని
పండుటకుఁ దిండికి వలను ♦ పడినయవియె;
కాన యాత్రికు లింతయుఁ ♦ గష్టపడరు. 51

గీ. క్రూరులై దేవళంబులఁ ♦ గూల్చి పాడు
చేయుమునలిమానులఁ జొర ♦ నీయకుంట,
నుత్కలంబున నుత్కర్ష ♦ మొంది యుండె
నమితజనసేవ్యపుణ్యదే ♦ వాలయములు. 52

క. తనమో మొకసారి ననుం
గననిచ్చునె తండ్రి యాజ ♦ గన్నాథుఁ డు చ
య్యన? ననునొకనుడికా, గొం
డు నిమి యనఁడుమార్గమందు ♦నోటను నితితోన్. 53

వ. ఒకదినంబున శ్రీగౌరాంగప్రథమోపదేష్ట యగునీశ్వరపురిగురుం డగుమాధవేంద్రపురిచరితంబు సెప్పుచు నితి యి ట్లనియె. 54

గీ. క్ష్మారుహచ్ఛాయనుండి, యా ♦ సన్నమరణుఁ
డైనమాధవపురి తన ♦ కమితభక్తి
సేవచేసినప్రియతమ ♦ శిష్యుఁ డైన
యీశ్వరపురిని బిలిచి తా ♦ నిట్టు లనియె. 55

శా. యావజ్జీవముఁ బెక్కుకష్టములతో నార్జించితి న్స్వప్నసం
సేవ న్భక్తిని బ్రేమ; ధాత్రినికర శ్రేష్ఠుండ వై నిత్యముం
నీవు న్నా కుపచారము ల్సలిపి తెం తేశ్రద్ధతో; మద్ధనం
బౌ వాని న్మనసార నిచ్చెదను గొ మ్మా! యీశ్వరా! నాకడన్.

గీ. మానసికములు భక్తిప్రేమంబు; నవ్వి
యిడుట యెట్లని సందేహ పడఁగవలదు;
భక్తవర్యుల కవి స్థూల వస్తువులుగ
నగు నొసంగఁగ గ్రహియింప నర్హమువలె. 57

ఆ. ఇట్లు పల్కి మాధ వేంద్రుఁడు, మృత్యువు
కడను వేచియుంట గాంచి, దీర్ఘ
ముగను మేను వాల్చి భూరుహచ్ఛాయఁ గే
ల్మొగిచి వేఁడెఁ గృష్ట మూర్తి నిట్లు. 58

ద్వి. దీనులతాపము ల్దృష్టించినంత
నే, నవనీతస న్నిభ మైనసీదు
మానసంబు మఱిఁగి మఱిఁగి కరంగుఁ
గా! నందనందన! కంజాక్ష! కృష్ణ!
ధ్యానంబుసేయుచు నధిప! నీ వెచటఁ
గానిపింతో యని కాలమంతయును
నే నెమకుచు నుంటి నిన్నె; యింకెప్డు
కానిపించెదో! చెప్పు కరుణాసముద్ర! 59

వ. అని కనుమూసి శ్రీమాధవేంద్రపురి శరీరత్యాగంబు చేసె నని నిత్యానందుండు చెప్పుట ముగియకుండఁగనే, ప్రాణోత్క్రమణావసరంబున నొక మహాభక్తునిచే భక్తిపూర్ణహృదయోద్గతంబుగా రచింపఁబడి చదువఁబడినశ్లోకంబుల నాలించునంతనె చైతన్య

స్వామి పోలి వ్రాలి కొంతవడికిం దేఱి లేచి భక్త్యానందోన్మాదం
బున నాడ మొదలువెట్టె. 60

క. కొన్నాళ్లు వాఱు నని చని
తెన్నున నొకచోట నుండి ♦ తిలకింపఁగ, న
త్యున్నతగోపురశిఖరము
కన్నుల కగపడియె భక్త ♦ కాండంబునకున్. 61

క. అంతట వార లమేయపు
సంతోషంబునను జూచి ♦ చైతన్యుఁ, బ్రభూ!
చింతవిడి చూడు మదె! శ్రీ
కాంతు జగన్నాథుగుడిశి ♦ ఖర! మనిరి లలిన్. 62

క. చూచుటయె తడవుగా నిమి
యేచినయానందమునను ♦ హృదయము వొంగన్,
వాచావిలోకనాదులఁ
దోఁచెన్వివశుఁ డయి పిచ్చి ♦ తొడరినభంగిన్. 63

సీ. వచ్చుచున్నాఁడ గో ♦ పాల! జగన్నాథ!
శ్రీకృష్ణ! యని యార్చుఁ ♦ జేతులెత్తి;
యెగిరి యాచక్కికి ♦ నేగి వ్రాలుదు నన్న
వెఱ్ఱితమిని బ్రధా ♦ వింపఁ దొడఁగుఁ;
బరుగెత్తి పోవఁగాఁ ♦ బదములు రామిని
నేలను గూలి క ♦ న్నీళ్లు రాల్చు;
నెంతవే చనఁగఁ దా ♦ నెంచెనో యంతయా
లస్యం బగుట చూచి ♦ లంపటవడు;
ఆ. నుస్సురస్సురనుచు ♦ నూర్చు నిట్టూర్పు; లిం
కేమిచేయలేక ♦ భూమిఁ గూరు

చుండి, కానిపించు ♦ నున్నతగోపురం
బుదెసఁ జూచుఁ గనులు ♦ మూయకుండ. 64

వ. ఇట్లుండి యుండి భక్తులనందఱను దగ్గఱకు రండని సన్నలతోఁ బిలిచి తనవ్రేలు శ్రీజగన్నాథాలయశిఖరంబుదెసకుం బఱపి చైతన్యస్వామి యర్థవ్యక్తశ్లోకరూపంబుగా నిట్లనియె. 65

ఆ. ఆలయశిఖరమున ♦ నాసీనుఁడై ముద్దు
లొలుకునవ్వు మోము ♦ కులుకుతోడ
నన్ను రమ్మటంచు ♦ నాచిన్నికృష్ణుఁడు
సైగ సేయుఁ బ్రాణ ♦ సఖులు కనరె? 66

వ. భక్తు లావంకఁ జూచిరి గాని వారి కేమియుఁ గనఁబడకపోయెఁ; నంత గౌరాంగుండు తటాలున లేచి "తండ్రీ! ఇదిగో వచ్చుచున్నా" నని కేకరించుచుఁ బర్విడ సాఁగె; నటమున్న శ్రీజగన్నాథస్వామిఁ దా నొంటరిగ దర్శింప నిచ్ఛగల దని యతండు భక్తులకుం జెప్పెఁ గాన, వార లందువలన వెనుకఁబడియుండి; రిం కట్లుండ కతనితోఁ గలిసిపోదమని వారు తలంచినం బోవంజాలరు; స్వామియంత వేగంబుగాఁ బరువెత్తుచుండె. 67

ఆ. చనఁగలేక నేలఁ ♦ జదికిలఁబడెనఁట;
యంతలోనె యెవరు ♦ నందుకొనఁగ
లేనిపరుగుతోడఁ ♦ దాను బోయెనఁట; శ్రీ
కృష్ణుమాయ లెవ్వ ♦ రెఱుఁగఁగలరు? 68

సీ. స్వామి నీలాచల ♦ చంద్రుండు, పతి జగ
న్నాథనామకపట్ట ♦ నమున; కతని
కుపచారములు సేయు ♦ చుందు రనేకులు
సేవకు లైభక్తిఁ ♦ జేసి యెపుడు;

నాలయాంతస్థుఁడై • యనుదినంబును స్నాన
చందననైవేద్య • శయనముఖ్య
సుఖము లందుచు నుండు; • సులభుఁడు గాఁ డతం
డరయఁ గాంక్షించుయా • త్రాగతులకు;
గీ. దర్శనంబున కెందఱ • దయిరయొ సెలవొ
కావలయు; భర్మశోధనిఁ • గరమునఁగొని
విభుఁడు రుద్రుండె గుడిముందు • వీథి యూడ్చు;
నమితముగ యాత్రికులు వత్తు • రటకు నెపుడు. 69
మ. అరిషడ్వర్గజయాతిరేకు లగుచు • న్స్వాధీననిష్కల్మష
స్థిరచిత్తంబులు గల్గి యుండుమహితుల్ • శ్రీకాంతుమ్హాత్మ్యపద్మ వం
దరయం జాలుదు;రట్టిధన్యుఁ డయుతం • బం దొక్కఁడేయుండు; న
క్కఱలే దాతని కాలయాదులకునే • గ న్వెగ్రిహార్చార్థమై. 70
క. ఇతరప్రకృతుల కరయఁగఁ
బ్రీతిమారాధనము ధ్యాన • పరికరములకు
ఖ్యాతమం ; బాముష్మికస
ద్గతిఁ గన, మిల వదలి సాము • గావించినచోఁ. 71
క. ఎందఱో భక్తమణులు గుడు
లందు న్బ్రతిమలను గొల్చి • యందిరఁట మహా
నందం; బిది గ్రంథంబుల
యందుం గల; దవ్వి కల్ల • లాడవు సుండీ! 72
మ. హత మైపోయినమానసం,బిఁకను ధ్యే • యధ్యాత్మభేదంబునుఁ
హత మాఁ; ప్రార్థన మంతదాఁక నెయవ • శ్యంబా;మనంబున్సమ
ర్పితము న్జేసి తలంతు రీశు సుగుణ • స్థితుల్బ్రసిరు ల్గొండ; ఆ
గతి నర్చాపరు లన్నియుందిప్రియముల • న్గావింతురు ప్రార్థ్యర్చనల్.

మ. ప్రతిమారాధన మొల్ల మంచుసభల ♦ న్వాదించుపాండిత్యగ
ర్వితులారా! యొకమాట! మూఢజనులు ♦ ర్విఘ్నుళ్లలోఁగొల్చునా
ప్రతిమ ల్దేవత లెట్లు కావో యటె భా ♦ వంబందు మీచేత ని
ర్మితమౌరూపముఁగాదు దైవత; మిఁక ♦ నీమ్రొక్కు వేమున్నదో!

మ. కనుమూయన్ప్రియురాలిమోమొకనులో ♦ కాంతాకుచద్వంద్వమో
ధనమో బిడ్డలొ పొట్టకూటికృషి ని ♦ త్యంబు న్విలోకించుసా
ధనసంతాన ములేవియో మలినచి ♦ త్తంబందుఁ గాన్పించు; న
ర్చనలన్గొల్చెదుబొమ్మకంటెనివి యా ♦ రాధింప యోగ్యంబులా?

సీ. దేవుఁ డన్భావనఁ ♦ దిలకించుచుండును
విడక కన్నులు శిలా ♦ విగ్రహంబు;
నఖిలేశుఁ డనుబుద్ధి ♦ నలరులు గ్రహియించి
చేతులు ప్రతిమఁ బూ ♦ జించుచుండు;
నందె దేవుం డుండు ♦ నంచు నాలుక పర
బ్రహ్మనామంబులు ♦ పలుకుచుండుఁ;
దత్సుశబ్దములకుఁ ♦ దక్కఁ బరధ్యాన
ములకు మూఁతలు పడి ♦ పోవువీను;

గీ. లన్నియింద్రియములు రజ్జు ♦ లట్లు చపల
మనము నీడిచి విగ్రహం ♦ బునకుఁ గట్టు;
నిద్ది యుపయోగకరమొ యిం ♦ కితరమైన
యుపధి మానసికధ్యాన ♦ మో కనుండు. 76

ఉ. దేవునె మీరు సత్యముగ ♦ ధీవినిబద్ధుని జేయఁ జూచినన్
గేవలమూఢయత్న; మిఁక ♦ నిత్యుఁ డనంతుఁ డమేయుఁ డంతరం
గావశపూర్ణతత్వ మగు ♦ నాయఖిలేశుఁడు సృష్టికర్త, యే
కైవడిఁ జిన్నిబుఱ్ఱలను ♦ గట్టుపడున్నను మూసినంతనే? 77

క. తనయంతదాని దయతో
నొనరుపవలె మనము నామ ♦ హోన్నతతత్వం;
బనువుగఁ దానైనను డిగి
మనుజుండయి పోవవలయు ♦ మనలనుదయతోఁ. 78

సీ. ప్రతిమ నారాధించి ♦ భక్తుఁ డెన్నియొ పాట్లు
పడి మనశ్చాంచల్య ♦ ముడుపుకొనును;
విస్మృతి లేకున్న ♦ విగ్రహం బెదుటను
దద్రూప మరయుఁ జి ♦ త్తంబునందు;
వెనుక నారూపంబు ♦ విగతజీవము గాక
యగును సచేతన ♦ మైనయదియె;
తరువాత నదియుఁ జి ♦ త్తంబును వ్యాపించి
వాక్కుల కందని ♦ వస్తు వగును;
గీ. భక్తిసోపానమార్గ మీ ♦ పగిది నుండు
నంచుఁ బెద్దలు భక్తులు ♦ స్వానుభూతిఁ
జెప్పి; రట్లంట మోసంబు ♦ చేయఁగాదు;
ముక్తిపరులార! యాపుంతఁ ♦ బోవుఁడయ్య! 79

మ. ప్రథమావస్థను భక్తుఁ డీశ్వరు నిజ ♦ స్వాంతంబున న్జూడఁగా
వృథ యాయత్నము సేసి చేసి, యెదుట♦న్వేల్పు న్గలి న్నిల్పి, త
త్ప్రథితాఖ్య ల్తననోట వాకొనుచుఁ గీ ♦ ర్తింబట్లువేమాఱు, స
త్కథనార్చాదులచే నొకింతపరితృ♦ప్తస్వాంతుఁడౌఁ విస్మృతిన్.

గీ. విఫలమానసికధ్యాన ♦ వృత్తిఁ జాల
వేసరినవార లెందఱో ♦ విగ్రహములఁ
బెట్టుకొని పూజసేసి ని ♦ ర్విఘ్నముగను,
గోఁతిమనసును సవరించు ♦ కొనిరిభువిని. 81

ఉ. ఎల్లెడ నుండునందు రతఁ ♦ డీశ్వరుఁ! డెక్కడఁ గానరాఁ డటం
చుల్లమునందుఁ దల్లడిలు ♦ చుండఁగ మానసికార్చనాపరుం,
డున్న విగ్రహంబునకు ♦ నర్చనసేసెడునాతఁ డాజగ
ద్వల్లభు లాగి తెచ్చి కను♦పట్టఁగఁ జేయును విగ్రహంబునన్. 82

గీ. చదువునకు నక్కరంబుల ♦ సరణి, దేశ
ములను దెలియఁగఁ బటముల ♦ పోల్కి, మహిత
హర్మ్యనిర్మితి కాలేఖ్య ♦ మట్లు, ముక్తి
సాధనం బగు విగ్రహా ♦ రాధనంబు. 83

గీ. విగ్రహారాధనముచే ల♦భించుఁ దప్ప
కాంతరంగికసద్భక్తి ♦ కొంత, యొండు
మాడ్కిఁ గా ; కంతఁ దాను క్ర♦మక్రమముగ
ముక్తిఁ గను గృషి చేసి ము♦ముక్షు విలను. 84

ఆ. బాహ్యసాధనంబు ♦ ప్రతిమ; యంతియ కాని
దానిపూజమాత్ర ♦ మానసికపు
భక్తిపాలు లేదె? ♦ పత్త్రి చేటగుఁ
జిత్తశుద్ధి నర్చ ♦ సేయమేని. 85

గీ. సార్వభౌముచిత్తరువు ను♦త్సవములందుఁ
జక్కఁ దాలిచి యూరేగి ♦ సంతసింతు;
మట్లె దేవప్రతిమ మ్రోల ♦ నధికభక్తి
నుంచి పూజించి యానంద♦మొందఁ దప్పె? 86

గీ. చక్రవర్తిని జూచిన ♦ సత్యవంతు
లెలమి వ్రాసి రతనిబొమ్మ; ♦ లలితభక్తి
మనసులందునఁ గాంచిన ♦ మాన్యుల యను
భవములనె విగ్రహములు నే♦ర్పఱుపఁ బడియె. 87

గీ. బొమ్మ కాధార మైనట్టి ♦ పురుషవర్యుఁ
డిలను గలఁ డని నమ్మఁడు ♦ మెట్లొ, యట్లె
ప్రతిమలకు మూల మైనట్టి ♦ పరమపూరు
షుండుఁ గలఁ డని నమ్మక ♦ ముండవలయు. 88

గీ. బొమ్మ సేవించుమాత్రన ♦ భూధవునకు
నెట్లు కోపంబు గదురదో, ♦ యట్లె రాదు
విశ్వవిభునకుఁ గోపము, ♦ విగ్రహములఁ
బెట్టి పూజించినంత నే ♦ వెఱ్ఱులార ! 89

ఆ. రాజయోగి యైన ♦ రామకృష్ణపరమ
హంసవరుఁడు విగ్ర ♦ హమును గొల్చెఁ
దొలుతఁ ; గాన నవ్వ♦వలదయ్య ! భక్తితోఁ
బ్రతిమఁ బూజసేయు ♦ వాని నెపుడు. 90

సీ. వేయేల పలుకఁగా? ♦ వినుఁడు విగ్రహములఁ
బూజసేసిన, మనం♦బున నె ధ్యాన
మును జేసినను, భక్తి♦పూర్ణఫలం బిచ్చె
ననుటకుఁ జిహ్నంబు ♦ లరసి పెద్ద
లివి యని చెప్పిరి—♦యెచ్చోట నెప్పుడు
భగవంతునామము ♦ల్వాడునో చెవుల,
బాష్పధారలు గాఱ♦వలయుఁ గన్నులనుండి
యత్యంత మచ్చోట♦నాక్షణంబ;
గీ. ముండ్లకై వడిఁ బులకలు ♦ పొడమవలయు;
వల్లకీతంత్రియట్లు మై ♦ వడఁకవలయు;
శ్రోత నిశ్చేష్టుఁ డై ధర ♦ సోలవలయు;
వాఁ డిఁక సమస్తకర్మము♦ల్వదలవచ్చు. 91

గీ. ప్రతిమలను భక్తిఁ గొల్వ లాభంబు గలుగు
ముక్తిపరమానవుల కని బోధపఱుప
నే కదా! యిట్లొనర్చె స ర్వేశ్వరుండు
భక్తి యవతార మైనవి శ్వంభరుండు. 92



క. ధన మడుగ సుతుల నడుగను;
బ్రణతుఁడ నై 'నీదుపాద పద్మములకు నా
మనము నట్టుము గట్టిగ'
నని వేఁడుదు; నట్లు చేయవా? శ్రీరామా! 93



శ్రీరామం.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయ భాగము.

### దశమాశ్వాసము.

చ. పదితల లున్న నేమి? మఱి ♦ బ్రహ్మసులోద్భవుఁ డైన నేమి? ప్రాఁ
జదువులఁ దర్కముఖ్యబహు ♦ శాస్త్రములందున "సార్వభౌమ" భీ
ప్రదతన్వైదుషీబిరుద ♦ రాజముఁ దాల్చిన నేమి? వైరి నీ
యెదుటను నిల్వఁజాలునె? యు ♦ హీనసుధీబలశాలి! రాఘవా! 1

ఉ. కావలివార లుండు రని ♦ కంబుగ ; భక్తిరసప్రపూర్ణుఁ డై
కోవెలలోని కేగు నిము; ♦ కోపముచే నట నున్నరక్షకుల్
చేవడి నేమిశిక్షలను ♦ జేయుదురో! సుకుమారు నంచుభ
క్తావళి భీతి వెన్కఁ జన ♦ నాతఁడు వోయినచాయఁ జెచ్చెరన్. 2

గీ. ఓజగన్నాథ! యంచుశీ ♦ ఘ్రుఁ డచటి
యాలయావనభటుల ల ♦ క్ష్యంబు సేయు
కేగె మూలవిగ్రహ మున్న ♦ యెడకు సరిగ
భక్తిపిహితాంగదివ్యస ♦ త్ప్రభలు వెలుఁగ. 3

క. చని యడుగునిలువునకుఁ దై
నునుపంబడి యున్నపీఠి ♦ నున్నతముగ ను

న్న, నిరీక్షణపర్వదశో
భనవిగ్రహ మరసి యరిగెఁ ♦ బరిరంభేచ్ఛన్. 4

ఆ. కౌఁగిలింపఁ బోయి ♦ కనకాంగుఁ డంతటఁ
బట్టలేనిభక్తి ♦ పరవశతను
మూర్ఛఁ జెంది వ్రాలెఁ ♦ బుడమిపై నఱకంగఁ
బడినచెట్టు నేలఁ ♦ బడినయట్లు. 5

ఆ. తమ్ము నరకుఁగొనక ♦ తప్పించుకొని పోయి
దేవుఁ జూచినట్టి ♦ దివ్యతేజుఁ
బట్టి కొట్టఁ గట్ట ♦ కట్టలుగా వచ్చి
రాలయమును గాచు ♦ నట్టివారు. 6

క. సన్యాసిని దండించుట
యన్యాయముఁ బావ మంచు ♦ ననుకొని, యంతన్
మన్యువునఁ బల్కి రీపురి
సన్యాసుల కేమికొదవ? ♦ చదువుఁ డటంచున్. 7

ఆ. స్వామిసన్నిధాన ♦ వర్తుల మామన
కంటె నధికు లెట్లు ♦ కావితాల్పు
బోడితలలవారు? ♦ పొదువుఁడు కొట్టుఁ డీ
గర్వి ననిరి కనులఁ ♦ గావు లెసఁగ. 8

సీ. అత్తఱి నావిగ్రహంబుచేరువ నొక్క-
యొద్దునఁ బొదువున ♦ నొప్పుపెద్ద
వయసుధరామర ♦ వర్యుఁ డుండె; నతండు
సోలి వ్రాలినమహా ♦ సుందరాంగు
నసమానలావణ్య ♦ హాటకదివ్యతే
జఃపుంజ మారసి, ♦ చక్షురంధ

కారం బెనసి ప్రేమ ♦ గదురఁ జిత్తంబున
శిష్టార్థ మటకు వ ♦ చ్చినభటతతిఁ
ఆ. జూచి మూఢులార! ♦ చూడుఁ డీసన్యాసిఁ
గొట్ట మీకుఁ జేతు ♦ లెట్లు వచ్చు;
నాఁగుఁ డాగుఁ; డీతఁ ♦ డలజగన్నాథుఁడో!
సురవరుండో! కాఁడు ♦ పురుషుఁ, డనియె. 9

వ. ఈభూసురుండు వేదవేదాంత న్యాయాదిసమస్తశాస్త్రంబులం దారితేఱిన మహావిద్వాంసుం డగువాసుదేవసార్వభౌముఁడు. తొలుత నవద్వీపంబుననే యుండువాఁడు. న్యాయశాస్త్రనిలయం బగు మిథిలానగరంబునందు నింతపండితుండు గానరాఁడు. తర్కంబున గండరగండఁ డగురఘునాథశిరోమణి యీతనికిశిష్యుండు. కాశీనివాసంబు పెక్కేండ్లు చేసి వేదవేదాంతవిద్యలు సభాష్యంబుగ సమగ్రంబుగ నభ్యసించి యందు నిండుపండితుం డయ్యె; నింక నితనికి సాటిమహావిద్వాంసుఁ డయి సన్యసించి కాశికాపురంబునందుండు ప్రకాశానందసరస్వతి యగు నేమోకాని మఱియొకఁడు లేఁ; డిట్టి పండితశిఖామణిఖ్యాతి వినియుత్కలదేశాధీశుం డగుప్రతాపరుద్రమహారాజు తనిన త్యాదరంబుతో శ్రీజగన్నాథంబునకు రప్పించి యచ్చట విపులం బగునొకపాఠశాల స్థాపించి సకలశాస్త్రంబుల, నందు ముఖ్యంబుగ, న్యాయమీమాంసాశాస్త్రంబుల వేనవేలు శిష్యులచే నధిగమింపఁ జేయుచుండెఁ; బెక్కురు సన్యాసులుసైత మీతనిపాదంబులకడ నుత్తరమీమాంసారహస్యంబులు గ్రహించి కృతార్థులై పోవుచుందురు. రాజును కీవాసుదేవసార్వభౌముండు గురువర్యుండై మంత్రుల కెక్కుడుగా నుండెఁ గాన నాతనిమాట జవదాఁట రాష్ట్రంబునం దెవ్వానికేని జంకుగా నుండు; నాలయా

ధికారులుగూడ నాతనియెడల రాజునొద్దకంటె నెక్కుడుభయ భక్తులతో మెలఁగుచుందురు. 10

సీ. శేముషియందునఁ ♦ జికిలిచేసినకత్తి,
పాండితీగర్వసం ♦ పత్తి మత్త
గజ, మహాంభావంపు ♦ గంభీరజలరాశి,
ప్రతిపక్షవిద్వత్కు ♦ రంగమహారి,
దశదిశావ్యాప్తవి ♦ ద్యాయశస్సాంద్రుండు,
ముకుళితభూపాల♦నికరకరుఁడు,
తతశాస్త్రనిగదిత ♦ ధర్మకర్మాచార
సంచయసంతతా ♦చరణచణుఁడు,

గీ. జ్ఞానమార్గావబోధవి ♦ ఖ్యాతకీర్తి,
యవని గౌరవ మెల్లఁ జూ ♦ఱాడువాఁడు,
భటుల నాఁకఁ బెట్టినసార్వ♦భౌమబిరుద
వహనపటువాసుదేవాఖ్య ♦ మహీసురుండు. 11

గీ. దయయు, గలవాఁడె కాని మా ♦ త్సర్య మెంతో
కలదు లోపల; నెంతటి ♦ గర్వియైన
నెదుటి కేతేర నెంచిన, ♦హృదయపీఠిఁ
జేతులను జేర్చి నతులను ♦జేయవలయు. 12

గీ. వాసుదేవునిదయను సం ♦ పాదనంబు
చేయఁ గోరినవా రెల్ల, ♦రాయనకడ
నతివినయభయభక్తుల ♦ నడఁగి మడఁగి
శిరము వంచుక చేమోడ్పు ♦ సేయవలయు. 13

క. కొన్నాళ్లు నవద్వీపము
న న్నిమి యీవిదురుకడనె ♦ న్యాయము చదివె

న్మృన్నయిన గుఱుతు పట్టుటె
పన్నుపడకపోయె మదము ♦ పైకొనుకతనన్. 14

క. అలవాటుచేతఁ గర్మం
బులు సేయుయశోభిలాషఁ ♦ బొరిద్దెల్లను; దా
నెలమి స్వరమార్థేచ్ఛను
జలుపఁడు, పాండిత్యగర్వ ♦ సంఛన్నుండై. 15

సీ. పటుపాండితీయుక్త ♦ భాష్యకలాపము
లాదరిసోపేతభో ♦ జనము లయ్యె,
నలపరిత,జ్ఞాపన♦య, నిగమ,నాదిసం
వాదంబు లాటలుఁ ♦ బాటలయ్యె,
సగుణనిర్గుణజీవ ♦ సదసద్వివేకాది
చర్చలు రస నాగరి ♦ చరములయ్యె,
ధర్మశాస్త్రనిగూఢ ♦ తమసర్వవిషయము
తెలుపంగఁ గరతలా ♦ మలక మయ్యె,

గీ. నీమహాపండితునకు; నీ ♦ యిల నతనికి
బాధఁ గలిగించునవి కనం ♦ బడవెచటను,
శాస్త్రమొప్పనియల్పప్ర ♦ సంగ మొండ
నుచిత మయినహేత్వాభాస♦మొండుఁ,దక్క. 16

గీ. ఇంత వైదుషి గలవాని ♦ కేమి పాప
మో! దృఢాస్తిక్యవిశ్వాస ♦ ములును భక్తి
లేవు; చచ్చినపిమ్మట ♦ నేవిధంపు
గతి తనకుఁ గల్గునో యది ♦ గాంచఁ డెపుడు. 17

ఉ. కాలమహాసముద్రమున ♦ గాంచఁగబిందువుమాడ్కి నుండువా
లోలపుజీవపుందమికి ♦ లోఁబడి మూఢతఁ బొరిఁకుల్లాడుచున్

వేలనుగూర్చి ఖ్యాతిఁ గని ♦ వేఱుతలంపులు వీడి యెప్పుడో
కాలునివాతఁ గూలునరు ♦ కంటెను బృథ్విని వెఱ్ఱియుండునే? 18

ఉ. ఉర్విని మూర్ఛవ్రాలి పడి ♦ యున్నమహోన్నతభర్మకాయుసా
పర్వణమంజుతాకలిత ♦ భాస్వరతేజు, శచీజు, వీడిపో
నోర్వక సార్వభౌముఁ,డెదో ♦ యొక్కవిలక్షణ మైనప్రేమలోఁ
బర్వఁగఁగాంచిశిష్యసమ ♦ వాయముఁబిల్చెను సంభ్రమించుచున్.

ఉ. అంతట వచ్చి రచ్చటికి ♦ నాతనిభ్రాతృలు; చెప్పెనైదుపీ
మంతుఁడు వాని వేగ నిజ ♦ మందిరమందునఁ బెట్టు మంచు; శ్రీ
కాంతునిఁ జేతుల న్గొనఁగఁ ♦ గాయముఁ దాఁకిరి; తాఁకుతోడనే
వింతగఁ బెద్దకేకలను ♦ బెట్టిరి శ్రీహరి యంచు నందఱున్. 20

గీ. హరిహరిధ్వానములతోడ ♦ నంద ఱతనిఁ
జేతులం గొని గురునింటఁ ♦ జేర్చి; రంత
వారిఁ బొండని సెలవిచ్చి ♦ వాసుదేవుఁ
డారయుచు నిమిమ్రోలను ♦ గూరుచుండె. 21

గీ. జీవచిహ్నంబు లేమి శ ♦ చీజుమేనఁ
గనమిఁ బండితుఁ డొకతూల ♦ ఖండము గొని
పెట్టె ముక్కరములకడఁ; ♦ బెట్టఁగానె
యది కదలి లోనఁ బ్రాణము ♦ న్నట్లు సూపె. 22

ఉ. తిన్నఁబడంగ గుండె, కడుఁ ♦ దీటికతోఁ గఱవాఱఁ గాంచె వి
ద్వన్నుతశాస్త్రవేత్త తన ♦ దాపున నున్నత్రిలోకవంద్యు, నే
త, న్నలినాయతాక్షు, దురి ♦ తప్రకరాంతకు,దివ్యరూపునిన్,
బెన్నిధిఁ గన్నపేదవలె ♦ విప్పినకన్నులు మూయకుండఁగన్. 23

సీ. ఎక్కడ నెంతగా ♦ నెట్లుండవలయునో
యట్లుండు సురుచిరాం ♦ గాళితోడ

మఱచినయట్లొప్పి ♦ మగవారిఁ గూడను
మరులు గొల్పెడుమోము ♦ మురువుతోడ
నర్ధనిమీలితా ♦ యతమనోహరదివ్య
రాజీవసదృశనే ♦ త్రములతోడఁ
బరిమళమిళితసు ♦ వర్ణంబునాఁ దావు
లొలయించునొఱపైన ♦ యొడలితోడ
గీ. శాంతియు సమాయభక్తియు ♦ స్వచ్ఛతయును
వత్సలత చిమ్ము లలితగూ ♦ పంబుతోడ
నచట నున్నట్టిసింహాస ♦ నానఁ గాంచి
పండితుం డుండె నానంద ♦ పరవశుఁ డయి. 24

మ. అలరాధాలలితాంగి కృష్ణునెడ న ♦ త్యంతానురాగంబు, మైఁ
గలయం బర్వఁగ,మున్నెలంగె ననున ♦ ద్గ్రంథోక్త వాక్యంబు ల
య్యలుగల్పించిన బెల్లిమాటలనునూ ♦ హం బొంది యున్నట్టిపు
ష్కలపాండిత్యయశస్కుఁడిప్పుడవి ని♦క్కంబంచు నెంచెన్మదిన్. 26

వ. ఎంచి యిట్లనుకొనియె.

సీ. జగమందుఁ గొందఱు ♦ సద్భక్తు లుండుట
నిజమని యిప్పుడకా ♦ నే నెఱిఁగితి;
విద్యాపవిత్రత ♦ వేదతుల్యగ్రంథ
విషయవిశ్వాసంబు ♦ వీడి చెడితి;
నవి వట్టినవి కల్ల ♦ లనరా;దనుట పాప
మని యిట నితఁడె సి♦ద్ధాంతపఱచు;
నింతభక్తియుఁ బ్రేమ ♦ వీక్షింపఁ బడినట్టి
వాని కాస్పద మైన ♦ వాఁడు లేఁడె?

ఆ. వాదిబుద్ధిబలముఁ ♦ బట్టివాదము గెల్చు;
దానికేమి? జయము ♦ దారి వేఱు,
సత్యపథము వేఱు, ♦ శాస్త్రపాండిత్యమా
త్రమున సత్యసుఖము ♦ రాదు రాదు. 27

ఆ. కలఁడు, కలఁడు, కలఁడు, ♦ కరుణాపయోరాశి
తండ్రి మంగళాంచి ♦ తగుణుఁ డొకఁడు;
లేనియెడల నింత ♦ మానితభక్తియుఁ
బ్రేమ మితనినావ ♦ రించు టెట్లు? 28

గీ. ఇతని కున్నభక్తిప్రేమ ♦ లితరులకును
గష్టకృషిచేయ లభ్యము ♦ ల్గావె? యెంత
కాల మే వృథ సేసితిఁ ♦ గట్ట! మంచి
వయసు వ్యర్థపువిద్యల ♦ పాలు సేసి. 29

ఉ. ఎంతయదృష్టవంతుఁడనొ ♦ యీయతివర్యుఁడు నాకుఁ జిక్కెఁ; దు
శ్చింతలు వోవఁ జూచి యిరుఁ ♦ జేతుల నీశుభకాయ మంటి, య
త్నింతు మహాత్ముఁ డైనయిత ♦ ని న్నొసలయించినశుద్ధచిత్తని
ష్క్రాంతరమేశభక్తిఁ గొనఁ ♦ జాలుదునేమొ యొకింత నేనునున్.

శా. నాసానాళము లంగుళీనికరవి ♦ న్యాసంబున న్మూసి, ని
శ్శ్వాసోచ్ఛ్వాసము లాఁపుయోగివరులు, ♦ న్శాస్త్రోక్తకర్మాళి న
త్యాసక్తి స్వచరించుకర్మఠులుఁ, గృ ♦ ష్ణానుగ్రహోద్భూతమా
నీసౌఖ్యంబు భుజింపఁజాలుదురె? వే ♦ యేండ్లట్లు గాసిల్లినన్. 31

ఆ. కాకి నక్క కథలె ♦ కా! భక్తిగాథ, లం
చెంచినాఁడ నయ్యొ! ♦ హీనమతిని;
భక్తిలక్షణములు ♦ వర్ణింపఁబడె నెట్లు
గ్రంథముల, నవె యిటుఁ ♦ గానిపించు. 32

సీ. వాసుదేవస్వస్రు ◆ భర్త, గోపీనాథ
పండితుం, డపు డత్త ◆ వారియింట
నుండె; గౌరాంగభ ◆ క్తుం డతం; డైనను
స్వామి యాయూరికి ◆ వచ్చె ననియు
గుడిలోన మూర్ఛను ◆ బడి తేఁబడెను దన
మఱఁదియింటి కనియు ◆ నెఱుఁగఁ డయ్యె;
నిఁకను నిత్యానందుఁ ◆ డితరభక్తులు వచ్చి
జరిగినదంతయు ◆ నెఱుకపడఁగ

గీ. సార్వభౌమునియింటికిఁ ◆ జనఁ దొడరిరి;
కాని లోపలికిం బోవఁ ◆ గలమొ లేమొ
యనెడుసందేహమున నుండి; ◆ రట్లు సేయ
సంయమీంద్రులుఁగూడను ◆ జంకువారె. 33

క. ఏపగిదిఁ జూచు టని మదిఁ
దాపం బొందుచును జనఁగ, ◆ దారి నగపడెన్
దాపయినిత్యాదులకుం
గోపీనాథుండు, భక్త ◆ కుంజరు లలరన్. 34

గీ. స్వామి యాలయమును జొచ్చు ◆ సమయమందె
పండితుఁడు వాసుదేవుఁ డం ◆ దుండుటయును,
సంశయాస్వస్థచిత్తులై ◆ చనెడువీర
లరయుటయును గోపీనాథు, ◆ నరుదుగాదె. 35

క. కనియావద్వృత్తాంతము
వినిచి రతని; కంత నతఁడు ◆ వేగమవారిన్
దనమఱఁదిదివ్యభవనం
బునకుం గొనిపోయె నిమిని ◆ బోడగాంచుటకై. 36

మ. చని, వారాద్విజవర్యుసద్మమున మూ ♦ ర్ఛన్వ్రాలియున్నట్టికాం
చనసంకాశశుభాంగుఁ, గట్టెదుటనా ♦ శ్చర్యంబుతోఁ బెద్దభ
క్తిని గూర్చున్నదిగంతచుంబితమహా ♦ కీర్తి, న్విలోకించి, నే
తను భక్త్యుత్కటకృష్ణగానములచే ♦ తన్దేర్ప యత్నింపఁగన్. 37

శా. శంకాభీతులు లేక భక్తులు హరి ♦ శ్రావ్యాఖ్యలం దండడిన్
బంకేజాక్షుశ్రవఃపుటంబు లదుర ♦ న్బల్క,న్విభుం డంతటన్
హుంకారం బొనరించి శ్రీహరిహరీ ♦ త్యుక్తు ల్విజృంభింప మో
దాంకూరప్రభలాననంబుపయి నా ♦ ట్యంబాడఁ బొందెన్సత్రుతిన్.

గీ. యతికి వందనములను గృ ♦ హస్థుఁ డొనరు
పంగవలెఁ గాన సాష్టాంగ ♦ పడియె మోప్రిల
వాసుదేవుఁడు; దీవించె ♦ వాసుదేవు
నండె యుండుత నీయాత్మ ♦ యంచు నిమియు. 39

వ. అంత సార్వభౌముం డిట్లనియె. 40

శా. ఆలస్యం బగుచున్న దోయతిమణీ! ♦ యంభోధికి న్నాదుశి
ష్యాళుల్గ్రాల్వఁగఁబోయి, యచ్చటనుస్నా ♦ నాదు ల్వడి న్జేసి, యీ
వేళ న్వ్యాజ నొనర్ప నిచ్చపడునీ ♦ విద్వాంసుగేహంబున
న్శ్రీలోలప్రతిమాన! భిక్షఁ గొని పీ ♦ నన్ధన్యుఁ గావింపవే? 41

వ. దానికి శ్రీచైతన్యస్వామి 'మంచి' దని, భక్తులతోఁగూడ సముద్ర
స్నానంబునకరుగుచుఁ, ద్రోవలోఁగపటమానుషవేషుండు భక్తులవ
లననంతవఱకుజరిగినయాత్మవృత్తాంతంబుసమస్తం బెఱింగి, యా
శ్చర్యం బంది నట్లగపడె; నింకఁ బండితాగారంబున. 42

ఆ. నిమి నెఱుంగనట్లు ♦ నేర్పున నటియింపఁ
గడఁగెఁ గాని బావ ♦ కడను జాల ;

వదన లక్షణములఁ ♦ బట్టి గోపీనాథు
గుట్టు నిట్టె తెలిసి ♦ కొనియె నతఁడు. 43

క. గోపీనాథా! యీ కన
కోపమతను భాసితుండు ♦ యువయతి యెవఁడో?
డాఁపక తెలుపుము; నా, సం
క్షేపంబుగ నెల్లకథను ♦ జెప్పె నతనితోఁ. 44

గీ. అంతలో స్నాతుఁడై నిమి ♦ యరుగుదెంచె;
వాసుదేవుండు సాఁగిల్లెఁ ♦ బరమపురుషు
నకు; నతఁడు తొంటిమాడ్కి నో ♦ నర్చె దీవ
నలు; పిదప సార్వభౌముండు ♦ వలికె నిట్లు. 45

సీ. నే నెఱింగితి స్వామి! ♦ నీయెల్లచరితంబు;
సంబంధ మున్నది ♦ చాల మనకు;
నీతాత యైనట్టి ♦ నీలాంబరుఁడు, మహే
శ్వరవిశారదుఁడు, మ ♦ జ్జనకుఁ, డొకటఁ
జదివిరి; మఱి నీదు ♦ జనకుఁ జానలజగ
న్నాథమిశ్రుం, డేను, ♦ నలిననేత్ర!
యైతిమి సుమి సహా ♦ ధ్యాయుల;మది గాక
పరమమైత్రిని మేము ♦ వఱలువార;

గీ. మన్నివిధముల నీవు నా ♦ కధికముగను
బ్రియుఁడ వౌదువు;సన్యాస ♦ విధుల నుంటి;
వందుచే వందనార్హుఁడ ♦ వౌదు;నాకు;
వీఁడు నీదాసుఁ డెంచుభా ♦ వించుకొనుము. 46

వ. అందులకుఁ జైతన్యస్వామి యిట్లనియె. 47

ఉ. ఈదినమందు నీవు గరు ♦ ణించి సహాయుఁడ వౌటచేతనే
కాదె! మనంగఁ గల్గితిఁ;వి ♦ [illegible]లోలితబుద్ధిఁ జేసి, మ
ర్యాదలు మీఱి, [illegible]ంగిత సంస్కృతి; జోగి నైతి; నీ
వాదున వీడకయ్య [illegible]బాలకు మౌఢ్యతమఃప్రభాకరా! 48

క. ఈమాత్రపులోపమునకు
భూమిసురప్రవర! నన్నుఁ ♦ బులుమానిసిఁ గా
నీమది నెంచక, పుత్ర
ప్రేమను రక్షింపవయ్యా! ♦ విద్వత్సింహా! 49

క. కొఱగానికొమరుఁ డుండినఁ,
దొఱఁగుదువే యతని?నయ్యో! ♦ దుర్గుణవర్గా
కరుఁడ నగునాకు లోకో
త్తర! బ్రహ్మజ్ఞానభిక్షు ♦ దయసేయఁ గదే! 50

క. ఎవఁ డొండు లేఁడు నాకీ
యవివేకికి; దొరకినాఁడ ♦ వపవర్గమహా
ప్రవిమలవిద్యాపూర్ణుం
డవు నాపుణ్యంబుచేత; ♦ ననుఁ గావఁగదే! 51

వ. ఈవినయవాక్యంబులు వాసుదేవుహతగర్వంబు మఱల రేఁప, న
తం డహంభావతిమిరాక్రాంతస్వాంతుం డై యీపైమిసమిసలబా
లుం డీపాటివాఁడే కదా! యనిలో నెంచియు, నతనిమధురదీనాలా
పంబులు వినమ్రవర్తనంబుం గాంచి కడు జాలిం జెంది యతనియె
డల నతిదయార్ద్రచిత్తుం డై యుండె నంత. 52

ఆ. భిక్షు ముగియువఱకు ♦ విశ్వంభరునికడ
నుండి, పిదప నతని ♦ నొక కుటీర

ఘునను బెట్టె, నద్ది ♦ తనపినతల్లిదే
యగుటచేత, ఖండి ♦ తారి, సూరి. 53

గీ. భావుకునితోడఁ బండిత ♦ వర్యుఁ డంత
భోజనము తృప్తిగాఁ జేసి ♦ ప్రోలితనదు
పాఠశాలకుఁ జనె; శాస్త్ర ♦ పాఠిపాళి
లేచి యొకటఁ జేతులుజమ ♦ లించి మ్రొక్కె. 54

వ. ఇద్దఱు సముచితాసనస్థు లైనపిమ్మట వాసుదేవసార్వభౌముండు
గోపీనాథుతో ని ట్లనియె. 55

శా. బావా! సంయమివైనమాత్రమున సం ♦ భావించిలోకంబు నం
దేవాఁ డెంతటిపండితుండును నిజ ♦ ప్రీంగౌరవాధిక్యము
ల్లోవన్ ద్రొక్కుట చెల్లునే? చెపుమ; యీ ♦ పోల్కిన్ బ్రవర్తింప, దు
ర్భావంబు ల్జనియించి వాని నురుగ ♦ ర్వచ్ఛన్నుని జ్జేయవే? 56

క. దేని నడంపఁగవలయునొ
దానినె పెంచుకొని చెడును ♦ దప్పక యతి; య
ద్దాన శాస్త్రనిగదిత
మానితధర్మములు తాఱు ♦ మా ఱగుఁజుమ్మీ. 57

సీ. సరె కాని, శ్రీకృష్ణ ♦ చైతన్యుఁ డటుకాఁ; డ
దేమి సౌందర్యమో! ♦ యేమి వినయ
మో! యేమి నవసుధా ♦ పాయసోపమసూక్తు
లో! కాని కనినంత ♦ లోన వాని
వలలోనఁ బడితిని; ♦ స్వాంత మచ్చటినుండి
మఱలించి నవరింపఁ ♦ దరముగాక
యున్నది; యిఁక గర్వ ♦ మన్నమాటయు లేదు;
యతి యయిపోవువ ♦ యస్సుఁ గాదు;

ఆ. యౌవనంబునందు ♦ మతిదేహదార్ఢ్యంబుఁ
గలిసి, యతికిఁ గాని ♦ కాపథములఁ
జొన్పి, చెఱపి, విషయ ♦ సుఖలోలుపునిఁ జేయు
వాని, నంచు దుఃఖ ♦ పడుదు నేను. 58

గీ. ఐన నీపాలఁ బడితి నం ♦ చనెను గాదె!
వాని కాచికొ లెపుడు రా ♦ నీను నేను;
వేదములు నేర్వవలయు ని ♦ ర్వేదపరుఁడు;
త్వరగ నవి వాని కే నిండఁ ♦ గఱపువాఁడ. 59

ఉ. భారతియొద్దఁ గైకొనెను ♦ వాఁడు యతిత్వముఁ; జాల దద్ది; యా
ధారిణి సుప్రసిద్ధు లగు ♦ ధన్యులు సేసెదుదండధారు లా
వారె యతుల్గణింపఁ; బెఱ ♦ వారలు గా;రది గాన, వెండి యా
సారసనేత్రుఁ డందవలెఁ ♦ జక్కఁగ నాశ్రమముల్ యథావిధిన్.

క. ఈయనుచితభాషణములు,
గాయంబులు సేసె మదినిఁ ♦ గర్ణంబుల, భ
ద్రాయితరూపుం డానా
రాయణుఁ డని నమ్ము శ్రోత, ♦ కమలాత్మునకున్. 61

గీ. వాసుదేవుండు నోటికి ♦ వచ్చినట్టు
లధికముగ వాఁగుచుండెన ♦ హంకృతిమెయిఁ;
బాప! మెఱుఁగఁడు తా నాడు ♦ ప్రతివచనము
శూలమ ట్లేఁచుచున్న దా ♦ శ్రోత ననుచు. 62

వ. అంతం గొంతవడి కాధోరణి నోరువలేక, దాని వారించుతలంపున నుదాసీనుఁడట్లు గోపీనాథుం డల్లన ని ట్లనియె. 63

చ. ఎవరికడన్యతిత్వము గ్ర ♦ హించిన నేమి యటంచు మిశ్రసం
భవుఁ డటు సేసె నేమొ?కొఱ ♦ మాలినబాహ్యవిభేదచింతలన్

దవులఁ గనీఁడు చిత్తము ను ♦ దారుఁడు గాన; నసారసంసృతిం
జవిగొని రోసి దాని విడి ♦ సంయమి యాట కవేల భావుకా? 64

క. పరిపూర్ణ విరాగుం డయి
యరిగినపుణ్యాత్ముఁ డెట్టి ♦ యతికులమునఁ దాఁ
జొరఁబడిన నేమి? యాతం
డరయం, డిది న్యాస, మద్ది ♦ యధికం, బంచుం. 65

వ. ఈప్రతివాదవాక్యంబుల కించుక కుపితుం డై సార్వభౌముం డిట్లనియె. 66

క. ఏమేమీ! నేఁ బల్కిన
యీమాటలు పొల్లుమాట ♦ లే! యతిపదవీ
కాముం, డది యర్థ్యంనికడ
నేమంబునఁ గొంట నెట్టి ♦ నియతియె బావా! 67

వ. అందులకు గోపీనాథుం డిట్లనియె. 68

ఆ. అట్టివిషయములను ♦ బట్టుదలను బూను
టనుచితంబు గాదె? ♦ యభినివేశ
మల్పమైన వాని ♦ యం దుంట, నిబిడదు
ర్గర్వతిమిరసూచ ♦ కంబు సుమ్ము. 69

వ. వాసుదేవుం డంతఁ గర్వమా? గర్వమన నేమియో యెఱుం[illegible]
యన గోపీనాథుం డిట్లనియె. 70

ఉ. చొచ్చిన పుంతలగ్గని త్రి ♦ శుద్ధిగ సమ్మ్రచరించువానికిం
బిచ్చిపరిజాపరిసంగములు ♦ పీనుల కెక్కువు; దూషణావళు[illegible]
వచ్చిన మేలు; సంస్తుతులు ♦ వచ్చిన నంతకు మేలు; [illegible]
నొచ్చి పరిమోద మందెడుజ ♦ నుం, డవివేకి యటంచు [illegible]

వ. సార్వభౌముం డిట్లనియె. 72

చ. అటులయిన స్వేచ్ఛముగ ♦ నందఱు నుండఁగవచ్చునయ్య! యెం
తటిపలుకాడినా? వెటులు ♦ తప్పులు నొప్పులెఱుంగవచ్చు ను
త్కటజనవాక్యపూలమునఁ ♦ గాక? స్వబుద్ధినిబట్టి పోవుచే
పటుతరగర్వసూచకము ♦ బాగుగ నెమ్మది నెంచి చూడుమా! 73

క. అందఱు మెప్పను గౌరవ
ముం దోఁచికొనంగఁగాదె ♦ భూప విపశ్చి
ద్వందిత ఘనపాండితి నే
నందితి, నన్యులకశక్య ♦ మౌశాస్త్రములన్? 74

క. లోకాభిప్రాయభయము
లేకుండఁగ జనులు మనుట ♦ లెన్న యయినచోఁ,
గాకులపూఁకలకును మన,
కేకరణిని భేదముండు ♦ నిలపైఁ జెపుమా! 75

గీ. వేయి చెప్పుము పెద్దత ♦ ప్పిదము సేసెఁ
జిన్నతనమున మతిలేమిఁ ♦ జేసి మిశ్రి
సుతుఁ; డతఁడు భారతీజాతి ♦ యతిని వేఁడి
యాశ్రమముఁ గొంటయనుచిత ♦ మనుచితంబు. 76

శా. దాఁప న్జూచెను వాసుదేవుకడఁ జై ♦ తన్యాత్మసంబంధమున్
గోపీనాథుఁడు; కానివానిసమద ♦ క్షుద్రప్రలాపోత్కరా
టోపంబు న్సహియింపలేమిఁ, గనుఁబా ♦ టుల్నిప్పుకల్గ్రక్కఁగాఁ,
గోపాకంపితనిస్వనంబులను, సం ♦ కోచింపకిట్లాడెఁదాన్. 77

ఉ. పండితసార్వభౌమ! యొక ♦ ప్రక్కను బెట్టుము నీదుపాండితిన్;
జండకరోరుతేజునిప్ర ♦ చారము నీ వెఱుఁగంగఁజాల; వీ
శుండగుమిశ్రసూనునకు ♦ నుంతయు నక్కఱలేదు దుర్మదాం
ధుండయి విఱ్ఱవీఁగునొక ♦ తూఁటరి నెయ్యముఁ, బ్రాపు, నెన్నఁడున్.

క. జలజాక్షుఁ డెవఁడొ నీకుం
దెలియమి నిటుకాఱు లఱచి ♦ తివి; శ్రీహరియే
వెలసె నరాకృతి నిటు లని
తెలియఁగలవు ముందుముందు ♦ దృష్టుఁడ! నీవే. 79

క. జ్ఞానామృతరసవాపికి
జ్ఞానము బోధింతె నీవు? ♦ సర్వామ్నాయ
స్థానంబీయువసం యమి;
వానికి వేదములు కఱపు ♦ వాఁడవె వెఱ్ఱీ? 80

వ. ఇట్లాడలుమఱచి వ్యాఘ్రంబున కెదురు దిరిగి యఱచువృషభంబు చందంబున నిర్భయుండై పండితశార్దూలంబు నోనాడినగోపీనాథు దెస నిశ్చేష్టులై చూచి చూచి, గురుగౌరవభంగప్రభూతక్రోధమాత్సర్యాతిరేకంబున శిష్యులందఱు లేచి యొక్కుమ్మడివానిం జుట్టుముట్టి పరిహాసవచనంబులు పెక్కులాడినపిదప, నందొక్కండు ముందునకు వచ్చి యిట్లనియె. 81

సీ. సప్రమాణంబుగా ♦ జరిగింపవలె వాద;
మిదియేమి వింతలా ♦ డెదవు నీవు?
నిగమనస్థాపక ♦ నియమము ల్గనరావు;
తెలియంగఁ జెప్పుప్ర ♦ తిజ్ఞ యిట నె
దియొ? యుదాహరణోప ♦ నయములెవ్వియొ? పండి
తాగ్రణి! యపుడు సి ♦ ద్ధాంతపడునొ,
లేదొ, చూతము నీదు ♦ వాదము; నోటికి
వచ్చినయట్టులు ♦ వదరెదేల?

ఆ. పంచభూతమయుఁడు ♦ పరమేశ్వరుండైన,
మేము నీవు నట్లు ♦ గామె? చెప్పు;

వట్టిమూర్ఖులకడఁ ♦ బల్కెడుమాటలు
శాస్త్రవేత్తలకడఁ ♦ జనునె పలుక? 82

వ. అని యుపచ్ఛేదకోద్దండపాండితీచండు లగుసార్వభౌమశిష్యులకుం బ్రత్యుత్తరంబు సెప్పనేరక, తప్పనియొప్పుకొని క్షమింపుఁడని య నుటకు నిష్టపడక, దురహంకారభూయిష్ఠులై యున్నశిష్యులతోనే మియునుడువక, సార్వభౌమువంక చూచి, గోపీనాథుండిట్లనియె. 83

సీ. బావ! నీ వెవ్వానిఁ ♦ బడుచుసన్యాసియే!
యంచు నిందించితో, ♦ యతనియెడల
జాగరూకత నీవు ♦ సంచరింపఁగవలె
నని యిట్టులంటిఁగా, ♦ కన్యముగను
భావింప; కిది విను; ♦ పతితపావనుఁ డైన
యామంజులాంగుఁ డ ♦ బ్జాయతాక్షుఁ
డొకయువమాత్రుండు ♦ నొకనరమాత్రుండుఁ
గాఁడు; సృష్టికిఁ బెద్ద♦వాఁడు; సర్వ
ఆ. దృశ్యచింత్యవస్తు ♦ దివ్యదయామయ
మహితపిత; యెఱుఁగుదు ♦ మదిని నేను;
నీవెఱుంగ వింక; ♦ నీవుఁగూడఁ, గొలంది
కాలమునను దెలియఁ ♦ గలవు నిజము. 84

ఆ. వెఱ్ఱివాఁడఁగాను, ♦ విద్వాంసుఁడ నొకింత;
కారణంబు లేక ♦ కలుగ దిట్టి
నమ్మకంబు నాకు; ♦ సరలక్షణాతీత
మైనగుణము లతని ♦ యందుఁగలవు. 85

క. గోపీనాథుఁ డు పండితుఁ
డేపో! నాయ్యంతసూరి ♦ యే? యనిదుర్గ

ర్వోపేతుఁ డయి తలంచెడు
నాపండితసార్వభౌముఁ ♦ డంతయు వినియెన్. 86

మ. వినిలోలోపల నవ్వుకొంచు మఱిఁది ♦ న్విద్వాంసుశిష్యాళిమో
లను హాస్యం బవమానము న్దలుపుట ♦ ల్పత్వం బవిద్వత్ప్రవ
ర్తన మౌనంచుఁదలంచిశిష్యులను గు ♦ ర్వద్ప్రేక్షల న్జూచిపొం
డని గద్దించి విపశ్చిదుద్ధ మనెని ♦ ట్లత్యంతమర్యాదతోన్. 87

సీ. బావ! నైయాయిక ♦ ప్రవరు లెప్పుడునిప్ర
మాణనిర్యుక్తికా ♦ మాన్యవచన
మంగీకరింప;రిం ♦ కందులో వారమే
మేమును గాన, మీ ♦ స్వామి లోక
పిత,దేవుఁ డని నమ్మ ♦ వీలులే దందుల
కుచితమౌ కారణ ♦ మున్నఁగాక;
యవతార మీకలి ♦ యందుఁ గల్గునటంచు
శ్రుతుల నేశాస్త్రసం ♦ తతుల సేనిఁ

గీ. జెప్పఁబడియున్నయట్లు సూ ♦ చింతువేని,
యితనిపూర్వపువృత్తాంత ♦ మెల్ల నరయ
వచ్చు; నట్టిదికూడఁ గ ♦ న్పడ; దిఁకతఁడు
శౌరి యని నీవు నమ్మనా ♦ ధార మేది? 88

క. అని సార్వభౌముఁ డింతయు
మనము న్నొవ్వంగనీక ♦ మాటాడినఁ, ద
ద్వినయయుతనిశితవాక్కుల
విని గోపీనాథుఁ డిటు త ♦ పించె న్మిగులన్. 89

ఉ. వాదమునందు మీని గెలు ♦ వంగలవాఁ డిల లేఁడు; బంధుమ
ర్యాదను నమ్రసూక్తుల నె ♦ సంతియ; లోపల నైదుషీమహా

నాగ్రహము పూర్తిగాఁ గలదు; ♦ మాటల వీని జయింపఁజాల; నీ
గ్గాదయ నక్షమింపు మని ♦ యాచనచేయుట కేమి సేయుదుర్.

వ. అని తలపోసి తలపోసి చివరకు వాసుదేవుతో నిట్లనియె. 91

సీ. ఎఱుఁగుదు నిన్ను నే ♦ నెదిరించి వాదింపఁ
దరముకా దని పండి ♦ తప్రకాండ
మా! "బుద్ధియుక్తుల ♦ మనుజుఁడు గనలేఁడు
భగవంతు, నతఁడు న ♦ ద్భక్తిచేత
మాత్రమే వేద్యుఁడౌ ♦ మహితసత్కృపఁ జూపి"
యని తెల్పుసుశ్లోక ♦ ము నొకమాఱు
జ్ఞప్తికిఁ దెచ్చికొ ♦ నంగ నేఁ బ్రార్థింతు;
శ్రీహరికరుణ వ ♦ ర్షించినపుడె

గీ. కనఁగలవు వాని; నందాఁకఁ ♦ గాంచలేవు
బావ! నీ వెంతయుద్దండ ♦ పండితుండ
వయిన, నాముద్దుఁబడుచు న ♦ న్యాసి కృష్ణుఁ
డీశుఁ డని యించుకేనియు ♦ నెఱుఁగలేవు. 92

వ. వాసుదేవుం డిట్లనియె. 93

మ. సరి డీకొంటివి నన్ను వాదమున; నీ ♦ సంభాషణంబెల్ల ను
త్త, రసాభాసపునిష్ప్రమాణపుటస ♦ త్యచ్ఛద్మవాక్యంబులం
చరయంగల్గితి; వీశుసత్కృపను నే ♦ సందంగలేదంటి; శ్రీ
వరుకారుణ్యము నీవు పొందితని బా ♦ వా! యెట్లు సాధింతువో?

క. పరిహాసవచనముల కెద
యెరిసె మిగులఁ; గాని యాతఁ ♦ డేమియుఁ బ్రత్యు
త్తర మీయ లేక, యొకచి
త్తరువువలె న్నిలిచెఁ గొంత ♦ తడవావఱకున్. 95

వ. అంతఁ గొంత తెలివిచేసికొని ధైర్యంబు దెచ్చికొని గోపీనాథుం డిట్లనియె. 96

క. నైయాయికావతంసుం
డైయెసఁగెడుసూరితోడ ♦ యాపేక్షను నేఁ
జేయం జొచ్చితి వాదము;
నాయట్టివివేకహీన ♦ నరుఁ డిలఁ గలఁడే? 97

వ. ఐన నిది వినుము. 98

ఉ. అంచితపాండితీమహిమ ♦ నాకసము న్మురిఁ గాన కుద్ధతిన్
మించి మదాంధత న్దిరుగు ♦ మేటివి యైనను, నన్ను మెప్పడో
వంచి శిరంబు నమ్రితను, ♦ వానిని నావలెఁ గృష్ణుఁ డంచు సే
వించెదు శిష్యరూపమున, ♦ వేయి యనం బనిలేదు భావుకా. 99

గీ. వాసుదేవుండు నవ్వె, న ♦ వ్వానిశిష్యు
లందఱును గిచకొట్టిరి; రే ♦ నయ్యొ! యేల
ప్రభునిభక్తునిగా బయ ♦ ల్పడితి వంచు
నుమ్మలించె గోపీనాథుఁ ♦ డుడికియుడికి. 100

వ. అంత వాసుదేవుం డిట్లనియె. 101

గీ. కావలయునేని యనువైన ♦ కాలమందు
ముందు దీనినిగూర్చి ♦ ముచ్చటింత;
మరిగి, కొనివత్తె "మీదేవు" ♦ నతని భక్త
గణము మనయింట రేపు భి ♦ క్షను గొనంగ. 102

క. దావాగ్నియట్లు కాల్చెను
యావద్దేహంబు నాతఁ ♦ డాలించిన "మీ
దేవుఁ" డనుహేళనపునుడి;
'యేవడువున నుత్తరంబు ♦ నీయం, డైనన్. 103

సీ. స్వామిఁ జూచి యతండు ♦ సరిగ జగన్నాథుఁ
డే! యంచుఁ బండితుం ♦ డెంచినాఁడు;
తులలేనిప్రేమంబు ♦ లలితభక్తియుఁ గాంచి
యుబ్బి యాశ్చర్యంబు ♦ నొందినాఁడు;
కటకటా! నేనింత ♦ కాలంబు వృథసేసి
తినని యుల్లమునఁ జిం ♦ తిల్లినాఁడు;
నాకుఁ గావలసిన ♦ దీకనకాంగున
ద్భక్తిలో నణువని ♦ తలచినాఁడు;
గీ. నిమి నవద్వీపమునఁ దన ♦ నెయ్యుఁడైన
యొక్కపండితుపట్టి, వే ♦ ఱొకఁడు గాఁ, డ
టంచు వినినంత, నంతమా ♦ య మయిపోయె;
నైన నాకర్షణముమాత్ర ♦ మట్టె యుండె. 104
ఉ. ఎక్కడ లేనియందము, న ♦ హీనవిరాగత, శాంతమూర్తియు,
న్జక్కనివాఙ్మృదుత్వము, వి ♦ నమ్రత, దైన్యము, నీవె యోసుధీ!
దిక్కఁక నాకటన్ననుడి, ♦ ధీరునిచిత్తమునుం గరంచుచుం
జొక్కఁగఁజేసెఁ; గానిపొడ ♦ చూపదు తొంటితితీర్ష యింతయుం.
క. పొరపడి గోపీనాథుం
డరవిందాక్షుగుణవితతి ♦ నధికముగా ని
త్తఱి నుతియించి విదురుకడ
హరియే యతఁ డంచుఁ జెప్పె; ♦ నావెన్వెంటన్. 106

క. గౌరాంగదర్శనంబున
మారిత మైనట్టిసూరి ♦ మదమాత్సర్య
క్రూరత్వాద్యవగుణతతి
పూరితజీవ మయి మఱల ♦ మూర్ధం బెత్తెన్. 107

ఆ. భక్తిరహితచిత్త ♦ పామరజనుల కీ
దురభిమాన, మీర్ష్య, ♦ దుష్టగర్వ
మును, సహజములె; నిమి ♦ వినుతిసేయుకొలంది
హెచ్చె నవ్వి సూరి ♦ హృదయమందు. 108

ఆ. బోధపఱుప నెపుడు ♦ ముందంజ వేయుదు
రంద ఱిలను; గాని ♦ యన్యులకడ
కేగి నేర్చికొనుట ♦ కెంతయు లజ్జింతు;
కనుఁడు మనుజులార! ♦ గర్వమహిమ. 109

క. వనజాక్షుఁడు దేవుఁడె యని
యనుగోపీనాథుఁ; డైన ♦ నామిశ్రసుతుం
డనుపమనమ్రిత నీలెం
కను జుమి యనుఁ బండితప్రి ♦ కాండము నెదుటన్. 110

వ. ఈ తెఱంగంతయుఁ గని వాసుదేవసార్వభౌముం డాత్మశిష్యులతో
నేకాంతంబుగ నిట్లు చెప్పుచుండు. 111

సీ. ఈబాలసన్యాసి ♦ యెంతో చక్కనిబుద్ధి
మంతుండు; ముం దింక ♦ మహితుఁ డగును;
గాని యెల్లప్పు డా ♦ కనకాంగుసన్నిధి
వర్తించు మూర్ఖులు ♦ వాని దైవ
మంచు ముఖస్తుతు ♦ లాచరించుచు మంచి
మాణిక్యమట్టిడిం ♦ భకుని జెఱుప
యత్నించుచున్నవా; ♦ రైన నాతఁడు యోగ్యుఁ
డగుటచే నింకఁ బా ♦ డగుట లేదు;

గీ. వానిపుణ్యంబుచేత నా ♦ పాలఁ బడియె;
మూఢసంస్తుతు లెల్లను ♦ బోవు నింక;

యతిపదోచితవేదవే ♦ దాంతశాస్త్ర
వేత్తఁ గాఁ జేసి, యతిని గా ♦ వింతు మఱల. 112

వ. ఇట్లు కృతనిశ్చయుం డై గోపీనాథుతోఁ బ్రసంగించినవెనుక శ్రీకృష్ణచైతన్యు నొక్కతఱిం గాంచి వాసుదేవసార్వభౌముం డిట్లనియె. 113

క. బాలక ! యుత్తమగుణములు
చాలఁగఁ గల; వైన నీకు ♦ సంయమి గాఁగన్
జాలదు వయ; సేఁబది యగు
నాలోపల సన్యసించు ♦ టనుచితము సుమా ! 114

వ. దాని కతివినయంబునం జేతులు దోయిలించుకొని చైతన్యస్వామి యి ట్లనియె. 115

చ. మతి చెడి నూత్నవేషరుచి♦మై గ్రహియించితి నాశ్రమంబు; నే
నతిచపలుండ, బాలకుఁడ,♦నజ్ఞుఁడఁ, గోవిదసింహ ! యెవ్వఁ డే
గతకృతికి న్విచారపడఁ ♦ గార్యము లే; దొకసారి యెట్టులో
యతి యయినట్టివాఁడెటుగృ♦హస్థుఁడు కాఁగలఁడయ్యక్రమ్మఱన్?

వ. వాసుదేవుం డి ట్లనియె. 117

క. భారతి గురువుగ నెందుల
కారసి కోరితివి బాల♦కా ! యుత్తము లౌ
సారస్వతులం దొకనిం
గోరక ? యాశ్రమము వెండి ♦ కొనవలెఁ గనుకన్. 118

వ. చైతన్యస్వామి యి ట్లనియె. 119

ఉ. పాలను ముంతలో నీరమున ♦ వైతువా ? పండితసార్వభౌమ ! నీ
పాలికి వచ్చినాఁడ గురు♦వర్యుఁడ వంచు; ననుగ్రహించి యా

ప్రోలికి నన్ను లాగినపరి♦భు ల్గల రిద్దఱు; నీ వొకండ, వా
నీలగిరీందరివాసి యగు ♦ నీరజనేత్రుఁడు కృష్ణుఁ డొక్కఁడున్.

క. మలమల సంసరణదవా
నలమునఁ బడి మాఁడినట్టి ♦ నను, దుష్టాత్మున్,
సలిలజనిభ భవదంఘ్రి
ర్జలచేఁ జల్లపడఁ జేసి ♦ బ్రతికింపఁగదే? 121

వ. ఈనమ్రవాక్యంబులకు సార్వభౌముం డెంతయో యుప్పొంగి చైతన్యస్వామికి మఱల సన్న్యాసం బిప్పించి నిజబహుశిష్యసమక్షంబునం జీవాట్లు పెట్టి యాత్మాధిక్యప్రకటనంబు గావించుకొనుతీవ్రదురహంభావంబున ని ట్లనియె. 122

క. సముచిత మానీయడఁకువ
నిమి! విను మది యేమొ కాని ♦ నిన్నుం గన నా
కమితాత్మజానురాగం
బు మది జ్జనియించుఁ బూర్ణ ♦ మోదకలిత మై. 123

శా. ఓ చైతన్య! దురంతదుర్జయము ల♦య్యో! యింద్రియంబు, ల్మహా
వైచక్షణ్యవయోదమంబులనె చం♦పంగల్గు నవ్వాని దా
పీఁచం బేగతి నీ వడంపఁగలవో ♦ వేదార్థపూతాపగా
వీచీక్షాళితచిత్తత న్గనక దు♦ర్వృత్తంపుబాల్యంబునన్? 124

క. అనుదినవేదాధ్యయనముఁ
బొనరుపవలె; నింతకంటెఁ ♦ బూతతరం బౌ
పని లేదు సన్యసించిన
మనుజున కీయిలను; నమ్ము♦మా! భర్మాంగా! 125

ఆ. నేను జూడ లేదు ♦ కాని, చెప్పిరి నాకు
క్షోణి నాడి పాడి ♦ సోలు దంచు;

యతికిఁ గూడ వట్టి ♦ యవివేకకృత్యముల్;
గాన వీడవలయు ♦ వాని వేగ. 126

క. పుత్త్రుఁడిమ్మెదౌర తల పై
కెత్తక కన్నులను మూసి♦యెంతో యడఁకువన్
'జిత్త' మనుమాటదక్క మ
ఱుత్త్రర మెయ్యది యొసంగఁ, ♦ డూఁకొని యెల్లన్. 127

శా. ఈపాండిత్యము లెక్క, రజ్జులు, ననా♦దృత్యార్భటంబు, ల్భుభ
వ్యాపృత్యంచితరూపమిశ్రిసుతశి♦ష్యశ్రేణి కెంతో మన
స్తాపంబుం గలిగించి యోరెమును ని♦ద్రిన్బాపె; నిం కందులో
గోపీనాథునవస్థ యిట్టిదని వా♦క్రువ్వంగఁ గష్టం బగున్. 128

క. ఉరుమదగర్వం డగుతన
మఱఁది న్నవరించి భక్తి ♦ మార్గమునందున్
జొరఁబెట్టుదు నని వర మీ
శ్వరుఁ డిచ్చెదుదాఁకఁ దిండి ♦ వర్జింతు ననెన్. 129

వ. ఇట్టిశపథంబు వట్టి యుండియుండి వాసుదేవనిర్ణీతం బై గౌరాం
గునకు వాసంబుగా నీఁబడినచిన్నయింటి కొక్కతఱి నేగి యట
భక్తులతోఁ గూరుచుండినస్వామిం గాంచి నమస్కరించి గోపీనా
థుం డి ట్లనియె. 130

క. దోషజ్ఞవరుఁడు విద్యా
భూషణుఁ డౌసార్వభౌమ ♦ భూసురుఁడు మిమున్
బోషించి దిద్ది జ్ఞానో
న్మేషము జేయునఁట! తా న♦మేయప్రేమన్. 131

వ. ఈమాట తమతో మనవిసేయుట కెంతయు సంతసిల్లుచున్నాఁడ
నని పరిహాసగర్భితవాక్యంబులుగాఁ బల్కిన, నిష్కపటశుద్ధసత్వ

స్వరూపుం డగుగౌరాంగుం డది యింతయు నెఱింగినట్లు కానం
బడక కృతజ్ఞతాసూచకం బగువచనంబుతో ని ట్లనియె. 132

క. న న్నంతధన్యుఁ జేయఁగ
నున్నాఁ డాపండితుఁడు మ♦హోదారుఁడు! మీ
కున్నట్టిబాంధవంబున
న న్నిటు మన్నించు; నీకు ♦ నావందనముల్. 133

వ. స్వామికోపంబు రేఁపనెంచి పల్కినగోపీనాథున కీశాంతవచనంబు
లించుకయు రుచింపమి నతండు వెండియు ని ట్లనియె. 134

ఆ. పడుచువాఁడ వౌటఁ ♦ బారాశరివ్రీత
భంగ మౌ నటంచు, ♦ బావ భయము
పడెడుఁ; గాని నిన్నుఁ ♦ బదివేలకనులతోఁ
గాంచి పొంగుచునఁట య♦ఖండతేజ! 135

వ. చైతన్యస్వామి యి ట్లనియె. 136

క. ఎంతదయారసపూర్ణ
స్వాంతుండో! సూరిసార్వ ♦ భౌముం! డీదు
ష్టాంతఃకరణునిఁ బ్రోవఁగ
నంతటిపరహితపరుండు, ♦ నములుఁడె, వలయుఁ. 137

వ. గోపీనాథుం డి ట్లనియె. 138

ఆ. అదియుఁగాక నీకు ♦ నామ్నాయజాలంబు
సెప్పి వెండి సన్య♦సింపఁ జేయు;
మఱియు భక్తినృత్య ♦ హరికీర్తనంబు ల
నుచితములఁట! వాని ♦ నుడుగవలయు. 139

వ. మాయామలవకలంకరహితచిత్తుం డగుగౌరాంగుం డీమాటలకు
నివ్వెఱపడి చూచుచుండ, ముకుందుం డడ్డపడి యి ట్లనియె. 140

ఆ. ఇంతగాథ యేల? ♦ యిందీవరాక్ష! నే
నొక్కముక్కతోడ ♦ నున్నయంత
విన్నవింతు; నీర ♦ మన్నంబు మానుక
వాడి వాడి యున్న♦ వాఁ డితండు. 141

వ. గోపీనాథుం డుపవసించు టేలయని యాశ్చర్యంబుతో స్వామి పృచ్ఛింప ముకుందుం డి ట్లనియె. 142

ఉ. దగ్గఱబందు గానితని ♦ దగ్గఱ, మత్త్రత, నెన్ని యెన్నియో
పగ్గెలు నెగ్గులు న్బలికి, ♦ పావనమూర్తిని నిన్ను, గర్వియై,
సిగ్గుఁ దొఱంగి, దూషణము♦ చేసినవాఁడఁట పండితాధముం;
డగ్గల మైనదుఃఖమున ♦ నందున కీతఁడు మానె నన్నముల్. 143

క. ఆమోటుమాటలు, విషము
ప్రామినయాశుగములట్లు ♦ పాప! మితనిస
త్కోమలహృదయముఁ దూఱి దు
రామయబాధలను బెట్టు♦ నఁట భర్మాంగా! 144

వ. అంత గౌరాంగుం డామాటల కడ్డము వచ్చి యి ట్లనియె. 145

ఉ. ఇంతటిబాధ నొందుటకు ♦ నేమికతంబొ యెఱుంగ; నిర్మల
స్వాంతతతోడనే పలుక♦ వచ్చును బండితుఁ డట్లు, భేద మిం
కంతయొ యింతయో ప్రజల♦ యాశయమందున నెప్పు డుండు, నీ
వింత విషాదము న్విడిగ ♦ వీడి సుఖంబుగ నుండఁగూడదే? 146

క. పడుచుఁదనపుఁ గ్రొవ్వునఁ జెడి
యిడుమపడెడుజనులఁ జూచి, ♦ యెంతయుదయతో,
నుడివె నటుసార్వభౌముం;
డుడుకుదురె వివేకు లట్టి ♦ సూక్తులచేతన్. 147

ఆ. నేను బడుచువాఁడ ♦ నే కదా! సఖులార!
పడుచువాండ్రు తఱచు ♦ పాడగుటయు
నెఱుకపడును గాదె? ♦ యింక మీ కెందుల
కామహాత్మ్రుమీఁద ♦ నాగ్రహంబు? 148

క. ఉన్నది యున్నట్టులు ప
ల్కు న్నరసత్తముఁడు; దాని♦కి న్గినియుదురే?
తిన్నఁగ నాపండితు నెఱుఁ
గన్నేరక యందు రిట్లు ♦ కట్టా! మీరల్. 149

వ. ముకుందుం డి ట్లనియె. 150

క. నిందాస్తోత్రంబుల నీ
ఢ్యందమున కొంకింతయేని ♦ డిల్లపడుట, యా
నందంబున నుప్పొంగుట,
యుం దొడరవు, సత్త్వగుణమ♦హోదధి వగుటన్. 151

శా. మన్యుత్రాసవిమోహగర్వదురహం♦భావాదు, లబ్జాక్ష! సా
మాన్యంబు ల్గద! మామనుష్యులకుఁ; జం♦పన్జాల మవ్వాని; ని
న్నన్యు ల్దూఱిన నోర్వలేక యితఁ "డా♦హారంబు వర్జింతుఁ జై
తన్యుం డాబుధుఁ బ్రోచుదాఁక" నని పం♦తం బూనె దేవర్షభా!

క. నిపుణత గోపీనాథున
కపమృత్యుభయంబుఁ బాపి ♦ యన్న మిడుటకున్,
గృప నూపి కృష్ణభక్తిఁ గ
అపవలె నాపండితునకు ♦ రాజీవాక్షా! 153

వ. దానికిఁ జైతన్యుం డి ట్లనియె. 154

సీ. మిత్రులారా! మీకు ♦ మిక్కిలె మాధ్యంబు,
పండితువర్తనం ♦ బుండవలసి

నట్టులే యున్నది; యతఁడుగా కోరుఁ డౌన
నరులకర్హుండు డైన గురువరుండు?
సర్వసర్వంసహా స్థలి నావిబుధుద్రోల
నిలువఁ గలట్టిపండితుఁడు గలఁడె?
యేచి గోపీనాథుఁడే, వాని కధికుఁడ
నో, సాటియో, యని యురకరజ్జు
గీ. లాడెఁ గాఁబోలు; దానిచే నంతపండి
తుండు గోపించి యీయల్పు దూఱి మీకు
హృదయతాపంబు గావించు టేమి వింత?
యద్ది యుచితంబు, సహజంబు, నాప్తులార! 155
వ. ఈమాటలకు జలజలరాలుకన్నీళ్లతో గోపీనాథుం డిట్లనియె. 156
శా. దేవా! మాయలు వల్కి మోసమునొనర్తే? గొప్పవిద్వాంసుఁడే
కావచ్చు న్బుధసార్వభౌముఁ; డయిన న్గర్వంబు, నాస్తిక్యదు
ర్భావంబు ల్మది మెండుగాఁ గలవు; దుర్భాషాళి నిర్దూఱె; నా
బావ న్పాపవిముక్తుఁ జేసి కరుణ న్బాలింపు పాపాంతకా! 157
క. నిను నిందించినదుష్టుఁడు
మనఁగలఁడే యిచట నచట? మడియును గా; కా
తని నీవు గావవే, భూ
జనము న్వాడి నేఁడో ఱేపో చచ్చెదఁ జుమ్మా. 158
వ. అని యతిదైన్యవ్యాకులచిత్తుండై నేల వ్రాలి శ్రీచైతన్యస్వామి పాదపద్మంబులు రెండునుం బట్టుకొని యున్నంత నాజగద్రక్షకుండు మందహాససుందరవదనారవిందంబుతో నల్లన నిట్లనియె.
మ. విదితశ్రీహరిభక్తవర్యుఁడవు గోపీనాథ! కన్నీళ్లఁ, బ్రే
మదయాపూర్ణనదంతరంగమున, ధీమన్మాళి రక్షింపఁ గో

రెదు; కృష్ణుండు విడండు భక్తుని గృపా♦ర్థి; నర్క్షితుం డౌట త
ప్పదు నీబావ; యతండుకావఁబడెఁబా♦పధ్వాంతమార్తండుచేన్.

క. తను శుద్ధచిత్తముస, నొ
క్కని కుపకారంబు సేయు♦కాంక్షం, బ్రార్థిం
చినవరు నొప్పరికింపఁడు
వనజాక్షుఁడు; వానిలెంక♦వలె వర్తించున్. 161

చ. పలుకుట యాచరించుటయ! ♦ వల్లభుఁ డంచు నపారమోదవి
హ్వాలు లయి భక్తు లందఱును♦బాడిరిశ్రీహరి! కృష్ణ! యంచు; స
త్కులమణిగర్వ మింక నడఁ♦గు న్గద! యంచుమఱందిపొంగి, తాఁ
గలఁకువపెట్టి యింతయు వి♦కారము నొందఁగనీఁడు చిత్తమున్.

గీ. కీడుపడక చలింపక ♦ కేరుచుండు
మఱఁదిఁ గని వాసుదేవుండు ♦ సరసిజాక్షు
హేళనము దూషణమును గా♦వించు చుండె
మునుపటికి హెచ్చుగా వారి♦మొగమునెదుట. 163

వ. ఇట్లుండ నొక్కనాఁడు సార్వభౌముండు శ్రీచైతన్యస్వామిం గాంచి నిజాధిక్యపాండిత్యగర్వంబు లుట్టిపడఁ దనశిష్యప్రశిష్యుం డగునొకసామాన్యబాలకుతో నట్లిట్లనియె. 164

గీ. కోతిచేష్టలు మానుమా ♦ కుఱ్ఱ! యతికిఁ
గేవలానర్హములు నృత్య ♦ గీతకలన;
లభ్యసింపంగవలయు ని♦త్యమును వేద;
మనుదినం బేను జదువుదు ♦ నందుఁగొంత. 165

గీ. ఉజ్జ్వలాంగుఁడు సముద్రిఁ డై ♦ యూరకున్న
కొలఁది, సార్వభౌముఁడు నిక్కి ♦ కూయఁ దొడఁగెఁ;

గడుసమీపపుఁదనయధో ♦ గతిని గనక
యాడునేతాముసవ్వలి ♦ యుగ్రిమట్లు. 166

వ. అంతఁ జైతన్యస్వామి బద్ధాంజలి యై యిట్లనియె. 167

ఉ. నమ్మితి నిన్నె కృష్ణకుల ♦ నాథ! జడుండను; విద్య సున్న; ప్రే
మ మ్మిటు సూపుచుంటివి కు ♦ మారునిపైవలె వీనిమీఁద; నే
నెమ్మెయిఁ దీర్చుకోఁగలనో ♦ యింతటినీఋణ; మీవె నాకు స
ర్వమ్ము నను; వీని, సంసరణ ♦ వార్ధినిమగ్నుని, లేవనెత్తుమా. 168

వ. వాసుదేవుం డిట్లనియె. 169

గీ. మంచివాఁడవు; హరి కరు ♦ ణించి నీకు
శ్రేయము ల్సేయు బాలకా! ♦ శీఘ్రముగను;
మనము కోవెలఁ బ్రతిసాయ ♦ మునను గలిసి
చదువుదము జేపుమొదలు ప్రాఁ ♦ జదువు లెల్ల. 170

వ. నిశ్చయించుకొనినట్ల మఱునటినాఁ డాలయంబున నుభయులుం
గూడిరి. సార్వభౌముండు వేదగ్రంథంబు తెఱచి చదువ నారంభిం
చె; నొకగంటవఱకుఁ జదివి పుస్తకంబుమూసి కొంతసేపుండిమరలఁ
జదివెఁ; జైతన్యుండు వినయంబుతో శ్రవణకృత్యంబు నెఱపెఁ;
గాని యేమియుం బలుకఁడయ్యె; నిట్లు ప్రథమదివసంబు గడచె.
రెండవనాఁడుకూడ విద్వాంసుండు చదువ, గౌరాంగుండు మిన్నక
యాలించుచుండె; నొకటిరెండుశ్రుతిభాగంబులు పఠించుటయు న
ర్థంబు సెప్పుటయు ముగిసెఁ; దొలినాఁడువలెనే యీదినంబునుం గ
డచెఁ; నిట్లాఱుదినంబులు గతించె; నంతవాసుదేవసార్వభౌముండు
శ్రీగౌరాంగదేవుచిత్రమూకత్వంబునకుఁ గతం బెఱుంగక, యారే
యిట్లు తలపోయం దొడంగె. 171

సీ. ఏమి యీవింత? యా ♦ లించి యూరక యుండెఁ;
తెలిసెనే చదివిన ♦ ది? తెలిసినది
యని జ్ఞాన శోభితా ♦ స్యంబు సూచించెడు;
గ్రహియించెనే, నౌను ♦ గా దన కటు
లుండఁ గారణ మేమి? ♦ యొక్కటి విదితంబు
గాకుండునే? యర్థ ♦ కలన మదికి
సరిపడ కుండెనే? ♦ సత్య మన్యం బంచు
నెంచునో బాలకుం? ♦ డిదియె హేతు
గీ. వౌను మౌనంబునకు; ముఖ ♦ మందుఁ దోఁచె
స్పష్టముగ ననంగీకృతి ♦ చ్ఛాయ లప్పు
డప్పు;డిది యిట్టు లుండనీ ♦ యంగఁ దగదు;
బాలుగు శైలియే బయ ♦ ల్పడఁగవలయు. 172

వ. ఇట్లు కృతనిశ్చయుండై సార్వభౌముం డేడవదినంబున శ్రీజగన్నాథాలయంబునఁ బుస్తకంబు విప్పకమున్న గౌరాంగుం గాంచి యిట్లనియె. 173

క. ఆఱుదినంబులనుండియు
వారక కావింతు వేద ♦ పారాయణ; మీ
వూరక యుందువు పలుకక;
కారణ మేమో వచింపు ♦ గౌరాంగ! యనన్. 174

వ. గౌరాంగుం డిట్లనియె. 175

క. విను మని నా కోగురువర!
యొనరించితి వాజ్ఞ; యట్లె ♦ యొనరింతు మహో
వినయభయభక్తియుక్తిన్;
జననుత! నీమాట నేను ♦ జవదాఁటితినే? 176

వ. వాసుదేవుం డి ట్లనియె. 177

ఆ. నిజమెకాని తెలుపి ♦ నిముసంబు లేక యె
ట్లులచి చదివి యంత♦రార్థ మంత
నుడువఁగలను? నీవు ♦ నుడువుచుండినఁ గాక
యప్పు డప్పు తెలిసి ♦ నట్లు తెలుప. 178

వ. గౌరాంగప్రభుం డి ట్లనియె. 179

క. ఏయనువున నాదునభి
ప్రాయముఁ దెలుపంగనేర్తు? ♦ బల్కెద నిజముగ్
నీయొద్ద; నీదువాక్యము
దాయంబున బోధపడదు ♦ తండ్రి! యొకటియుగ్. 180

వ. వాసుదేవుం డి ట్లనియె. 181

సీ. కటకటా! యొకటియు ♦ గ్రహియింపఁ జాలవే?
యట్లైనఁ బ్రశ్నంబు ♦ లడుగ వేల?
వింతమానిసివి భా♦వింప గౌరాంగ! నీ;
వెవఁడేనిఁ దెలియని ♦ యెడల, మఱలఁ
బోధింపుఁ డని వేఁడు ♦ బోధకు; నటు గాక
మిన్నకుంటివి గ్రిక్కు ♦ మిక్కు మనక;
యెఱిఁగితి వనికాని ♦ యెఱుఁగ లే దనికాని
యెవ్వఁడే నట్లైన ♦ నెఱుఁగఁ గలఁడె?

ఆ. నీదుబుద్ధి చాల ♦ నిశితమైనది యను
కొంటి నింతవఱకుఁ ♦ గుఱ్ఱవాఁడ!
యేఱునాళ్లచర్య ♦ లారయ, నాయాశ
యంబు లెల్లఁ దప్పు ♦ లంచుఁ దోఁచు. 182

వ. గౌరాంగుం డి ట్లనియె. 183

జగదేకవంద్య! చదివిన
నిగమము మూలంబు తెలిసె ♦ నిస్సందేహం
బుగ; గాని వ్యాఖ్య యేమో
యగాధగాథవలెఁ దోఁచు ♦ నయ్యా! మదికిన్. 184

వ. వినయపూర్వంబు లయ్యు నపూర్వంబులు విపరీతంబులు నగునీ
వాక్యంబు లాలకించి పండితుండు వెఱఁగుపడి యి ట్లనియె. 185

క. తెలిసినది వేదమూలము,
తెలియంగాఁబడఁగ లేదు ♦ దివ్యవ్యాఖ్యా
సులభలలితోక్తు, లనియా
పలికెదు? చైతన్య! మేఁక ♦ వన్నియదీప్తి! 186

వ. దానికిఁ జైతన్యుం డి ట్లనియె. 187

గీ. అరఁటిపం డొలిచి కరము ♦ లందుఁ బెట్టి
నట్టు వేదమూలము స్పష్ట ♦ మయ్యెఁ; గాని
విఱిచి వికృతంబు చేసి రో ♦ విబుధవర్య!
దాని, వ్యాఖ్యను వ్రాసిన ♦ తండ్రు లెవరొ. 188

వ. పరివ్రాజకశిరోమణి యగుశ్రీమచ్ఛంకరాచార్యు భాష్యంబును,
నిరుపమానమనీషావైదుషీప్రాప్తానన్యలభ్య ‘సార్వభౌమ’ బిరుద
విరాజమానుం డగుతన్మునను, మనుష్యమాత్రుం డధిక్షేపింప సా
హసించుట కిదియె తొలిసారి. కాశీవాసియు, నిరంకుశపాండిత్య
శేముషీకలితుండును, యతిగణప్రథమగణ్యుండు నగుప్రకాశానం
దుండుసైత మిట్లు ధిక్కరింపం జాలండు. చతుర్వింశతివర్షంబుల
బాలసన్యాసి, కాశికాపురిమొగంబు; వేదవాసనయు నెఱుంగని
యొకభక్తమాత్రుండు, కపటదైన్యభయవినయలక్షితమంజులవి
గ్రహుం, డి ట్లొడలెఱుంగక పల్కినపల్కులకు వాసుదేవుం డా

డుగ నడచుకొని వానివంక తెప్పలు వాల్పక కొంతసేపు తేఱి
చూచి పిదప ని ట్లనియె. 189

శా. ఔరా! సూత్రములమాత్రమియె యెఱుఁగుదే! ♦ వ్యాఖ్యామృతంబింపుగా
దే! రంగారువినమ్రకాయమున నెం♦ తేఁ దోఁచుగర్వంబు; నీ
ధీరత్వంబును, వేదవేత్తృత, మన♦ స్తేజంబుఁ, గాన్పింప వ్యా
ఖ్యారంభం బొనరింపు చూచెదను గౌ♦ రాంగా! పరిమత్తాగ్రిణీ!

క. వినువాఁడను నే నౌదును;
వినిపించెదుసర్వశాస్త్ర ♦ విదుఁడవు నీ వౌ;
దనుపమధిషణాఘణితి
న్వినిపింపు యథార్థమైన ♦ వేదార్థంబుల్. 191

వ. అంత గౌరాంగుం డించుకయుఁ జలింపక పండితునాగ్రహంబుఁ
బొడగాంచినట్లనియు నగపడక యల్లన నిట్లనియె. 192

సీ. పండితవర! యభి♦ప్రాయానుసారులు
గావు పావనవేద ♦ కాండము; లవి
యతిసులభార్థంబు; ♦ లర్థకుండేనియు
నించుక చూచి గ్రి♦హింపఁ గలఁడు;
దుర్జయధీబలో ♦ పార్జితపాండిత్య
వారాశి, శంకర ♦ పారికాంక్షి,
యాత్మాశ్రయములె వే♦దాశయము లని, స్థా
పింప భాష్యంబు గా♦వించి, బుద్ధి

గీ. కౌశలంబున వేదము♦ల్గలఁచి వైచెఁ;
గొంచ కవ్వియె నీవు ప♦ఠించినావు;
సూత్రల మిట నుండ భాష్యంబు ♦ లేల మనకు?
నెంతసులభంబొ యది చూచె ♦ దిపుడు నీవె. 193

మ. అని విశ్వాసము, శాంతి, నివ్వటిల వే♦దాధ్యక్షుఁ డై నట్టిపా
వనకాయుం డతిమంజునాదమున భా♦వం బుప్పతిల్లంగ, దే
నినిఁ దొల్దొల్తఁ బఠించెఁ బండితుఁడు దా♦ని న్దాను వాక్రుచ్చి చ
క్కనిరీతి న్విశదీకరించె శ్రుతిభా♦గస్థప్రశస్తార్థముల్. 194

ఆ. యుక్తియుక్త మైన, ♦ యురువైదుషీమహి
మప్రశస్త మైన, ♦ మదికి నచ్చు
నట్టిదైన, యర్థ, ♦ మదివఱ కాలింప
నట్టి, దొండు సూరి ♦ యపుడు వినియె. 195

సీ. తాఁ జెప్పునదియె స♦త్యం బన్నధైర్యంబు
చెన్నారుమోముపైఁ ♦ జిందు ద్రొక్క,
వీణారవంబుల ♦ వీఁకఁ జక్కనిగొంతు
వేదస్వరంబులు ♦ వెలుచుచుండ,
సర్వశాస్త్రావళి ♦ సారమాధురి యూడు
పలుకులు పెల్లుగా ♦ నొలుకుచుండ,
ధీశాంతరసపూర్ణ ♦ దీర్ఘికల్వలెఁ గనుల్
చల్లనిచూపులు ♦ చల్లుచుండ,
గీ. దివ్యఫణితిని వేదార్థ ♦ దీప్తిఁ జిమ్ము
సురుచిరాంగునివక్త్రతఁ ♦ జూచి యంత
పండితుండు మహాశ్చర్య ♦ భయవినిహత
మానసుం డయి రాపడి ♦ మట్టువడియె. 196

క. ఎదిరింప నప్పు డప్పుడు
కదిరెను లోనూహ ; మైన ♦ గౌరాంగునిభీ
ప్రదవాగ్ధోరణికాకృతి,
బెదరి యటుల్సేయలేక ♦ వెనుకకు మఱలెన్. 197

వ. గౌరాంగదేవుండు ప్రథమభాగవ్యాఖ్యానంబు ముగియించి చిఱు నవ్వుతో నిట్లనియె. 198

గీ. కృష్ణికులమణి! చూచితే ♦ యెంతసులభ
ములో శ్రుతులు సహజార్థము ♦ల్వుచ్చుకొనినఁ?
బొదుఁ గనాయాసముగ లాగఁ ♦ బొడముఁ బాలు;
బలిమి నలిపిన రక్తంబు ♦ వచ్చు నయ్య! 199

వ. అని తద్భాగంబునకు శంకరుం డిచ్చినయర్థంబనువదించి, యది యస్వాభావికంబని స్థిరపఱిచెఁ; బండితుం డది సహింపలేక డీకొనఁ దలపోసెఁ గాని గౌరాంగుం డతనిమనోభావంబు గ్రహియించి, యాతనిభావియుక్తులు తానే వాక్రుచ్చి, వానిసిద్ధాంతంబు లన్నియుఁ బూర్వపక్షంబు సేసి, సమగ్రంబుగ ఖండించె; నిట్లె యితరభాగంబులుకూడ వినిపింపందొడంగె. 200

గీ. పదవిభాగంబుఁ గావించి, ♦ ప్రతిపదంబు
నర్థమును వ్యక్తముగఁ జేసి, ♦ యతఁడు పూర్వ
పరవచఃకాండసంబంధ ♦ మరసి, తేట
పఱిచె నందలిసత్యార్థ ♦ భావములను. 201

క. ఆవశ్యకములు ముక్తికి
సేవానికిఁ బ్రేమ భక్తు; ♦ లిటు చాటు మహా
పావనవేదము లని లో
కావనుఁ డెఱిఁగించె సంది♦యము లేకుండన్. 202

వ. శ్రీగౌరాంగస్వామి యనంతరం బాతనిశిష్యుండు, భక్తుండు, మహాపండితుండు, వంగదేశస్థుండు నగుబలదేవవిద్యాభూషణుం డీసత్యవేదవ్యాఖ్య విపులంబుగ వ్యాపింపఁ జేసె. 203

ఆ. వాసుదేవసార్వ ♦ భౌముని కోపమా
త్సర్యములను గరఁచి ♦ స్వామి ప్రతిభ
యట్టె మార్చివైచె ♦ నద్భుతరసముగా;
నంత నెంచె నాతఁ ♦ డాత్మ నిట్లు. 204

క. ఈయద్భుతధిషణాప్రిభ
యేయెడ నే వినఁగ లేదు; ♦ వీక్షింపఁగ లే;
దాయతపాండిత్యంబున
నీయువయతి నాకు నెంతొ ♦ యెక్కువయయ్యెన్. 205

చ. బిడియము వీడి, సమ్రితను ♦ వీడి, శచీజుఁడు శాస్త్రవాదముల్,
బెడిదపుఁబూర్వపక్షములు, ♦ భీకరవక్తృత, యుక్తిజాలముల్,
జడిగురియంగఁ, బండితుఁడు ♦ సాలఁగలేమిని మాఱువల్కఁగా,
నుడివెను "శ్రీహరీ" యను చ ♦ నూనముదద్భుతభారచిత్తుఁడై. 

క. ఆఁగెను వల్లభుఁ డది విని;
యాఁగంగావలదు చెప్పు ♦ మని ప్రార్థించెన్
యోగీశుఁ గోవిదాగ్రణి;
సాఁగించెను వ్యాఖ్య సార ♦ సనయనుఁ డంతన్. 207

శా. ఏమీ వాగ్ఝరి! యేమి ధీమహిమ! యే ♦ మీచాకచక్యంబు! నే
నేమో యొక్కమనుష్యమాత్రునిగనే ♦ వీక్షించితి న్నీని; శ్రీ
భామాభర్త యటంచుబావవలికె; ♦ న్వాఁ డన్నయ ట్లాట యిం
కే మాశ్చర్యము; కానిచో నలువయో! ♦ బృందారకాచార్యుఁడో!

క. అని యాశ్చర్యము పండితుఁ
డెనసినకొలఁదిని, విభుఁడు వి ♦ జృంభించి సమ
స్తనిగమభాగార్థకథన
మున నాతనికనులు శీర్ష ♦ ముఁ దిరుగఁజేసెన్. 209

సీ. ఇది యర్థ; మిది కాద ♦ నెదవేని పూర్వభా
గార్థ మెట్లొప్పునం ♦ చదుగుసూరి;
నిదె యర్థ; మిది కాద ♦ నెదవేనియుత్తర
భాగంబు లేఁక వెట్టి ♦ పలుకు లనును;
శంకరభావమే ♦ సత్యం బయినయెడఁ,
గడమవి పదటను ♦ గలియు ననును;
వేయితావుల నిట్లె ♦ వేదంబు లనుచున్న
వని దడదడఁ జదు ♦ వునవియెల్ల;

గీ. నఖిలశాస్త్రపురాణేతి ♦ హాసపాళి
నుండి పెక్కుఁబ్రమాణము ♦ లున్నుడివి వాని
భావమును దెల్పుమంజుల ♦ భాషణములఁ
గడుమనోహర మానలం ♦ కారములను. 210

ఉ. ఆకసమంటినట్టితల ♦ యద్దున కేగెను బ్రాక్షమాళికిన్;
పీఁక యడంగె; వాని కవె ♦ పెద్దప్రపత్తిని దోయికట్టె నె
ట్లోకరము; “లమ్రహాప్రతిభ!” ♦ “లోకముదాఁటినప్రజ్ఞ!” “దుర్జయా
స్తోకవిచిత్రయుక్తి!” యను ♦ సూక్తులు నాలుకనుండి వెల్వడెన్.

వ. ఉండి యుండి తుట్టతుద కాశ్చర్యనిమగ్నం బైనమానసం బరికట్టం
జాలక వాసుదేవసార్వభౌముం డిట్లనియె. 212

ఉ. వేదమయుండ వీ వనుచు, ♦ వేదము లన్నియు నీకుఁ జూడఁగ్రీ
డాదరణీయమాత్రము ల ♦ టంచు, నెఱుంగఁగఁజాలనైతి; నీ
వీదినమందు నేడ నెపు ♦ డెవ్వరుఁ జూపనివింతఁ జూపి, తో
శ్రీదయితావతార! యొన ♦ రించి సదర్థము వేదరాశికిన్. 213

వ. ఈస్తావకవాక్యంబు లాల్లక, స్వామి పండితునకడ్డపడి. 214

సీ. ప్రేమయు భక్తియు ♦ వేదము ల్బోధించు
 నన్న నాశ్చర్యంబు ♦ నంద వలదు;
తత్త్వాతబోధము ♦ ల్దర కొసంగినమహా
 త్ములె భక్తిలోలు రై ♦ చెలఁగినారు;
నామాట గా దిది♦నమ్ము సుధీవర!
 పరమపావనభాగ ♦ వత మె యిటు వ
లికెడునం చందలి ♦ యొకశ్లోకమును దీసి
 నిర్గుణబ్రహ్మస్థి ♦ నివ్వటిలిన
గీ. యుత్తమోత్తమపురుషు లే ♦ యుండ లేక
పలుకులను దాఁటునానంద ♦ ఫలము నొసఁగు
భక్తికై పాఁకులాడిర ♦ న్భావమందుఁ
గలదనిసుధామృదూక్తులఁ ♦ దెలిపెఁ; దెలుప, 215

క. వినయమున సార్వభౌముఁడు
వనజాయత నేత్ర! నీవు ♦ పఠియించినపా
వనసుశ్లోకంబునకుఁ
బొనరుపు వ్యాఖ్యాన మంచుఁ ♦ బోడ్రిడ న్వేఁడెన్. 216

క. చిఱునవ్వు నవ్వి కోవిద
వర! మంచిది! యట్లె చేయు ♦ వాఁడ; నయిన, ము
న్నరసభవద్వ్యాఖ్యను వినఁ
గ రుచివొడము నా కటంచు ♦ గౌరాంగుఁ డనెన్. 217

ఉ. ఓడితినంచు లోన వెత♦నొందెడుపండితసార్వభౌముఁ డీ
యాడినమాటల న్విని మ♦హాపరితోషతరంగితాత్ముఁ డై
బోడ యనుగ్రహించి నను ♦బోధము సేయు మనె, న్బుధోత్కరా
పీడనమన్మనీష నిట ♦ వెల్చెద నీయతివర్యుముందఱన్. 218

చ. అనుకొని సాహితీమహిమ♦మందున నైసను మిశ్రసూతికి
న్ఘనుఁడ నటంచుఁ దెల్పుకొను♦కాంక్షను గోవిదసార్వభౌముఁ, డి
చ్చినయొకశ్లోకము న్జదివి ♦ చెప్పెను బ్రజ్ఞను జూపి, దీనియం
దునఁ గలవోయతీ! యిమిడి ♦ తొమ్మిదియర్థములంచు నన్నియుఁ.

వ. కాని యన్నియుంగూడ జ్ఞానావబోధకంబు లైయుండె. 220

క. చెప్పితిఁ దొమ్మిదియర్థము
లొప్పుగ నిటు సెప్ప నెవ్వఁ♦డోపుఁ బుడమినం
చప్పండితుఁ డురుగర్వము
గప్పినమది నుండ, నిట్లు ♦ గౌరాంగుఁ డనెన్. 221

సీ. పండితాఖండల! ♦ పాండిత్య మన నీదె,
సార్వభౌముఁడ వంట ♦ కుర్వి నీవె
తగు; నైన భాగవ♦తంబు చెప్పినమహా
త్మ్ముండు నీచెప్పిన ♦ తొమ్మిదర్థ
ముల నొందుఁ గా, కన్య ♦ ములగునర్థంబుల
నూహించి యిది వ్రాసి ♦ యుండవచ్చు;
నవి యేవొ చెప్పఁ బ్ర♦యత్నంబు సేసెదఁ,
గోపింప వల దయ్య ♦ కోవిదేంద్ర!

గీ. యంచు సుమనోవతంసుల ♦ కధిపుఁ డైన
చక్షురానందకరశుభ ♦ స్వర్ణమూర్తి,
యతఁడు నుడివినతొమ్మిది ♦ యర్థములను
వీడి దానికి వ్యాఖ్యఁ గా♦వింపఁ దొడఁగె. 222

క. పాండిత్యగర్వ మునన్మ
త్తుం డయియున్నట్టిపండి♦తుం డిది విని, తా

గుండె దడఁ బొనుఁగువడి యట
నుండె న్హరిప్రేమోల, హరిణ ♦ ముండెదురీతిన్. 223

సీ. పద్యపాదంబులందలి ♦ పదము లెత్తి,
ప్రతిపదమునకుఁ గలయర్థ ♦ పటలి నుడివి,
యందు నొకయర్థమును గొని, ♦ యద్ది ప్రేమ
భక్తిబోధక మని కనఁ ♦ బఱిచె విభుఁడు. 224

ఆ. మొదటిమాట 'యాత్మ' ♦ పిదపటి 'దారాము'
శబ్ద; మిట్టు లుండ ♦ శబ్దవితతి,
ప్రోడ నుడివె 'నాత్మ' ♦ కేడర్థములు, బహు
శార్థములు కడమప ♦ దాళికెల్ల. 225

ఆ. వెఱఁగుపడి వాసుదేవుఁ, డో ♦ పురుషవర్య!
యొక్కయామ్నాయములనె కా ♦ దుంట నీకుఁ
బూర్ణవై దుషి; యన్నింటఁ ♦ బొడవు నూపు
బళిర! పటుసాహితీచక్ర ♦ వర్తి! యనియె. 226

ఉ. పండితుఁ డాడినట్టిస్తుతి ♦ వాక్యముల న్వినకుండ దానికిన్
రెండవయర్థము న్నుడివి ♦ నిర్మలభక్తియుఁ బ్రేమ మందులో
నుండెనటంచుఁ జెప్ప విభుఁ, ♦ డోటమిఁ దత్తఱమొందియానుధీ
మండనుఁ డున్నరూర్చిపలు ♦ మాఱు 'హరీ' యనిపల్కెనివ్వెఱన్.

వ. మఱియు మనంబున ని ట్లనుకొనియె. 228

క. వీఁడు బృహస్పతియేనియు
నే డీకొనువాఁడ; నతని ♦ కెక్కుడుగా మా
టాడెడునితఁ; డాపలుకుం
జేడెమొ పురుషాకృతివడ ♦ సి, యిటకు వచ్చెన్. 229

క. ఆకెను లక్ష్యము సేయక
డీకొని వాదమున నాప • టిమఁ గనఁబఱుతుర్,
వాకులుఁ బ్రీతిభయుఁ గన నా
శ్రీకృష్ణుఁడె యీతఁ డంచుఁ • జింతింతు మదిన్. 230

ఉ. చిత్తము వచ్చినట్లు కవి • సింహుల వాదములందు నోర్చి, దు
ర్వృత్తిని దిద్దుచుండఁ గని • శ్రీహరి యోపక నన్ను, శేముషీ
మత్తుని,బాండితీకదన • మర్దితుఁ జేసి వివేకిఁ జేయ, లో
కోత్తరబుద్ధిఁ జూపి కడు • న్యూనతఁ దెచ్చెను నాకు నీగతిన్.

క. ఎందఱనో విద్వాంసులఁ
జిందఱవందఱ యొనర్చి • సిగ్గుపఱిచితిన్ ;
బొందితి నిచటనె నాయఘ
సందోహంబులకుఁ బూర్ణ • సద్యఃఫలమున్. 232

వ. ఇట్లుండ. 233

గీ. పిడుగుపైఁ బిడ్గు వడినట్లై • వడిని మిశ్రి
సుతుఁడు మఱియొకపదియాఱు • గతుల నర్థ
ములను వాకృచ్చి, శ్లోకంబు • లలితభక్తి
యంచితప్రేమ బోధించు • నంచుఁ జెప్పె. 234

క. పదునెనిమిదియర్థంబుల
పిదప నిజావస్థ యనుభ • వింపఁగ లే, కా
ముదివిబుధుఁడు గౌరాంగుని
పదములపైఁ బడియె దీన • పాలక ! యనుచున్. 235

వ. స్వామి వాక్ప్రవాహంబునకు సార్వభౌముం డడ్డుపడుటచే నాతని
కింక నధికార్థంబులు నుడువ ననువుపడక పోయె ; నాశ్లోకంబున
కే పిదప నొకనాఁడు గౌరాంగుం డఱువదియర్థంబులు సెప్పె

నఁట. ఆశ్లోకం బిప్పు డున్న; దర్థంబు లున్నవి. వానిం జదివి సంస్కృతభాషయందు నిశితపాండిత్యంబు గలవా రిప్పటికి నత్యం తాద్భుతానందరసాంభోధిం దేలుచుందురు. 236

సీ. పండితు నోడింప ♦ వలె నని పూర్వమే
యెంచి యాశ్లోకంబు ♦ నేఱ లేదు;
దాని కయ్యదియె చి ♦ త్తంబులోనికి వచ్చె
వేదార్థకలన గా ♦ వించుచుండ;
నర్థంబు చెప్పమం ♦ చడుగుఁ బండితుఁ డని
యెఱుఁగఁడు నిమి; పండి ♦ తేందు్రివలన
జ్ఞానావబోధక ♦ సవసరసార్థంబు
లిదివఱకే యతి ♦ కెఱుకపడియె;

గీ. నం దొకందును గొనక స♦దర్థములను
దెలిపి పదునెన్మి, దన్నిబో ♦ ధించుఁ బ్రేమ
భక్తి నని విప్పి చెప్పె వి♦శ్వంభరుఁ; డిఁక
నెవఁడో యాచిద్విలాసి యూ♦హింపలేమె? 237

వ. అట్లు పాదంబులు పట్టుకొని సార్వభౌముం డి ట్లనియె. 238

ఉ. తప్పులు సేసినాఁడ నినుఁ ♦ దక్కువవానిఁగ నెంచి, బుద్ధిలే,
కిప్పు డెఱుంగనయ్యె భువి♦నెవ్వఁడు నీసరి గాఁడటంచు; నా
తప్పులనెల్ల సైఁపు, మహిం♦తప్రితిభాయుత! పుణ్యమూర్తి! న
న్నప్పనసేసికొంటి శర♦ణాగతు నొప్పరికింప కోముమా! 239

వ. క్షమియించి శ్రీచైతన్యస్వామి దయార్ద్రహృదయుం డై దుఃఖో పశమనవాక్యంబుల దైన్యంబున నున్నతన్నుపలాలించు నను నాశ నున్నసార్వభౌముం, డట్టివేమియు వినరామిం దలపై కెత్తి చూచె నంత. 240

సీ. కరయుగళీధృత ♦ కార్ముకాశుగములు
దివ్యతేజశ్ఛట ♦ దైసలఁ గురియ,
నిరుఁగేలఁ బూనిన ♦ మురళి, మంజులగాన
సుధ వీనులను బోసి ♦చొక్కఁ జేయ,
రెండుచేతులను గ♦మండలువును దండ
మును శాంతరసచిహ్న♦ములుగ నెలయ,
నఘతమఃపటలసం ♦ హారణదక్షం బైన
నెమ్మోము చల్లవె♦న్నెలలు చిమ్మ,
గీ. గరము లాఱును శత్రుస♦ట్కంబునకుఁ, బ్ర
చండభీకరమారక ♦ సాధనములు
గా, వెలింగెడునొక్క వి♦గ్రహము నూచి
విస్మృతిని సార్వభౌముఁ డు♦ర్విపయి వ్రాలె. 241

వ. వ్రాలి యొకకొంతసేపటికి మఱలఁ దెలివికి వచ్చి పైకిఁ జూచి యాదివ్యాకారంబుఁ గానక దీనాననుం డయి బయలునూచుచు " నామహాత్ముఁడు! నాతండ్రి! యేఁడీ! యెక్కడకేగెనయ్యో!" యని పండితుం డఱచి పలవరించుచుండ గౌరాంగుం డాయాలాపంబు లాలింపక. 242

గీ. చాలసే పయ్యెఁ బండిత ♦ సార్వభౌమ!
యింకఁ బోవుదమే యని ♦కృష్టివర్య,
నగముస్మృతి వాని, నింటికి♦సాఁగ నంపి,
తానుఁ దనకుటీరమునకుఁ ♦ దరలి పోయె. 243

వ. గదిలోఁ బరుండి కలంకువ నొందినచిత్తంబుతో వాసుదేవసార్వభౌముం డిట్లు తలపోసికొనియె. 244

క. మానసము భ్రమము నొందుట
చేనా! కనిపించె నట్టి ♦ చిత్రాకృతి? కా;
దా నారాయణుఁడే కృప
వీని న్ధన్యునిగఁ జేయ ♦ విచ్చేసె నటుల్. 245

క. ఇలయెల్ల వార్ధిలోపలఁ
గలసి నశించినను జింత ♦ గలుగదు, నా కా
జలజాతాక్షుఁడు శ్రీహరి
వెలయుచు నెప్పుడును గాని ♦ పించుచు నున్నన్. 246

సీ. ధృతధనుర్బాణము ♦ శ్రీరామచంద్రుని
దుష్టశిక్షణసత్కృ♦తులను దెల్పుఁ;
బట్టినవేణువు ♦ బాలకృష్ణునియను
రాగంబు నానంద ♦ రసముఁ దెల్పు;
దండకమండులు ♦ తనబిడ్డలను నిమి
ప్రేమకై భిక్షించు ♦ రీతిఁ దెల్పు;
నాలుచేతుల మంజు ♦ లాకృతి గౌరాంగుఁ
డును రమాధవుఁ డొకం ♦ డనుచుఁ దెల్పు;
గీ. ధర్మ మడఁగినయపు డవ♦తార మొందు
వచ్చునని పల్కుగ్రంథము;♦ లవ్వచ్చి యిపుడు
నీకుఁ గనఁబడె; నింతయు ♦ నిజము సార్వ
భౌమ! నీయట్టిధన్యుఁ డీ ♦ వసుధ లేఁడు. 247

ఉ. ఎంతయదృష్టవంతుఁడవు ♦ క్షత్రివతంసమ! సర్వవస్తుబా
హ్యాంతరవర్తి, శ్రీహరి, కృ♦పాంబుధి, దుర్దమఘోరకిల్బిష
ధ్వాంతవిభాకరుండు, నిను ♦ దర్శన మిచ్చి కృతార్థుఁ జేసె; నే
కాంతులు యోగివర్యు లిటు ♦ చాలిరి చూడఁగ నామహాత్మునిన్?

క. లోకేశుఁ జూచినతనికి
నీ కేమి భయంబు? చెనక ♦ నేర వికఁ నిరున్
బ్రాకృతజనపీడాకర
భీకరసంసరణదుఃఖ ♦ వితతులు, సూరీ ! 249

క. చిత్తని సత్తని యెపుడున్
మొత్తుకొనుచు నింతవయసుఁ ♦ బోకార్చితయో !
విత్తయశస్తృష్ణను, వి
ద్వత్తిలకమ ! యిట్టి సుఖముఁ ♦ బడయఁ గలిగితే? 250

క. నవనిధులు, ప్రసంభావిత,
మవని సమస్తంబు నేలు ♦ నైశ్వర్యం, బి
య్యవి యొకటఁ గల్గునాతఁడుఁ
జవి చూడంగలఁడె యిట్టి ♦ సౌఖ్యామృతమున్? 251

ఆ. ఓరి వాసుదేవ! ♦ యొకఁడేని, యిప్పటి
నీకు సాటి రాఁడు ♦ నిజము నిజము ;
సర్వలౌకికసుఖ ♦ జాతము లక్షణముల
ట్లాను జుమ్మి నీసు♦ఖాబ్ధిలోన. 252

వ. ఇట్లానందమహాసముద్రమునం దోలలాడుచున్న పండితసార్వ
భౌమునంతఃకరణంబునఁ బ్రారబ్ధవశంబున నది యంతయుఁజిత్త
భ్రాంతిమహిమంబు కాదు కదా! యను నొకదుస్సంశయంబు
వొడమ నతనియానందం బంతయు సికతాసౌధంబుమాడి
గూలె; నొడలు కంపింపం దొడంగె; నాశాభంగోద్భూతశోక
బాష్పధారలు కన్నులనుండి వర్షించె; నంత మనంబు దిటవుపఱు
చుకొని యాతం డిట్లు తలపోయ సాఁగె. 253

సీ. స్వప్నతుల్యంబె కా • వచ్చును జూచిన ;
దతఁ డేను స్వప్నంబు • లనెడె మనస ?
స్వప్నమా వేదంబు • సదివి చెప్పుటయును
గాంచినవై దుష్య • గరిమ యెల్ల ?
నయ్యయ్యొ స్వప్నమా • యతఁడు శంకరభాష్య
మును నిజవాగ్ఝరి • ముంచుటయును?
సకలశాస్త్రపురాణ • సారమంత్రముల స
న్నాకట్టు గట్టిన • వార్త గలయె ?
గీ. వేయి చెప్పుము భ్రాంతి గా • దోయి వెఱ్ఱి
మనస ! యంతటిప్రతిభ యే • మానవునకు
నుండ దుండదు; చూచితి • నుర్వి యెల్లఁ
గృష్ణుఁ డాతండు; కేవల • కృష్ణమూర్తి. 254

క. అంతటివానిని శిష్యుల
చెంతను నే బుద్ధిలేమిఁ • జేసి, పొగరుచే,
నెంతో యవమానపఱిచితి;
నంతఃకరణంబ ! యేమి • యౌనో నాకున్? 255

క. నాపాప మెట్లు పోవునో!
గోపాలుం డెట్లు లెంచు • కొనునో యంచున్!
దాపమున వాసుదేవుఁడు
వాపోవుచు దండభీతి • వణఁకఁగఁ జొచ్చెన్. 256

వ. ఇట్లు విషాదానందంబులమధ్యంబున నూఁగులాడుచు సార్వభౌ ముం డా రాత్రి యంతయు జాగరావస్థం గడపి యహర్ముఖంబున గన్నుమోడ్చె నంత. 257

మ. ఉదయం బోటకు మున్నె యాలయములో♦నున్నట్టిముఖ్యార్చచెం
తఁ, ఘటితాత్యంతినిభక్తిమూర్తియగుచై♦తన్యుండుగూర్చుండ,నా
ప్పిద మాపూవులదండ యొక్కఁడును నై♦వేద్యంపుటన్నం బొకం
డుఁ, దమి న్బ్రీతిని జేతఁ బూని గుడిబం♦టు ల్వచ్చి రిర్వుర్వడిన్.

గీ. వచ్చి యొక్కండు స్వామిగ్రీ♦వంబునందు
వైచెఁ బూదండ; రెండవ♦వాఁడు చేతఁ
బెట్టెను బ్రసాద; మంత నా♦విశ్వవిభుఁడు
చివ్వనను లేచి పైకి వ♦చ్చె, గుడి వదలి. 259

గీ. కొన్నయన్నప్రసాదంబుఁ♦గొంగునందుఁ
గట్టి, పూదండ తనమెడ♦చుట్టుఁ గ్రాలఁ,
బరుగుపరుగున నెచటికో♦యరుగఁ దొడఁగె
వరదుఁ, డనుయాయిభక్తులు♦వెఱఁగుఁ జెంద. 260

మ. ఎటకుం బోవునొ తండ్రి, యేమిపనియో♦యిట్లంచుభక్తర్షభుల్
పటుశంక న్దనవెంట రాఁగఁ జని వి♦శ్వత్రాత, యొక్కింతసే
పటికి న్బండితునింటివీథిదెసకుం♦బర్వెత్తి, యాయింటివా
కిటఁ గాపున్నభటావళి న్గడచి యే♦గె న్లోనికిం జెచ్చెరన్. 261

క. వచ్చినయాతఁడు పండితు
నచ్చెరువుగ నోర్చినట్టి♦యతివరుఁడె, యటం
చొచ్చెము సేయక బంటుల్
విచ్చలవిడి లోని కేగ♦విడిచిరి విభునిన్. 262

గీ. తిన్నఁగా సార్వభౌముగ♦దికడ కేగి
పిలిచె గౌరాంగుఁ డాతనిఁ♦బేరు వెట్టి;
యచ్చటివసారఁ బండుకొ♦న్నట్టియొక్క
ఛాత్రసురార్భకుఁ డంత మే♦ల్కాంచి లేచి. 263

క. తలుపుం దట్టెను వెంటనె;
యులికిపడుచు లేచి పండి ♦ తోత్తముఁ డెవ రా
పిలిచెడువా రని, సంయమి
తిలకం బని యెఱిఁగి వేగఁ ♦ దెఱచెం దలుపున్. 264

క. తెఱచి, బహిస్థలికాతం
డరుదెంచి శుభాంగు నరసి ♦ యాతనిలోకో
త్తరపూతచరణయుగళికి
నెఱఁగె న్భయభక్తియుక్తి ♦ హృదయముతోడన్. 265

క. భవదాత్మకృష్ణునందున
నివసించుత నెప్పు డంచు ♦ నిమి దీవించెన్;
గవియుం జైతన్యుండును
గవగాఁ గూర్చుండి రంత ♦ గది నొక్కయెడన్. 266

వ. అంత గుడినుండి తీసికొనివచ్చినశ్రీజగన్నాథప్రసాదంబు పట్టెఁడు
చేత నిడికొని చూపించి గౌరాంగుండు. 267

క. కొను కొనుము జగన్నాథుని
యనుగ్రహముచేత లబ్ధ ♦ మైనప్రసాదం
బును వేవేయని చిఱున
వ్వునఁ బల్కెను వాసుదేవ ♦ బుధవరుతోడన్. 268

వ. అంత. 269

మ. ఘనవిద్వాంసుఁడు, గొప్పనైష్ఠికుఁడు, ద ♦ గ్రచ్ఛాందసాచారపో
షణధౌరేయుఁడు, పెద్దకర్మఠుఁడు, హా ♦ స్తద్వంద్వము న్సాఁచి యం
దున నిడ్డట్టిపదార్థ మాదలను గం ♦ దోయి న్మహాభక్తియు
క్తి నిహత్తించి మహాప్రసాద మనిమ్రిం ♦ గె న్గొంకులే కింతయున్.

గీ. దేవునిప్రసాదము గొనసి ♦ ద్ధించినపుడు
తత్క్షణము దేశకాలాది ♦ ధర్మనియమ
ముల గణింపక తినవలెఁ ♦ బురుషుఁ డనెడు
రెండుశ్లోకములు చదివి ♦ మ్రింగె సద్ది. 271

క. తరణి యుదయించుటకు మున్,
బరమచ్ఛాందసునిచేతఁ, ♦ బల్దోమకమున్,
సురవరుఁ డంటగుసన్నముఁ
దెరలిచి యను మాన మెల్లఁ, ♦ దినిపించెఁ గదా! 272

గీ. మను జసామాన్యదంతధా ♦ వనము లేదు;
లేదుపస్నాస; మర్ఘ్యంబు ♦ లేదు; మఱియు
లేదు; దేవతార్చన లేదు; ♦ లేఁతవయసుఁ
గుఱ్ఱవలెఁ బ్రాజ్ఞుఁ డన్నంబుఁ ♦ గుడిచినాఁడు. 273

ఆ. భక్తిరహితకర్మ ♦ సక్తుఁ డై మత్తిల్లి
కన్నుగాన కున్న ♦ కవిగజమున
కిట్లు సేసె రోగ ♦ మెఱిఁగి మం దిచ్చెడు
వెజ్జుపగిది విశ్వ ♦ విభుఁడు కరుణ. 274

ఆ. భక్తిలేనికర్మ ♦ పటలంబు వృథ యని
తెల్లపడఁగఁ జేసె ♦ దివ్యతేజుఁ;
డంతెకాని సత్కు ♦ లాచారధర్మముల్,
విహితకర్మవితతి, ♦ పీడు మనఁడు. 275

క. భక్తి లేనట్టిబ్రాహ్మణు ♦ పైవరుకంటెఁ
జాల నధికుఁడు భక్తుఁ డౌ ♦ శ్వపచుఁ డంచుఁ
బెక్కుతావులఁ బల్మఱు ♦ నొక్కి చెప్పె
నద్భుతమోభాసుఁ డైనగా ♦ రాంగవిభుఁడు. 276

క. తురకను భక్తావతంసుని
హరిదాసునిఁ దక్కువారి ♦ నట్లే, నిమి త్తా
నరయుటయ కా, కతని నె
ల్లరు మిక్కిలి గారవించు ♦ లాగునఁ జేసెన్. 277

వ. వెనుకఁ బ్రథమభాగంబునం దిరువదవయాశ్వాసంబున నీక్రింది పద్యంబుల భక్తితత్త్వంబును గపటరాధావేషధారి యయి చెలికత్తెలకు బోధించిన ట్లిప్పు డీపండితునకు గౌరాంగుండు ప్రసాద సాధనంబునం బోధించె. 278

చ. "వినుఁడీ! వినుండీ! మాధవుని ♦ వేణునినాదము లవ్వె! నన్ను ర
మ్మని నెఱజాణ సేసెడునొ ♦ యారపుసైగలు, నేను బోవలెన్
దనువును నిల్పలే నతని ♦ దర్శనముం బొనరించి కాని, వెం
టనె చనుదెండు కృష్ణుచర ♦ ణంబులు గొల్వఁగఁ గోరునెచ్చెలుల్."

చ. "పతిసుతముఖ్యసంసరణ ♦ బంధముల న్దెగఁగోసి, మైహికో
ద్ధతి నపవాదభీతిని మ ♦ దంబును మానముఁ జంపుకొన్నయా
గతకలుషాంతరంగలకుఁ ♦ గాక లభించునె చేడెలార! య
చ్యుతపదచింతనామృతము ♦ జుర్రెడుభాగ్యము, మోక్షసౌఖ్యమున్",

ఆ. "కూడవత్తు రేని ♦ గొబ్బున రండిఁక
నేను నిలువఁ జాల ♦ నేగ కుండ;
నెట్లు దొరకు మనకుఁ ♦ గృష్ణునికౌఁగిలుల్
కొంతబాధ కోర్చు ♦ కొన్నఁ గాక."

గీ. సార్వభౌముఁడు గోపిక; ♦ చలము మదము
దంభచర్యలు, ధనయశ ♦ స్తత్పరతయు,
వెఱ్ఱియభిమాన, మపవాద ♦ భీతి, యివియె
పతిసుతాద్యురుసంసృతి ♦ బంధనములు. 279

చ. అమితపుఁబ్రేమ స్వామి గొను♦మం చెలనవ్వన దేవతాప్రసా
దము నొసఁగంగఁ, బండితుఁ డు♦దారపుఁదీవ్రపుమోక్షకాంక్షచే
శమితసమస్తపాపుఁ డయి ♦ క్షాళితనిర్మలచిత్తవృత్తి స
ర్వముఁ ద్యజియించి హానిఁదని♦వ్రాలెనుమూర్ఛనపారభక్తిచేఁ.

వ. పండితసార్వభౌముతత్కాలావస్థ "శ్రీచైతన్యచంద్రోదయము"
నం దిట్లు వర్ణింపంబడియె. 281

క. పుడమి న్మూర్ఛారోగుల
వడువునఁ బడెఁ; నురుఁగు గ్రక్కె ♦ వాయి; గుఱకచ
ప్పుడు గొంతుకలో వినఁబడెఁ;
నొడలిపయి న్పులక లడరె ♦ నుద్వేలముగాఁ. 282

క. చలనంబు లేక కనఁబడు
విలక్షణాభాక్షియుగము ♦ నెంబడి నిరుఁజె
క్కులపయి బాష్పంబులు పి
చ్చిలి యురవడి విడక పాఱె ♦ సెలయేళ్లగతిఁ. 283

వ. ఈస్థితిం గాంచి యతనిభార్యయుఁ జెల్లెలుఁ గొడుకుం గూతురును
గుటుంబములోనితక్కువారు నతిభీతాత్ములై యేమియుఁజేయం
జాలక రాపడి నిలిచి; రంతఁ జైతన్యప్రభుం డతనిశరీరం బించుక
స్పృశియించి కదలుపఁ బండితుండు లేచి కూరుచుండి యర్ధస్మృ
తితో స్వామివంకఁ జూచుచుండ స్వామి యాతనికరంబు పట్టు
కొని నిలువం బెట్టి తానుం గూడ నిలువఁబడి యతనితో నిట్లు
పల్కినట్లు "శ్రీచైతన్యచరితామృతము" నందుఁ జెప్పంబడియె.

సీ. పండితకులసార్వ ♦ భౌముఁడ వౌనీవు
శ్రీకృష్ణచింతనా ♦ మృతముఁ గ్రోల

నిస్సారసాంఘిక ♦ నిర్బంధములఁ ద్రెంపి
నేఁడుగా విడిచితి ♦ వేడబములు!
బాహ్యనిష్ఠల నెల్ల ♦ వర్జించి నేఁడుగా
యకలంకకృష్ణసే ♦ వకుఁడ వైతి!
నేఁడుగా కృష్ణుండు ♦ నిన్గృప నారసి
హాయిగాఁ దనయక్కు ♦ నందుఁ జేర్చె!

గీ. నుత్తరోత్తరశుభవృద్ధి ♦ నొందఁ గలుగు
వాఁడవును ముక్తుఁడవు నైతి ♦ నేఁడు గాదె!
కృష్ణసల్లాపయోగ్య మౌ ♦ హృదయశుద్ధి
నేఁడుగా కల్గె నీకుఁ బం ♦ డితవరేణ్య! 285

క. నేఁడు జయించితి లోకము;
నేఁడు మనోభీప్సితములు ♦ నెఱవేఱెను; నేఁ
డోడించి సర్వవిమతులఁ
బాడిమెయి న్గొంటి నల్ల ♦ స్వారాజ్యము నే. 286

క. బాగుపడితేని నీ విఁక
బాగుపడుదు రయ్య! కోటి ♦ పర్విజలు మనీషీ!
యేగ ముదిగొత్తె యొకదెస,
కేగునుగా మంద యద్ది ♦ యేగినచాయన్. 287

వ. అని సంపూర్ణప్రేమభరితుం డై గౌరాంగుం డాతనిఁ గౌఁగిలించు కొన, ననిర్వాచ్యం బగునానందంబుఁ బట్టఁజాలక వృద్ధపండితుం డూరక నర్తనంబులు గావింపం దొడంగె. సార్వభౌమునికుటుం బము వారుఁ బరిజనంబును గోపీనాథుండు నచ్చటనే యుండి చూ చుచుండిరి. మహానందబాష్పప్లుతలోచనుం డై గోపీనాథుండు కృ తజ్ఞావలోకనంబులు స్వామిమీఁదను,సంతుష్టవిలోకనంబులుసార్వ

భౌముపైనిం బఱపి యంతఁ దనమఱంది తో నిట్లు పరిహాసం బాడె.

శా. బావా! ఛీ! యిది యేమి! యాడె దిటు లుద్బాహుండ వైమద్యపా
నావిర్భూతమదాతిరేకుగతి? న య్యయ్యో! పరిజ ల్నవ్వరే?
నీ వెవ్వండవొ చూచుకొమ్ము! తగునే నిర్లజ్జచిత్తంబునం
గావింప న్గవిసార్వభౌమున కయుక్తం బైననాట్యంబులన్? 289

ఆ. వృద్ధవేశ్యపోల్కి నిట్టట్టు పరిహాస
పాత్రలంఘనములు వైతు వీవు;
బహుళశాస్త్రములను బఠియించునీశిష్యు
లరసి రేని యేమి యందురొ కద! 290

వ. ఈపరిహాసపుదెప్పల్లఁ గించుకేనియుఁ గినియక, చలింపక, మహాభక్త్యానందాబ్ధినిమగ్నచిత్తుం డైనవాసుదేవుండు గోపీనాథుపై సుధాశీతలమంజులంబు లగుచూపులు వఱపి తత్క్షణం బాశుధారారూపంబుగ నీక్రిందియర్థంబిచ్చుశ్లోకం బొండు చేసి చదివె. 291

ద్వి. పలువ లిష్టమువచ్చు పగిది సన్గూర్చి
పలుకుఁ గా! కభిమాన పడ; నననిమ్ము;
బావ! యీలోపలఁ బానంబు సేసి
పావనపేరిమాన వంబు తృప్తిగను,
జొక్కుచు సోలుచు సుఖపరవశతఁ
జక్కఁగా నర్తించి సంతోషగరిమ
ధరపయి నిర్నిరోధంబుగ దొర్లి
తలుగుద మెల్లచిం తల రమ్ము! రమ్ము! 292

సీ. అడ్డుగా నున్నయభిమాన మఱచి, స్వస్వ
రూపమును జూపి, గర్వంబు రూపు మాపి,

శశిధర మది నెలకొల్పి, వి • శ్వంభరుఁడు ప్రి
సాదమునఁ జేరిమభ క్తు లొ • సంగెఁ గవికి. 293

క. ఇట్లు కావించి శ్రీచైతన్యస్వామి తొందరతోఁ దనచిన్నకుటీరంబు
న కరిగె నంత. 294

సీ. అప్పటినుండియు • ననుదినంబును బ్రభా
తమునఁ బండితుఁ డాల • యమున నున్న
స్థావరదారుకృ • తప్రతిమను జూచు
పని మాని జంగమ • ప్రమదదోరు
నప్రాణవిగ్రహా • స్వామిఁ జైతన్యునే
పొడగాంచి సుఖియింపఁ • బోవుచుండె;
నట్లు మఱునటినాఁ • డాలయమార్గంబుఁ
దా వీడి మిశ్రినం • దనునియింటి

ఆ. దెసకుఁ బోవుచుంట • తిలకించి, వెంటవ
చ్చెడుభటుఁడు, మఱపుఁ • జెంది యట్లు
లరుగుచుండె నొడయఁ • డనునూహమున, నిట్లు
చెప్పె వినయమునను • జెంత కేగి. 295

క. స్వామీ! ప్రితిదిన మేగెడు
నీమార్గము వదలి యట్లు • లేగెద, రటుగా,
దీమార్గమునకు రం, డన
నేమన కటు పోవుచుండె • నెలనవ్వులతోఁ. 296

వ. అటమున్న గోపీనాథుం డరిగి చైతన్యస్వామియొద్ద నుండె; నంత వాసుదేవసార్వభౌముం డత్యుత్కంఠతోఁ జని స్వామిమొ్రిల బద్ధాంజలి యై నిలువంబడి కొంతసే పటుండి సాష్టాంగనమస్కా రంబు గావించి మఱల లేచి తత్కాలోద్భూతమనోభావప్రకటక

శ్లోకం బొం డికిం దిరీతి రచియించి చదివె. వెనుక జరిగినవృ
త్తాంతం బంతయు మఱచి శ్రీచైతన్యుండు యథాపూర్వవినయ
విధేయతాస్థితిం బొరసి కూరుచుండె. 297

సీ. ఎఱుఁగ నశక్యంబు ♦ లీశ్వరేచ్ఛాచర్య,
లల్పబుద్ధుల మవ్వి ♦ యరయఁ గలమె?
నరరూపమున నిప్డు ♦ నటియించు చామహా
త్ముఁడు హరి సర్వేశ ♦ కృష్ణుఁడు చరాచ
రప్రపంచము నేలు ♦ రాజాధిరాజు మా
మధ్యంబుననె మహా ♦ మాయి యున్న
వాఁ డని యెఱుఁగక,♦ వారల వీరలఁ
జూచినట్టులె వానిఁ ♦ జూచినాను;
గీ. స్పర్శవేధియు శిలయొక్క ♦ పగిదిఁ బైకిఁ
గానిపించును గనులకుఁ; ♦ గాని యినుప
ముక్క నది యంటి బంగారు ♦ ముక్కఁ జేసి
నపుడు తెలియదె దానిగు ♦ ణాతిశయము? 298

వ. అని యంతట నాఁగక యిట్లు మఱికొన్నిశ్లోకంబులు చెప్పె. 299

సీ. కేవలంబును బుద్ధి ♦ కృషిఁ జేసి కార్యకా
రణముల వెదకుచుఁ ♦ బ్రబలతర్క
వేదాంతధర్మశా ♦ స్త్రాదులనుడిగుండ
ములఁ బడి జీవితం♦బు వృథచేసి
తిని గటా! యిపుడు న ♦ న్నైలివికిఁ దెచ్చితి;
వంపఁగఁ గరఁగఁగ ♦ వశముగాని
తుచ్ఛశిలాఖండ ♦ తుల్య మానామనం
బును నీమహాశక్తి ♦ మూపఁ గరఁచి

గీ. పోఁతపోసితి చక్కఁగాఁ బుణ్యమూర్తి
నేరుపున భవదిష్టాను సారముగను;
శుంఠ యాపాపిఁ బ్రోచుట సులభము కద
మాన్య! నావంటిపండిత మ్మన్యుకంటె. 300

క. వెన్నుఁ డెదిగియున్నాఁ డీ
వన్నె ననుచు నెఱుఁగకుండఁ బాపిని గర్వ
చ్ఛన్నుఁడఁ దర్కబలంబున
ని న్నొకయూఁ పూఁపఁదలఁచి నే నిల్లైతిన్. 301

శా. అన్యాలాపము మాని నీ వొకమను ష్యప్రాయవేషంబుతో
"ధన్యుం జేయు" మటంచు నమ్రతను చైతన్యా! నను న్వేఁడి; తా
యన్యాయంబున కేమిచెప్పుదు; మదీ యౌద్ధత్యభంగంబుకై
సన్యాసంబు గ్రహించి వచ్చి తని యెంచ న్నా కెటుల్శక్యమా?

గీ. బుద్ధిమంతుని జేయఁగాఁ బుత్రుఁ దండ్రి
కొట్టి యలమట వెట్టెడు నట్టు నన్ను
గర్వభంగంబుఁ గావించి కలుష మడఁచి
కాచితివి; వంతలే సౌఖ్య కరము లయ్యె. 303

వ. అని కుండలతోఁ గుమ్మరించినట్లు కన్నీళ్లు వెడల్చి పండితుండు
వెండియు నిట్లనియె. 304

మ. అవమానించితి నిన్ను మూఢతను గౌరాంగా! క్షమన్జూపు; ము
ద్భవ మయ్యె న్మది విజ్ఞతాప్రభ, శ్రుతి ప్రాజ్యార్థబోధంబునన్;
హావణిల్లె న్మతిమీఱి శ్రద్ధ, యలనీ యష్టాదశవ్యాఖ్యలన్;
దవిలె న్నిన్ను మనంబు; మత్సకలము న్దండ్రీ! సమర్పించితిన్.

క. కాయం బర్థము హృదయము
నీయవి సర్వేశ! యిపుడు నేఁ బల్కుదు ము

న్నియట్లు, నీవు దాల్చిన
మాయను గా, కాత్మశుద్ధి ♦ మై, భర్మాంగా ! 306

వ. అని వలపల యొకశిశువువలెఁ గన్నీరు వడువఁ, బూర్వవృత్తాంత విస్మృతి నున్నచైతన్యుం డది యంతయు నేమియో గ్రహియింపఁ జాలక, నివ్వెఱంగునఁ గొంతసేపు చూచి, చివరకుఁ బండితుం డనర్ఘునిఁ దన్ను దైవభావంబున శ్లాఘించుచున్నట్లెఱింగి, సిగ్గుచే మొగం బెల్లవాఱి, వడఁకుచు, వ్రేళ్ల నిజశ్రవఃపుటంబులు మూసికొని, యిట్లనియె. 307

ఉ. చాలు మనీషిసింహ ! యిఁకఁ ♦ జాలుము సంస్తుతిఁ గట్టిపెట్టు; మీ
పోలిక నీకు నన్నుఁ బోరి ♦ వోవఁగఁ జేయుట పాడి గాదు; నీ
పాలను బడ్డవానిఁ, బసి ♦ వానిని, నీసుతువంటివాని, గో
పాలునటు ల్నుతించు టది ♦ పాపము; చేయకు మట్టు లెన్నఁడున్.

ఆ. ఇంతకాలమునకుఁ ♦ గృష్ణునిపై భక్తి
వొడమెనేని నీకు ♦ నెడఁద, సర్వ
కలుషహారునకు జ ♦ గన్నాథునకుఁ గేలు
మోడ్చి చిత్తశుద్ధి ♦ మ్రొక్కుమయ్య ! 309

వ. జగన్నాథశబ్దోచ్చారణంబున స్వామివత్సలాననంబు భక్తితేజఃక్రాంతం బయ్యెఁ; బండితుం డీపరితారణవాక్యంబుల కించుకేని చలింపక బద్ధపాణి యై వెండి యిట్లనియె. 310

క. సేవకు గోపీనాథుని
నీ వెటు లరయుదువో నన్ను ♦ నీరజనేత్రా !
యావడువున రక్షింపుము,
సేవకుఁ గాఁ జేసికొనుము ♦ శీఘ్రము నన్నున్. 311

గీ. బహుకుటుంబివి సంయమి ♦ వరుఁడ వైన,
నందఱను దండ్రివలెఁ బ్రోవ ♦ నవతరించి,
తభవ! శ్రీకృష్ణ! చిన్మయా! ♦ సుభగమూర్తి!
యే నొకండను భారంబు ♦ గాను గొనుము. 312

వ. గోపీనాథుండు పగఁ దీర్చికొనుట కిదియే మంచిసమయం బని ముందునకు వచ్చి చేతులు సాఁచి దరహాసవదనంబుతో ని ట్లనియె. 313

ఉ. పండితవర్య! శ్రేష్ఠుఁ డగు ♦ పవ్రిజితు, న్బనివట్టి, యీధరా
మండలమంతయు న్వెదకి, ♦ మంచిమహాత్ముని నేఁతి, బాలకుల్
వెండి గ్రహింపఁ జేయవలె ♦ వేగఁ దురీయపదం బటంటి; వి
ట్లుండఁగనిచ్చినావు మఱి ♦ పొందితె నీయుపజీవి భావుకా? 314

క. ఎంతవఱకు వేదంబుల
నంతలు చెప్పితివి బాల ♦ సన్యాసికి? దు
ర్దాంతపుటంతశ్శత్రుల
వంతం బడి మడియకుండ ♦ వాని నరసితే? 315

వ. ఈవక్రోక్తులకు సార్వభౌముండు కోపపడక పెద్దనవ్వు నవ్వెఁ; దక్కుభక్తు లందఱుంగూడ నవ్వి; రంత వెన్వెంటఁ గృతజ్ఞతో ద్భూతబాష్పసిక్తావలోకనంబులు గోపీనాథుపైఁ బఱపి వాసు దేవుం డతనితో ని ట్లనియె. 316

శా. గోపీనాథ! యిదంత నీకృపసుమా! ♦ గోరంతయర్హత్వముల్
జూప న్లే నిటలోనఁ; జాలఁగ దయ ♦ న్జూపించెఁ జైతన్యుఁ డీ
పాపాత్మాగ్రణిపైని; నీ వతనిస ♦ ద్భక్తుండవు న్లెంకవుల్;
నాపుణ్యంబున నీకు బావ నయితి; ♦ న్గాఁబట్టి రక్షించె నన్.317

గీ. వాసుదేవుఁ డీవాక్యము ♦ ల్వలుకఁ గానె
ప్రేమకలశాబ్ధి యైనట్టి ♦ విశ్వవిభుఁడు
లేచి వానిఁ జేసికొనె నా ♦ లింగనంబు,
మహితసుఖదాత్మబాహుయు♦గ్మంబుతోడ. 318

వ. ఆనాఁటినుండియు సార్వభౌముండు గౌరాంగునితీవ్రభక్తుం డై
యుండె. 319

సీ. రాజుసమ్మతిఁ గొని ♦ ప్రాజ్ఞపుంగవుఁడు తాఁ
జూచినషడ్భాహు ♦ సురుచిరాకృ
తిని శ్రీజగన్నాథ ♦ దివ్యాలయంబున
నెలకొల్పె; నది యట ♦ నేఁటికిఁ గనఁ
బడును యాత్రికులకుఁ; ♦ బండితుం డదియునుఁ
గాక భక్తిని బట్టి ♦ లేక మదిని,
కమ్రపాండిత్యస♦త్కవితాగరిమఁ జూపి
స్వామిపై యొకశ్లోక♦శతముఁ జెప్పె

గీ. సంస్కృతంబున; నది యిప్డు ♦ చదువ నగును;
జూచి చదువుట భక్తిని ♦ జూఱకొనుట;
చదువరుల కెల్ల సర్వభ♦ద్రదుఁడు స్వామి
కన్నులను గట్టినట్టులు ♦ కానిపించు. 320

వ. వానినుండి తీసినమూఁడుశ్లోకంబులయాంధ్రీకరణం బీక్రిందిపద్యం
బులఁ గాన నగు. 321

గీ. ప్రేమభక్త్యురులక్షణ ♦ పిహితకాంచ
నాంగుఁ డయి నిత్య, మిల మాన ♦ వాళిదయను
గావ నవతరించిన శచీ ♦ గర్భపావ
నునకుఁ గావింతు భక్తి వం♦దనము లెపుడు. 322

గీ. భక్తిపరవశతానంద ♦ బాష్పపూర్ణ
కమ్రనయనాంబుదముల నొ♦క్కగతిఁ "కృష్ణ!"
యనుచుఁ దనుఁ దానె స్మరియించు ♦ కొనెడువిబుధ
వంద్యునకు శచిపట్టికి ♦ వందనములు. 323

గీ. వెనుక నందాత్మజుం డయి ♦ వెండి సత్య
సన్మతస్థాపనార్థంబు ♦ క్ష్మాతలమున
నవతరించినశచిబిడ్డ ♦ కఖిలలోక
భారవాహున కెపుడు నా ♦ వందనములు. 324



క. ఖ్యాతిపయిఁ బ్రీతియును, మృతి
భీతియు, సోదరులపైని ♦ బ్రేమయుఁ, గల; వీ
భీతిప్రీతులు భక్తివి
ఘాతంబులు గాకయుండఁ ♦ గావుము రామా! 325



శ్రీరామా.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

## ఏకాదశాశ్వాసము.



శా. మాతృద్రోహిని రావణాసురు వధింప న్ఖ్యాత సీత జ్జగ
న్మాత న్దేరఁగ దక్షిణాపథముకిం ◆ ద న్పోయి తా వందు; రా
చేఁత ల్వట్టిమిన; ల్విభీషణుకపి ◆ శ్రేష్ఠాంగద స్త్రేనసం
భూతాభ్యుద్ధరణార్థమే చలిపి తా ◆ పోల్కి న్రఘూత్తంసమా! 1

క. ఒరులకుఁ గనఁబడకుండఁగఁ
బురుషోత్తముఁ డుండఁ గోరె; ◆ బుధవర్యుఁడు శ్రీ
వరునిచ్ఛకుఁ దోడ్పడి యెపు
డౌరు లాతని కడ్డుపడక ◆ యుండఁగఁ జేసెన్. 2

వ. కాని తనయనుచరు లగుభక్తులతో స్వామి మఱియొకవిధంబుగాఁ, దాను దక్షిణదేశంబున కేగవలయు నని నుడివెఁ; దల్లియొద్ద సెలవుదీసికొనినప్పుడు భక్తు లందఱు స్వామి శ్రీజగన్నాథాలయంబుననే యెప్పుడుండునట్లు వాగ్దానంబుం గొనిరి. నిత్యానందుం డామాట గౌరాంగునకుఁ బునస్మారకంబుగ విన్నవింప, వారిరువుర కీక్రిందిసంభాషణంబు జరిగె. 3

ఆ. "అచటి కేగి మఱల ♦ నతిశీఘ్రముగ వత్తు ;"
"నేమిపనికి నటకు ♦ నేగఁ దలఁతు ?"
"నన్న విశ్వరూపు ♦ నారయువాంఛను"
"బరమపదము నతఁడు ♦ పొరసెఁ గాదె !" 4

వ. స్వామి యి ట్లనియె. 5

ఆ. అట్లు వింటిఁ గాని ♦ యన్నసమాచార
మేగి నాకు నేనె ♦ యెఱుఁగవలయు ;
విహిత మైనపుణ్య ♦ విధి గాదె నితి ! యట్లు
పోయి కనుట, తోడఁ ♦ బుట్టువునకు ? 6

వ. నితి యి ట్లనియె. 7

క. మంచిదె యటు సేయుట యో
కాంచనసదృశాంగ ! యెవఁడు ♦ కాదనఁగలఁడ
ట్లెంచిన ? మన మెపు డటు కా
వించుట ? దయచేసి చెప్పు ♦ వీనికిఁ గూడన్. 8

వ. చైతన్యస్వామి యి ట్లనియె. 9

సీ. ఒంటరిగా నేగ ♦ నూహించితిని నేను;
మీరు నాపై ప్రేమ ♦ మీఱి నన్ను
బానిసీనిగఁ జేసి ♦ బంధించినా; రెంత
యస్వతంత్రుఁడ నైతి ♦ నయ్యొ ! నేను;
శ్రీపాద ! నా కెప్డు ♦ స్నిగ్ధులసంతోష
పెట్టుటే పని, లేదు ♦ వే ఱటంచుఁ
దలఁచెదో ? మనసారఁ ♦ దండ్రిఁ గృష్ణుని గొల్చి
ప్రేమ నేఁ బడసి త♦రించు టెపుడు ?

గీ. మెత్త నౌమెత్తలను బెట్టి, ♦ మృదులభోజ
నంబు వెట్టి, గృహస్థగ ♦ ణంబుకంటె
నధికభోగిని జేసె ద ♦ హర్నిశంబు,
ధర్మమూ! జగదానంద ♦ ధర్మవధము. 10

ఉ. ఓయి! ముకుంద! లోకమున ♦ నొందుదుఁ గష్టము నేనటంచు, నె
ప్డాయతదుఃఖసూచకపు ♦ టాస్యము వెట్టుక, జీవితాల్పమ
త్కాయికదుఃఖసంతతుల ♦ కంటె నొనర్తువు కష్ట మిూ; వటు
లేయక నవ్వుమోమునను ♦ జెంత మెలంగుమ! సంతసించెదన్.

ఆ. నేను వత్తు వెంట, ♦ నేను వచ్చెద, నంచు
జగడమాడ, కొంట ♦ రిగను నన్ను
మెలఁగనిండు కొన్ని ♦ నెలలైన; స్వేచ్ఛాసు
ఖంబు గుడువనిండు ♦ కలవుదీఱ. 12

వ. అట్లు చేయనిచ్చుట యపాయకరం బని యెంచి నిత్యానందుం
డి ట్లనియె. 13

క. ఏకాకిగ నినుఁ బంపఁగ
మా కిష్టము కాదు! కాదు! ♦ మ మ్మెందఱనున్
బోకార్చి యరుగు మావల,
నాకరణిం బోక తప్ప ♦ దన్న మహాత్మా! 14

గీ. ఐన వృద్ధునిఁ, బండితు, ♦ నాప్తవరుని,
మంచిచెడ్డలు తెలిసిన ♦ మాన్యు, నల్ల
సార్వభౌముని, ననుభవ ♦ శాలిఁ, బోయి
యడుగుదము దీనిఁ గూర్చి యే ♦ మనునొ యతఁడు. 15

వ. అట్లు చని స్వామియభిప్రాయంబుఁ దెలుప వాసుదేవుండు శీఘ్రం
బ గౌరాంగుకడకు వచ్చి యావచ్ఛక్తి వినియోగపఱిచి యెంటి

మెయిం బోపలదని చెప్ప స్వామి యి ట్లనియె. 16

క. అన్నను వెదకఁగవలె నని
యున్నాఁడను, బోక తప్ప • దోపండితుఁడా!
న న్నడ్డపెట్టి దీయెడ
నన్ని యెఱిఁగి; యిట్లు సేయ • నగునే నీకున్? 17

వ. సార్వభౌముం డి ట్లనియె. 18

చ. ఎఱుఁగుదు నో మహాత్మ! భవ • దిచ్ఛను; దక్షిణదేశమందు భ
క్తిరహితచిత్తులై ప్రజలు • దీర్ఘతమఃపటలీనిమగ్నులై
తెరువును గాన కంధతను • దిమ్మరుచుండఁగ, ముక్తిదీపముం
గరమునఁ దాల్చి పోదు, సరె • కాని చనన్వల దీవొకండవున్. 19

వ. వెంట నిత్యానందుం డి ట్లనియె. 20

సీ. దండకమండలు • ల్లాదిలోఁ బడ్డవెవ
నెత్తి క్రిమ్మఱ నీకు • నెవ్వఁ డిచ్చుఁ?
బారవశ్యంబున • హారలకొలఁది తెప్పి
తలమునఁ బడి యుండఁ • దండ్రి! యయ్యొ!
శ్రీహరినామము • ల్చెవి నూఁది యూఁది ని
న్నెత్తి కెంతొ శ్రమపడి • యెవఁడు తెచ్చు?
నిద్రి నాహారంబు • నిరసించి శుష్కింపఁ
బవళింపు! తిను! మని • యెవఁడు పోరు?

గీ. నన్ను నీతోడ రానిమ్ము • నలిననేత్ర!
తిరిగితిని నేను దక్షిణ • ధరణి యెల్ల;
నెల్లపురములు వనులు నే • నెఱిఁగినవియె;
యింతకంటె నేఁ జెప్పన • దేదియు లేదు. 21

వ. స్వామి తా ననుభవింపవలయుకష్టంబు లితరులుఁగూడ నేల పడ

వలయు ననుతలంపున నితిని గాని మఱియొక భక్తుని గాని తోడఁ గొనిపోవ నొల్లక పోయె; నైనను జిట్టచివరకు "గోవింద" భక్తుని దీసికొని చనక తప్ప దయ్యె; నీతఁడే స్వామిదక్షిణయాత్రా వృత్తాంతంబు లెల్ల లిఖియించి యుంచి లోకోపకారంబు సేసిన వాఁడు; ప్రథమభాగంబులో నించుక తక్క నంతయుఁ జదువుట కిప్పు డున్నది. ఈప్రయాణంబు సేసి తిరుగవచ్చుటకు రెండు వత్సరంబులు పట్టె; నేతద్దీర్ఘయానోన్ముఖుం డై యున్నగౌరాంగుం జూచి భక్తు లందఱు అతివిషాదాక్రాంతహృదయు లైయుండ, స్వామి వారిం జూచి యి ట్లనియె. 22

గీ. ఇంతమాత్రపుదాని కీ ♦ రీట్లు తల్ల
డిల్లుచున్నారు సఖులు; నా ♦ యుల్లమంద
నున్నకోర్కెని దీరుచు ♦ కొన్నవెంట
మార్గమందున మసలక ♦ మఱల వత్తు. 23

వ. అంత సార్వభౌముం డి ట్లనియె. 24

క. నూఱుగురుసుతులు మడిసిన
గౌరాంగా! చింత నొందఁ; ♦ గాని విడిచి నీ
వూరికి నేగినఁ, జింతా
భారము సహియింప నాకు ♦ వశ మానయ్యా! 25

వ. అని సార్వభౌముం డేడువ మొదలువెట్టె; స్వామి వీడ్కొనునప్డు పండితుండు భావివియోగదుఃఖాసహనుం డై పుడమిపై మూర్ఛిల్లి పడియె; నతని, స్మృతి వచ్చినపిదప, సేవకు లింటికిం గొంపోయిరి. నితిప్రభృతులు స్వామితోఁ గూడ నచటికి రమారమి యొకదినంబు ప్రయాణంబున నున్న యొకదేవాలయంబు గల "అలాలనాథ" పురంబుదాఁక సాగనంపం బోయి; రచటి కేగు

నప్పటి కేచటినుండియో వేలకొలఁది ప్రజలు శ్రీచైతన్యస్వామిని దర్శింప వచ్చి యాతనిం జుట్టుకొనిరి. 26

ఉ. వచ్చినవార లందఱును ♦ వారిజనేత్రునిఁ జూచి సంతసే
యుచ్చెము లేని ప్రేమయు మ♦హోజ్జ్వలభక్తియు డెందమందునన్
జొచ్చి ప్రపంచచింతలను ♦ జోద్యముగాఁ బొలియింపఁ, గృష్ణనా
మోచ్చరణంబు సేయుచు స♦మూనముదంబునఁ జొచ్చిరాటలన్.

క. హరినామసంస్మరణంబునఁ
బరమాహ్లాదకరభక్తి ♦ వరనాట్యములన్
బురమెల్లఁ బగలు రాత్రియు
వఱలెన్సుఖపూర్ణ మైన ♦ వైకుంఠమటుల్. 28

వ. నిత్యానందుం డానందాశ్రుపూర్ణనయనంబులతోఁ దనతోడిభక్తులం జూచి యిట్లనియె. 29

సీ. ఎవ రిటఁ జేర్చిరి ♦ యీజనసంఘంబు
నలినాక్షునాకర్ష ♦ ణంబుగాక;
వినువీధిచుక్కలఁ ♦ బెట్టవచ్చును లెక్క
యిచటిజనావలి ♦ నెంచలేము;
జ్యేష్ఠసోదరుఁ జూడ ♦ నే! తాను జనునట
దక్షిణంబునకు నీ ♦ తక్కులాఁడు;
మాయి పోయెడుపని ♦ యేయదియో యిపు
డైన మీ రందఱు ♦ సరసినారె?

. దక్షిణంబువారిఁ ♦ దరియింపఁ జేయుట,
కఘునికాయ మెల్ల ♦ నడఁచుకొఱకు,
భక్తిమధురసుధను ♦ బంచిపెట్టుటకు, ము
క్తిసుఖవార్ధిజనులఁ ♦ దేల్చుటకును. 30

వ. ఈదక్షిణదేశంబున భక్తి వ్యాపింపఁజేయుటలో శ్రీచైతన్యస్వామి పూర్వ మెన్నఁడుం గనఁబఱుపనిమహాదివ్యతేజశ్శక్తులఁ జూపె నని ‘ చైతన్యచరితామృతము ’ నందు వ్రాయఁబడియె. 31

క. సదయుఁడు భక్తులవీడ్కొని
కదలించనెడుతఱినిఁ దన్ము ♦ ఖంబులు మృతదు
ర్వ్యదసంబులట్లు కనులకు
నదర్శనీయంబు లయ్యె ♦ నతిదుఃఖముచేఁ. 32

క. నిస్తేజము లౌవారల
యస్తోకవిషణ్ణముఖము ♦ లరయఁగ, సురజా
తస్తుత్యమోము రాహు
గ్రస్తం బగుచందమామ ♦ కరణి న్దోఁచెఁ. 33

వ. వారి వదలి యాలాలనాథపురి వీడి స్వామి గోవిందునితోఁ జన, నానాఁడు భక్తు లంద ఱచ్చట నిలిచి మఱునాఁడు క్రమ్మఱ జగన్నాథంబున కేగి రంత. 34

శా. గోవిందుండు పిఱుంద రాఁగ జలజా ♦ క్షుం డెత్తి హస్తద్వయిన్
గోవిందా! హరి! నన్నుఁ గావు మనుమా ♦ క్తు ల్గల్గుశ్లోకంబొకం
డావిష్టాత్మతఁ బెద్దనాదముల హృ ♦ ద్యం బాగతి న్బాడుచున్
దోవం బోవుచు నుండె భూమిగతవి ♦ ద్యుద్వల్లియా? వీఁడునా.

చ. ఇరువదియైదువర్షముల ♦ యేపున ముద్దులుగుల్కుమోమునన్
మెఱపులు గ్రక్కునంగముల ♦ మేనిబలంబున గేహసౌఖ్యముల్
దొఱఁగి సమస్తము న్మఱచి ♦ తోరపుబాహు లమేయభక్తిను
ప్పరమున కెత్తి శ్రీహరినిఁ ♦ బాడుచు నన్యుఁ డెవండువోయెడిన్?

సీ. సర్వచరాచర ♦ జాలంబునందు శ్రీ
కృష్ణునే పొడగాంచి ♦ కెరలువానిఁ

గావిచింపులఁ గట్టి, ♦ గరమునఁ గొబ్బెర
    చిప్పను దాల్చి భి ♦ క్షించువాని
జనచిత్తములను గృ ♦ ష్ణునిపాదపద్మంబు
    లకుఁ గట్టి మెలఁకువ ♦ లాగువానిఁ
బరహితార్థ మనిద్రిఁ ♦ బస్తు దప్పినిఁ దక్కు-
    నురుబాధలను బడి ♦ తిరుగువాని

గీ. వానఁ దడియుచు నెండల ♦ వాడువాని
దుర్గమారణ్యములయందుఁ ♦ దూఱి 'కృష్ణ!'
యంచు దీనాననంబున ♦ నార్చువానిఁ
గనిన నెవనికి హృదయంబు ♦ కరఁగ కుండు? 37

గీ. పట్టెడన్నంబొ తరువుల ♦ పండ్లొ మెసవి
పాకయందుఁ దరుచ్ఛాయఁ ♦ బండుకొనుచుఁ
గఱకునేలల సడవులఁ ♦ దిరుగువానిఁ
గన్గిన నెవనికి హృదయంబు ♦ కరఁగ కుండు? 38

క. కఱచెడుపాముల మ్రింగెడు
తరక్షుశార్దూలసింహ ♦ తతి లేశంబున్
సరకుగొనక కాఱడవులఁ
దిరుగుమహాత్మునకు నెవఁడు ♦ తిరుగకయుండున్? 39

క. సురఁ ద్రావినయున్మత్తుని
తెఱఁగునఁ గృష్ణా! యటంచు ♦ దివ్యనినాదో
త్కరములు సెలఁగఁగ నెల్లెడ
దిరుగుమహాత్మునకు నెవఁడు ♦ తిరుగకయుండున్? 40

వ. అడవిలోఁ బ్రొద్దు గ్రుంకిన, శ్రీచైతన్యస్వామి యొకతరుమూలం
బునఁ గూరుచుండి "కృష్ణా! కృష్ణా! శ్రీకృష్ణా!" యని యడవి

యంతయు మాఱుమ్రోయ నఱచుచు మఱలఁ బొర్లుచు వాడుచు వఱకు నట్లే యుండు; నాతనిపాదంబులకడ నిర్భయుండై గోవిందుండు సుఖంబుగ నిద్రించుచుండు; నిశాచరక్రూరమృగంబు లేల వారిం జేరరాక యుండెనో భగవంతుని కెఱుక. పల్లెలం బత్తనంబులఁ బోవునప్పుడు జను లాతిథ్యంబు లెస్సగ జరుపు చుండిరి; కాని వనంబులలో నేగునప్పు డచ్చటియడవిపండ్లే వారికిఁ బంచభక్ష్యపరమాన్నంబు; లీపథిశ్రమంబునకు గోవిందుండు చాలఁ గృశించె; స్వామియుఁ జిక్కిన ట్లగపడె; నిట్లు పోవు చుండ శ్రీకృష్ణస్వామి యొకసన్యాసిరూపంబునఁ బ్రజల నుద్ధరింపవచ్చుచున్నాఁ డనుప్రతీతి యెట్టులో నూరూరఁ బ్రాఁకెఁ; గావున స్వామి యేయూరు సేరిన నంతకుముందె బహుజనులు సమావిష్టులై యతనిబహూకరించుచుండి; రింక స్వామిభక్తివ్యాపనకరమార్గంబు పూర్త చైతన్యచరితామృతంబునం దీచొప్పనఁ జెప్పంబడియె. 41

ఉ. కావుము కృష్ణ! యంచుఁ గన ♦ కద్యుతికాయుఁడు భక్తిపూర్ణుఁడై
పోవుచు నున్నదారిఁ, దన ♦ పొంతకు వచ్చినధన్యపూరుషు
న్నీ వొకసారి శ్రీహరిని ♦ నెమ్మి వచింపు మటంచు వేఁడ మో
దావహభక్తినక్తుఁ డయి ♦ యాతఁడు శ్రీహరియంచుఁ బల్కెడున్.

క. హరి యంచుఁ గొంతదూరము
వఱకు న్గౌరాంగు నంటి ♦ వాఁ డరుదేరన్
సరసీజాక్షుఁడు వానిని
భరిరంభ మొసంగి ప్రేమ ♦ భరితుం జేయున్. 43

క. నిమిషలుకున భక్తుం డగు;
నిమికౌఁగిట నితరజనుల ♦ నిర్మలభక్తి;

ప్రమదాత్ముల్గాఁ జేసెదు
సమర్థతను బడసి సరుఁడు ♦ సనుఁ దనపురికిన్. 44

క. చని యొకభూతము సోఁకిన
తని కైవడిఁ గృష్ణ! యనుచుఁ ♦ దద్దయు నాట్యం
బును జేయుచు నవ్వుచు న
శ్రునివహము ల్గనులఁ గార్చు♦చు నట్టాడున్. 45

సీ. మట్టాడి పురిలోని ♦ మనుజుల నందఱు
హరి యను హరి యను ♦ మనుచుఁ బలుకుఁ;
బలుకువెంటనె జను ♦ ల్పరవశత్వము నొంది
యాడుదు రందఱు ♦హరి హరి యని;
పొరుగూరివార లీ ♦ ముచ్చట విని వచ్చి
యరసి వాక్రుత్తురు ♦ హరి యటంచు;
నని యూరకుండక ♦ కొనిపోయి యూరియం
దఱకు నంటింతురు ♦ తమనుభక్తి;

గీ. యిట్లు హరిభక్తి యొకనినుం ♦ డింకొకనికి,
నొక్కగ్రామంబునుండి యిం ♦ కొక్కగ్రామ
మునకుఁ, గన్యాకుమారిదాఁ ♦ కను బ్రబలము
వెల్లినటువంటితీవ్రవ్యా ♦ పింపఁ జేసె. 46

క. సాధారణనరులకు జగ
దాధారుం డీవయనుచు ♦ హరిభక్తినిఁ దా
బోధించి, యర్హజనులకు
బోధించెను జ్ఞానమంచుఁ ♦బాత్రము చెప్పన్. 47

క. ఒకచో నిలుకడ కుదురమి
సుకరపువాక్స్పర్శముల వి♦శుద్ధపుభక్తిన్

సకలజనుల కిడె నిమి యని
ప్రకటించెడు స్పష్టముగను ♦ బైగ్రింథంబే. 48

గీ. కూర్మపురపరిసరమునఁ ♦ గుష్ఠపీడి
తుండు వాసుదేవుఁ డనునొ ♦ క్కండు గలఁడు;
ప్రబలదేహదుర్గంధంబు ♦ వలన నాతఁ
డూరి కావల దవ్వగా ♦ నుండవలసె. 49

ఆ. డోఁకు వచ్చునట్టి ♦ యాకుష్ఠ దూరుజ
చేత మెత్తఁబడియుఁ ♦ జిత్త మతని;
గైహికార్థవిముఖుఁ ♦ డై యజస్రము నీశుఁ
దలఁచి కొలుచుచుండు ♦ లలితభక్తి. 50

క. దేహాభిమాన లౌకిక
మోహంబులఁ జంపి యతఁడు ♦ పురికిం బయటన్
శ్రీహరిని స్మరియించుచు
దేహస్మృతి వీడి మను ను ♦ దీర్ణపుభక్తిన్. 51

గీ. పుండ్ల మెసఁగుచునున్నట్టి ♦ పురువు లిలను
బడిన, నవి యెత్తి పెట్టు నా ♦ పట్ల మఱల
వాని కాహారభంగంబు ♦ వాటిలు నని;
భూతదయయందు సంతసం ♦ పూర్ణుఁ డయ్యె. 52

శా. శ్రీకృష్ణుం డోకసంయమీంద్రుఁడయి య ♦ క్షీణానుకంపాత్మతన్
శ్రీకూర్మంబున కేగుదెంచి యటనుం ♦ డె న్దేవళంబం, దటం
చాకర్ణించి తదీయదర్శనముకై ♦ యాత్రింబుతోఁ గుంటుచున్
జేకట్టున్గోని వాసుదేవుఁ డరుదెం ♦ చె న్భక్తి చేతస్కుఁడై. 53

క. అరుదెంచి దేవగృహమున
నరయంగా లేక నిమిని, ♦ నంతకు మున్నె

పురుషోత్తముఁ డేగె నటం
చెఱఁగి యతఁడుగూలె నేల ♦ నెంతయు వంతన్. 54

క. చదికిలఁబడి "శ్రీకృష్ణా!
వెదకుచు వచ్చితిని గాని ♦ పింతీ విటనం,
చదయత దర్శన మీయక
కదలి చనితె మఱచి న న్నకట!" యని యేడ్చెన్. 55

క. అరకోసుదూర మేగిన
సురవల్లభుఁ డట్టె తిరిగి, ♦ శ్రుతిపుటయుగమున్
బురిదెసకుఁ బెట్టి, వెంటన్
బరుగునఁ గూర్మిలయుంబు ♦ పజ్జకుఁ బోయెన్. 56

గీ. పోయి క్రిమిపూర్ణదుస్సహ ♦ పూతిగంధ
కలుష మౌవాసుదేవుని ♦ కాయము, నిజ
క్రమగంధోరుబాహుయు ♦ గ్మంబుచేతఁ
బొడువ, నుభయులు వ్రాలిరి ♦ పుడమి సోలి. 57

గీ. సకలపాపాంతకునిపరి ♦ ష్వంగమునను,
ముట్టఁ జూడఁగఁ జెంతకుఁ ♦ బోవుటకు, న
నర్హ మౌవాసుదేవుని ♦ యంగసమితి
స్వచ్ఛనీరోగకల్యాంగ ♦ సమితి యయ్యె. 58

వ. అంత వాసుదేవుండు బాష్పపూర్ణనయనుం డై చేమోడ్చి యి
ట్లనియె. 59

మ. అకటా! యే మిటుచేసినావు హరి! కు♦ష్ఠార్తిప్రశాంతిప్పనీ
డకురాలేదు; త్వదంఘ్రిపద్మములుచూ♦డన్వచ్చినానయ్య; యీ
వికృతాసహ్యవపుర్వశంబునను గ♦ ర్విష్ఠాక నమ్రుండ నై
యకలంకాత్మను నిన్నుఁ బొందఁగల నే♦సంచుంటిఁ బేరాసతోన్.

క. ఆరోగ్యముఁ దనుదార్ఢ్యము
మాటిచి నను, వెండి గర్వ ♦ మాత్సర్యములన్
గూరిచి హృది, నాకు నిన్నున్
దూరము సేయుననుభీతి ♦ దుఃఖింతుఁ బ్రభూ ! 61

వ. దానికిఁ జైతన్యస్వామి యిట్లనియె. 62

ఉ. ఎప్పుడు నట్లు కాదు; క్రిమి ♦ బృందము కై తనువెల్ల నిచ్చు నీ
గొప్పదయ న్వినమ్రత స♦కుంఠితభక్తి విరాగతాధృతిన్
నెప్పరి కృష్ణుఁ డారయుచు ♦ నీ కిపు డిచ్చుట సర్వసౌఖ్యముల్
చొప్పడఁ జేసినాఁడు; పరి ♦ శుద్ధుఁడ వైతివి మిత్రరత్నమా! 63

గీ. ఈమహాద్భుతకృత్యంబుఁ ♦ బ్రేమఁ జేయు
కతన నటఁ బట్టి స్వామికిఁ ♦ గలిగె 'వాసు
దేవరక్షకుఁ' డనుక్రొత్త ♦ ది యొకబిరుద;
మెన్నిబిరుదులు శ్రీహరి ♦ కీయఁ గలము? 64

వ. దక్షిణదేశంబున స్వామి చూచినవారలలో ముఖ్యుండు రాజబిరుదాంచిత రామానందరాయాభిఖ్యుండు. ఉత్కలదేశాధీశుండగు శ్రీప్రతాపరుద్రమహారాజుచేఁ జయింపఁబడిన దక్షిణరాష్ట్రంబుల కధిపతిగా నేర్పఱుపఁబడినవాఁడు; చక్కనిపండితుండును భక్తశ్రేష్ఠుండు నై వాసుదేవసార్వభౌమునితోఁ బెక్కుసారులు భక్త్యాధిక్యస్థాపనార్థంబు వాదించి పరాజితుం డైనవాఁడు. సార్వభౌముండు స్వామిశిష్యుం డైనప్పుడు తా నోర్చినప్రతివాది రామానందరాయనిభక్త్యౌదార్యంబు స్వానుభవంబునం గనుఁగొనుటచేఁ బ్రయాణంబునఁ దప్పక యతనికి శుభదర్శనమహాలాభం బొసంగవలయు నని శ్రీచైతన్యస్వామిని వేఁడుకొనియె; స్వామియు నందున కియ్యకొనియెఁ; దద్రాష్ట్రరాజధాని యగు

విద్యానగరంబె రామానందరాయనికి నివాసంబై యుండె; ని
ట్లుండ. 65

క. పావనమూర్తి మిశ్రిజుఁడు♦ పైనము సేయుచుఁ బోయి పోయి, గో
దావరి దాఁటి యాత్మతను♦ తాంతినివారణపుణ్యవారిలో
నావలియొక్కఘట్టమున♦ హాయిగ స్నానము చేసి, కృష్ణచిం
తావశచిత్తవృత్తి నొక♦ తావున దవ్వునఁ గూరుచుండెఁ దాన్.

వ. అపు డపుడు రామానందుం డాఘట్టంబునందే స్నానము చేయు
వాడుక గలదు. నాఁ డేలో తప్పక స్నానము చేయవలయునను
మహాకుతూహలం బతనికిఁ గలిగె, నంత. 67

గీ. వేగురుమహాభటు ల్తన♦వెంట రాఁగఁ,
దాళమర్దళముఖ్యవా♦ద్యములు మ్రోఁగ,
నాకసంబున బహుపతా♦కాళు లాడ,
రామరాయఁడు మజ్జనా♦ర్థంబు వచ్చె. 68

వచ్చి స్నాన మాడి ♦ పై కేగుదెంచి తా
నట్టు లిట్లు చూడ ♦ నటకుఁ గొంత
దూరమందు నున్న ♦ గౌరాంగుఁ డగపడె
నొడలిమిసలు కడలఁ ♦ గడలుకొనఁగ. 69

శా. సామాన్యంబుగ సంయమీంద్రులు మహా♦జ్ఞానావబోధంబులన్
బ్రేమ స్ఫక్తిని జుల్కఁజేయుటను సం♦వీక్షించుట, న్జంకునన్
రామానందుఁడు పోఁడు వారికడ; కై♦న న్దివ్యదేజోధికుం
డామిశ్రాత్మజుఁ జూచినంతఁ జన నూ♦హం బుప్పతిల్లె న్మదిన్.

. చని చైతన్యస్వామికిఁ
బ్రణమిల్లెం బెద్దభక్తి♦రాయఁ; డతఁడు వ

చ్చునని యెఱిఁగిన శచీజుం
డనుమా! యొకసారి "కృష్ణ!" ♦ యని యర్థించెఁ. 71

గీ. అట్టు లర్థించుచేఁ కాక ♦ యతివరుండు
నీవె? యల్లరామానంద ♦ నిర్మలాత్ముఁ
డ, వని పృచ్ఛించె; నంత నా ♦ యవనివిభుఁడు
వలికె, నౌ నేనె యామహా ♦ పాపి, ననుచు. 72

సీ. ఉజ్జ్వలాంగుం డంత ♦ హుంకార మొనరించి
తనకౌఁగిటను బట్టు ♦ కొనియె నతని;
వెంట నాయిర్వురుఁ ♦ బెద్దమూర్ఛను జిక్కి
యన్యోన్యబద్ధులై ♦ యవనిఁ బడిరి;
తనువులఁ బులకలు ♦ తద్దయుఁ బొడచూపె;
నూపిరి పోయిన ♦ ట్లుండెఁ బైకి;
నరమోడ్పుఁగన్గవ ♦ ల్వఱలె; నచ్చటినుండి
కాల్వలై బాష్పము ♦ ల్గాఱుచుండె;

గీ. రాజపరివారజనులు వె ♦ఱఁగు సెంది
చూడఁ బోయిరి; చూచిన ♦ తోడ వారు
సాయమొనరించుటకు మాఱ ♦ మేయభక్తి
విహ్వలతఁ జూచుచుండిరి ♦ విభుని యతిని 73

వ. అంతం గొంతవడికి నుభయులు పునస్స్మృతింబొరసి యొకరినొకరూరక గాఢానురాగవిలోకనంబులఁ జూచుకొనుచుండి;రిట్లుకొంతసే పైనపిదపఁ జైతన్యస్వామి మౌనముద్రవీడి యల్లన నిట్లనియె.

సీ. శ్రీజగన్నాథపు ♦ రీతిలకమ్మునుండి
నే వచ్చుచుంటి; నా ♦ తావునందు

నివసించునట్టిపం ♦ డితసార్వభౌముండు
కడుదయతో నన్ను ♦ గారవించు;
సుతువలె నాతఁడు ♦ సూచు న న్నెప్పుడుఁ
గనుల ఱెప్పలయట్లు ♦ కాచుచుండి;
తప్పక భక్తస ♦ త్తముని రామానందు
నారసి నీవు కృ ♦ తార్థుఁడ వగు,
గీ. మంచు నా కానతిని బ్రిసా ♦ దించినాఁడు;
కాన, వచ్చితి నిటకు ; నా ♦ కంటఁ బడితి
కష్టపడకుండ సర్వార్థి ♦ కారి వైన ;
నేమిపుణ్యంబు చేసితి♦నో ! మహాత్మ! 75

వ. రామానందుం డిట్లనియె. 76

సీ. నలినలోచన నేఁడు ♦ నాజీవితమునందుఁ
గొప్పమా ర్పొక్కటి ♦చొప్పడియెను;
దేవప్రసాదంబుఁ ♦ దెచ్చితి దివినుండి,
స్వామి ! యమానుష ♦ శక్తి నీది,
చూడు వేగురు భక్తిఁ ♦ జొక్కి యె ట్లాడుచుఁ
బాడుచు నున్నారొ ♦ పరమపురుష!
యఱ్ఱులశ్రీకృష్ణ ! ♦ హరి ! యని యాడుచు
న్నారు పాపియు శుంఠ ♦నాస్తికుఁడును;
ఆ. నరున కిట్టిమహిమ ♦ పొరయ దెన్నండు; నేఁ
బాపవాపి, నీవు ♦ పావనుఁడవు;
ముట్టికిముద్ద శుద్ధ ♦ ముగఁ జేసినా వయ్య
చేర్చి యక్కునందుఁ ♦ జిత్రముగను. 77

గీ. వరద! సార్వభౌముఁడు నిన్నుఁ ♦ బంప లేదు;
నీవె వెదకికొనుచు నన్నుఁ ♦ గావ నిటకు
వచ్చినా; వది యెఱుఁగుదుఁ; ♦ బాపి పాప
మెంతమెక్కుడో నీకృప ♦ యంతయుఱవు. 78

వ. స్వామి చిఱునవ్వుతో ని ట్లనియె. 79

ఉ. భక్తులచుట్టు నున్నప్రతి♦వస్తువు, వాయువుసైత, మచ్ఛతో
దిక్కుత నొప్పు;నీభటులు ♦ దీర్ఘపుభక్తిని కృష్ణనామసం
సక్తిఁ జెలంగు టబ్రిమొకో?♦నంయమి నైనను నాకు వచ్చెఁగా!
భక్తి యొకింత నీవిమల ♦ పావనకాయము నంటుతోడనే. 80

వ. సన్న్యాసులు ధనాధికులగృహంబులఁ గుడువఁ గూడ దని కాఁ
బోలు నీప్రసంగమధ్యంబున నొకపేదపాఱుండు ముందునకువచ్చి
స్వామికి భిక్షావందనంబు గావించె; నంత గౌరాంగుండు "రామా
నందా! నీపవిత్రజిహ్వనుండి శ్రీకృష్ణసంబంధమధురవాక్యంబులు
విన నాకుఁ జాలఁ గుతూహలంబు గల" దనఁ జేతులు జోడించి
రామరాయం డి ట్లనియె. 81

సీ. నన్ను రక్షింపఁ బం ♦ తముపట్టి వచ్చితి,
వది నే నెఱుంగుదు ♦ నంబుజాక్ష!
యరుదెంచినట్టికా♦ర్యముఁ జేసికొనకుండ
నరుగ విచ్చటినుండి,♦యది యెఱుఁగుదుఁ;
గాని, నే మనవి యొ♦క్కటి చేసికొనియెదఁ
జిద్రూప! దానినిఁ ♦జిత్తగింపు;
మంతట నింతట ♦ నగునట్టిపని గాదు,
జలధిఁ దీపిగఁ జేయఁ ♦ దలఁచినావు;

గీ. జన్మజన్మార్జితము లైన, ♦ సకలవిధము
లైన, నెంచుట కలవి గా ♦ నట్టి వైన,
భయదదుష్పాపములను దు ♦ ర్భరపుటసట
నిండు పెనుగోత, నేను ము ♦ నింగి యుంటి. 82

వ. రామానందునిదారాక్షణంబుగం గొని శ్రీకృష్ణప్రేమకు నైహిక భాగ్యభోగంబునకు నవిరోధంబు స్వామిపరిజలకు బోధించె; నా సాయంకాలంబున రామానందుం డేకానుచరుం డై సామాన్య వస్త్రంబులు ధరియించి చైతన్యస్వామియొద్ద కేతెంచి నమస్కరించి యుచితాశీర్వాదంబు వడసినపిదప నన్యప్రసంగంబునం గాలయాపనంబు సేయ నొల్లక స్వామి యి ట్లనియె. 83

క. ధరణిం బుట్టినమనమం
దఱము న్బడునట్టిదుఃఖ ♦ తతి నేపగిదిన్
దరియింపం గలమొ, నీశ
ర్కరం బోలెడునుడులం జెప్పు ♦ రామానందా! 84

సీ. ఏమి యీప్రశ్నం? బ♦దే నెట్లు చెప్పుదుం?
గొంచక యతికి బో ♦ ధించు టెట్టు?
లీతనియుద్దేశ♦మే మయియుండును?
భక్తి ఖండింప నీ ♦ పగిది ననెనె?
సన్న్యాసి యడుగుట ♦ సంసారి చెప్పుట
విషయము ముక్తి యీ ♦ వింత గలదె?
"నుడువ నే" ననుటకు ♦ నో రాడకున్నది,
చెవి యొగ్గి వినువాఁడు ♦ చెప్పవలసె,
గీ. ముందువోయిన నూయి పి ♦ ఱుంద గొయ్యి,
యేమి సేయంగ నగు నయో! ♦ యిప్పు డంచుం

గలవరము సెంది రాయఁడు ♦ కట్టకడకు
ధైర్యమును దెచ్చికొని యిట్లు ♦ తా వచించె. 85

క. నీవంటిజ్ఞానపూర్ణున
కీవిషయమునందు సంయ♦మీంద్రా ! చెప్పన్
నావంటివాఁ డసర్థుఁడు;
కావునఁ గరుణించి నన్ను ♦ క్షమియింపవలెన్. 86

మ. అన గౌరాంగుఁడు రామరాయ! యిలము♦క్త్యర్థంబునావంటిమూ
ఢనరు లోవఁగ యుక్త మైనగతియే♦డ న్లేదె? శ్రీకృష్ణుఁగూ
ర్చి నుడు ల్వల్కఁగ లేవె? వాని విని సం♦ప్రీతి జ్జన న్వచ్చితి,
న్ననుఁ దృప్తాత్ముని జేసిపంపఁగ దెయ♦న్నా! యంచుఁ బ్రార్థించినన్.

వ. ఇఁకఁ దప్పించుకొనునుపాయంబుఁ గానక రామానందుం డాలో
చించి యి ట్లనియె. 88

ఉ. పూర్వులు దీనిఁగూర్చి యిటుః ♦ బోధ మొసర్చిరి ; యెవ్వఁడేని త
త్పూర్వము తండ్రితాత లెది ♦ పూనిరో యామతముస్గ్రహించి ని
ర్గర్వవిశుద్ధచిత్తమున ♦ శ్రద్ధను దద్విధు లాచరింప; నీ
యుర్విఁ గ్రమక్రమంబునమ♦హోన్నతముక్తిపదంబు వొందెడున్.

వ. ఇది యతిసులభం, బెట్టియజ్ఞానాంధుం డైనను జలుపవచ్చు, నని
విష్ణుపురాణంబునుండి యొకప్రమాణంబు చదివె; నది విని స్వా
మి లోఁతున కేగి మఱలఁ జెప్పుమన, రామానందుం డి ట్లనియె.

చ. సరిపడదేని యీ తెఱఁగు ♦ చక్కనిమార్గము నొందు చెప్పెదన్
బరమకృపాబ్ధిమీఁదఁ దన♦భారము సర్వము వైచి యిచ్చ మె
ప్పరుసున నీకుఁ బుట్టు నటె ♦ పాలనసేయు మటంచు, నిర్ధరన్
దిరిగెడువానికి న్దొరకు ♦ దివ్యమహామృతసౌఖ్యసంపదల్. 91

వ. అని శాస్త్రప్రమాణంబులతో విన్నవింప స్వామి ‹‹ సరి! సరి!

యీపైపైపలుకుల కేమి! భగవంతుండు సర్వాధికారసర్వశక్తి భీకరోద్దండచండశాసనుం డనెదవే? యింక లోఁతుమాటలు చెప్పు" మన రామరాయండు వెండి యాలోచించి. 92

చ. తనమత మంటి పోవు టది ♦ తప్పని తోఁచిన,నమ్మకంబు పెం
పున నరుఁ డొండుసన్మతముఁ♦బూనిచరించిన, వాఁడుసిద్ధిఁబొం
దును నిజబంధుమిత్రులకు ♦ దూరమునందున నున్న ; నిట్లు చె
ప్పును మతపుస్తకంబు లని ♦ పోషణవాక్యముల న్వచించెదాౘ.

వ. ఏమతంబునసైన శ్రద్ధాభక్తులును బరమేశ్వరప్రాప్తికై కష్ట సహనంబు నున్న వాంఛితార్థసిద్ధి యగు ననియా? చెప్పితి; విద్యయుం బైమాటలే కావున, నిమ్న గుప్తార్థంబు లున్న, నవి తెచ్చి నా కిమ్మని స్వామి పలికె నంత. 94

సీ. రామరాయఁడు గురు ♦ ప్రాజ్యపదంబందు
నున్నపోల్కిని జెప్పు ♦ చున్నఁ, జెప్పి
నవి యెల్లఁ బైమాట ♦ లని తృణీకారంబు
విశ్వంభరుండు గా ♦ వించుకతన,
సర్వజ్ఞుఁడును సర్వ ♦ శక్తుండుఁ గఠినాత్ముఁ
డౌ పరీక్షకుమోఁల ♦ నతిభయమునఁ
జేరి పరీక్ష ని ♦ చ్చెడియొక్కబాలకు
నోజఁ బాపం బాతఁ ♦ డుండె ; నుండి

గీ. పల్కునది యెల్లఁ గా దని ♦ పల్కు నితఁడు,
చిత్తతృప్తిగ నే నీకఁ ♦ జెప్పు టెట్లు?
వింతగా నున్న దిది! యని ♦ చింత చేసి
చేసి, రాయఁడు తుద కిట్లు ♦ చెప్పఁ దలఁచి. 95

క. భక్తిజ్ఞానావాప్తిని
ముక్తిఁ దగుముముక్షు వంచుఁ ♦ బురుషోత్తమ! గ్రం
థోక్తుల్గల; వని దానికి
యుక్తం బగునొక్కశ్లోక ♦ మొయ్యనఁ జదివెన్. 96

వ. అది విని చైతన్యస్వామి యిట్లనియె. 97

మ. భగవద్దర్శనముక్తిసాధనము సం♦పాదించుకో నేను బె
ద్దగ నీయొద్దకు వచ్చినాను జుమి; వ్య♦ర్థక్షారనీరంబు చేఁ
దగఁ దీర్ప న్గమకించి దాన మతి యిం♦త ద్దప్పి పుట్టింతు; వీ
విఁగలోలోఁతున కేగి తెచ్చియిడుమా!♦తృడ్వారకాచ్ఛాంబువుల్.

వ. అంత. 99

ఉ. జ్ఞానము భక్తియు న్దఱచు ♦ జంటగ ముక్తికి సాధనంబులే;
యైనను జ్ఞానము న్వదలి ♦ యచ్చపుఁగేవలభక్తిఁ గొల్చుటే
దానికి ముఖ్యసాధనము ♦ తండ్రి! యటంచొకసత్ప్రమాణ మ
ద్దానికిఁ బోషణంబుగ న♦తండు పఠించె విశిష్టపాండితిన్. 100

సీ. భగవంతుఁ దెలియంగఁ ♦ బాట్లుపడును జ్ఞాన;
మతనిఁ బొందఁగ భక్తి ♦ యాసపడును;
బొందిన, వానినిఁ ♦ బూర్ణంబుగనొ స్వల్ప
ముగనొ తప్పక శక్య ♦ మగు నెఱుంగ;
నింతయో యంతయో ♦ యెఱిఁగినమాత్రాన
నరుఁ డాపరేశునిఁ ♦ బొరయ లేఁడు;
మఱియు నెడారిఁ గుప్ప♦మ్మరి సికతాపీలు
వుల లెక్కఁ బెట్టెడు ♦ పురుషుఁ డట్లు

ఆ. విసిగి విసిగి యతఁడు ♦ విముఖుఁడై విఫలార్థ
వికలచిత్తుఁ డాచు ♦ విగతధైర్య

మునను దిరిగి వచ్చు; ♦ మనసునఁ గలతొంటి
భక్తిలవముగూడఁ ♦ బాడువడును. 101

గీ. కేవలజ్ఞానమంటి త♦ర్కించి పోవు
పురుషుఁ డీశ్వరునకుఁ బరా♦ఙ్ముఖుఁ డగు; నిఁక
భక్తి నాతనిసేవించు ♦ వాఁడు తప్ప
కింతయో యంతొ తత్సమా ♦ కృష్టుఁ డగును. 102

క. చిఱుబుట్టునరుఁడు, జ్ఞానము
తెరువునఁ జని దేవు నరయ, ♦ ధృతివీడి, పరా
త్పరుఁ డొక్కదూరదుర్గమ
ఖరతేజం డనెడుబుద్ధిఁ ♦ గ్రమ్మఱవచ్చున్. 103

క. సుతుఁడు బలాధికుఁ డగుతన
పితకడకుం బోవుమాడ్కి ♦ బ్రియపడి భక్తుం,
డతికౌతూహలమున దే
వతఁ గొలుచును గనుల మోద ♦ బాష్పము లురలన్. 104

ఆ. గుడ్డిభక్తి యైనఁ ♦ గూల్పక జ్ఞానంబుఁ
గ్రమముగాను దానిఁ ♦ గాచి పెంచు;
జ్ఞాన మింక భీతి ♦ సంశయంబులమనం
బునకుఁ దెచ్చి భక్తిఁ ♦ బొలియఁ జేయు. 105

క. చిఱుత తెలివిపులుమానిసి
పరమాత్మ నెఱుంగఁ దివిరి ♦ పరికించుట, లోఁ
తెఱుఁగఁ దలఁచి యలయంబుధిఁ
బురువు సారం బాఱినట్లె ♦ పొడగాంచినచోన్. 106

క. మేయపుమానవబుద్ధి, న
మేయపుఁబరమాత్మ నరయ ♦ మేకొనుపురుషుం,

డీయనువున బహుసందే
హాయత్త్రాత్ముఁ డయి బాధ ♦ నందెడు జగతిన్. 107

సీ. ఎల్లలోకంబుల ♦ నీశుండు సృజియించెఁ,
గానిమ్ము; వానికిఁ ♦ గర్త యెవఁడు ?
మొదలు మధ్యము నంత♦మును గూడలే వఁట !
యెట్లెట్టివాని నూ ♦ హింపఁ గలము ?
మనసుఖదుఃఖము ♦ ల్గనకయుండిన, నాతఁ
డున్ననే మింక లే ♦ కున్న నేమి ?
సౌఖ్యముల్గొన్ని యీ ♦ జగతి నున్నవి; లోక
మసుఖకరంబు గాఁ ♦ బొడవుసూపు;
గీ. నాఁకలి యొనర్చినాతఁడా ♦ హార మిచ్చె;
నీరువ ట్టిచ్చినతఁడె పా♦నీయ మొసఁగె;
నియమితార్కేందునక్షత్ర ♦ చయచలనము
లరయఁ దత్కర్త యవివేకి ♦ యనఁగలేము. 108

సీ. పుణ్యాత్ములను, మంచి ♦ పుష్పంబులను, దక్క-
తతమోదకరపదా ♦ ర్థములఁ జూడ
నతఁడు కృపాయుతుఁ ♦ డంచుఁ దోఁచెడుఁ; గాని
యేల రోగాశని ♦ మృతు లొనర్చె?
లేఁబచ్చికను మేయు ♦ లేళ్ల బెబ్బులు లేల
కృపలేక పైఁబడి ♦ మ్రింగవలయుఁ ?
గప్ప పుర్వులఁ, బాము ♦ కప్పలఁ, బాముల
దుప్పి, దుప్పుల నరు ♦ ల్దోర్చుచుంద్రు;
గీ. నిండి యెల్లెడఁ జావె కా ♦ న్పించు నయ్యొ!
యతఁడు పరమదయాళు వం ♦ చనుట యెట్లు ?

క్రొంత దయగలవాఁ డైనఁ, ♦ క్రూరుఁ డాతఁ;
డట్టిభగవంతుఁ డుపకారి ♦ యౌనె? కాఁడు. 109

సీ. పుట్టినతోడనే మడియుఁ ♦ బాలుఁ డొకప్పు, డ దెందుచేతనో?
గిట్టుట యన్నసర్వము ము♦గించుటయే భవనాటకంబు ; చూ
పట్టదు జన్మ మన్య ; మది ♦ పట్టియసత్యము ; వెండి వచ్చుటిం
కెట్టులు గల్గు దగ్ధ లయి ♦ పృథ్విని బూడువఁబడ్డవారికిన్? 110

క. సందియపుసృష్టికర్తకు
వందనపుశ్రమంబు లేల? ♦ ప్రాణంబులు మై
యం దుండుతఱినె, సర్వా
నందంబులు గుడిచి జీవ ♦ నము చాలింతుర్. 111

వ. ఇట్లు నానాసందేహాబ్ధికల్లోలాందోళితచిత్తుం డై జ్ఞాని కొట్టుకొను
చుండ. 112

ఉ. ఏమిప్రయత్నము ల్సలుప♦కే, యనుభూతిని గ్రుడ్డిభక్తిచే
స్వామిరహస్యతత్త్వమును ♦ సర్వము భక్తుఁ డెఱుంగఁ జాలు ; స
త్ప్రేమనిధాన మీశుఁ డని ♦ వేఁడెడువానికి బుద్ధ్యగోచరం
బౌ మితిలేనియాత్మవిష ♦ యంబులు గోచర మౌఁ గ్రమంబుగన్.

వ. ఈచివరఁ జెప్పినమార్గంబునకు గౌరాంగుం డించుకంత సంతో
షించిన ట్లగపడి రామానందా! మంచిపథంబె బోధించితి; సరియె
కాని దీనికంటెఁ జక్కని దింకొండు లేదా? యని యడిగె నంత.

మ. భగవద్గీత సమస్తమానవులకుం ♦ బ్రామిన్కులై నన్,
భగవల్లీలల నిండుగాఁ దెలుపున ♦ ద్భక్తిప్రధానోల్లస
న్నిగమప్రాయసుబోధభాగవతమే ♦ నిర్వాణమోదార్థికిన్
దగుసద్గ్రంథము; గాన భక్తుఁ డది శ్ర♦ద్ధ న్గాఁ బఠింపన్వలెన్.

వ. అని పెద్దలు చెప్పుదురు కదా! యీభాగవతబోధసాధనంబున స్వామికిఁ దృప్తికరం బగునుత్తరంబు నిచ్చెద నని యూహించి.

గీ. వాసమందుఁ గుటుంబసం ♦ బంధములను
గృహమువా రుందునట్లు, స♦ర్వేశుఁ గొలువ
వలయు నీలోకమున; నను ♦ తలఁపు వొడమ
రాయఁ డిట్లనె సంయమి ♦ పరివరుతోడ. 117

చ. పలుకులు నావి భావములు♦వల్లభ! నీయవియట్లు తోఁచు; నీ
తలఁపులు నాకు లేవు తొలు♦త; న్గడుఁజిత్రము గాఁగ నీకడ
గలిగెడు; నన్నుఁ జెప్పు మని♦కాటియ పెట్టెదు; నీవెనాయనా!
తెలిపెదు ముక్తిసాధనత♦తి న్జనపాళికి మన్ముఖంబునన్. 118

క. చిలుకవలెఁ బలుకుమనియెడు
పలుకుల నన్నిటిని నేనె ♦ పలికెద మాయీ!
తెలిపెద ముందటిమార్గం
బుల కధికం బైనయొక్క ♦ పుంతను వినుమా! 119

క. బుద్ధివచఃకర్మంబుల
సిద్ధింపనిముక్తిసుఖము ♦ సిద్ధించును సం
శుద్ధానురాగగరిమని
బద్ధు జ్జేయఁగలమేని ♦ పరమాత్ము హరిన్. 120

గీ. ప్రభునివిశ్వాసి యైనసే♦వకుఁడువలెను
జనకులవిధేయుఁ డౌమంచి ♦ తనయుఁడట్లు
లీశ్వరుని మంచిప్రేమఁ జూ♦పించి కొలువఁ
బురుషునకుఁ దప్పక దొరకు ♦ ముక్తిసుఖము. 121

వ. దైవానురాగంబుల నిదియూ? యుత్తమంబని స్వామి యడుగ, రామరాయం డాలోచించి యి ట్లనియె. 122

గీ. పరమమిత్రుల, సత్సహో ♦ దరుల, ప్రేమఁ
బోలుప్రేమను బరమాత్మ ♦ మును భజింప,
శౌరిఁ బ్రేమించినట్టియా ♦ సీరి కట్లు
భక్తజనులకు ముక్తిలా ♦ భంబు గలుగు. 123

వ. రామానందా! యీశ్వరుపైయనురాగంబుం బోల్చుట కింతకంటె బలవత్తర మైనప్రపంచానురాగంబు లేదా? యని స్వామివికసిత వదనారవిందుం డై ప్రశ్నింప నాతం డిట్లనియె. 124

గీ. నందుఁడు, యశోద, శ్రీకృష్ణు ♦ నందు నెంత
ప్రేమ ముంచిరో యంతన ♦ త్ప్రేమఁ జూపి
దేవుఁ గొలిచిన ముక్తి ప్రా ♦ ప్తించు; నంత
శ్రేష్ఠము జనకనందన ♦ ప్రేమ మిలను. 125

వ. స్వామి చిఱునవ్వు నవ్వి నాకడ నేరహస్యంబు డాఁపక చెప్పు మన రామరాయండు వెండియు ని ట్లనియె. 126

సీ. అన్నిరహస్యంబు ♦ లబ్జాక్ష! నీయవి;
లేవు నాయం దట్టి ♦ వేవి స్వామి;
నామూలమున జన ♦ స్తోమంబునకు నవ్వి
ప్రకటింతు లోకర ♦ క్షకుఁడ వీవె;
చింతించి చెప్పెదఁ ♦ జిత్తగింపు మహాత్మ!
యవని, భర్తకును భా ♦ ర్యకును గల్గు
ప్రేమంబు దాఁటిన ♦ ప్రేమంబు గనరాదు;
నరుఁ డట్టిప్రేమంబు ♦ నను బరేశుఁ

ఆ. గొలువ ముక్తి వచ్చు; ♦ గోపాలకృష్ణుని
నిత్య మల్లరుక్మి ♦ ణీపరిభృతులు

చిత్త మర్పితంబుఁ ♦ జేసి సేవించిన
పగిది దేవుఁ గొలువ ♦ వలయు జనుఁడు. 127

వ. ఇదివఱకుఁ జెప్పినయనుకంపాపరంపరలో నిదియే యుత్తమంబు; కాని యింతకంటె నధికానురాగం బెక్కడ లేదా? యని గౌరాంగుండు పృచ్ఛింప శ్రీమద్భాగవతంబునుండి యొకశ్లోకరత్నంబు చదివి రామానందుం డిట్లనియె. 128

సీ. తనసొత్తని, స్వసుఖ ♦ తత్పరత్వంబునఁ
బుస్తె గట్టిన యట్టి ♦ పొలఁతి మగని
వలచు; నాప్రేమంబు ♦ దలఁపఁగ నిష్కామ
మైనప్రేమము గాదు; ♦ దానికంటెఁ
గలదు ప్రేమంబొండు ♦ బలవత్తరం బైన,
దద్ది జారిణి కుండు ♦ నట్టివలపు;
విటునికై సర్వంబు ♦ విడిచిపెట్టును; వాఁడు
తనవాఁడె కాఁడని ♦ యును దెలియును;

గీ. గూడి యుపపతి తన్నడ్డి ♦ వీడవచ్చు;
నోఱపు యోగ్యత యచట లే ♦ కుండవచ్చుఁ;
దెరువునను దన్నుఁ బాములు ♦ కఱవవచ్చు;
బయలుపడఁ, దాను వెలివేయఁ ♦ బడఁగవచ్చు. 129

ఉ. భిత్తరి గేహకృత్యములు ♦ ప్రీతిగఁ జేసినయట్లె సేయుఁ; దా
నెత్తుకొను న్నిశూత్కరము♦నెంతయొ నిక్కపుఁబ్రేమ యున్నయ;
ట్లత్తకు నాఁడుబిడ్డలకు ♦ నన్నిటఁ దృప్తిని జేయుఁ; జేసినన్
జిత్తముమాత్రమాంబొజుఁగు ♦ చేరువ నుండుఁ బడంతికెప్పుడున్,

క. వనితా యింతటిమోహం
బునకుం గత మేమి? యన్య ♦ పూరుషసంగం

బును దలఁపవలదు నా, స
ట్లొనరింపక యుండలేమి ♦ నొనరింతు సనుఁ. 131

గీ. ఇట్టితీవ్రపునిష్కామ ♦ వృత్తి నీవుఁ
గోరి భక్తప్రికాండంబు ♦ గొలుచుచున్నఁ,
బరుల కందనిరుచిరాప ♦ వర్గసుఖము
హస్తగత మౌనటండ్రు మ♦హాత్ము లిలనే. 132

వ. అందునకుఁ జైతన్యస్వామి యి ట్లనియె. 133

క. అమృతరససన్నిభంబులు
సుమి నీవాక్యములు ! నన్నుఁ ♦ జొక్కించెదు ; నీ
యమితానందం బెంతటి
శ్రమపడినను జెప్పలేను ♦ రాయఁడ ! నోటన్. 134

వ. కాని నాయతృప్తికి క్షమించి, దీనికంటె నుత్కృష్టతరం బగు ప్రేమం బున్నయెడ నానతిమ్మనిన రామానందుండు సస్మితాననుం డై యి ట్లనియె. 135

క. ఇలఁ బ్రియురాలికిఁ బ్రియునకుఁ
గలయనురాగంబుకంటె ♦ ఘనతర మానే
వలపు న్లే; దైనను మదిఁ
దలఁచి స్ఫురించినను దానిఁ ♦ దండ్రి ! నుడివెదన్. 136

క. పలికి యటు రాయఁ డిట్టులు
పలికెను "యతివర్య ! దాని ♦ పై ప్రేమంబున్
గలదు కలదు, రాధాకృ
ష్ణులప్రేమం బట్టిదంచుఁ ♦ జూపట్టుఁ బ్రభూ !" 137

వ. అంత గౌరాంగదేవుం డానందజ్యోత్స్నావిరాజమానదివ్యసుందరవదనంబుతోఁ దండ్రి ! దానిస్వభావం బెట్టిదో కొంచెము పెంచి

చెప్పె మన రామరాయం డిట్లనియె. 138

క. శుద్ధుఁడు శ్రీకృష్ణుం, డిఁక
శుద్ధతయే! రాధ; వారి♦సురుచిరసత్ప్రే
మౌద్ధత్యము పరిశుద్ధం;
బిద్ధర నటువంటిప్రేమ ♦ మెచ్చట నుండున్? 139

చ. మనుజులకుం బ్రియం బగున♦మస్తముఁ గృష్ణునిప్రీతికై నివే
దన మొనరించె రాధ సత♦తం బతని న్దలపోసికొంచుఁ; గృ
ష్ణునిసుఖ మాత్మసౌఖ్యముగఁ ♦ జూచె నలక్ష్యము సేసి లోకనిం
దనునయితంబు; శ్రీహరిక ♦ థాసుధ యన్నము నీరమాయె నర్.

క. చావఁగ నున్నపుడు పున
ర్జీవితఁగాఁ జేసె నామెఁ ♦ గృష్ణునిశుభనా
మావళి; హరిమయచిత్తత
నీవడుపున నుండి, కోర ♦ దేమియు నతనిన్. 141

వ. శ్రీకృష్ణుండు మధురానగరంబున మహారాజవైభవంబుతో నుండ రాధ చెలికత్తె లాతనిందీసికొనిరమ్మనెదవా యని యడుగ నామె వలదని యీాపగిదిం జెప్పె. 142

మ. చెలులారా! మధురాపురీవరమున ♦ న్శ్రీకృష్ణురాజోపభో
గలసద్వైభవనిత్యసౌఖ్యములతోఁ ♦ గాలంబుపుచ్చంగనిం;
డిల నేదుఃఖిత నైన నేమి? యతని ♦ న్వీక్షింప నా కెంతయో
కల దుత్కంఠ నిజంబె; కాని విభు నా♦కై,యొప్పబాధింపఁగన్.

ఆ. నాదుసుఖముకొఱకు ♦ నాముద్దుఁగృష్ణుని
మధుర విడిచి సుఖము ♦ మాని యిటకు
బృంద కడవిపట్లు ♦ కేతెంచుమని వేఁడ
రాదు రాదు రాదు ♦ రాదు-ఇవ్వ. 144

వ. రాధావిరహార్తిం గాంచి చెలులు భీతిం జెంది యమ్మా! మధుర
నున్నశ్రీకృష్ణుని బంధించి తెత్తుమా? యన్నఁ గంపితశరీర యై
యామె యిట్లనియె. 145

ఆ. కట్టి తెచ్చుటేమి ♦ ఘనకార్య? మిందీవ
రాక్షులార! యెవ్వ ♦ రట్లు సేయఁ
జాల? రెడఁద నున్న ♦ సద్భక్తి ప్రేమయు;
రాధమాత్రి మట్టి ♦ త్రాఁగ గాదు. 146

క. చీటికి మాటికిఁ బాపము
పాటింపక బాధపెట్టి ♦ భక్తులు తమకై
పాటుపడఁ జేసి వేఁపుదు
రాట్టవికస్థలులఁ బత్త్ర ♦ నాదుల విభునిన్. 147

క. నావాఁ డాతం డెప్పుడు;
నే వల్లభుదాని నైతి ♦ నిత్యం; బకటా!
యీవడువున నే నుండఁగ,
జీవేశుం గట్టితేరఁ ♦ జే! యొప్పుదునే. 148

వ. అని వెండియు నిట్లనియె. 149

సీ. తెచ్చుటే మంచిది; ♦ తెచ్చిన సద్ది నా
కై కాదు నాథుసు♦ఖంబుకొఱకే;
మధురలో నుండెడు ♦ మనుజులంద అళీక
మిత్రు, లవిశ్వాస ♦ పాత్రజనులు,
వింతవా రెల్లరు ♦ విభునకు; స్వార్థప
రత్వాకాలుష్యాంత ♦ రంగు లకట!
నాప్రాణనాథు నె ♦ న్నఁడు సట్టిచోటుల
నుండనీ నిటఁ బ్రాణ ♦ ముండువఱకుఁ;

గీ. నెట్టు లతఁడు సుఖంపడు ♦ నట్టిచోటఁ;
కృష్ణునిరామ్రయహృదయంబు ♦ నే నెఱుఁగుదు;
నకృతకవిశుద్ధసత్ప్రేమ ♦ కన్య మైన
దేది యతనికి సంతోష ♦ మీయ లేదు. 150

క. అరవిందాక్షుఁడు, కావునఁ
దరలి వెసన్బృందకడకుఁ, ♦ దనసన్మిత్రుల్
దిరిగెడుచోటికి, నిచటికె,
మఱల నాప్రవలయు నంచు ♦ మది వాంఛింతుర్. 151

వ. అంత గౌరాంగుండు రామానందా! యేమి హాయి! యేమిపర
వశత్వాకరానంద! మాఁగ కాఁగకు మింకఁ జెప్పు మన నతం
డి ట్లనియె. 152

గీ. ఇంతకంటె మానవబుద్ధి ♦ యేగదయ్య
పైకి యతివర్య! యేగఁగా ♦ వచ్చునేమో!
మాటలాడుదు నావేశ ♦ మహిమమునను
భవదమలవాక్యములె నాదు ♦ పలుకులెల్ల. 153

క. ఒకటియు నుడువక, నానా
లుక నీసాధనముగాఁగ, ♦ లోకంబునకున్
బ్రకటింతువు కైవల్యపు
టకలంకపథంబులను మహాత్మా! నీవే. 154

వ. కాని శ్రీరాధాదేవి యామెముఖ్యసఖికిం దనయవస్థను దెలుపు
పూతవచనంబులు నామనంబున నప్రయత్నంబుగఁ బొడము
చున్నవి; విన నగునేని వినిచెద నని రామానందుం డీక్రింది
భావంబులు గలయొకగీతిక శ్రీచైతన్యస్వామిముందఱం బాడె. 155

సీ. పోయి శ్రీకృష్ణుని ♦ పొంతకు సకియ!
మాయిద్దఱకుఁ బ్రేమ ♦ మదినెట్లు పెరిఁగె
నో! విన్నవింపు నే ♦ నుడువుతీరున; ర
మావిభుం డది తాను ♦ మఱచిన ట్లైనఁ;
దొలుసారి చూచిన ♦ తోడనే మాకుఁ
గలిగెను నెమ్మది ♦ గాఢానురాగ;
మది పార్వణాంబుధి ♦ యట్లు పొంగారె;
నొదిగి యింకను బొంగు ♦ చున్నదే చెలియ!
యెదఁ గ్రమ్మి, యుప్పొంగి, ♦ యేపారి, మీఱి,
తుద కది యెంతౌనొ ♦ తోఁచదు నాకు;
నాత్మనివేదనం ♦ బయ్యెఁ గృష్ణునకు,
నాత్మసౌఖ్యమె యింక ♦ నతనిసౌఖ్యంబు;
ధర నందగానిని ♦ దరుణి వీక్షింపఁ
దరితీపు లుదయించి ♦ తగులాటములను
బెట్టునందురు కదా! ♦ ప్రియునకు నాకుఁ
బుట్టినప్రేమ మా ♦ పోల్కిది కాదు;
మగవాఁడు నాథుఁడు ♦ మగువ నే నన్న
తగ నట్టిభేద మిం ♦ తయును లేదమ్మ!
పొంగుచుఁ బ్రేమ మీ ♦ పోలిక నుండ
లింగభేదం బైక్య ♦ లీన మై పోదె?
నందనందను పైని ♦ నాచిత్తమిట్టు
లెందుల కుంచి ప్రే ♦ మించుట? యంచు
నెవరేని యడిగిరే ♦ నింతి! కారణము
నివరిముల్లంతయు ♦ నేఁ జెప్పలేను.

156

వ. రామానందుం డీగీతంబు పాడి ఱెప్పలు వ్రాల్పక స్వామివంకఁ గొంతసేపు చూచి యాతనిసత్యస్వరూపం బెఱింగినవానివలెఁ బాదంబులపైఁ బడి యస్యప్రేరితుండ నై యింతవఱకుఁ గీరం బువలె నే నెవ్వనింగూర్చి పలికితినో యారాధాకృష్ణుండ వీవె కావా! నిజం బెఱింగింపు మని తీవ్రచిత్తుం డై శుద్ధాత్ముం డై వేఁడ, స్వామి యతని నాఁపందలంచెఁ గాని రామరాయం డాఁకపడక వెండియు నిట్లనియె. 157

ఆ. నన్ను వెదకికొనుచు ♦ నలినాక్ష! నీవె యి
చ్చటికి వచ్చినావు ♦ సాఁక, లోక
మాన్య! యింత చేసి ♦ మఱుఁగునఁ బడి యుంట
తగ దొసంగు నాకు ♦ దర్శనంబు. 158

వ. ప్రత్యుత్తరం బేమియు వినరాకుంటచే రామానందుండు తల పైకెత్తి చూచి యంత. 159

సీ. దండకమండులు ♦ ల్ధరియించుకరముల
మోవినొక్కులపిల్లఁ ♦ గ్రోవి మొరయ,
బంగారుతళ్కుల ♦ బదులు మేనను దివ్య
నీలాంబుదచ్ఛవు ♦ ల్నివ్వటిలఁగఁ,
గావిగుడ్డలమాఱు ♦ కాయంబుపై మంచి
బంగారుతగటుదు ♦ వ్వలువ మెఱయ,
బోడియాదలమీఁదఁ ♦ బొలుపారు కేకిపిం
ఛం బల్లలాడి యు ♦ ల్లం బలర్ప,
గీ. మొగులచెంగటిమెఱపును ♦ బోలి కాంతిఁ
గ్రిక్కి రాధాలతాంగిపా ♦ ర్శ్వమున నిలువఁ,

బోలిచినట్టిరాధాకృష్ణ ♦ మూర్తిఁ గాంచి
మోదము భరింపఁ జాలక ♦ మూర్ఛఁ జెందె. 160

వ. రామానందుండు కొంతసేపటికిం దేఱుకొని మఱలఁ జూడ నా దివ్యమోహనరూపం బంతర్హితం బయ్యె; నాస్థానంబునఁ జిఱు నవ్వుతో యథాప్రకారంబుగ గౌరాంగుం డుండె. 161

గీ. భక్తి లేమిని గనె సార్వ ♦ భౌముఁ డల్ల
యాఱు బాహులయుత్కృష్ట ♦ కార మప్పుడు;
రాయనికి భక్తి గలదు పూ ♦ ర్ణంబె; కానఁ
గఱువుదీఱ రాధాకృష్ణుఁ ♦ గాంచె నిపుడు. 162

వ. గౌరాంగుండు కొన్నిదినంబులు విద్యానగరంబునం దుండి "రామానందా! నేను దక్షిణంబున కేగవలయు; మఱల వచ్చెద; నప్పటికి నాతో జగన్నాథంబునకు వచ్చుటకు సిద్ధపడి యుండ వలెను జుమీ! దైవసత్ప్రసంగములఁ గాలంబుఁ గడపుచు నెప్పుడు మహానందక్షీరసాగరంబున నోలలాడుచుండ" మని చెప్పి చనియె. 163

గీ. రాజ్యమును వీడి తనతోడ ♦ రమ్మటంచు
రామరాయునితోఁ బల్కె ♦ స్వామి; యిట్టి
వింత గలదొకో? చూడుఁడు ♦ విమలభక్తి
యెక్కుడో రాజపదభోగ ♦ మెక్కువదియొ. 164

గీ. రాధ యనుభక్తి, పూర్ణిమా ♦ రాజవదన,
యుర్వి నెన్నఁడు నెచ్చట ♦ నుండ లేదు,
కేవలపురాణకల్పిత ♦ యావెలంది,
యనెడునుడి గ్లానిసేసె గౌ ♦ రాంగవిభుఁడు. 165

గీ. రాధసద్భక్తిఁ గనఁగోరు • ప్రాజ్ఞుఁ డరయఁ
గలఁడు గౌరాంగభక్తిని • గాంచెనేని;
జనులసంశయములు దీర్ప • జగతిఁ బుట్టి
యన్నివిధముల హరి రాధ • యై నటించె. 166

గీ. అంతభక్తిని బడయ, సా • ధ్యంబు గా ద
టంచు దిగులొందఁ జనదు; గౌ • రాంగుదృష్టి
నిలుపుకొని భక్తి సాధింపఁ • జలుపవలయు
యత్నములు శక్తికొలఁది ని • ర్వ్యాజమతిని. 167



క. చంచలహృదయుఁ డిసీ! ర
క్షించుట యెట్లంచు నన్ను • శ్రీరామ! విస
ర్జించుట కూడదు; కోఁతిని
మించినచపలాత్మకుండు • మేదినిఁ గలఁడే? 168



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

### ద్వాదశాశ్వాసము.

శా. రామా! సద్గుణధామ! యెంతటివిచి ♦ త్రంబయ్యా! శ్రీపూరుష
స్తోమంబు, ల్శబరు, ల్ప్లవంగవితతుల్, ♦ చోరాగ్రిణు, లా్రక్షసు,
ల్కామాంధు, ల్విహంగంబు, లెల్గు, లుడుత, ♦ ల్కాలంటుత్రా, ల్గూడనీ
ప్రేమాస్వాదన భాగ్యమందిరఁట ధా ♦ త్రిన్బూర్వ పుణ్యంబునన్.

ఆ. స్వామి సన్యసించి ♦ స్వస్థలంబున కేగె
నైదువర్షములకు ♦ నవల ; నందు
దక్షిణమునకుఁ జని ♦ తత్ప్రజ రక్షింపఁ
బట్టె నిండ రెండు ♦ వత్సరములు. 2

శా. ఈకాలంబున స్వామి చేసినమహా ♦ కృత్యంబులు, న్లీలలున్
సాకల్యంబుగ వ్రాసి చెప్పుట కిట ♦ న్సామర్థ్యంబుగామి, న్సద
ద్వాక్యప్రథితంబు లైనవియె వ్రా ♦ యంబూనితి న్సక్య మా
వీఁక, న్జాలఁ గుదించి, భక్తజనసం ♦ ప్రీతిప్రదానార్థమై. 3

సీ. తురకతుటూరుల ♦ తొందరల్లేమిని
దక్షిణధరణి యు ♦ ద్ధములఁ బీడి

తం బయియుండక ♦ తతశాంతి ననుభవిం
చుచు నుండె; వర్ణము ♦ ల్లుసక్క కుండె;
పైకులంబులవారు ♦ పఠియించుచుండిరి
వేదశాస్త్రములు ని ♦ ర్విఘ్నముగను;
వణిజులు వాణిజ్య ♦ వర్తులై యుండిరి;
పండించుచుండిరి ♦ పాదభవులు;

గీ. కర్మములు వర్ణములును జ ♦ క్కఁగనె యున్నఁ,
జిత్తములయందు భక్తి శు ♦ష్కించుచుండె;
నెండువానిని వెండి తా ♦ నిండఁ జేయ
వచ్చి పనిఁ దీర్చికొనియె వి♦శ్వంభరుండు. 4

చ. వడివడిఁ బోవుచుండినను ♦ వారిజలోచనుఁ, డచ్చు టచ్చటన్
దడయుట తప్ప దయ్యెఁ బ్రిధి ♦ తత్ప్రతిపక్షులపట్టులందు; వా
రొడయనిచేతిలోఁ బడి స ♦ దూర్జితభక్తియుఁ బ్రేమ చక్కఁగాఁ
బడసి సమార్జితంబులను ♦ వ్యాప్తము చేయుదు రన్నియూళులన్.

క. ఒకనిని మార్చినగతి నిం
కొకనిని మార్పండు కాంచ ♦ నోజ్వలకాయుం;
డకృతకభక్తిని మాత్రము
ప్రకటించెను జనినయన్ని ♦ పట్ల మెలఁకువన్. 6

క. జనబోధకత్వపటు వగు
మనుజోత్తముఁ డెచటనేని ♦ మాటున నున్నన్
జను విభుఁ డట; కాతఁడె వ
చ్చును దఱచుగఁ బ్రిబలనిమివి ♦ శుద్ధాకృష్టిన్. 7

గీ. కనకతేజుఁడు విద్యాన ♦ గరమ్ము వదలి
చనియెను "ద్రిమండ" పురికి; న ♦ చ్చటను బౌద్ధ

మతలలితబోద్ధ "భిక్షురా ♦ మగిరి" యనెడు
వాని నొప్పించి శ్రీకృష్ణ ♦ భక్తుఁ జేసె. 8

గీ. "ఘుండిరామ" విద్వత్ప్రవ ♦ రుండు తుంగ
భద్రయొద్ద మహాఖ్యాతి ♦ వఱలుచుండ,
వానిఁ జిత్రంబుగా భక్త ♦ వరుని జేసి
తండ్రి "హరిదాస" బిరుదమా ♦ తనికొసంగె. 9

సీ. "అక్షయవటము" న ♦ కచ్చోటినుండి చై
తన్యుఁ డేగె; నట నా ♦ తతధనుండు
వణిజులలో గొప్ప ♦ వాఁడు నౌ "తీర్థరా
ము" డనునొక్కఁడు ♦ ష్టుండు స్వామి
హృదయబలంబుఁ బ♦రీక్షింప నిర్వురు
సురుచిరాంగల వాని ♦ మరులుకొల్పఁ
బంపించెఁ; గాని యా ♦ పరమపావనుకృపా
భక్తిబలంబుల ♦ వారు, వాఁడు,

గీ. వారిముప్వురతోడుత ♦ వానిభార్య
యైన "కమలాకుమారి" స ♦ ర్వాఘువితతిఁ
దొఱఁగి శుద్ధాత్ములై భక్తి ♦ గరిమ నతని
శిష్యవరులుగ మాఱిరి ♦ చిత్రముగను. 10

క. అటనుండి కదలి చని, యొక
యటవి, దశక్రోశభీక ♦ రాధ్వముదానిన్,
బటుసత్వాభీలను, నిమి
తటిదాభం జొచ్చి దాని ♦ దాఁటె క్రమతోన్. 11

గీ. దాఁటి "మూనా" సమాఖ్యప ♦ త్తనము సేరి
తత్సమాకృష్టబహుజన ♦ తతులమధ్య

మునను భక్తి నాట్యముసేసి ♦ పూతకృష్ణ
భక్తిపూర్ణులఁ జేసెను ♦ వారి, విభుఁడు. 12

క. అటనుండి స్వామి సని "వేం
కట" పురి, కట "బూగ్ల" బంది ♦ కాని, నతనియు
ద్భటభయదసర్వభటతతి,
నెటులో శ్రీకృష్ణభక్త ♦ బృందముఁ జేసెఁ. 13

ఆ. పగలు రేయి మూఁడు ♦ వాసరంబులు స్వామి
వస్తునను గృశింప ♦ వలసె నిచట ;
నవల విభుఁడు నాలు ♦ గవనాఁ డొకించుక
పాలు డ్రావి పిదప ♦ బయలుదేఱె. 14

సీ. ప్రౌఢ "గిరీశ్వర" ♦ పురమునందు శివాల
యంబున సతతమా ♦ నంబు వ్రతము
చేసికొని సమాధిఁ ♦ జేరి యున్నయొకతా
పసుఁ జూచి చూచి, కృ ♦ పారసంబు
కన్నుఁ దమ్ములనుండి ♦ కాల్వ లై పాఱఁగా
నామహాత్ముని చెంత ♦ కరిగి, భక్త
వరదాయకం బయి ♦ పరమపావన మైన
నిజహస్తమునను వా ♦ నిని స్పృశించి,

ఆ. మంచిప్రేమమున స ♦ మాధిని దెరలించి,
లేపి, యొడలు నిమిరి, ♦ పాపమోచ
కంబు వాగతీత ♦ కమ్రిమోదప్రదం
బైనకృష్ణభక్తి ♦ నతని కిచ్చె. 15

గీ. అచటినుండి "త్రిపాది" కి ♦ నరుగుదెంచె ;
"మధుసుఁ" డనుపండితుం డట ♦ మదిఁ దలంచె

వాదమును జేయఁ; గాని వి ♦ శ్వంభరేశు
మార్చి యతనికి భక్తిసా ♦ మ్రాజ్య మిచ్చె. 16

వ. అక్కడనుండి చైతన్యస్వామి ‹‹ పాననరసిం ›› హాలయంబునకు వచ్చె; నచ్చటినుండి ‹‹ విష్ణుకంచి ›› కిం జనియె. మార్గంబున ననేకదేవాలయంబులు దర్శించి ‹‹ సాంది ›› పురంబునకు వచ్చి యచ్చటిదేవాలయంబున భక్తిఖండనప్రచండబద్ధకంకణుండగు ‹‹ సదానందపూరి ›› యనునొక్కసన్యాసిం జూచి వాని శ్రీకృష్ణ భక్తాగ్రేసరునిగాఁ జేసె. 17

గీ. ప్రభు వచటినుండి వచ్చెఁ ‹‹ జే ♦ పల్లె ›› కద్ది
వదలి ‹‹ తంజాపురము ›› నకు ♦ వచ్చె; నంతఁ
‹‹ జందలు ›› నగంబులం దుంజు ♦ సంయములకు
నేలిక ‹‹ సురేశ్వరు ›› ని కిచ్చెఁ ♦ గృష్ణభక్తి. 18

గీ. అంత వచ్చెఁ ‹‹ బుదుకోట ›› ♦ యాలయమున;
కచటిబాలికాబాలచ ♦ యంబుఁ గూడి
భక్తినృత్యంబు సేసె వి ♦ శ్వంభరుం; డ
పుడు పడె నఁట విచిత్రపుఁ ♦ బుష్పవృష్టి. 19

చ. అపు డొకగ్రుడ్డిపాఱుఁడు ద ♦ యామయుపాదసరోజయుగ్మమం
దపరిమితాచ్ఛభక్తిఁ బడె; ♦ నంతట నక్ష్యవరోధ మేద, మో
దపరవశత్వ మంది నిమిఁ ♦ దాఁ గనుచుండఁగ, నెందుచేతనో
విపులపయి న్ప్రజావితతి ♦ విస్మయ మంద, గతాసుఁడై పడెన్.

గీ. ఉత్తరక్రియలందు భ ♦ రోత్మజ్వలుండు
చాలఁ దోడ్పడి యటనుండి ♦ చనియెఁ; జని ‹‹ తిరు
పాత్ర ›› పురిఁ జొచ్చి యచ్చట ♦ ‹‹ భర్గదేవుఁ ››
డనెడువేదాంతి భక్తసిం ♦ హామును జేసె. 21

ఆ. ఏడుదినము లుండి ♦ యీమహాత్మునికడ,
నంత నొక్కవనము ♦ నందుఁ జొచ్చెఁ;
బ్రభుఁడు దాని దాఁటఁ ♦ బదునేనుదినములు
పట్టె; నద్ది కడచి ♦ పైకి వచ్చె. 22

క. ఎందఱనో సన్న్యాసుల
నిందీవరనయనుఁ డెలమిఁ ♦ గృష్ణప్రేమం
బందున భక్తిని బూర్ణత
నందించి తరింపఁజేసె ♦ నధ్వంబందున్. 23

క. కన్యాకుమారివఱకును
మాన్యతఁ బయనంబు సేసి ♦ మఱి పోవక చై
తన్యుఁడు "తిరువాన్కూరు" ను
ధన్యను జేయంగ మఱలి ♦ తాఁ జనుదెంచెన్. 24

క. శ్రీకృష్ణుఁ డొక్కసంయమి
వీఁక న్దిరుగుచును బ్రజకుఁ ♦ బ్రేమను భక్తిన్
జోకగ నిడుచున్నాఁ డను
వాకులు వినవయ్యె వాడ ♦ వాడలయందున్. 25

మ. "తిరువాన్కూరు" విభుండు మిశ్రజునికీ ♦ ర్తి న్జాల నాలించి యా
యరవిందాక్షుని జూచునాశ నిజభృ ♦ త్యస్తోమము న్బంపె, నా
వరదు న్వారలు చేరలేమిఁ గని, క్ష్మా ♦ పాలుం డుత్కంఠతో
నరిగె న్జూడఁగఁ దానె యొంటరిగ గౌ ♦ రాంగు, న్మహాత్ము, న్హరిన్.

సీ. పోయి, యొండవనిజ ♦ మూలంబునను దన
వెన్ను నానుక కూరు ♦ చున్నవానిఁ
గరఁగించి పోసిన ♦ కనకవిగ్రహమట్లు
కమ్రశోభల దెస ♦ ల్గప్పువాని

పీనులవఱకుఁ బ ♦ ర్వెడుముద్దుఁగన్దోయి
సతిభక్తిమై మోడ్చి ♦ సట్టివాని
ముకుళితాక్షిసరోవ ♦ నోద్భద బాష్పములదం
దడిఁ జెక్కుటద్దము ♦ ల్దడుపువానిఁ

గీ. గన్నులారంగఁ గని లేపి ♦ స్వామివిభుండు
మొక్కి నిమి దీవనలను సం ♦ పూర్తుఁ డయ్యెఁ;
గాని తనరాజ్యమందు నా ♦ కనకతేజు
నిలువఁ బ్రార్థించి, యొప్పింప ♦ నేరఁ డయ్యె. 27

గీ. అచటినుండి "రామగిరి" కి ♦ నరిగి విభుఁడు
మూఁక మూఁకలుగా నున్న ♦ బోడల నట
లలితభక్త్యుజ్జ్వలాంతరం ♦ గులుగఁ జేసి
మార్చి వారికిఁ గ్రొత్తజ ♦ న్మంబు లిచ్చె. 28

వ. వెనుకఁ జైతన్యస్వామి "మత్స్యనగ" "పంచపాది" "చిత్తాల" నగరంబులం దుండునాలయంబులు సేవించి మఱలఁ దుంగభద్రాతీరంబునకు విచ్చేసి "ఛంద" పురంబున "నీశ్వరభారతి" యనునొక్కసన్యాసిం భక్తిబోధంబునం గృతార్థుంజేసెఁ; బిమ్మట బహుక్రూరమృగసంకీర్ణం బగునొకమహారణ్యంబుఁ బ్రవేశించె; నీపట్టున గోవిందభక్తుండు తనగ్రంథరాజంబున నిట్లు చెప్పె. 29

ఆ. అధిపుసన్నిధాన ♦ మందు నే నుండిన,
భయముచేత మేను ♦ వడఁకఁ జొచ్చెఁ
బిక్కఁ బోవుఖడ్గి ♦ వారణసింహము
ల్పులులు నాదుదరిని ♦ మూరుకొనఁగ. 30

గీ. అవ్వి చేరుపగా వచ్చు ♦ నప్పు డెల్ల
స్వామి దగ్గఱగా నేను ♦ జనెడువాఁడ;

మృగము లంతటఁ దముదారి ♦ నేగెడునవి;
గుండెదిటవున నే నప్పు ♦ డుండువాఁడ. 31

క. చీమలగజముల నన్నిటఁ
బ్రేమాకారమున నున్న ♦ విభున కడవిలో
నేమాడ్కి హానిగలుగును?
బ్రేమాగ్నులు వాని నవె హ ♦ రింపంగలవే? 32

గీ. వరదఁ డిది దాఁటి వెనుక "ఘూ ♦ ర్జరము" సేరె;
భక్తితాండవమున నటఁ ♦ బ్రజలనెల్ల
ర, నలరఁగఁజేసి చొచ్చెఁ "బుణ్యానగర" మను
నుత్తమం బగునల "పునా" ♦ పత్తనంబు. 33

క. ఈపురి, యుత్తరపునవ
ద్వీపంబును బోలి యుండె ♦ విద్యానిలయ
వ్యాపనమున, సుమనస్స
త్ప్రాపణమున, వేదశాస్త్ర ♦ వరపాఠములన్. 34

వ. "తాఫా" రను నొకసరోవరంబుతీరంబునఁ గూర్చుండి చైతన్యస్వామి ప్రజాసమూహంబు నిజదివ్యతేజస్సమాకృష్టంబై మూఁగి తన్నుఁజూచుచుండ, నీవిధంబుగవిలపింపందొడంగె.

ద్వి. ఉత్తరదిగాఁ జేసి ♦ యుల్లంబుఁ గృష్ణ!
యెత్తావునకుఁ బోయి ♦ తీవు న న్బాసి?
శ్రీవరా! సర్వంబుఁ ♦ జీఁకటి యాయెఁ
నీవు నాకడ లేమి ♦ నిసిగఁ జూపట్టు;
రావయ్య! రావయ్య! ♦ రాజీవనయన!
జీవింపలేను నీ ♦ చెంత నే కాని. 36

వ. ఇట్లతిదైన్యంబున దుఃఖించుచుండ, నొక్కదురాత్ముండు కొంటె

తనంబుననో, పరిహాసంబుననో, నిరర్థకంబుగ నోయయ్యా! నీ వెవనికొఱకు కేడ్చుచున్నావో యాతఁడదె యాపంకజాకర మధ్యంబున నున్నాఁడని చూపి పలుకఁ జైతన్యుండు 'నా కృష్ణా!' యనుచు నాగంభీరజలంబునందు దుమికి మూర్ఛితుం డై మునింగె; నంత వందలకొలఁదిదర్శిబృందంబు లందుఱికి స్వామిం బైకిఁ దీసి తేర్చుట కృత్యాద్యవస్థ యయ్యె; నచ్చోటు వీడి స్వామి "బలేశ్వ" రాలయంబున కేగె; నటనుండి "దేవ లేశ్వరంబు" న కేగె; నక్కడనుండి "ఖాండ్వా" దేవాలయం బునకుం జనియె. 37

సీ. అత్యసహ్యామహాదు ♦ రాచారమొండుండెఁ;
గలరు "మురారు" ల ♦ న్గాంత లచట;
దేవునిభార్యలు ♦ గా వారి నెంతురు;
కాని వారలచర్య ♦ కానిచర్య;
వారకాంతలయట్లె ♦ వర్తించుచుందు; ర
య్యాది పాపమంచైన ♦ మదిఁ దలంప;
రట్టిదురోభ్ధంబు ♦ లందిరి తోల్తను;
గ్రమముగా వ్యాధులుగ ♦ ర్కశము లయ్యెఁ;

గీ. బైకిఁ దళ్కుల బెళ్కుల ♦ పసల, నవ్వు
చుండినను బాప! మాత్మయు ♦ నుల్లము మెయి
గుళ్లి పాడయిపోయెను ♦ గోమలులకుఁ,
బాపపంకంబునందునఁ ♦ బడినకతన. 38

క. ఇరువదియాతేండ్లమహా
సురుచిరదేహుండు దొరకె ♦ సుఖపడుద మటం

చరిగిరి కామోద్వృత్తిని
"మురారు" లందఱు సెబాసు! ♦ మురహరుకడకున్. 39

క. నలినాక్షుఁ గూడ నేగిన
లలనలదుశ్చింత లెల్ల ♦ లలితాగ్నిజ్వా
లల మిఱ్ఱింగఁబోయి నమసెడు
శలభంబులమాడ్కి మాఁడి ♦ చచ్చెను గాదే? 40

క. పాపినులఁ గనినవెంటనె
పాపాంతకుకనులనుండి ♦ పరమకృపాబా
ష్పాపగలు గాఱ, హృత్పరి
తాపంబున నేడ్చి రంతఁ ♦ దరుణులుఁ గూడన్. 41

క. పరితాపబాష్పములతోఁ
దెఱవలు రక్షింపు తండ్రి! ♦ దేవ! దయాళూ!
ధరణీరక్షక! యని నిమి
చరణంబులమీఁదఁ బడిరి ♦ చకితాత్మిక లై. 42

వ. అంత స్వామి వారి కి ట్లనియె. 43

మ. అతివ లీమ్రలు సర్వరక్షకుని కి ♦ ల్లాం వైఱ్ఱిలి; రయ్యో! యిటు
ల్పతికి న్ద్రోహ మొనర్తురమ్మ! విటత ♦ ల్పచ్ఛద మ్త్రభోగేచ్ఛలన్?
క్షితిఁ జూపింపవలె న్మనుష్యసతుల ♦ స్త్రీకొట్టుసచ్ఛీలమున్,
సతతశ్రీహరిపాదచింతనమహా ♦ సౌఖ్యాబ్ధిఁ దేలుం డిఁకన్. 44

క. అంతటినుండి "మురారులు"
సుంతయు దుర్మార్గములను ♦ జొరఁబాఱక య
త్యంతపునీతి న్మెలఁగిరి
వింతగ నెక్కుడయి తక్కు ♦ వెలఁదులకంటెన్. 45

శా. నీరేజాక్షుఁడు "చోరనంది" యడవి ♦ ద్రష్టాత్ముఁడై, పాపియై,
క్రూరుండై, పురపాళిఁ జూఱకొని దా ♦ రుల్గొట్టి, విత్తాఢ్యులా
వారిం బాంథుల దోర్చుచు, గ్రన్బజఁ గడు ♦ న్బాధించుచున్నట్టియా
"నౌరోజీ" గ్గని చక్కఁ బెట్టునురుచిం ♦ తన్బోయె నంత న్వడిన్. 46

వ. "నాయనా! సర్వాంగసుందరా! నీవెంత నిర్ధనుండవును సన్యాసివి యునైన మహాక్రూరుండును నరమారణవినోదియు నగునాభిల్ల చోరాధిపతియొద్దకుం బోవల" దని యెందఱు చెప్పినను వినక కృపాపరిపూర్ణహృదయుం డగుస్వామి వనంబు సొచ్చి తన్మధ్యం బున నున్నవానినివాసంబుచెంత నొకచెట్టున వీఁపూఁదికొని యుండ నాసమాచారం బాదొంగచేరువకాఁ డెఱింగి "వాఁ డెవ్వఁడో మాయెదుటి కీడ్చికొనిరం" డని కొందఱుభటులం బంపె నంత. 47

క. ఆతతదిసకరశోభో
పేతుం డయి కృష్ణభక్తి ♦ వివశుం డౌనా
చైతన్యుని దస్కరతతి
చేతులఁ దాఁకంగ సాహ ♦ సింపదు భీతిన్. 48

క. రమ్మని నిమిబతిమాలిరి,
'హు' మ్మని జళిపించి రసుల ♦ నుత్కటముగ వా,
రెమ్మెయిఁ జేసిన యతిలే
శమ్మును జలియింపకుండె ♦ స్థాణువుపగిదిన్. 49

వ. అంత నీవృత్తాంతంబుఁ జోరులు తమయేలికకు విన్నపింప నాతం డు ప్రళయాగ్నింబోలె మండిపడి "ఛీ! పిఱికిపందలారా! యీ మాత్రపుఁబనియే చేయలేకపోయితిరా!" యని నిజకౌక్షేయకం బొఱనుండి పెఱికి పట్టుకొని 'వడివడిఁ దిన్నఁగ స్వామికడకు

వచ్చె నంత. 50

గీ. స్వామిఁ గాంచినయంతనే ♦ నడలె నంత
కోపమును; గాని యతి యెందు ♦ కోస మిచటి
కడవిలోనికి దొంగల ♦ కడకు వచ్చె,
నంచు 'నౌరోజి' మెల్లఁగా ♦ నడిగె విభుని. 51

క. శీర్షంబును బైకెత్తి సు
దర్శభుఁ డంతటను జోర ♦ రాజ స్వాంతా
మర్షం బణఁ జిత్తశుభో
ద్ధర్షకరవిలోకనములఁ ♦ దాఁ గనె నతనిన్.
52

ఆ. పాపతాపశమన ♦ పటువు లౌగౌరాంగు
చూపుగములు వడఁగఁ, ♦ జోరవిభుని
సహజకఠినహృదయ ♦ కుహరమం దెన్నఁడుఁ
గననియట్టియొక్క ♦ కలఁత వొడమె. 53

వ. చూచి చూచి స్వామి యిట్లనియె. 54

క. చోరుఁడఁ జోరుఁడ ననెదవు,
"నౌరోజీ!" నీదునెదను ♦ నందకిశోరా
పారసుభక్తిని నాకను
లారఁగ నల్లదిగో! యదిగో! ♦ యూరయుచుంటిన్. 55

క. రాజీవాక్షునుడు లౌ
రోజీపవిత్రమమందుఁ ♦ బ్రోత్కటనుతివా
గ్రాజియొ పరిహాసవచో
రాజియొ యని యెంచి చూచె ♦ రక్తాక్షులతోన్. 56

ఆ. కాని స్వామిప్రేమఁ ♦ గ్రక్కుచూడ్కులు, మార్ద
వంబు, మాయలేని ♦ వర్తనంబుఁ

గాంచుతోడ శాంతిఁ ♦ గని యిల్లు వెల్కొను
వినయగరిమ దోఁప ♦ విభునితోడ. 57

ఆ. ఏను దొంగవాఁడ; ♦ హృదయమందున దైవ
భక్తి గల దటంచుఁ ♦ బలికె దీవు;
నేను నమ్మలేను ♦ నీవాడుమాటలు;
తేటపడఁగఁ జెప్పు ♦ దివ్యతేజ! 58

వ. స్వామి యి ట్లనియె. 59

ఆ. వృత్తిచేతఁ జోర ♦ విభుఁడవె కావచ్చు;
దాని కేమి? నీహృ ♦ దయమునందు
నెవనినేని నీవు ♦ నెనయఁజేసెడునంత
భక్తి గలదు; దుఃఖ ♦ పడఁగ వలదు. 60

ఆ. "చిత్తశుద్ధితోడఁ ♦ జెప్పెదే నీ విట్లు?"
"చిత్తశుద్ధితోనె ♦ చెప్పుచుంటి;"
"దుష్టచర్యలెల్లఁ ♦ దొలఁగి దేవునిపాలఁ
బడిన నిష్టపడునె?" ♦ "పడును! బడును!" 61

గీ. షష్టివర్షంబు లయ్యెను ♦ సంతు లేదు;
లేదు పెండ్లము; బంధుగు ♦ ల్లేరు పోవ;
మృత్యు వాసన్న మై యుండె; ♦ మ్రింగు నెపుడొ!
మూఢమతి! యెంతకాలంబు ♦ పోయె వృథగ! 62

క. అని యనుకొని "నౌరోజీ"
కనుల న్బాష్పములు గార్చి ♦ గౌరాంగుఁడు బం
ధనములఁ ద న్నాకర్షణ
మును జేయుచునుండినట్లు ♦ పోడగని యంతన్. 63

గీ. విచ్చుకత్తిని దవ్వుగా ♦ విసరి వైచి,
నేను మీపూఁక నడపంగ ♦ లేను ; వేఱు
ప్రభువు నేర్పాటుచేసికో ♦ వలయు ; నేను
బోదు నీతనితో; నని ♦ పుచ్చె భటుల. 64

వ. స్వామి గమనోద్యుక్తుం డై లేచె ; నౌరోజీ యతనివెంటం బడ నుండె. స్వామి వలదనెఁ ; జోరవిభుం డంత నాఁగి ''యోహో ! పాటచ్చరాధిపదుర్వేషం బింకను నాపై నున్నదనియా రావల దనెదరు? స్వామీ !'' యని యాయసర్వవస్త్రంబు లన్నియుఁ జీరికలుగఁ జింపి పాఱవైచి ప్రీతచింపులతో మొలఁ గప్పికొని ''మహాప్రభూ ! పతితపావనా ! యిప్పుడైన రావచ్చునా?'' యని విలపించె; స్వామి యూరకుండె ; నప్పటినుండియు నౌరోజీ మహాభక్తుండును స్వామినిత్యసహచరుండు నయ్యె. 65

గీ. ''పాండురంగ'' పురమునకు ♦ వచ్చి యంత
నచటఁ బదునెన్మిదేండ్లప్రాయ ♦ యంబునందె
యన్న విశ్వరూపుఁడు సిద్ధి ♦ నందె నంచుఁ
దేటతెల్లగ నధిపుండు ♦ దెలిసికొనియె. 66

గీ. అఖులభక్తి ''మహారాష్ట్ర'' ♦ మందు వెల్లి
గొల్పినట్టి ''తుకారామ'' ♦ కోవిదుండు
ప్రభువునొద్దనొ, ప్రభుశిష్య♦వరునికడనొ,
గొప్పహరిభక్తిరసమును ♦ గ్రోలినాఁడు. 67

వ. అచ్చటినుండి చైతన్యస్వామి ''మూలా'' నదీతీరస్థ ''ఖాండ్వా''; పురంబున కేగె ; నటనుండి ''నాసికాత్ర్యంబకం'' బున కేగె; 'నాసిక' నుండి ''పంచవటి'' కిం జనెఁ ; ''బంచవటి'' నుండి ''దామను'' పత్తనంబున కరిగె; నక్కడనుండి ''సూర'' త్తను

"సౌరాష్ట్ర" నగరంబునకుం జనియె. 68

గీ. "అష్టభుజ" యనుదేవత ♦ నర్చసేయు
ప్రజలు, బహుజంతువులఁ జంపి ♦ బలు లొసంగు
నొకదురాచారమును బాపె ♦ నొడయఁ డచట,
బోధము నొనర్చి సద్భక్తి, ♦ భూతదయయు. 69

వ. "సూరత్తు" నుండి "బ్రోచ్చి" పత్తనంబున కేగి యటనుండి "బరోడా" కరిగె; నాదేశపురాజు స్వామిదర్శనంబు చేసికొని కృతార్థుం డయ్యె; నిచ్చట "నౌరోజీ" కిఁ గాలంబు వచ్చి పూర్వసుకృతమహిమంబున స్వామియంకస్థలంబునందు మృతుం డయ్యెఁ; బ్రాణోత్క్రమణసమయంబున శ్రీచైతన్యస్వామి నిజ ముఖంబున నాపుణ్యాత్ముకర్ణంబున సర్వదుఃఖవిమోచకపరిశాంతి వాక్యంబు లూఁది కైవల్యసుఖం బిచ్చె; మృతకళేబరంబున కుచితకర్మంబులు స్వామియే కావించె. 70

గీ. స్వామి యంత "నహమ్మదా ♦ బాదు" వచ్చె;
నాపురిని వీడి "ఘోగ" కు ♦ నరుగుదెంచెఁ;
దండ్రి యిచ్చట నొకవిచి ♦ త్రంబు సేసె;
వ్రాసెదను దానిఁ గ్రింద సం ♦ గ్రహముగాను. 71

సీ. ఆపురంబున నొక ♦ యాపవసమధ్యస్థ,
తెలుగంటి చెలులట్టి ♦ యొఱపులాఁడి,
కులుకుటొయ్యారంపుఁ ♦ దళుకుబెళ్కులపోవు,
ధనులసిరు ల్దొచఁ ♦ గొనెడుదొంగ,
కోడెకాండ్రను బట్టి ♦ కోఁతులవలెఁ ద్రిప్పు
నెఱజాణ, పున్నెంపు ♦ గిరులకుఁ బవి,

వలపించి పురుషుల ♦ వలనై చుకొనుటలో
మహి నెన లేనట్టి ♦ మాయలాఁడి,

గీ. రోకఁ మెంతయొ కలయట్టి ♦ రోవెలంది,
"వరము ఖి" సార్థకాభిఖ్య ♦ వఱలుచాన,
పాపములు లెక్క సేయని ♦ ప్రబలధీర,
మెలఁగుచుండెను మారుని ♦ ములికి యనఁగ. 72

చ. అమితశరీరభోగముల ♦ నాకుటిలాలక యొక్కనాఁడు గే
హమున సుఖించుచుండఁగ గ ♦ వాక్షముక్రిందను మిశ్రసూతి, యు
త్తమహరికృష్ణనామకలి ♦ తం బయి భక్తిని వెల్చునొక్కనృ
త్యము నొనరించె; నాకలికి ♦ యారసె నద్ది గృహాంతరస్థయై.

క. అరయుట నిర్మలభక్తిం
బొరయుట; వేశ్యాకువృత్తిఁ ♦ బూర్తిగ నపుడే
తొఱఁగుట; సర్వస్వం బొక
తెఱవ కొసఁగి గృహమునుండి ♦ తెరలుట యయ్యెన్. 74

చ. పురిని సమస్తయావనవ ♦ పుర్బలవిత్తవిశాలకాముకో
త్కరముల, నాత్మపాదములఁ ♦ గట్టెడు నాజలజాయతాక్షి, దు
ర్భరపరితాపనిర్గళిత ♦ బాష్పముల న్యతివర్యు మంగళా
కరచరణద్వయంబు పయిఁ ♦ 'గావుము! కావు!' మటంచు వ్రాలెదాన్.

క. దీవించి మిశ్రసూనుం
డోవనితా! యుండుకాల ♦ ముత్తమభక్తిన్
బావనకథనంబుల హరి
సేవింపుచుఁ గడపు మంచుఁ ♦ జెప్పె న్గరుణన్. 76

గీ. పూర్వకృతఘోరపాపము ♦ ల్వాలఁతి స్మరణ
మునకు రాఁగనె వైరాగ్య ♦ మునను, యువపు

రుషమనశ్శృంఖలోదుశీ ♦ రోజవితతి
త్ఛురిక కెరసేసి కోమలి ♦ గొత్తిగి వైచె. 77

గీ. ముతుకవస్త్రంబు దాల్చి, యి ♦ మ్ముల గుగదుల
వదలి, యొకయాకుటిల్లె ని ♦ వాసముగను
జేసికొని, విటబంధన ♦ చిత్రబుద్ధి,
పొలఁతి భగవదాకర్షణ ♦ మునను బెట్టె. 78

క. ఉరువిషయభోగశీలను
"వరముఖి" నొకగొప్పవేశ్య ♦ వైభవయుక్తన్
జొరఁబెట్టి యుటజమున నె
త్తెఱఁగున నిస్సంగఁ జేసి ♦ తివి? గౌరాంగా! 79

వ. స్వామి యీ "ఘోగా" పత్తనంబునుండి "జాఫరాబాదు" న కేగె; నటనుండి మహమ్మదీయులు కొల్లగొన్న "సోమనాథ" దివ్యస్థలంబుం జేరె; నిచ్చటిప్రసిద్ధచిత్రాలయద్వారబంధంబు మహమ్మదీయులు తమ "ఆఫ్ఘనిస్థాన్" నామక "గాంధార" దేశంబునకుం గొంపోయిరి; కాని యుత్తమాంగ్లేయప్రభువులు దాని మఱల "హిందు" దేశంబునకుం దీసికొనివచ్చి; రిచ్చటినుండి చైతన్యస్వామి "జునగరం" బుం బ్రవేశించె నంత. 80

గీ. అచట "భర్గదేవుఁ" ♦ డనునొకసన్యాసి
దుష్టరోగపీడి ♦ తుని బ్రభుండు
గాంచి రుజను మాన్చి ♦ కమ్రభక్తిప్రేమ
ములను గూర్చె శ్రీమణు ♦ ముదితమతిని. 81

వ. ఈమహోపకారం బమానుషమహిమంబు నరసి యాతండు న తనిశిష్యసంఘంబును స్వామిని వదలలేకపోయిరి. చనక తప్ప దన్నప్పుడు పదాఱుగురు సచ్ఛాత్రులు లాతనివెంటఁ బడిరి. వారితో గా

రాంగుం డొకదట్ట మగునడవిలోఁ జొచ్చి యేఁడునాళ్లడవి
కాయలుం బండ్లే యాహారంబుగాఁ బయనంబు సేసి ప్రసిద్ధం బ
గు "పరివా" సాలయంబున కరిగె; నక్కడనుండి "ద్వారక"
కు వచ్చి యటనొకపక్షం బుండె; నచ్చటినుండి తిరిగి "బరోడా"
కు వచ్చి యటనుండి మఱల రామానందరాయనియునికిపట్టైన
"విద్యానగరం" బున కేతెంచె. 82

క. పలుతావులఁ జైతన్యు వ
దలలేమని వెనుకొనంగఁ • దలఁచిరి ప్రజ; లె
ట్టులో, కాని, వారి నందఱఁ
దలఁగించుక బైటఁ బడియెఁ • దండ్రి మెలఁకువన్. 83

క. తవతారణమార్గము లె
వ్వనికిం దెలుపండు మున్ను • వరదుఁడు; తావీ
డినపిదపఁ గూడ నాయా
జనపదముల భక్తి నిలుచు • నరణిం జేసెన్. 84

ఆ. స్వామి చేసినట్టి • సామాన్యభక్తుల
కెక్కు డైనబుధుల • నేర్చి, కొంద
ఱకు నతం డొసంగెఁ • బ్రత్యేకముగ నందు
కొఱకు, భక్తిఁ గఱపు • గొప్పశక్తి. 85

ఆ. నేను గృష్ణుఁడ నని • నిమి యెచ్చటను బ్రక
టింపలేదు సుఁడి; క • డింది ప్రేమఁ
జిత్తశుద్ధితోడ • శ్రీకృష్ణుపైఁ జూపుఁ
డనుచుఁ జెప్పెఁ గాని • జనవితతికి. 86

గీ. స్వామి తరియింపఁజేసిన • భక్తవరులు
గూడఁ గొంద ఱెఱుంగరు • ప్రోడపేరు,

నూఱు, వేగెడుచోటు; లీ ♦ యుబుసులేల?
భక్తి నిమి యిడెఁ; గాని రది ♦ వారు; చాలు. 87

క. శ్రీవరుఁ డించుక యాఁగిన
తావులమాత్రంబు జనులు ♦ తండ్రిచరితముం
గోవిందువలన నెఱిఁగిరి;
కావింపంబడియె నిట్టి ♦ కరణి న్నీలల్. 88

వ. కాని. 89

సీ. కొన్నివందలయేండ్ల ♦ మున్ను శ్రీకృష్ణుండు
మారసుందరయువా ♦ కారధారి
యాచు నిచ్చటను బ ♦ ర్యటనంబు సేసెనం
చనుకొందురు దక్కి ♦ ణంబున ననేక
జనపదంబుల నిప్పు ♦ డును గూడ; నది గాక
యిటఁ గూరుచుండెఁ; ని ♦ చ్చటను బండె;
నిట స్నానమాడెఁ; నం ♦ చటవీతరుచ్ఛాయ,
లుటజము, ల్ఘట్టంబు, ♦ లుత్తరంబు

గీ. నుండి వచ్చిన నిమిభక్త ♦ మండలి కటఁ
బెద్ద లిప్పటి కలరి చూ ♦ పింతు; రవని
నెన్నియేనియు విస్మృతి ♦ నేదుఁ గాని
యంతరింపదు మృతజీవు ♦ నమలచరిత. 90

గీ. ప్రబలభక్త్యాత్మకుఁడు "తుకా ♦ రాముఁ" డుండు
"పాండురంగ" పురంబును ♦ బ్రభువతంసుఁ
డరిగినటువంటిదక్షిణ ♦ యాత్రఁ జూడఁ
బోయె నని చెప్పఁబడె నితః ♦ పూర్వమందె. 91

క. క్షితిపైని "దుకారాముం"
డతని యసంఖ్యాకశిష్యు ♦ లందఱును బ్రజా
తతికిం గఱపిన, దీ, నిమి
మతమే యని యెఱుఁగఁ గలరు ♦ మాన్యు లరసినన్. 92

గీ. ఏము చైతన్యశిష్యుల ♦ మే! యటంచుఁ
బ్రకటనము చేసికొని "తుకా ♦ రామ" శిష్యు
లెంద ఱెందఱొ ప్రేమస ♦ మిద్ధభక్తి
శ్రిద్ధమెయి భూమిపై వెద ♦ చల్లినారు. 93

వ. మానవలోకభూషణుం డగు "తుకారాముఁ" డే యాత్మభక్త్యు
వబోధకారణంబుంగూర్చి యిట్లు చెప్పికొనియె. 94

సీ. స్నానార్థ మొకనాఁడు ♦ నే నేటికిం బోయి
తి; నట నొకానొక ♦ దివ్యపురుషుఁ
డెదిరికి వచ్చి, యెం ♦ తదయనో చిమ్మెదు
నొఱపుఁజూపులు పైని ♦ బఱపి, నాశి
రంబుఁ దాఁకెఁ దనక ♦ రంబున; నతఁడు "శ్రీ
కేశవచైతన్య" ♦ కీర్తితుం డ
నుకొనెదఁ; జాలను ♦ నుడువఁగాఁ దరువాతి
నాయవస్థను నక్రృతి ♦ నష్ట మైన

గీ. కతన; నా చెప్ప లేనట్టి ♦ స్థితినివీడి
స్మృతికి వచ్చినవెంట నీ ♦ క్షింప, నాకు
నక్షిపర్వం బొనర్చిన ♦ యట్టివాఁడు
పొడవుసూపక మాయ మై ♦ పోయినాఁడు. 95

గీ. దీనిఁ బట్టి యతఁడు గన్న ♦ దివ్యపురుషుఁ
డింక గౌరాంగుఁడే యని ♦ యెఱుఁగవచ్చు;

నట్లు భక్తియుఁ బ్రేమంబు ♦ నలవడిచెడి
తీ రొకశచీతనూజుని ♦ తెలుఁగె కాన. 96

గీ. దక్షిణావని నీమహా ♦ ధన్యపురుషుఁ
డట్లు "ఘూర్జర" మందున ♦ నధికభక్తుఁ
డైన "స్వామినారాయణుఁ" ♦ డనెడువాఁడు
బయలువెడలి బోధించెను ♦ భక్తిఁ బ్రజకు. 97

క. సరిగా శ్రీగౌరాంగుని
వరుసనె బోధించె నితఁడు; ♦ ప్రభువరుఁ డచటన్
గలిపినబోధామృతమున్
గలవాలఁగఁ ద్రావి వెడలఁ ♦ గ్రిక్కె నమృతులన్. 98

క. కలుపుటయకాక, తనయా
చరణంబునఁ గూడఁ జూపె ♦ సద్భక్తి నితం;
డురుశాంతివినమ్రతలన్
సరిగాఁ డోకఁ డీప్రవిమల ♦ సత్యాధ్యానకున్. 99

క. చెప్పుల దుష్టాత్మకు లొ
క్కప్పుడు తనుఁ గొట్ట, దాని ♦ కాఁకరపడక యా
చెప్పు లొసఁగె వారలకే;
యిప్పగిది మెలంగు నెవ్వఁ ♦ డీకలియందున్.? 100

గీ. అల్ల "బొంబాయి" రాజ్యంబు ♦ నం దదేమొ
చాలదుష్కీర్తి "వల్లభా ♦ చార్యుఁ" డండె;
నతఁడు శుద్ధుండె నిస్సంశ ♦ యముగఁ; గాని
వానితరువాతివారలు ♦ పాడువడిరి. 101

క. దారుణకర్ములు శిష్యులు
దూరీకృతనీతు లగుచు, ♦ దుష్టానహ్యా

చారపరంపరయందలి
జారత్వముఁ జొన్పినారు ♦ సన్మతమందున్. 102

గీ. "వల్లభాచార్యుఁ" డాతని ♦ వార్ధకమున
వచ్చె "నీలాచలము" నకు; ♦ వచ్చి, స్వామి
పాదములమీఁదఁ బడి, కృష్ణ ♦ భక్తిఁ గఱచెఁ
దండ్రి సచ్ఛిష్యుఁ డౌ "గదా ♦ ధరు" నికడను. 103

క. పెద్దలు శ్రీచైతన్యుని
యొద్ద స్వవినయగరిమ ♦ నుండిరి పురుషుల్
ముద్దియ ; లిఁగఁ బిల్ల లతని
యొద్ద స్వేచ్ఛాముదముల ♦ నుండుదు రెపుడున్. 104

క. నలినాయతాక్షునకుఁ బి
ల్లలఁ జూచినఁ జిత్తమందు ♦ లలితామోదం
బొలసెడుఁ ; దా నాటలన
వ్వులఁబడి మెలఁగెడును వారి ♦ పొంత న్శిశువై. 105

వ. దీనికి నిదర్శనంబుగ గోవిందభక్తుండు దక్షిణదేశయాత్రలో జరి
గినయొకవిచిత్రకథ యీక్రింది తెలుంగున వ్రాసె. 106

గీ. వెఱ్ఱిసన్యాసి యొక్కఁ డీ ♦ వీటి కరుగు
దెంచె ; రం డో సఖులు ! వినో ♦ దింత మచట ;
నని యొకపురంబునం దొక్క ♦ యర్భకుఁ డొక
బాలకులగుంపుఁ గొనిపోయె ♦ స్వామికడకు. 107

క. కొని మీరందఱు శ్రీహరి
యని యనుఁ డొకవింత జరుగు ♦ నని, యాబాలుం
డనిపించె వారిచేతను
బనివడి హరి! హరి! యటంచుఁ ♦ బల్మఱు నచటన్. 10

వ. హరియని చప్పట ల్పఱచు ♦ చర్భకు లందఱు నార్చి పేర్వ, నా
సరసిజనేత్రుఁ డత్తఱి వ♦సంబున నెమ్మన ముంట, మోముపై
జిఱునగ వొప్ప హస్తమునఁ ♦ జేతేఁడు మట్టిని దీసి బాలకో
త్కరమును గాంచి పూసికొనెఁ♦గాయము పైయది వెట్టిచేఁతలన్.

గీ. వెట్టి పారంభ మైనది ♦ వీని కంచు
నంద ఱఱచిరి హరి! హరి! ♦ హరి! యటంచు;
వార లఱచినకొలఁది న ♦ పారముగను
దోయజాక్షుఁడు భూమిపై ♦ దొర్లసాగె. 110

క. దొరలినకొలఁదిని, బాలురు
హరిహరి యని నవ్వి నవ్వి ♦ యార్చి; రిఁకను వా
రఱచినకొలఁది శచీజుఁడు
దొఱలంగాఁ జొచ్చె వారిఁ ♦ దుష్టులఁజేయన్. 111

వ. రామానందుండు శ్రీగౌరాంగదేవునిమహారాజ వైభవంబుతోఁ దన 'విద్యానగరం' బుం బ్రవేశపెట్టె; నంత స్వామి యతని కి ట్లనియె. 112

క. మనము జగన్నాథపురికిఁ
జని మిత్రమ! కృష్ణసత్ప్ర ♦ సంగంబుల నె
ప్పును గాలముఁ గడపుచు జం
టను సుఖయింత; మట కీవు ♦ నాతో వత్తే? 113

వ. దానికి రామరాయం డి ట్లనియె. 114

సీ. నిను వీడుకొల్పిన ♦ వెనుక మహారాజున
కొకలేఖ వ్రాసితి; ♦ నొప్పుకొనఁగ
లే; దంత మఱి మఱి ♦ లేఖలు వ్రాసితిఁ;
దుదకు నీకును నాకు ♦ నొదవినట్టి

సంబంధమును దెల్పి, ♦ స్వామియూనతి యిది,
చలుపంగవలె నని ♦ తెలిపినాఁడు;
సార్వభౌమువలన ♦ సర్వంబు నిన్గూర్చి
విన్నవాఁ డౌటచే ♦ వేగ బయలు

గీ. దేరి రావచ్చు ననునాజ్ఞఁ ♦ దెల్పనొక్క-
జాబు పంపించినాఁడయ్య! ♦ స్వామి! నాకు;
నీవు "నీలాచలంబున" ♦ కెపుడు వత్తు
వో! యని యెదురుచూచుచు ♦ నున్నవాఁడు. 115

గీ. రాజ్యభారంబు వదలి యో ♦ ప్రభువరుండ!
వత్తుఁ; గాని నీతోడ రా ♦ వలనుపడదు
భటసమూహంబుతోఁ జన ♦ వలయుఁ గాన;
నీవు సనినవ్వలను వేగ ♦ నేను వత్తు. 116



క. మన మది తిన్నఁగ మోదం
బున నుండును రామ! నీదు ♦ పుణ్యాఖ్యను బ
ల్కిన వ్రాసిన; నొండుతఱిని
శునిపుచ్ఛంబట్లు తిరుగు; ♦ సుస్థుపఱుపవే? 117



శ్రీరామా.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వితీయభాగము.

## త్రయోదశాశ్వాసము.

ఉ. రాజితరత్నసంఖచిత ♦ రాజశిరస్థకిరీటఝూటనీ
రాజిత మై, సురోత్తమక ♦ రప్రకరాంచిత మై, మునీంద్రసం
పూజిత మై, భవోరుభయ ♦ మోచక, మా భవదంఘ్రియుగ్మ, మ
వ్యాజకృపాత్మ! రామ! మన ♦ సారఁగఁ గొల్చెద నాకుఁ బ్రోవుమా!

గీ. వర్షయుగ్మంబు తరువాత ♦ వచ్చునట్టి
మిశ్రసుతుఁ జూడఁ బ్రత్యబ్ద ♦ మించి భక్తు
లేకదివసప్రయాణము ♦ నెంతో ప్రేమఁ
జేసి సంఘీభవించి ద ♦ ర్శించి రతని. 2

గీ. వాసుదేవుండు తనపరి ♦ వారజనము
తోడ నెదురేగి యతిభక్తి ♦ తోడ స్వామి
పాదయుగళికి నెఱఁగెను ; ♦ స్వామియు నతి
వత్సలత నెత్తి కౌఁగిటఁ ♦ బట్టె నతని. 3

గీ. ఊర గుడిచెంత నున్నట్టి ♦ యొకకుటీర
మందు నివసించి యుండె గౌ ♦ రాంగుఁ ; డతని

ఖ్యాతి యెల్లెడఁ బర్వెను ♦ గాన, జూడ
వచ్చి రెందఱెందఱో భక్తి ♦ పరులచటికి. 4

వ. ఆమహానుభావునిత్యసాంగత్యసేవాసౌఖ్యం బభిలషించి "పురి" "భారతి" "స్వరూపదామోదరుండు" మున్నగుసంయమీంద్రులు జగన్నాథంబునకు వచ్చిరి. రామానందుండు తనయావజ్జీవంబు స్వామిచరణంబులకడఁ గడపునూహంబున నిదివఱకే వచ్చి యుండె. వాసుదేవసార్వభౌమరామానందులు స్వామికృపచే ధన్యులైన తెఱంగంతయు విని, యుత్కలాధినాథుం డగు ప్రతాపరుద్రమహారాజు, గౌరాంగుండు కేవలశ్రీకృష్ణుండుగాని నరమాత్రుండు గాఁడని మనంబున నిశ్చయించుకొని యుండె నంత. 5

క. వా రుభయులు "రుద్రు" ని కల
గౌరాంగుని దర్శనంబు ♦ గావింపఁగ స
న్వారి గమకించి; యైనను
సారసనేత్రుఁ డటు చేయఁ ♦ జాల ననెను దా౯. 6

క. పారాశరి స్త్రీ కెటు పై
న్ద్వారంబున నుండవలయు ♦ నో, యాపగిది
న్ద్వారమున నుండవలయును
భూరమణున కంచు యోగి ♦ పుంగవుఁ డనియె౯. 7

చ. నరులకు జాలిఁ గొల్పి హరి♦నామ మొసంగఁగ నన్ని వీడి, య
న్కరి యయినట్టిమిశ్రిజుఁడు, ♦ క్షాత్రపతి శిష్యుని జేసికొంచుఁ
త్పురమున సత్సపర్యలురు ♦ భోగము లందుచుఁ దా మెలంగ
గ్గల కిఁక రాఁ డెవం డనెడు ♦ కాతరత న్వచియించె నాగతి

వ. రామానందసార్వభౌములు చేతులు జోడించుకొని స్వామిం

ని ట్లనిరి. 9

సీ. రాజుగా నాతఁడు ♦ రాఁడు నీచెంతకు ;
శ్రీజగన్నాథుని ♦ సేవకుఁడుగ
నరుదెంచుఁ; జూడు ! దే ♦ వాలయస్థలి నూడ్చు
భూపతి పైఁడిచీఁ ♦ పురును బూని;
యంతకంతకు భక్తి ♦ యధిక మౌచున్నది;
వైరాగ్య మెక్కుడై ♦ వఱలుచున్న ;
దెపుడు నీపదముల ♦ నీక్షింతు నని తేఁడు
పగలు రాతిరియొక్క ♦ పగిది నేడ్చు
గీ. చున్నవాఁ డయ్య! చూడని ♦ మొక్కసారి;
చూడకుండిన దుఃఖంబు ♦ తోడ నెపుడొ
యీల్గు; నాతనియుద్వేగ ♦ మెంతొ యతఁడు
పొక్కి చేసినయీశ్లోక ♦ మునను దెలియు. 10

క. అని యాసుశ్లోకము శచి
తనయునిసమ్ముఖమునందుఁ ♦ దద్దయుఁ గరుణా
వినయంబుల వినిపించిరి ;
పౌనరింతుఁ దదర్థకలన ♦ ము నిటఁ దెలుఁగునన్. 11

గీ. కృష్ణ ! సకలపాపులను ర ♦ క్షింప నవత
రింప శపథంబుఁ గొన్నప్పు ♦ డిఁకఁ "బ్రతాప
రుద్రుఁ డనుమహాపాతకా ♦ ర్తుని నొకనిని
దక్క" నని యనుకొంటె చి ♦ త్తమునఁ దండ్రి? 12

వ. ఎంత చెప్పినను స్వామి సమ్మతింపకుండె ; నీయనురక్తి, ప్రతా
పరుద్రునకు గొప్ప మేలు కావించె ; నతి చండశాసనుండై నిరా
ఘాటపరిభావోదితమహాహంభావుండై యున్నయతనిగర్వం బడం

చి విసమ్మురం జేసె; నంత నామహారాజు వాసుదేవుతో నిట్లు
మొఱపెట్టుకొనియె. 13

సీ. నను దగ్గఱుటకేని ♦ నాకడఁ గూరుచుం
డుటకేని జంకు సం ♦ దుసరుఁడొకఁడు
చైతన్యునకు నిత్య ♦ సహవాసి యైనాఁడు;
కాని యీసర్వాధి ♦ కారి, రాజ
రాజు, మిశ్రజుపాద ♦ రాజీవముల నొక్క-
సారి దర్శింపఁగాఁ ♦ గోరి యిట్లు
విఫలమనోరథ ♦ వికలాత్ముఁ డయ్యె! భూ
పతుల మామే మింత ♦ పనికిమాలి

గీ. నట్టినీచుల మైత్రి, మ ♦ య్యయ్యొ! యైన
నీశ్వరుఁడు చాల నాయెడఁ ♦ గృపనె చూపె;
నాదురభిమాన మెల్ల న ♦ ణంచి, రాజ్య
మత్తతఁ దొలంచి, హృదయంబు ♦ మెత్తఁబఱిచె. 14

గీ. నాకరంబుల నెవరిప్రా ♦ ణంబు లుండు,
వారె మధ్యస్థులై ప్రజా ♦ వనుని నిమిని
నాకొఱకు వేఁడుచుం; డ్రిఁక ♦ నాయవస్థ—
క్షితిపతియవస్థ—యేమని ♦ చెప్పవచ్చు? 15

క. ఉపజీవులైరి స్నేహితు;
లపకృష్టుఁడ నైతి వారి ♦ యధిపతి నే; నీ
విపరీతచర్యఁ బ్రభుఁ డే
యుపకారము సేయఁదలఁచి ♦ యుండెనొ నాకుఁ! 16

వ. ఇట్లు కొన్నాళ్లు పరితపించి పరితపించి హృదయపరిపాకం బందిన
పిదప, రామానందసార్వభౌమాదిమహాత్మకృతబోధంబులం గొని, రా

రాజువేషం బూడ్చి యొక్కసామాన్యమనుష్యవస్త్రంబులు ధరి
యించి పరితాపరుద్రమహారా జొక్కనాఁడు స్వామికుటీరంబున
కేగి. 17

చ. పడుకొనియున్నస్వామిపద • పద్మముల న్దనయూరుదేశమం
దిడుకొని కృష్ణవర్ణనస • మిద్ధపుభాగవతస్థపద్యముల్
తొడరి మహాపరిపత్తిపరి • తోషతరంగితచిత్తవృత్తితో
నుడువుచు నొత్తుచుండఁగ, ధ్వ • నుల్వడెస్వామిశ్రవఃపుటంబులన్.

శా. అంత న్స్మాంకృతిఁ జేసి లేచి నిమి య • త్యంతపరిమోదంబునన్
జెంత న్స్వాదములొత్తు ‹‹రుద్ర›› విభుని • న్జేదోయి బంధించి, యీ
స్వాంతాకర్షణభక్తిమోదకరశ • స్తశ్లోకపాఠంబులన్
శాంతిం గొల్పితి వయ్య! యీవెవఁడవో • సత్యంబుగాఁజెప్పుమా!

క. ఓసత్పూరుష! యమృతము
వోసితి నాకర్ణముల న • పూర్వప్రేమన్;
నే సన్యాసిని గద! ఋణ
మేసరణి న్దీర్చికొందు • నీలోకమునన్? 20

క. కొను మిది; యింతకు నెక్కుడు
గ నొసఁగలే నెయ్యది; యని • కంజాతాక్షుం
డనుపమసుఖదాశ్లేషం
బున గ్రుచ్చెఁ బ్రతాపరుద్ర • భూభృద్వరునిన్. 21

వ. అంతట నుత్కలప్రభుండును ద్రిజగత్ప్రభుండునుం గలిసి యవా
ఙ్మనసగోచరానందసుధాపానప్రమత్తులై సోలి వ్రాలిరి. కొంత
సేపటికి ‹‹రుద్ర›› భూపతి లేచి కాదంబరీపానోన్మత్తుండట్లు తూ
లాడుచుం జని స్వామిఁ బరివేష్టించికొని యున్నభక్తరత్నంబుల
కు సవినయుం డై ప్రణమిల్లె. వారంద[illegible] చివరకు స్వామియను

గ్రహంబున నీతండుం దరించెఁ గదాయని యపరిమితానంద భరితు లై రాజుపుణ్యంబును మిక్కిలి కొనియాడిరి. 22

గీ. ఎన్నినామంబు లున్నన ♦ శ్వేశున, కీఁక
నన్ని వీడి "ప్రతాపరు ♦ ద్రివనుఁ" డను
ప్రథితబిరుదంబుననె పిల్వ ♦ వలయు నంచు
రాజ్యమం దెల్లఁ జాటించె ♦ రాజరాజు. 23

వ. ఇట్లుండ నవద్వీపంబున. 24

ఉ. చూచుట కైతిగాశ స్మర ♦ సుందరకాయుఁ డొకండుఁ బోయె నీ
లాచలమందుఁ బెట్టి తన ♦ యందఱుభక్తులనం చెఱింగి, లో
నేచినపేర్మి, భార్య, జన ♦ యిత్రియుఁ, బుట్టినయూరిభక్తు, లా
లోచన సేయుచుండి రెటు ♦ లో మఱల న్నిమిఁగాంచుటన్వెతన్. 25

క. ఎక్కడకు నేగె నిమి? తా
నెక్కటిగా మెలఁగవలసె ♦ నిందఱ మిచటన్
నెక్కొని తిని మనుచుండఁగ
నక్కట! యనుకొంచుఁ గడపి ♦ రారెండేండ్లున్. 26

క. మనములఁ దలఁచినయప్పుడు
వనజాక్షుఁడు గానిపింప ♦ బ్రదుకఁ గలిగె రా
తనితల్లియు విష్ణుప్రియ
యును దక్కినభక్తపూరు ♦ షోత్కర మెల్లన్. 27

వ. ఈవత్సరద్వయంబు నవద్వీపంబున నున్నజనులచిత్తఖేదస్థితి "వసుఘోషుం" డీతెలుఁగునఁ దనగ్రంథంబునందు వర్ణించె. 28

ద్వి. స్వామి లేఁ డిచ్చటఁ; ♦ జచ్చె సంతోష;
మేమాడ్కి నెటుపోయె ♦ యాత్మింత మతని?

నంతరంగంబు ల ♦ య్యయ్యో! దుర్దాంత
చింతాబ్ధి మునిఁగి న ♦ శింపఁగఁ జొచ్చె;
నరసి యార్తులపై ద ♦ యామృతవృష్టిఁ
గురిసి యెవ్వాఁ డింకఁ ♦ గుం దార్పఁగలఁడు?
పతితులఁ గాంచి కృ ♦ పాదుఃఖబాష్ప
తతులదండడిఁ గార్చు ♦ తండ్రి యిం కేఁడి?
మానవద్వీపంబు ♦ మహితాంధకార
లీనమై మహిమీఁద ♦ లేనట్లె యుండె;
నసువులఁ బాయ కీ ♦ యంతయుఁ బాపి
"వసుఘోషుఁ" డారయ ♦ బ్రతుకంగవలసె. 29

గీ. ఇట్లు కుట్టూరుపులను జీ ♦ వించుచున్న
వారలలరంగ నొకనాఁడు ♦ వార్త వచ్చె
దక్షిణపుయాత్రనుండి చై ♦ తన్యుఁడు మఱ
ల నరుదెంచెను నీలాచ ♦ లమున కంచు. 30

ఉ. అంత శచీగృహంబుకడ ♦ నందఱుభక్తులు సేరి యాశచీ
కాంతయనుజ్ఞఁ దీసికొని ♦ కాల్నడ మాసముకాలమేగి శ్రీ
కాంతుని గన్నులారఁ బొడ ♦ గాంచిరి నీలనగంబున; న్వపు
స్త్రాంతి యడంగె నంతయును ♦ దండ్రిని జూచినయంత వారికిన్.

వ. ఈవచ్చినవారిలో శ్రీవాసుండు నద్వైతుండు మున్నగు ననేక భక్తతల్లజంబులు గలరు. మహమ్మదీయుం డైనందున నోఢ్ర దేశంబు సొర జంకుచుండెడుహరిదాసుండు నిందుఁ గలఁడు. తన రాక కభ్యంతరం బొనర్చినప్రతాపరుద్రమహారాజే స్వామికి దాసుం డై యుండ హరిదాసునకు స్వామిం జూడరానిఁ కేమి భయంబు? ప్రభుభక్తబృందంబులసమావేశమహోత్సవంబును

వా రెదురుగఁ గూరుచుండి యొండొరులఁ జూచుకొన్నప్పుడు వారికిం గలిగినయనిర్వాచ్యమోదంబీ యైహికచింతాపంకిలచిత్తంబుతో నెవఁడు వర్ణింపఁ గలండు? వా రట్లానీను లై కొంత సే పున్నయనంతరంబు స్వామి "మురారి యెక్కడ?" యనియడిగె; నంత నొకం డాతనిఁ దీసికొనివచ్చుటకుఁ బరుగెత్తె. 32

గీ. ప్రభుని జూచెడుకౌతుక ♦ భారముగను
దారిలోపల మూర్ఛము ♦ రారి వ్రాలెఁ;
దత్సమానందపరవశ ♦ త్వమున నితర
భక్తు లతనిని మఱచిరే ♦ వచ్చినారు. 33

క. వచ్చినమురారిఁ గౌఁగిటఁ
గ్రుచ్చుటకు న్సిద్ధపడఁగ ♦ గురువరుఁ, డాతం
డిచ్చపడ కేగివెనుకకుఁ
బచ్చవిలుతుతండ్రి! ముట్ట ♦ వలదని వేఁడెన్. 34

క. తాఁకకు న న్నోస్వామీ!
తాఁకుట కర్హుండఁ గాను; ♦ ధర నెచ్చట లేఁ
డీకలుషాత్ముకుఁ డట్టిఁడు;
నీకౌఁగిటఁ జేరఁగలనె ♦ నిర్మలమూర్తీ! 35

గీ. అనిన బలవంతముగనె ము ♦ రారిఁ బట్టి
కౌఁగిలించుక "నీశుభ ♦ కాయ మంటి
నన్నుఁ బరిశుద్ధుఁ జేసికొ ♦ నంగ నిట్లు
చేసితిని మిత్రమా!" యని ♦ చెప్పె విభుఁడు. 36

ఉ. ఈగతి నాల్గుమాసములు ♦ హృత్ప్రమదంబున నొక్కనాఁడు గా
వేగఁగ, భక్తుల న్బిలిచి ♦ యూశుఁడు సెప్పె "గృహస్థులారిమీ

శేగి గృహస్థధర్మములు ♦ నెల్లను జేసికొనుండు చక్కఁగా,
జాగొనరింప మీకయివి ♦ చారము నొందుదు రిండ్ల బందుగుల్. 37

క. యతులు గృహస్థులమాడ్కిని
యతులగతిని గేస్తు లుంట ♦ యతిపాపము; మీ
పితృసుతదారాద్యుపజీ
వితతి నోషింపఁ జనుఁడు ♦ వేగమ" యనినన్. 38

క. దారాదిసర్వ మేమఱి
గౌరాంగునికడనె శేష ♦ కాలముఁ గడపన్
గోరెడుభక్తులు సనిరి వి
చారముతో వారివారి ♦ సద్మంబులకున్. 39

క. యత్యాశ్రమము స్దాల్చిన
నిత్యాదులు మాత్ర మచట ♦ నిలిచిరి, లోక
స్తుత్యుం డగుగౌరాంగుని
భృత్యు లయి యఖండభక్తి ♦ విహ్వాలమతు లై. 40

గీ. కృష్ణభక్తిని దొప్పదో ♦ గెను సమస్త
మైనయుత్కలభూమి గౌ ♦ రాంగుకృప; ని
పుడు జగన్నాథ మానంద ♦ పూర్ణ మయ్యె
వెనుక రెండేండ్లము న్నవ ♦ ద్వీపమట్లు. 41

వ. ఒక్కనాఁడు స్వామియు నిత్యానందుం డేకాంతంబున ముచ్చట
లాడుకొనుచుండ "నీవు వంగదేశంబునకుఁ బోవలయు" ననవి
స్వామి వలుక నిత్యానందుం డిట్లనియె. 42

గీ. నిన్ను విడిచి వంగమునకు ♦ నేను జనుట
యెట్లు పనుపడు? నట్లు గా ♦ దేవుడు స్వామి!

నీవు నాప్రాణమవు; నేను ♦ నిలువఁ గలనె
జీవమును బాసి యెన్నఁడేఁ ♦ జెప్పు మభవ! 43

వ. చైతన్యస్వామి యిట్లనియె. 44

సీ. వంగము రక్షింపఁ ♦ బడవలె; నాయసా
ధ్యంపుఁగార్యంబున ♦ కగుదు వీ వొ
కండవె; నామీఁద ♦ నుండు ప్రేమంబున
నినుఁ బాసి యేగలే ♦ ననెద వీవు;
మనము సంతోషించి ♦ మనుటకుఁ బుట్టలే
దయ్య! నిత్యానంద! ♦ యవనియందు;
భక్తిహీనత దుఃఖ ♦ వార్ధిలో మున్గియు
న్నారయ్య! వంగంబు ♦ వారు తండ్రి!

గీ. వంగతారణ మతిదుర్ల ♦ భంబు సుమ్ము;
వారలందఱుఁ బ్రబలవి ♦ ద్వాంసు, లధిక
బుద్ధిశాలులు; వారి నీ ♦ బోఁటికృష్ణ
భక్తుఁడును శాంతుఁడే చక్కఁ ♦ బఱుపవలయు. 45

క. క్రూరం బగునీయాజ్ఞను
గౌరాంగా! వినిన గుండె ♦ కలఁతంబడుచున్
దారితమయ్యెడు నని నితి
కాఱిచె బాష్పములు ప్రభుని ♦ కడఁ గాల్వలుగన్. 46

వ. అంతఁ జైతన్యస్వామి యత్యంతప్రేమార్ద్రహృదయుం డై నితి
నిం గౌఁగిలించుకొని యిట్లనియె. 47

సీ. నావియోగము చేత ♦ నీ వెంతదుఃఖింతువో
యంతగా దుఃఖింతు ♦ నయ్య నేను;

బుద్ధిబలంబునఁ బొగరెక్కి యున్నవం
గంబువారిని బుద్ధి గరిమ నోర్వఁ
జాలవు శ్రీపాద! శస్త్రభక్త్యద్రిక్త
హృదయంబుచేత జయింపవలయు;
బుద్ధిమంతుల నోర్వ బుద్ధిని మించిన
సాధనంబుం గొని చనఁగవలయు;

గీ. వారిఁ జింతింప నాకు న పారమైన
జాలి గలిగెడు; నీపేరె చాటు నీవు
నిత్యసంతోషపీయూష నిలయమ వని;
జాగరూకత మెలఁగిన జయము గల్గు. 48

క. శేముషిఁ బాండిత్యంబున
మైమఱచి మెలంగునట్టి మనవారలకున్
బ్రేమను దెల్పుము మనలో
శేముషిగా కొందు గలదు చిత్రం బనుచున్. 49

క. దానిఁ గనఁబఱిచి వారికి
మానసముల నాటఁజేయుమా! శ్రీపాదా!
పూనికఁ గృష్ణుని గొల్చెడు
మానిసికిం గలుగునట్టి మహితసుఖంబున్. 50

క. అడ్డంకు లెన్నొ వచ్చున
నడ్డ న్మ్రొలఁగకుమ తండ్రి! సత్ప్రేమముచే
నడ్డులు తెగి పడిపోవును
గొడ్డట నఱకంగఁబడిన కుజములమాడ్కిన్. 51

శా. అన్నా! శ్రీహరిభక్తిపాయసము మర్త్యశ్రేణికిం బెట్టున
ట్లెన్నంబోకుమ జాతి, నీతి మత, సద్వ్య, త్రార్థ,లింగాదు; లా

పన్నతాత్రిణపరాయణుండ వయి యా♦బాలం బౌసంగన్వాలె;
ఛిన్నాఘార్తులఁ జేసి వంగజనుల ♦ న్శ్రీకృష్ణుఁ జేర్పన్వాలె. 52

క. ఎంతగఁ బాపం బెక్కుడొ
యంతగ శాంతియును బ్రేమ ♦ మగపఱుపుము ! స
ర్వాంతర్యామి యగురమా
కాంతుఁడు కృష్ణుండు నీకుఁ ♦ గైదండ యగున్. 53

వ. అని పన్నిద్దఱుభక్తుల నితికి సహాయులుగా నిచ్చి పంపెఁ; బంప కమున్న వారందఱకు భక్తిప్రదానార్థంబు కావలయునాత్మతేజ శ్శక్తు లవలోకనమాత్రంబున స్వామి ప్రసాదించె; వారు చని చని నవద్వీపంబు చొచ్చినప్పుడు పూర్ణానందప్రమత్తులై పూర్వ వృత్తాంతవిస్మృతిం బొరసి యుండిరి. 54

సీ. వంగముననను నితి, ♦ ప్రభునిగౌరాంగుని
భక్తిపైకొంబు నీ ♦ ఫక్కి నెత్తెఁ;
గరపత్రములు జనో♦త్కరమున కీలేదు,
సభల వాదంబులు ♦ సలుపలేదు,
ధరకు శ్రీకృష్ణావ ♦ తారంబు గౌరాంగ
రూపంబునను వచ్చి ♦ పాపతాప
ములను జల్లారిచి ♦ ముక్తిమహానంద
మును బంచిపెట్టెడుఁ ♦ గొనుఁ డటంచు

ఆ. భక్తికాంతి వదన ♦ పద్మంబుపైఁ బర్వ,
దివ్యమోదవివశ ♦ దృక్తులను
జలుపుచుండె భక్త ♦ చయముతో నూఁగూర
నర్తనముల భక్తి ♦ కీర్తనముల. 55

గీ॥ నితి యేగుచుం బాడినగీతంబులరీతి యీ్రకిందిదానివలన నెఱుంగ
నగు. 56

ద్వి. అందఱహృదయంబు ♦ లం దుండువాఁడు
సందియంబులు వోవఁ ♦ జను దెంచినాఁడు;
చనుదెంచెఁ జనుదెంచె ♦ జనులార! కనుఁడు;
కని ముక్తిసుఖసుధఁ ♦ గఱవాఱఁ గొనుఁడు;
దరదసంసారదు ♦ స్తరవార్ధి జనులఁ
దరియింపఁజేయ మా ♦ తండ్రి గౌరాంగుఁ
డొకరేవుపెట్టెఁ గే ♦ వొకకాసు నడుగఁ
డీఁక రండు నాతోడ ♦ నేగుద మటకు. 57

సీ. వాదంబు సేయఁగా ♦ వత్తువే యని కొంద,
అప్రిమాణపుమాట ♦ లనుచుఁ గొంద,
అున్మత్తు లగువారి ♦ యుబు సేల మన కని
కొందఱు, క్షుద్బాధఁ ♦ గొల్పి కొంద,
ఱింతంతయనరాని ♦ యెగసిపాటునఁ గడు
గేలికొట్టుచుఁ గొంద, ♦ ఱోలి నిత్తిని
జిక్కుపెట్టిరి; కాని ♦ చిత్తధైర్యంబును
విమలభక్తిని శాంతి ♦ విడక యాతఁ

గీ. డట్టిశత్రులకడనె ద ♦ యాతిరేక
మునను గన్నీళ్లు గాఱిచి, ♦ కొనుఁడు భక్తి
ననుచుఁ బదములపైఁ బడ, ♦ నంద త్రైరి
కరఁగి వెన్వెంట భక్తు; ల ♦ క్కజము గాదె? 58

వ. తొల్దొల్త నితికిఁ బరమశత్రువులై యెదురుకొనినవా రెందఱో
పిదప నిశ్లే యతనిశిష్యులుం భృత్యులు, భక్తివ్యాపన మహాసాధ

నంబులు నైరి; సహస్రోపసహస్రంబులుగఁ బెరిఁగి భక్తులతని వెంబడించి పోయిరి. నిత్యానందముఖ్యశిష్యకృత 'చైతన్యభాగవతము' నం దామహామహుని భక్తిబోధంబుంగూర్చి యిట్లు వ్రాయంబడియె. 59

ఆ. నిత్యశాంతమూర్తి • నిత్యమోదాత్మకుం
డైననితికి నెవ్వఁ • డేని యెదురు
వచ్చెనేని గర్వ • వాసన లేనట్టి
మనసుతోడ నిట్టు • లనును మ్రొక్కి. 60

క. మనమందున మాగౌరాం
గుని బెట్టుక కొలువు మయ్య, • కూలును వంతల్,
పెనుపడును శుభపరంపర,
పనుపడు సులభముగ ముక్తి • పదసౌఖ్యంబుల్. 61

క. మంచిది యని యాతం డా
లించి వచించినను సరియె; • లేకుండినచో
నుంచుక నోటను దూర్వా, వ
చించును నితి దైన్యవికల • చిత్తమున నిటుల్. 62

క. శ్రీదయితుని గౌరాంగుని
నాదట గ్రహియింపు; మదియె • యర్థముగాన
న్నీదినమునఁ గొను; మెప్పుడు
నీదాసుఁడ నౌచు నంత • నిన్నుం గొలుతున్. 63

గీ. పాపులను గాంచి దుఃఖబా • ష్పములు రాల్చి
భక్తి దివ్యౌషధం బిచ్చి • పాపశాంతి
చేయ నిట్టులు దైన్యంబుఁ • జెందు నితని
విడిచి యవ్వాలి కెవ్వఁడు • నడవఁగలఁడు? 64

అన్యపూరుషపాపార్తు ♦ లరసి యవ్వి
తన్ని బాధించుచున్నట్లు ♦ తలఁచి యేడ్చి
పుడమిపైఁ బడి దొర్లెడు ♦ పుణ్యమూర్తి
విడిచి యవ్వలి కెవ్వాఁడు ♦ నడవఁగలఁడు? 65

సీ. స్వామి నిత్యానంద ♦ సత్సాధనంబున
వంగదేశమునందు ♦ భక్తిరసము
వఱదవాఱెడునట్లు ♦ పచరించెఁ; బెక్కురు
చిత్రశక్తులను గాం ♦ చిరఁటకూడఁ;
బిల్లలుకొందఱు ♦ పెద్దవిద్వాంసుల
వలెఁ బల్కిరఁట మంజు ♦ భాషణముల;
నెఱుఁగనిభాషల ♦ నెందఱో మాటాడి
నారఁట; వస్తుల ♦ నవయకుండ
గీ. నుండినారఁట దుర్బలు; ♦ లెన్నొండుశక్తి
చూపినారఁట; యీభక్తి ♦ సులభమహిమ
పటలమెల్ల శ్రీచైతన్య ♦ భాగవతము
లోన నతివిపులంబుగఁ ♦ గాననగును. 66

వ. తరువాతిసంవత్సరంబున భక్తులందఱు జగన్నాథంబున స్వామి దర్శించుటకు వచ్చిరి. స్త్రీలుకూడ గౌరాంగావలోకనలాలసలైన కతంబున జాయాసహితభర్తలు, మాతృసమేతపుత్రులు, సోదరీయుతసోదరు లనేకులు వచ్చిరి. స్వామిమహాభక్తులలో నొక్కఁడగు "శివానందసేనుం" డనుగొప్పధనికుండు సర్వజనులయావద్యాత్రావ్యయంబును బుణ్యార్థంబు తానే భరియించెద నని చెప్పి యట్లు చేసె. రథోత్సవంబునాఁడు స్వామిం దర్శింపఁబోవు నందఱయాత్రావ్యయంబు లిట్లిరువదియేండ్లకెక్కుడు కాలంబు

తానే వహించె; నీమహానుభావునిసత్పుత్రిలలో నొకండు బ
హుసంస్కృతగ్రంథకర్తయై విఖ్యాతిం గాంచె; నందు రెండు-
"చైతన్యచారిత్రం" బొకటియుఁ "జంద్రోదయనాటకం" బొ
కటియు-శ్రీగౌరాంగదేవులీలలం గూర్చి వ్రాయంబడియె; నవియే
యీపుస్తకంబునకు ముఖ్యాధారంబులు. 67

క. నీలాచలపురభక్తో
ద్వేలకదంబముల నెల్ల • వెంటం గొని శ్రీ
లోలుఁ డెదుర్కొనె వచ్చును
శీలుర, నవ్యాజభక్త • శేఖరుల దయన్. 68

వ. అంత శ్రీకృష్ణా! శ్రీహరీ! మాతండ్రీ! యనుశబ్దంబులు సమా
గతభక్తవారంబునుండి వెలువడి నింగిముట్టె. శివానందుం డెత్తు
కొనివచ్చుచున్నయతనిపెద్దకొడుకు, తొమ్మిదేండ్లబాలకుం డా
మహాధ్వానంబు లాలించి స్వామి నంతకుమున్న చూడమింజేసి,
నాయనా! యీమహాసంఘుంబులో స్వామి యెచ్చట నున్నాఁడో
యనఁ పలుకు,మన భక్త్యుద్రేకచేతస్కుం డై నశివానందుం డానం
దబాష్పపూర్ణనయనంబులతోఁ గొమరున కిట్లనియె. 69

సీ. వెఱ్ఱివాఁడవు సుమీ! • కుఱ్ఱ! నాస్వామిని
వేఱెల్చెఁచి నీకుఁ జూ • పింపవలెనె?
యందఱి కున్నతుం • డై మహాసౌందర్య
యుతుఁ డయి మిన్నంటి • యున్నవాఁడు,
చూడశక్యము గాని • సురుచిరదివ్యతే
జమ్ము గ్రిమ్మనశుభాం • గమ్మువాఁడు,
చిన్నారిమోమునఁ • జేరెఁడుకన్నులఁ
బూర్ణగ్రుపం జిమ్ము • ముద్దులాఁడు,

గీ. పేరిమభక్తుల కిరువు, శ్రీ ♦ కృష్ణమూర్తి;
పరిజల రక్షింపఁగా నేను ♦ వసుధఁ బుట్టి
నాఁడ నని చెప్పకే చెప్పు ♦ వాఁడె, వాఁడు!
కనుము నాతండ్రి! కన్నుల ♦ కఱవు దీఱ. 70

వ. ఈమహాభక్తులందఱు స్వామియుం గలసి నాల్గుమాసంబులు జగన్నాథంబునం దుండి; రాదినంబు లన్నియు వారికి మహాపర్వదినంబు లయ్యె. వారిదినచర్య భోజనాద్యైహికభోగభాజనం బై యుండ కిట్లుండె. 71

సీ. పెందలకడ లేచి ♦ యందఱుం గలిసి శ్రీ
హరి, ధ్యానమును జేసి, ♦ యలరి యేగి,
వేలకొలందిగా ♦ విష్ణునామోచ్చార
ణముల దోయముల స్నా ♦ నంబు సేసి,
హరిహరిధ్యానంబు ♦ లాకసంబంటున
ట్లొనరించి, కలిసి భో ♦ జనము చేసి,
యపరాహ్ణమునఁ గూడి ♦ హరిపూతసత్కథా
యుతము శ్రీమద్భాగ ♦ వతము సదివి,
గీ. పండుకొనఁబోవునప్పుడుఁ ♦ బాడి హరిని,
హరికథామృతపానంబు ♦ నందె నూట
యిరువదిదినంబులును భక్త ♦ వరులు, స్వామి
కడ మహానందమున, నిట్లు, ♦ కడపినారు. 72

వ. తుదకు స్వామిని వీడ్కొనిపోవలసినదుర్దినంబు వచ్చె. భక్తమహారణ్యమధ్యంబునం గూరుచున్నస్వామి యందఱఁ బ్రత్యేకంబుగ గాఁగిలించుకొనియె; నందు ‹‹ముకుందు›› నన్నయగు ‹‹ వాసుదేవుం ›› డనువాఁడు, ముకుందునితరువాతఁ జాలకాలంబునకు

శ్రీగౌరాంగభక్తవారంబులోఁ జేరినవాఁడు, లోకంబునఁ బ్రజలు పడుకష్టంబులం జూచి సహింపలేక యెప్పుడు దుఃఖించుచుండు వాఁడు, భక్తిభరితనిష్కల్మషాంతరంగుండు, పవిత్రుం, డతివినయభూషణాభూషితుండు, ముందునకు వచ్చి స్వామిపాదంబులపైఁ బడి యి ట్లనియె. 73

సీ. ఓదయాసాగరా ! యొసఁగుమునాకొక్క
వరముఁ గోరెద దుఃఖ భరముఁ బాపి;
జనులు, నీబిడ్డలు సర్వేశ ! బహుదుఃఖ
వార్ధినిమగ్ను లై బడలుచున్న
వా ; రది గాంచి నే నోరువఁజాలను;
వ్రక్కలయ్యెడు గుండె ప్రభువతంస !
వారిపాపాళి స ర్వంబు నాపై వైచి
వారినందఱ సౌఖ్య పడఁగఁ జేయు;

గీ. మే నొకండను నరకార్తి నెనయుచున్న,
నితరజను లందఱును నీదు కృపను నిత్య
సుఖసుధను గ్రోలుదురు ; నాకుఁ జొప్పఱపుము
వారు సుఖపడఁ జూచున పారసుఖము. 74

గీ. వాసుదేవునిమది వెన్న వంటి దయ్యెఁ;
దాఁ బడెడుకష్టములకంటెఁ దక్కుజనుల
కష్టతతు లాత్మకురుదుఃఖ కరము లయ్యె ;
నిట్టిపరిపక్వహృదయున కెవఁడు సాటి? 75

క. ఈవింతప్రార్థనంబును
గావించుట చూచి భక్తకాండముఁ బ్రభుఁడుఁ

గావించిరి 'బళి' యనును
ద్రావము లానందబాష్ప ♦ రాజిఁ బులకలన్. 76

క. ఈరీతి వరము నడిగెడు
వా రెవ్వరు గలరు? పాపి ♦ పాపక్షమకై
కోరఁడు; నాపై వేయుము
వారలపాపము లటంచు ♦ వాంఛించెనహో! 77

గీ. స్వసుఖతత్పరత్వంబు లే ♦ శంబు లేక
భక్తివైరాగ్యపూర్ణులై ♦ వఱలినట్టి
లలితగౌరాంగపాదభ ♦ క్తులకె చెల్లె
నట్టివరమును వేఁడ సా ♦ హసము చేసి. 78



క. నలువదియేడేండ్లమహా
కలుషానలతాపమెల్లఁ ♦ గడతేఱుఁ జుమీ
లలితభవచ్ఛుభదృక్సుధ
నొలికిస నీవంక రామ! ♦ యొకమాఱు దయన్. 79



శ్రీరామా.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ద్వితీయ భాగము.

### చతుర్దశాశ్వాసము.



చ. పరమతపోగరిష్ఠు లగు ♦ వారలకేనియు నందరానిసుం
దరభవదంఘ్రిపద్మము ల ♦ నారత మాదలఁ దాల్చినట్టియా
వరశుభపాదుకాలనద ♦ పారయశోమహిమప్రభావముల్
భరతుఁ డెఱుంగు రామ! హరి ♦ భక్తుఁ డెఱుంగు! నేరుం డెఱుంగునే?

సీ. "భక్తిలోఁ జండాల ♦ పర్యంత మందఱు
సములె నిష్కల్మష ♦ స్వాంతులైన"
నని స్వామి బోధించె ♦ నని చెప్పఁబడె నిటఁ:
పూర్వ; మాకారణం ♦ బునను దనదు
కాఁపురం బగునవ ♦ ద్వీపమూంది నిమికి
విద్వేషు లుండిరి ♦ పెక్కు-చోట్లఁ;
గాని చిత్రంబుగ ♦ గౌరాంగుఁ గనినంతఁ
బరమశత్రుండును ♦ భక్తుఁ డయ్యె;

గీ. దీని కద్వైతుఁడును, ఖాజి, ♦ ధృష్టదుష్ట
నరులు మాధవుఁడును జగ ♦ న్నాథుఁ, డింకఁ

బ్రభునిదక్షిణయాత్రఁ గా ♦ వంగఁబడిన
పెక్కురు, నిదర్శనము లంచు ♦ విదిత మయ్యె. 2

గీ. ఉగ్రశాసనుఁ డైనట్టి ♦ యుత్కలాధి
పుఁడు, ప్రతాపరుద్రుఁడు, నయ్యెఁ ♦ బుణ్యమునను
స్వామిశిష్యుఁడు ; గృష్ణుఁడే ♦ స్వామి యనెడు
నిశ్చయంబున నతఁడు స ♦ న్నిధిని మెలఁగు. 3

సీ. వంగదేశంబును ♦ బాలించుప్రభువు మ
హమ్మదీయుఁడు ; వాని ♦ యంతరాజ్య
కృత్యంబు నెఱవేర్తు ♦ రిర్వు రమాత్యులు ;
వారు బ్రాహ్మణు ; లైనఁ ♦ బ్రభునిదయను
బొరసి నిరాఘాట ♦ ముగ రాజ్య మేలెడు
నత్యాశఁ దురకల ♦ యట్లు మెలఁగు
చుండిరి కట్టునం ♦ దుండక ; పేరువం
గాధిపునది, వారి ♦ దనుభవంబు;

గీ. ప్రబలి ప్రబలి తుదకు నీయు♦భయులు స్వామి
యడుగుఁదమ్ములఁ గొలిచి కృ ♦ తార్థు లైరి ;
'రూపుఁడు' 'సనాతనుఁ' డనుపే♦రులను బ్రభుఁడు
భక్తిఁగఱపంగ బృందకు ♦ వారిఁ బంపె. 4

క. వాయువిదిగ్దేశంబున
కేయిద్దఱుఁ బోయి భక్తి ♦ హీనప్రజకున్
భూయశ్రీహరిభక్తి
శ్రేయంబు లొసంగిరి, నిమి ♦ చెప్పినపగిదిన్. 5

ఆ. వాసుదేవసార్వ ♦ భౌముఁ డయ్యెను నిమి
శిష్యుఁ ; డింక గర్వ ♦ శీలుఁ డతని

యంతవాఁడు కాశి ♦ యందున నొక్కఁడు
మేటిపండితుండు ♦ మిగిలి యుండె. 6

వ. ఈతండు ప్రథమభాగంబునఁ జతుర్దశాశ్వాసంబున నొక్కయా వేశసమయంబున స్వామిచే నీక్రిందిపద్యంబులం దెలుపంబడిన దిగంతవిశ్రాంతకీర్తియుఁ, బరివ్రాజకాచార్యుండును, జ్ఞానావబోధనభక్తిఖండనపటిష్ఠుండు, నగు ప్రకాశానందసరస్వతీస్వామియే. 7

గీ. "ఒడలు పొగరెక్కి కాశిలో ♦ నుండుజోగి
యెల్లిదుఁడు ప్రకాశానందుఁ ♦ డెట్లు కాలు
లఱచుచున్నాఁడొ చూచితి ♦ రయ్య మీరు!
బుద్ధి సెప్పెదు వానికి ♦ ముందు ముందు."

గీ. "తాన పరిపక్వచిత్తుఁడై ♦ తానుగఱపు
మూఢజనపాళిసామర్థ్య ♦ మును రవంతఁ
జూడకుండఁగ భక్తిని ♦ నురుఁగఁ జేయు
నతని 'బ్రహ్మహ' మెట్టిదో ♦ యరయువాఁడ!"

సీ. వేదంబు లతనికి ♦ వేడుకపాటలు;
శ్రుతిశిఖ ల్రసనాగ్రి ♦ సతతవర్తు;
లఖిలశాస్త్రములు న ♦ య్యాటమాటలు; యుక్తి
జాతంబు తెఱుఁగని ♦ నూతినీరు;
భక్తిఖండనములు ♦ పరమసంతోషము;
ల్సద్విజయము తృణో ♦ త్సాదనంబు;
వాచంయములు నిత్య ♦ పాదసేవకులు; ఛా
త్రులమేటిసంఖ్య శి ♦ రోజసంఖ్య;

గీ. శత్రుగర్వనిర్భేదక ♦ చండపాండి
తీమహత్వాస్తఘనయశో ♦ దీప్తిఁ, గాశి

కాపురంబున నామాడ్కిఁ ♦ గాఁపురంబు
చలుపుచుండె ‘నానందుఁ’ డ ♦ జయ్యుఁ డగుచు. 8

క. గౌరాంగుఁడు శ్రీకేశవ
భారతికడ సన్యసించి ♦ భక్తిఁ బ్రజల కె
వ్వారిగ నిడుచున్నాఁ డూ
రూర ననుచు వెనుక వినియు, ♦ నూరక యుండెన్. 9

గీ. సార్వభౌముని నిర్జించి ♦ స్వామి యాత్మ
భక్తునిగఁ జేసికొనె నన్న ♦ వార్త వినిన
నాఁటినుండి యలక్ష్యంబు ♦ నను బ్రభువును
జూడ కా ‘సరస్వతి’ కడుఁ ♦ జోద్య మందె. 10

వ. వెఱంగుపడి యి ట్లనుకొనియె. 11

క. ఎవఁడో చైతన్యుం డఁట;
చివరకు మావాసుదేవు ♦ చిత్తముకూడన్
దవిలెనఁట వాని; నట్టులు
రవణించుట కాతఁ డెట్టి ♦ రవరయొ యెఱుఁగన్. 12

ఆ. చదివె వాసుదేవ ♦ సార్వభౌముం డెల్ల
వేదశాస్త్రములును; ♦ విదితుఁ డైన
పండితుండుఁ జండ ♦ వాదియే; కాని యీ
పిల్లగానికడను ♦ వెఱ్ఱి యయ్యె. 13

క. సామాన్యపుబాలకు శ్రీ
భామాపతి! కృష్ణుఁ! డంచు ♦ భావించి, యశః
కాముఁడు ధీమంతుం డెటు
పామరపురుషుఁ డయి వాని ♦ భజియించెనొకో! 14

క. మాయావి ; యింద్రజాలికుఁ
డాయర్భకుఁ; డంతకోవి ♦ దాగ్రణియెదుటన్
వాయి తెఱచి వాదంబున
నేయచ్చికబుచ్చికల జ ♦ యింపఁ గలిగెనో? 15

క. ధీపాండిత్యవిశాలుం
డేవో! యాసార్వభౌముఁ ; ♦ డేమైన, ముదిన్
బాపము ! మది దప్పి, యటుల్
పాపనికి న్దాసుఁ డయ్యెఁ ♦ బ్రారబ్ధమునన్. 16

క. గౌరాంగుం డెప్పుడే నొక.
మా ఱేకాశి కరుదెంచి ♦ మాటాడినచో,
వారి న్వీరిని గెలిచిన
తీరెల్లను మాకుఁ గూడఁ ♦ దెల్లముపడెడున్. 17

వ. అని ప్రకాశానందుం డాత్మమనీషావైదుషీసామర్థ్యం బగ్గలంబుగ నుగ్గడించుకొనుచు గర్వాతిరేకంబు బయల్పడ రెండుశ్లోకంబులు చేసి వ్రాసి వానిస్వామికిం బంపెఁ ; దద్భావం బీక్రింది పద్యంబునఁ దేటపడంగలదు. 18

గీ. పుణ్యతీర్థంబుఁ గాశికా ♦ పురవరంబు
వదలి, యిచ్చట నచట ని ♦ వాస ముండు
వాఁడు, కేవలదుష్పశు ♦ ప్రాయుఁ డంచుఁ
జెప్పెదరు ; దాని సన్న్యాసి ! ♦ చిత్తగింపు. 19

వ. సాధారణంబుగ సట్టివిషయంబుల నుదాసీనుం డై యుపేక్షనుండుస్వామి యేలో యామాత్సర్యకలితం బగుజాబున కీక్రింది సవినయప్రత్యుత్తరం బిచ్చి పంపె. 20

క. పరువునకు లోప మగునని
యరయంగా లేదు ప్రభువు ♦ నానందుఁ; డిఁ కెం
దఱకో దర్శన మిచ్చియు
నరయం డానందుమాత్రి ♦ మధిపుఁ డదేమో ! 27

వ. కాశినుండి బృందావనంబునకు స్వామి తరలిపోయినపిమ్మటఁ బ్రకాశానందుం డాత్మమాత్సర్యదౌష్ట్యంబులు బయలుపడ నిజ శిష్యనికాయంబుమోఁల ని ట్లనియె. 28

ఉ. మాయలమారిబాలుఁ; డను♦మానము లే దని చెప్పలేదె ము;
న్నాయవతారపూరుషుని♦యాటలు సాగవు కాశికాపురిన్ ;
బోయెనుగాస నే; యెపుడు♦పోయెనొ? బృందకుఁబోయెనంట; యిం
కాయన రాఁడు నేను బుర♦మందు వసించెదు నంత కాలమున్. 29

వ. కాని కొంతకాలంబునకు బృందావనంబునుండి వచ్చి స్వామి కాశీ నగరంబుం బ్రవేశించె; నది యెఱింగి ప్రకాశానందుం డి ట్లనియె. 30

క. మఱలం బురి కే తెంచెనె
సురవంద్యుం ; డైన మనలఁ ♦ జూడఁగ మాత్రం
బరుదేర లేదు లే ; దీ
పరమరహస్యార్థ మెఱుక♦పడె నా కవుడే. 31

క. ఒకచిన్నకుటీరము నం
దొకపురభాగంబు నందు ♦ నుండెడు స్వామిన్
సకలపురీసజ్జనులు, కు
తుకమున సరుదెంచి కనిరి♦తోరపుభక్తిన్. 32

క. కనినంతనె శ్రీకృష్ణుం
డె నిమి యటం చెంచి వారు ♦ నిర్మలభక్తిన్

వనజాక్షుపాదయుగ్మం
బునకుం జాఁగిల్లి మ్రొక్కి ♦ పోవుట యయ్యెన్. 33

క. అరిగి ప్రకాశానందుని
యిరవునకుం బోయి ముద్దుఁ ♦ గృష్ణుఁడె వచ్చెం
బురమున కని చెప్పఁగ, మ
స్కరి కడు పవియంగ నవ్వి ♦ కడ కి ట్లనియెన్. 34

చ. పురజనులార! మీ రెపుడుఁ ♦ బోవకుఁ డాతని వైపు; చిత్రత
స్కరుఁ; డతఁ డింద్రజాలములఁ♦జాల సమర్థుఁడు; పోదు రేని, దు
ర్నరకమహార్తులం బడి య♦ణంగుదు; రింతయు నిక్కువంబు; ద
బ్బఱలకుఁ జిక్కి మోసపడు ♦ వారలకంటెను మూర్ఖులుందురే?

క. అవతారపురుషుఁ డనునే
ను వచ్చితి ధరణికటంచు ♦ నొడివెడునాతం,
డవతారపురుషబుద్ధిన్
దవిలి నరునిఁ గొల్చువారు, ♦ నష్టులిట నటన్. 36

వ. క్రొత్తగా స్వామిభక్తగణంబుం జేరినవారి నీయసూయాగ్రస్తుని
మాట లించుకయు మార్పఁజాల వయ్యెఁ; బ్రభుఁడు శ్రీకృష్ణుం
డే యనుదృఢవిశ్వాసంబున సతనిసతతంబు సేవించుచుండి యె
ప్పుడేని ప్రకాశానందుండు స్వామికనులఁ బడెనేని తప్పక
తరింపం గలఁ డనుకొనిరి; కాని వారియుభయులకు సమావేశం
బెట్లు గల్గుననుదీర్ఘాలోచనంబునంబడిరి. కొంతకాలం బట్లుండి
తుదకు వారంద ఱొకనాఁడు స్వామితో ని ట్లనిరి. 37

మ. అతిగర్వంబున నిన్ను దూఱెడుఁ బ్రకా♦శానందసన్న్యాసి; మా
వెతలం దీర్పవలె న్బ్రజావన! మహా♦భీతాత్ములైయున్నవా

రతనిం జూచినభక్తు లంద ; ఱొకయు ♦ య్యా స్సిను రక్షించినఁ
క్షితియెల్ల నన్నరింపఁగాఁబడు ; నటు ♦ ల్సేయంగ నుంకింపవే? 38

క. జగమంతయు రక్షింపఁగ
నిగమాంతవిహారి ! యిల జనించితి కానఁ,
బగవాఁ డని చూడక కా
వఁగ నగు నేవేగ దృష్ట ♦ పండితసింహులన్. 39

క. వేఁడిన దానికి నుఱుమా
టాడక, మోమువయి నుండ ♦ వరసాంభలు న
ట్లాడఁగ, మిన్నకయుండెను
బొద్రిడలలోఁ బొద్రిడ, మిశ్ర ♦ పుత్త్రుం డంతన్. 40

గీ. కొత్తగా భక్తుఁ డైనయు ♦ కొల్చినను, మంచి
దండిగలమహారాష్ట్రవి ♦ ప్రుండను, యతి
మంతుఁ డొకనన్నుగడఁ బన్ని ♦ యుత్త స్వామి
కడకు మిత్త్రులతోఁ జని ♦ యడిగె నిట్లు. 41

క. వారాణశిలో నుండెడు
పారాశరిబృందములను ♦ బ్రభువర ! యొకచో
నారాధింపఁ దలంచితి ;
మీరును రావలయు నటకు ♦ మీశిష్యులతోన్. 42

వ. అతనిహృదయగతోద్దేశం బెఱింగినస్వామి చిఱునవ్వు నవ్వి యూరకుంట గాంచి తక్కుభక్తు లందఱుఁ జేతులుజోడించుకొని మ్రొక్కి లేచి నిలువంబడి యేకగ్రీవంబుగ ని ట్లనిరి. 43

సీ. సత్యస్వరూప ! నీ ♦ సమ్ముఖంబుననున న
త్యంబె వచింపఁగాఁ ♦ దగును గాన

బలికేద మాలింపు ; ♦ వట్టిమూర్ఖత నిన్ను
నిందించువారిని ♦ నిన్ను నొక్క-
పట్టునఁ గెలువఁగాఁ ♦ బన్నిన యొకతంత్ర
మిది యెల్లఁ ; గాదన ♦ కీవు రావ
లయును ; నిస్తుంత కీ ♦ లాగున వారలు
వదరుచున్నారు ; నీ ♦ వెదురుపడినఁ

ఆ. బాపరహితుఁ డౌదు ♦ రావలుగాకులు ;
పాపమేద, నూరు ♦ భక్తిరసము
వారిహృదయముల న ♦ వారిగ ; వారికి
నోరు రాదు నిన్ను ♦ దూఱ నంత. 44

క. నిందాస్తుతుల కతీతుఁడ
వెందీవరనయన! ; నీదు ♦ హృదయం బెపుడున్
జెంద దొకింతయుఁ జింతా
సందంబులు వానివలన ♦ నాయన ! తెలియున్. 45

గీ. కాని మే మోహభరితులఁ ♦ గలము తండ్రి !
ఖలులు నిన్గార్చి యాడువేళ ♦ కాలు లెల్ల ?
నూరు విడి నీవు వోయిన ♦ వార లింక
బ్రతుకనిత్తురె మాన్న నీ ♦ పట్టనమున. 46

క. ప్రాణమునకుఁ బ్రాణమవగు
నీనుతులకు మాఱు తుచ్ఛ ♦ నిందలు వినినన్
బ్రాణము లెటు నిలుచును మా
మేనుల ? నిట్టులఁ దలఁపు ♦ మీ ! భక్తాంగా ! 47

గీ. ఇష్టపడవేని నీభక్తి ♦ హింస కెపుడు,
" భక్తవత్స" లాభిఖ్య నీ ♦ బద్ధమేని,

సీ. ఈయల్లకల్లోల ♦ మీమహాయత్నంబు
మెఱుఁగుమైమాయావి ♦ కొఱకుఁ గాదె?
వెళ్ళిజగన్నాథ ♦ విద్వాంసుఁ డనునూహ
మున వచ్చుచున్నాఁడె ♦ మోసగాఁడు?
రాఁడు, రాఁ; డెట్లు కు ♦ రంగంబు రాఁజాలుఁ
బంచాననం బుండు ♦ భయదగుహకు?
వల దన్నఁ బోయె నీ ♦ భ్రష్టమహారాష్ట్రి
విప్రుండు; పోయి యా ♦ భిక్షుపాటి
గీ. ములను బడెఁ; బడ్డవాఁ డొక ♦ మూల నుండ,
కాతనిని నన్నుఁ గలపనీ ♦ యంత సేసె;
నేమి చేసినవాఁ డిట ♦ నెట్లు నిలుచు?
శిష్యులను జూచినంతనే ♦ చెదరు గుండె. 53

క. పరిహాసంబుల దూఱుల
నరహాస్యంబుగనె చేసి ♦ యలమటపఱుపన్,
బరుగెత్తి యెటకో పోవక
యరుదేరఁగ నున్నవాఁడె ♦ యర్భకుఁ డిటకున్? 54

శా. అంతేవాసి తపస్విసంతతులు త♦న్నశ్రాంతము న్గొల్వ, నా
శాంతవ్యాప్తయశోవిశాలుఁడు ప్రకా♦శానందుఁ డచ్చోట దు
ర్దాంతప్రజ్ఞుఁడు వచ్చియుండు నని సం♦త్రస్తుండుగా, కూర్జిత
స్వాంతుం డై యిట కేగుదేర నెటు లా♦బాలుండ పేక్షించెడున్?

ఆ. వాసుదేవసార్వ ♦ భౌముని బూర్వము
మోసపుచ్చినాను; ♦ మోసపుత్తు
నితనిఁ గూడ నన్నె ♦ యిప్పు, డం చూహించి
వచ్చుచున్నవాఁడె ♦ వాఁడు వ్యాయి? 56

క. నీఁకడ చెడి, పలువిధములఁ
గలఁగె నిటుల్ యతిమనంబు; ♦ గాని యతం డా
కలవరము స్వల్పవంతపు
తెలనవ్వులఁ గప్పివైచె ♦ నితరులయెదుటన్. 57

వ. ఇట్లుండ నంత నొక్కుమ్మడి యల్లదే స్వామి వచ్చుచున్నాఁడని కేకిసలుకొట్టుచుఁ గేకలువేయుచుఁ జూచుచుండ సవశుం డై ప్రకాశానందుండుం జూచుచుండె నంత. 58

సీ. బంగారునగకొండ ♦ వలెఁ దోఁచుమంజుల
ద్రాఘిష్ఠదివ్యాభ ♦ తనువుతోడ,
ముష్టిలోలుక్కుచుఁ బూర్ణ ♦ పుష్టిమూలాధారపు
ను గ్రిందుపడుచున్న ♦ మోత్రముతోడ,
నాత్మవిలోకనా ♦ యత్తశాంతరసవి
శ్లేషవిశాలదృ ♦ క్శ్రీలతోడఁ,
దాఁకుమాత్రమున వి ♦ రాకు పుట్టించెడు
సురుచిరాజానుబా ♦ హువులతోడ,

గీ. కమ్రనమ్రితచూపుల ♦ గతులఁ దోఁప,
నంటి నల్గురునిష్యులే ♦ వెంటరాఁగ,
నరకలుషదుఃఖహారిదా ♦ నందమూర్తి,
వచ్చె శ్రీకృష్ణచైతన్య ♦ వల్లభుండు. 59

గీ. చూచినంతనె లోనహో ♦ సుఖమ్మఁ దొక్క
వాఁడవు, నానందుఁ డోరి! యీ ♦ పోఁడవుఁ, బోఁడవుఁ,
బోఁడవుసూప వెటను; మహో ♦ పురుషుఁ డితఁ
డంచు నెదలోన నచ్చుతం♦బందె మిగుల. 60

క. పందిరివాకిటికి శచీ
నందనుఁ డరుదెంచి యంత ♦ నమితాననుఁ డై
యందలితోయంబుల నర
విందనిభనిజాంఘ్రియుగము ♦ వెసఁ గడుగుకొనెన్. 61

క. కడుగుకొని తుడుచుకొని య
క్కడియతిబృందముల కెల్లఁ ♦ గడునమ్రతతో
నిడి వందనములు,ద్వారము
కడఁ జదికిలఁ బడియె నపుగ ♦ కయ లోపలికిన్. 62

సీ. శత్రుండెహో! వైన ♦ సన్న్యాసి నతిథిని
ట్లవలఁ గూర్చుండనీ ♦ యంగ నగునె?
బలఁగంబుతోఁ గూడి ♦ బలియుండ నై యున్న
మాత్రానఁ దోడికక ♦ ర్మంది నిట్లు
పరిభవింపఁగ నాకుఁ ♦ బాడి గా; దన్యమౌ
ననువునఁ బగ దీర్చి ♦ కొనఁగవచ్చు;
నదిగాక కన్నులు ♦ చెదరెడు నీతని
యురుతేజమును జూడ ♦ నొక్కసారి,

గీ. దివ్యధిషణా,వినమ్రతా, ♦ భవ్యసాధు
తా,మనోహరభూరిస ♦ త్ప్రేమమూర్తి
యీతఁ; డయ్యయ్యొ! మోసగాఁ ♦ డెట్టులౌను?
నుడుల నొప్పించి పొరపాటు ♦ పడితినే మొ? 63

క. అనుకొని యిటు లానందుఁడు
వనజాక్షునితోడ నేమొ ♦ వచియింపఁగ లే
చినయంతనె,లేచిరి భయ
వినయంబుల వేలకొలఁది ♦ భిక్షువు లితరుల్. 64

వ. లేచి శ్రీకృష్ణచైతన్యునొద్దకుం బోయి ప్రకాశానందుం డిట్లనియె.

గీ. స్వామి! యీరీతిఁ గూర్చుండ ♦ వలదు బయట;
లోని కరుదెంచి, పందిరి ♦ లోనఁ గూరు
చుండి, మాతోడ విప్రశి ♦ ష్యునిసపర్య
లంది, మఱి చను, మందహా ♦ సంద మొంద. 66

వ. అందులకు స్వామి బద్ధాంజలి యై యతివినయంబున నిట్లనియె.

చ. యతికులచంద్రమా! యిటనె ♦ యాసనముం గొననిమ్ము; నేనుభా
రతికులమందుఁ జేరిన వి ♦ రాగుఁడఁ జేరికి; సల్పభిక్షుసం
తతి యభిజాతపూతయతి ♦ తల్లజమధ్యము సంముఁ గూరుచుం
ట తగదు; మీదుసన్నిధిని ♦ నా కెట నున్న శుభంబె చేకుఱున్.

మ. తులువా! నీచయతీ! యసూయమెయి నెం ♦ తో నీ వవజ్ఞ న్మహా
త్ములలోఁ బెద్దకుఁ జేసినాఁడ, వయినం ♦ బూర్ణేందుబింబాస్యుఁ డె
ట్లు లసన్నమ్రవచఃకదంబకము లా ♦ డు న్జూఁడు నీతోడ, నం
చలఁతం బెట్టె నిజాంతరాత్మము ప్రకా ♦ శానందు శూలంబటుల్,

క. కనఁబడనిలోనియీబా
ధను భరియింపంగలేక ♦ తాపసవరుఁ డం
త నిమికరముఁ దనచేఁ గొని
తనకడఁ గూర్చుండఁబెట్టె ♦ దయఁ బందిరిలోన్. 70

వ. అంతటితో నూరకుండక యకృతకానుకంపాసూచకంబు లగు
మృదువాక్యంబులతో వెండియు నిట్లనియె. 71

గీ. స్వామి! మాయతిగణములో ♦ వాఁడ వైతి;
కాశికాపురి నిన్నాళ్లు ♦ గడపి; తైన
నీవు న న్నొకమాఱును ♦ రావు చూడఁ;
గారణం బేమొ తెల్పుమా ♦ కనకతేజ! 72

సీ. ప్రౌఢయర్థవ్యక్త • ము లగుశబ్దము లేమొ
కో? యందునకు నోట • గొణఁగుకొనియె;
నాగర్వమే కార • ణము దాని కిఁక నొక్క
యడుగ నేలని వెండి • యడుగకుండ,
విషయంబు మార్చిన • విభునిమనస్తాప
మంతయుఁ జల్లారు • ననుకొని, యతి
దానికే? మజ్జాత్మ! • తప్పులే దేమియుఁ,
జూచిన, నీవు న • న్నూడకున్న,

ఆ. నడుగఁదలఁచినాఁడ • నయ్య! నే నిన్నిప్పు
డొక్కదానిఁగూర్చి; • నిక్కమైన
యుత్తరం బొసంగు • మూరకుండక, యని
స్వాతిశయపుబుద్ధి • నడిగె నిట్లు. 73

మ. మరుదాభాయుతసుందరాంగ! యెవఁడు • న్నావంటిసామాన్యమ
స్కరి వీ వంచనఁజాలఁ; డంతటిమహా • సన్న్యాసి వయ్యు న్నిరం
తరముం బోడ పఠింపఁగా వలయు నా • మ్నాయోత్కరం బేలయే
మఱియున్నాఁడవు? పాప మానుగద ధ • ర్మంబు ల్విసర్జించినన్.

చ. మఱియొకమాట, పరివర్జిత • మార్గవిరుద్ధము లైనచేష్ట లే
త్తెఱ నొనరించుచుందఁట, న • టించుచుఁ బాడుచు, దేశమందుసం
ధఱ కిది తెల్లమయ్యె; యతి • నాయకుఁడే యిటు సేయ, నున్నమ
స్కరతతి పాడువాఱి కడ • గండ్లను జెందుట యింక వింతయే! 75

క. గౌరాంగా! నీయంతటి
పారాశరి యిట్టికాని • పను లొనరింపన్
గారణ మెదియో యుండక
తీరదు; కావునను దానిఁ • దెల్పుమ నాకున్. 76

న. ఇట్లు నిజాధిక్యంబు బయల్పడ నడిగిన ప్రకాశానందునకు మహా
వినయంబునఁ జైతన్యస్వామి యి ట్లనియె. 77

ఉ. హృదయము విప్పి చెప్పెద య ♦ తీశ్వర ! నేఁ గడుశుంఠఁ గావునన్
సదయుఁడు నాగురుం డితర ♦ సంయమియోగ్యము లైనకష్టమో
క్షదపృథుసాధనంబులకుఁ ♦ జాలఁడు వీఁడని యెంచి యెంచి తాఁ
ముదకు నను గ్రహించెమహి ♦ తుండొకచుల్కనయైనమార్గమున్.

క. [illegible]క్రమసులభమార్గము
శ్రీకృష్ణా ! యనుచు నోటఁ ♦ జేతోవీథిన్
వాకొని ధ్యానించుట, యని
[illegible]కరుణామయుఁడు సెప్పె ♦ యతికులతిలకా! 79

క. [illegible] చేసిన, మనుజున కెం
తటిసౌఖ్యము వొంద స్వర్గ ♦ తగలదో, యతఁ డం
తటిమోదముఁ బూర్తిగఁ బొం
దుట యగు నని గురుఁడు ప్రేమ ♦ తో బోధించెన్. 80

గీ. గురువునాజ్ఞను మీరక ♦ కోర్కు లూర
వారకతిభక్తిఁ బవలు రే ♦ నోరు నొవ్వఁ
గృష్ణనామంబు నుడువుచు ♦ నెసఁగుచుంటి
హరిపదాబ్జయుగమె నాకు ♦ శరణముగను. 81

గీ. పరమమూఢుఁడ నైనాకు ♦ సరిపడుటయె
కాక యది యొకచిత్రింబుఁ ♦ గలుగఁ జేసెఁ;
బూర్ణముదమున హృదయ ము ♦ పొంగఁజేసి
నన్నుఁ జొన్పెను బాటల ♦ నాట్యములను. 82

క. ఇది యేమిపిచ్చియో యను
మది, నతిమూర్ఖుండ నౌట, ♦ మాన్యపురుషుఁడున్

సదయుఁ డగుగురువుకడకు
న్బెదరుసఁ జని యంటి నిట్లు ♦ నే నాతనితోన్. 83

చ. సరిసరి ! మంచినామమునె ♦ సంతసచేసితి వెంచియెంచి యో
గురువర !యున్నమందమతి ♦ కూడఁ జెడె నోన్మాదలంటఁ;బిచ్చియుం
బోరసితి ; సిగ్గు వీడి నటు ♦ పోల్కిని బాడుచు నాడు చెల్లెడన్
దిరుగుదు నవ్వ నంద ;జెటు ♦ తీర్తువొయీవిపరీతరోగమున్. 84

వ. అంత నామహాత్ముండు నాయకారణభయంబునకు మందహాసంబు చేసి,పిచ్చి గానిదానిఁ బిచ్చి యనుటకంటెను రోగంబు గాని దాని రోగం బనుకొనుటకంటెను వేఱున్మాదరోగంబులు లేవని చెప్పి వెండియు ని ట్లనియె. 85

సీ. శ్రీకృష్ణుఁ డట్టులే ♦ శ్రీకృష్ణనామంబు
బలవత్తమం ;బ దాఁ ♦ పంగ నెవ్వఁ
డోపఁడు ; నీశ్రమ ♦ కుచిత మౌప్రతిఫలం
బును బొందినాఁడవు ♦ పూర్ణముగను;
నీవె కా దెవఁడేని ♦ నిర్మలస్వాంతంబు
నను బల్కునేఁ గృష్ణ ♦ నామ,మతని
కగు నగు సరిగ నీ ♦ కయినట్టులే ; యిది
యనుభవగ్రంథవే ♦ ద్యంబు సుమ్ము !

గీ. కృష్ణసత్ప్రేమ, మమరవ ♦ రేప్సితం బొ
కించుకంత నీ కబ్బె న ♦ దృష్టవంతుఁ
డవు ; హరిప్రసాదముఁ గాంచి ♦ తివి;కనేనుఁ
బరమధన్యుఁడ నిట్టినీ ♦ గురుఁడనౌట. 86

క. కావునఁ జేయఁగవలె నని
కావింప స్మృత్యగీత ♦ కలనలు";బలవ

92

వ. అందునకు శ్రీచైతన్యస్వామి యిట్లనియె.

సీ. పరమోపకారులుఁ ♦ బరమపావనములు
సర్వవేదంబులు ♦ సంయమీంద్ర;
చిత్రార్థములు సెప్పె ♦ శ్రీశంకరాచార్య
పండితయతికుల ♦ మండనుండు;
వానిభాష్యంబులే ♦ ప్రజకు వేదము లయ్యె,
మూలవేదము లింక ♦ మూలఁబడియె,
నతనియర్థములెల్ల ♦ నందునఁ గనరావు,
భేదంబు లేదఁట ♦ విశ్వవిభున

గీ. కును మనకు; భక్తిమాత్రపు ♦ మనుజుఁడ నగు
నాకు నల్పున కయ్యో! యా ♦ నరవతంసు
భాష్యములు సూచి చదువ దు ♦ ర్భరపుఁజింత
వశము గానట్టికన్నీళ్లు ♦ వచ్చు నయ్యె! 93

ఉ. శంకరుఁ డీశుఁడే యనుచు ♦ స్వాంతమునందున నమ్మి కొల్చిని
శ్శంకమనీషఁ దద్వచన ♦ జాలము బోధము సేయుబోడ కి
వంకరపూర్వపక్షములు ♦ వహ్నివలె న్నమ్రన మేర్చెఁ; గాని యే
కింకయుఁ జూపకుండఁ బలి ♦ కె న్నిమితో నతఁ డిత్తెఱంగునన్.

క. భగవత్తుల్యుఁడు; యావ
న్నిగమాంతసుబోధకుండు ♦ నిమి! శంకరుఁ; డా
జగదేకవంద్యు నీగతిఁ
దెగడెదు; కారణము నాకుఁ ♦ దెల్పఁగవలయున్. 95

96

వ. స్వామి యిట్లనియె.

గీ. భగవదుచ్ఛ్వాసమే వేద ♦ పటలి యనుచుఁ
జెప్పఁబడుఁ గద! భాష్యంబు ♦ చేసినట్టి

యాతఁ డెవఁడేని, సరులభా ♦ ష్యంబుకంటె
వేదమునె యెల్లరును గౌర ♦ వింపవలయు. 97

గీ. వేదము సుబోధ మైయుండి ♦ వేదభాష్య
మల్లకల్లోల మైయుండ ♦ యతివరేణ్య!
మూలమును వీడి వ్యాఖ్యను ♦ బుచ్చుకొనుట
యెప్పగిది నెంచిచూచినఁ ♦ దప్పుసుమ్ము? 98

వ. ఏమి! యీబాలసన్న్యాసిసాహసం బని యాశ్చర్యం బంది, వేదజ్ఞశిరోమణి యగుతనకుఁ దెలియనిసదర్థంబులు గాని, సమస్తశాస్త్రవిశారదుండును యుక్తిపయోరాశియు నగుతాను ఖండింపలేనియపార్థంబులు గాని యుండ వనుధైర్యంబునఁ బ్రకాశానందుం డయ్యా! యాపూతభాష్యం బెట్లు పూర్వపక్షంబు సేసెదవో యొకింత వచింపుము వినెద" నన గౌరాంగుండు సార్వభౌమునొద్దవలెనే శ్రీశంకరాచార్యభాష్యవాక్యంబులనువదించి మందమతులకైన సుగ్రహం బగునట్లు లవ్వి యన్యాయంబు లసంగతంబు లని తెలియఁబఱిచెఁ; గొయ్యవలె నిశ్చేష్టితుండై వినుచున్నప్రకాశానందుం డంతయు నైనపిమ్మట స్వామితో ని ట్లనియె. 99

సీ. శ్రద్ధతో నిశ్చల ♦ స్వాంతంబుతో నీవ
చించినవెల్ల నా ♦ లించినాఁడఁ,
బరిపూర్ణధిషణాప్రభావంబునను బృథు
భాష్యంబు ఖండించి ♦ వైచినావు,
మనుజమాత్రుని డిట్టి ♦ మాడ్కిఁ గావింపనో
పం; డత్యమానుష ♦ ప్రజ్ఞ నీది,

పండితసింహుఁడు ; ♦ ప్రవ్రజితవరుండు
గురువతంసులకును ♦ గురుఁడు శంక
ఆ. రుండు ; వానిబోధ ♦ మండలిఁ దుషమ్మై
యెగురఁ గొట్టినావు; ♦ నిగదితార్థ
ములను లేశమేనిఁ ♦ బొరపాటు గనరాదు ;
తప్పొవట్టుకొనఁగఁ ♦ దలఁచునాకె. 100

సీ. పూర్వపక్షంబు న్యాయమ్మై ♦ పొలుచు ; నరియె ;
ఖండితము సేయ దాని శ ♦ క్యంబు గాదు ;
సూాలనిగమంబులకు నర్థ ♦ మును మహాత్మ!
చెప్పు దయచేసి ; వినఁగ వాం ♦ ఛింతు నేను. 101

శా. వేదం బిట్టులు చెప్పునంచుఁ దెలిపె ♦ న్వేదాంతవేద్యుండు:—హృ
త్వాద్రిదుర్ఖ్యాతము దైవప్రేమమున స♦ద్భక్తి న్నరుం డీశ్వరు
న్దా దర్శింపఁగఁ గొల్వ దివ్యతనుత♦న్గాన్పించు ; న ష్టందు నా
మోదం బెట్టిదొ చెప్పలే ; మనుభవం♦బుంబట్టి ప్రాపింప నౌ.

క. ఆరీతిని మధుపూరము
లూరెడుపల్కులను మంచి ♦ యుక్తులను ద్రయీ
సారంబు బోధపఱిచెను
గౌరాంగుఁడు శ్రోతృచిత్త ♦ కంజము లలరన్. 103

ఆ. తొల్లి వాసుదేవు ♦ నుల్లంబునట్టులే
మార్చివైచె స్వామి ♦ మహితభక్తి
బోధ మచట నున్న ♦ బోడలచిత్తముల్ ;
చిత్ర మేమి? యట్లు ♦ చేసె నన్న. 104

ఉ. శంకరభాష్యఖండనము ♦ స్వచ్ఛము చేసెను జిత్తసీమలన్ ;
గింకరు లైరి వేదతతి ♦ కి న్బొనరించినవ్యాఖ్యచేత ; వా

రింక సమస్తము న్మఱచి • యీశ్వరభక్తిరసపరిమత్తమో
దాంకములెల్లఁ జూపిరి మ•హాత్ము్మఁడు భక్తినిగూర్చి చెప్పఁగన్.

మ. క్షితి సామాన్యపుభక్తుఁడే కడఁగి భ•క్తింగూర్చి పల్కంగ ఖం
డితసర్వైహికదుఃఖచిత్తపరితు • ష్టి న్బాష్పరోమాంచల
క్షితులై యుందురు శ్రోత; లింక నల(శ్రీ•కృష్ణుండెసత్ప్రేమసం
భృతకాయుం డయి వచ్చి చెప్పఁగ సమా•కృష్టాత్ములెచొక్కరే?

వ. ఇట్టిమహానందస్థితియం దుండి యందఱు మాటాడఁదలంచిరి కాని గురుతల్లజప్రకాశానందునమ్ముఖంబున నట్లు చేయ జంకి; రంత నతండే లేచి చేతులు జోడించుకొని స్వామితో వినమ్రవిశుద్ధ వచనంబుల నిట్లనియె. 107

సీ. మహితదుర్మదగర్వ • మాత్సర్యముల నాకు
సరిలేఁ డెవం డను • దురభిమాన
మునను యావద్దేశ • మునకు ధర్మోపదే
ష్ట నయి, యిన్నాళ్లును • సంచరించి
తిని ; నిన్ను మత్తతఁ • దిట్టితి; నెగతాళి
సలిపితి ; క్షమియింప •వలయు నన్ను,
క్షమియింపు మని దయా • శాంతిక్షమామూర్తి
నడుగ నక్కఱలేదు • హాటకాంగ !

ఆ. యట్లు వేఁడికొనుట • యపరాధ మౌ స్వామి !
నేఁడు కనులుదెఱచి • నాఁడ నేను;
వేదవేత్త నంచు • విఱ్ఱవీఁగెడునా కొ
సంగినావు క్రొత్త • జన్మ మిపుడు. 108

ఆ. మొదలుకొంటి నిపుడె • పూతవేదయథార్థ
భావ మెఱుఁగ నీకృ • పామహిమను;

నాకు గురుఁడ వీవు; ♦ శ్రీకృష్ణసత్ప్రేమ
దారకు సులభమైన ♦ త్రోవఁ జూపు. 109

గీ. గర్వకర్కశచిత్తమి ♦ క్కరణిఁ గరఁగి
భక్తి కృష్ణను గడు దీన ♦ భావ మంద
నడుగునానందుఁ జూచి సం ♦ యములు, తక్క
వార లెల్లరుఁ జేసి రా ♦ పగిదినె యట. 110

వ. ఆక్షణంబుననే సశిష్యుండై ప్రకాశానందుండు స్వామి కోడి యాయవతారపూరుషునొద్ద భక్తిభిక్షం గొనె ననుసమాచారం బు వారణాశియం దంతటం బ్రాఁకె; నాకతంబునఁ జైతన్య స్వామికుటీరం బహర్నిశం బసంఖ్యాకదర్శకసంఘంబులచేఁ గ ప్పఁబడి యుండె. సన్నిహితజనసమూహంబుబారినుండి తప్పించి యేకాంతంబుగ నుండనిచ్చినం గాని యీపురంబున నుండలేనని స్వామి చెప్ప, సతనిభక్తు లంద ఱామహాత్ముం గొన్నిదినంబులు కాశిలో నుంచుటకై కష్టపడి కట్టుపాటు లెన్నియో చేసిరి కాని కార్యంబు లేకపోయె; నెంతమూఁకమూఁకలుగా మూఁగినను బ్రజాసమూహంబునకు స్వామి గంగాస్నానార్థం బేగిసమూఁడు సమయంబులందే యాయనశుభదర్శనం బయ్యె. 111

సీ. మఱునాఁడు సన్యాసి ♦ మఠమునం దెల్లరు
భాషించుకొనిరి శ్రీ ♦ వరునిగూర్చి;
యతులలోపలఁ బ్రకా ♦ శానందుతరువాతి
వాఁ డగుసంయమి ♦ ప్రవరుఁ డొక్కఁ
డనె నిట్లు—బాలస ♦ న్యాసి వచ్చెను మన
భాగ్యగరిమ; నింత ♦ వఱకు నయ్యొ!

గోలుపోయితి నెంత ♦ కాలంబొ జీవనం
బును వృథసేసి దు ♦ ర్బుద్ధిఁజేసి,

ఆ. కష్టమెల్ల నెట్లు ♦ నష్టమైపోయెను
ముక్తి కొందు లేదు ♦ భక్తివంటి
సాధనంబు ; క్రొత్త ♦ సన్యాసిసూక్తులు
చెవుల మ్రోఁగుచున్న ♦ వివిగొ యింక. 112

క. శ్రీకృష్ణుని గొల్తుము రం,
డాకరుణామయుఁడు చెప్పి ♦ నట్లని యొకను
శ్లోకంబుచేసి చదివెను ;
వాకు లడర నంద ఱద్ది ♦ పాడిరి భక్తిన్. 113

వ. అంతఁ బ్రకాశానందుండు. 114

గీ. నీవు వల్కినసర్వంబు ♦ నిజము నిజము ;
మనకను ల్విప్పె నిప్పు డా ♦ మహితతేజుఁ ;
డల్ల శ్రీకృష్ణు సేవింత ♦ మంచుఁ జదివె
నురుచిరం బగుస్తావక ♦ శ్లోక మొండు. 115

వ. చదివిన నస్థిరచిత్తుండై యతం డిట్లాందోళనపడుచుండె. 116

మ. సుమనస్సంయమిచక్రవర్తి నయి య ♦ స్తోకప్రభావంబుచే
నమితఖ్యాతి గడించి మించి యిపు డా ♦ యావద్యశోరాశి సం
యమిబృందంబులమ్రోల నొక్క యువస ♦ న్యాసి జయింపంగలే
క, మహాదీనతఁ గోలుపోయితి నెటు ♦ ల్కట్టా ! మనం గల్గుదున్?

ఉ. ఎన్నఁగరానిపాట్లు వడి, ♦ యెన్నియొ శాస్త్రము లభ్యసించి, వి
ద్వన్నుతపాండితి న్నిగమ ♦ తత్త్వరహస్యము లెల్ల నేర్చి నా ;
వన్నియుఁ బోయె వమ్మయి మ ♦ హాత్ముఁడుబాలకుమ్రోల ; నెట్టిచి
న్నతనంబు సైఁపఁగలఁ ? ♦ జీ ! బ్రతు కేటికి నింక నా కిలన్ ?

క. అయ్యో! వస్తువులను సధ
శ్శయ్యల నార్జించినట్టి ♦ సర్వామ్నాయా
జయ్యప్రజ్ఞామహిమం
బయ్యె న్భస్మమయియొక్క ♦ యర్భకు నెదుటన్. 119

క. నలువదివర్షంబులు కృషిఁ
జలిపి సకలనిగమశిఖర ♦ సందోహంబుల్
గలఁగఁ జదివియును, నాల్క మె
దలుపన్లేనైతి మిశ్రి ♦ తనయునిప్రోలన్. 120

వ. ఇదియునుంగాక. 121

ఉ. కొంచక మిశ్రిసంభవు, స ♦ గూఢముగాఁ బటుగర్వ నోచుదూ
షించితి నింద్రజాలికుఁడు ♦ చెట్టయు దొంగ యటంచుఁ, గృష్ణరూ
పాంచితుఁ డాతఁ డంచు జను ♦ లందఱుఁ గొల్చుచునుండ; నింతకా
వించినవాఁడె న న్గెలిచెఁ; ♦ బృథ్విని నే అవమానముందునే? 122

శా. ఏకాంతంబునఁ గాక బట్టబయట ♦ న్బ్రేమాంగుఁ డాబాలుఁ డ
స్తోకప్రజ్ఞను మందహాసముల శి ♦ ష్యు లూనుచుచుండంగ న
య్యో! కాశిం గలసంయము ల్విబుధవ ♦ ర్యు లూనుచుచుండంగ, న
న్నాకట్టొందఁగఁ జేసెఁ గాదె యెటులీ ♦ ప్రాణంబులన్నిల్పుదున్?

క. తలయెత్తుక యిఁకఁ దిరుగుట
గలుగని తెలిఁగుసను బ్రోడ ♦ గౌరాంగుఁడు, కే
వలదుర్మరణహోమా
నలశిఖల న్వ్రేల్చి వేల్చి ♦ న న్మ్రండిచెఁ గా! 124

క. ఈవిధమున నపకారము
గావించిన శత్రువైన ♦ గౌరాంగునిపై

యావంతయు మాత్సర్యము
నేవయు మదిలోనఁ గలుగ ♦ వేమొకో? వెఱఁగా. 125

క. కనుమూసినఁ గనుదెఱచినఁ
గనఁబడునదియేమొ యెల్ల ♦ గౌరాంగుండే;
మనమంతయు నా సుందర
తనుఁడే చూఱకొనినాఁడు ♦ తస్కరుమాడ్కిన్. 126

శా. రాగంబంతయుఁ జంపుకొంటి సతినై ♦ రాగ్యంబున ; న్గాని యి
ష్టిగౌరాంగునిమంజులాకృతిఁ గనన్ ♦ హృత్కోశమం దెంతయో
రాగం బుద్భవ మయ్యెడు ; న్మఱవఁగా ♦ రాఁ డాశుభాంగుండు,నీ
రాగస్వాంతత నుండఁగావలయు నా ♦ ప్రారబ్ధమిట్లుండెఁ గా. 127

క. ముద్దులు గాఱెడుమోమున
నుద్దవిడిఁ గృపారసంబు ♦ నొల్కుచు, నిఁక నే
ప్రొద్దు న్నాహృదయము నే
గద్దియఁ జేసికొని యుండు ♦ గౌరాంగుఁ డహా! 128

ఉ. ఆతనిపీణపల్కులు, మ♦హాద్యుతిపుంజమనోహరాంగముల్,
శ్రోతసుబోధము, ల్సురుచి♦రప్రమదావహసత్కృపాక్షిపా
స్ఫీతదృగావళు, ల్గనుల ♦ వీనుల నెప్పుడుఁ గట్టినట్లుగాఁ
జూతును విందుఁ ; బోడతని♦సుందరరూపమునన్నుఁ బాయుచున్.

క. తోఱఁగి చనుమయ్యా ! నిఁక
కఱలే దీ వంచుఁ బనుపఁ ♦ గా నోప ; నెదం
బొరయుదుఁ దీఱనితమి నా
సురుచిరరూపంబు నెపుడుఁ ♦ జూచుటకొఱకే. 130

వ. ఇట్లశాంతమనస్కుం డై ప్రకాశానందుండు దుర్గమగౌరాంగ
శుభదర్శనకుతూహలుం డై చిరకాలజ్ఞానమార్గావలంబి య

య్యుఁ బ్రిబలభక్తి ‘పూర్వరాగం’ బెనసి యామహాత్మ్రసాన్ని ధ్యపుసుఖంబునకై తన కున్నసమస్తంబు దారవోయునంతటి తహతహతో నుండెఁ; గాని పూర్వదుర్గర్వాభిమానవాసనాబలంబున నే నెట్లాజేతయైనయువతారపూరుషుకడకుం బోయి సర్వపౌరజనహాస్యాస్పదుండ నగుదు ననుభీతి సట్లుకావింపక యున్నకుండెఁ; నీతండు సంస్కృతంబున రచించిన శ్రీచైతన్యచంద్రామృతంబందలి యొక్క-శ్లోకంబులోఁ బ్రిస్తుతనిజమనస్థితి యిట్లు వర్ణింపంబడియె. 131

ఉ. సుందరవర్ణతస్కరుఁడు ♦ చూఱకొనె స్వద నామసంబు ; నా
యందలివేదధర్మరతి, ♦ యాటలఁ బాటలఁ గావ్యపాళిఁ గ
ర్మ్రందుల కుందు నేవయు, వి ♦ రాగత, యిట్టివి యింక నెన్నియో
చిందఱవంద ఱయ్యె ; నెటు ♦ చేసె మహాబలుఁ డీయతీశ్వరుఁ?

క. మతి చెడినవానిగతి నా
యతివర్యుఁడు మఱచి నిద్ర ♦ నన్నము రెన్నా
ళ్లితరులతో మాటాడక
సతతశచీపుత్రభావ ♦ సక్తుం డయ్యెఁ. 133

గీ. స్వామి మఱునాఁడు గంగలో ♦ స్నానమాడి
దర్శనము చేసె బిందుమా ♦ ధవునిగుడిని ;
గృష్ణవిగ్రహ మటఁ గాంచి, ♦ కెరలి, పరవ
శత్వమున భక్తినృత్యంబుఁ ♦ జలుపఁదొడఁగె. 134

గీ. అదు చానందమున వచ్చు ♦ నతనిఁ జూచి
భక్తిపరవశులై యూరి ♦ ప్రజలు వెంటఁ
బడిరి “హరి! హరి!” యనుధ్వను ♦ లడర నఱచు ;
చాకలకలము వినఁబడె ♦ యతివరునకు. 135

వ. అంత నది స్వామిభక్తి తాండవసమాకృష్టప్రజానముద్రాధ్వానం
బు లని యొకనిఁ బంపించి తెలిసికొని ప్రకాశానందుండు. 136

సీ. భవ్యంబుఁ బూతంబు ♦ దివ్యంబు సురుచిరం
బగుమోముఁ గన్దోయి ♦ సరసినాఁడ;
చెవులార నాతఁడు ♦ శ్రీకృష్ణుఁగూర్చి ప
ల్కినమధురోక్తు లా ♦ లించినాఁడ;
భక్తి బోధించుచో ♦ వరమువోమునఁ బర్వు
నానందరసవీచు ♦ లరసినాఁడ;
బోధించుతఱి విను ♦ పురుషులకుం గల్గు
చొక్కసౌఖ్యముఁ జవి ♦ చూచినాఁడఁ;

గీ. గాని పరవశుఁ డైయాడు ♦ కాలమందు
సుందరాంగుని నెప్పుడేఁ ♦ జూడలేదు;
కలిగె నీవేళ సట్టిభా ♦ గ్యంబు నాకు
రండు శిష్యులు! పోదము ♦ రండు! రండు! 137

వ. అని వెఱ్ఱివానిపోల్కి, శిష్యులు వెంబడించి రాఁగఁబరుగెత్తి పోవ,
నందఱు మహావినయసంభ్రమంబులతోఁ ద్రోవనిడి; రంతఁ బ్ర
కాశానందుండు స్వామికట్టెదిరి కరిగి నిలిచి చూచె; నప్పు డా
తం డందినయానందభక్తి గరిమంబు తత్కృతం బైనయొక
శ్లోకంబున నిట్లు చూపట్టు. 138

సీ. అసమానపూతచి ♦ త్తాబ్జంబునను నిండు
తతకృష్ణభక్త్యమృ ♦ తంబుతోడ,
సతతసభస్థలో ♦ ద్ధృతదివ్యకనకసం
కాశోరుబాహులయు ♦ గ్మంబుతోడఁ,

దాండవఖేలాని ♦ తాంతమంజులదేహ
చలనతటిచ్ఛవి ♦ చ్ఛటలతోడ,
నానందపారవ ♦ శ్యంబునఁ దొట్రిల్లు
చిగురాకుముద్దుట ♦ డుగులతోడ,
గీ. సర్వపాపహారంబును ♦ శస్తమోద
కరము నగుపేరు నాలుక ♦ నిరవుకొనఁగ
"హరి! హరి" యటంచు నర్తించు ♦ గురువతంసు
న, కలచైతన్యమూర్తికి ♦ నతులొనర్తు. 139

వ. భక్తితన్మయత్వంబున నాడుచున్నస్వామి, ప్రకాశానందుండు గాని ప్రజాసంఘంబు గాని తనయొద్ద నుండినట్లు యెఱుంగఁడు. గౌరాంగదేవునప్రతిహతనృత్యంబుఁ గాంచి భక్తివిహ్వలచిత్తుం డై ప్రకాశానందసరస్వతి యీతఁడు గురుకులచక్రవర్తి యను కొంటి నంతకంటె నధికుం డగునొకమహాపురుషుఁడుగాఁ గాన్పించె డు నని భావించె; నది యీక్రింద లిఖింపఁబడినయతనిశ్లోకంబు వలననే యభివ్యక్తం బగు.

శ్లో. ప్రవాహైరశ్రూణాంనవజలదకోటీఇవదృశౌ
దధానంప్రేమర్ధ్యాపరమపదకోటీఃప్రహసనమ్
వమన్తంమాధుర్యైరమృతనిధికోటీరివతను
చ్ఛటాభిస్తంవన్దేహరిమహహసన్యాసకపటమ్. 140

వ. పైశ్లోకంబుభావం బీక్రిందిపద్యంబువలనఁ దేటపడు. 141

ఉ. కోమలలోచనాంబుధర ♦ కోటుల నశ్రునదు ల్వెలార్చుచున్,
ప్రేమముదావహాప్రథఁ ది ♦ విష్టపము న్హసియించుచు, న్విభా
రామవపుర్ద్యుతి న్దెసలఁ ♦ గ్రమ్మచుఁ గైతవసంయమిత్వ మీ
భూమిని దాల్చి తేజరిలు ♦ పోడకు శ్రీహరి కేను మ్రొక్కెదన్.

సీ. గర్వాదు లేదుట, ♦ కలుషచిత్తము నిర్మ
లాంతరంగం బౌట, ♦ యాద్యవస్థ;
సత్యాదురభిమాన ♦ చండసంగర, మందు
సను సత్యజయము, రెం ♦ డవయవస్థ;
యధిపుచే నాకృష్టు ♦ డై గురుభక్తిని
దవిలి పల్కుటయె మూ ♦ డవయవస్థ;
గురు డనుకొంటిని ♦ గురుడు గా డల్లమా
ధవు డనుకొంట నా ♦ ల్గవయవస్థ;
గీ. నాల్గుసితులను దాటె నా ♦ నందు; డింక
మిగిలి యుండెను స్వామి బే ♦ మించి యెపుడు
దలచుకొనుచుంట ;యిదియె యై ♦ దవయవస్థ ;
యందగల డిప్పుడే యాత ♦ డదియు గూడ. 143

క. ఈలలితప్రేమంబును
బోలుచుటకు నెదియు లేదు ♦ భూమిని ; జార
స్త్రీల కుపపతులపై గల
వ్యాలోలత యించుక సరి ♦ యగునో యేమో ! 144

మ. అమితానందభవోరుబాష్పజలసి ♦ క్తాచ్ఛాభగండద్వయిన్
నిమి గావించెదునాట్యము స్గని యొగి ♦ న్స్విద్వద్యతీందుప్రిందు,త
త్ప్రమదావర్తనిమగ్ను డై వెలిచె జ ♦ త్వారింశదబ్దపక్రి
ష్టమలగ్రీష్మ నిరస్త సారనయన ♦సప్తాశుప్రపూరంబులన్. 145

క. జ్ఞానావబోధతర్కా
నూనవివాదముల నాశ ♦ మొందిన రాగం
బీనాడు మఱల జిగురుప,
నానందుడు రాల్పె గలిగె ♦ నానందాశ్రుల్. 146

వ. అంత నానందుం డిట్లు తలపోసె. 147

గీ. ఎంతయానంద! మానంద ! ♦ మింతమోద
మొందుటకుఁ దగి మానవుం ♦ డుండ నయ్యొ !
ముండ్లపెడపుంతలను బట్టి ♦ పోయి మాఁడి
చితినిగా వెన్నవంటినా ♦ చిత్తసీమ! 148

క. అనుకొని యిటు,తా నాట్యం
బునఁ జొచ్చె వితాకుఁ జెంది ♦ పూర్ణాశ్రువులన్ ;
వెనుక నిమితోడ యతికిన్
జన దాడుట పాదు టన్న ♦ సంయమివరుఁడే. 149

క. శ్రీలోలభక్తిబాష్పో
ద్వేలక్షాళితవిశుద్ధ ♦ దృక్తతి, యతి తా
నాలోకించెను వైవ
శ్యాలోడితదేహుఁ డౌచు ♦ నాదుశచీజున్. 150

ఆ. చూడఁ గానిపించె ♦ బోడకు మాత్రొక్క
దివ్యత ప్రకనక ♦ తేజ మైన
సుభగవిగ్రహంబు ; ♦ చూచు కే పొరయుట
పొరయవలయు ప్రేమఁ ♦ బూర్ణముగను. 151

వ. అంతఁ గొంత సేపటికిఁ బరిజాకలకలంబున స్వామి పునస్స్మృతిం గాంచి వెల్లువ లైయూరుబాష్పంబులచేఁ దడిసినమోమున నిలువంబడి యున్నపరికాశానందు నతనిశిష్యనికురుంబంబుం గాంచి సిగ్గుపడినయ ట్లగపడి యతివినయంబున నాశీస్సంప్రార్థకుం డై యానంధుపాదంబులకుం బరిణమిల్లె ; నాఘోరకృత్యంబు నిర్ఘాతపాతంబట్లు మనం బేఁచనంత నాయతీంద్రుండు. 152

సీ. ఈవినయమున నా ♦ భావిజన్మము దుఃఖ
భూయిష్ఠముగఁ జేయఁ ♦ బోకు మీవు;
పాడైతి నయ్య! యీ ♦ వఱకె నే మిక్కిలి;
భగవంతు దూషించు ♦ వాఁడు నిత్య
మత్సర కార్తులఁ ♦ దోఁగు నంచను శాస్త్ర;
మద్దియే దేవప ♦ దాబ్జములను
వాఁక సర్వాఘము ♦ ల్దగ్ధంబు లౌనని
చెప్పు; నిన్దూషించి ♦ చెడిన నన్ను

గీ. బతితపావనత్వత్పద ♦ పద్మములను
బడి తరించెడుదుర్లభ ♦ భాగ్యమంద
నిచ్చి రక్షింపు మయ్య! పూ ♦ ర్ణేందువదన!
యంచుఁ బ్రజ చూడఁ బడె విభు ♦ నంఘ్రులపయి. 153

వ. అప్పుడు సాధారణమనుజస్థితిం బొరసి యున్నస్వామి యట్టిపని కొప్పుకొనక యానందునితో ని ట్లనియె. 154

క. మనుజునిభగవంతుం డని
వినుతించుట చనదు, ధర్మ ♦ విరుద్ధము, నీ
వొనరించుపనులు సద్బో
ధనములకు నాత్రముపడుట ♦ తగునే? చెపుమా. 155

వ. దానికిఁ బ్రకాశానందుం డి ట్లనియె. 156

గీ. ఇపుడు పూర్తిగ నీవాక్రమించునాదు
నంతరంగంబునను నీయ ♦ థార్థరూప
మును విలోకించితిని, కృపా ♦ పూర్ణ! పతిత
పావనా! కృష్ణ! యిఁక మోస ♦ పోవనయ్య! 157

గీ. మాదృశాజ్ఞానతిమిరాంధ ♦ మానవుల క
గోచరం బగుకారణ ♦ కోటి నీవు
ధరను బ్రచ్ఛన్నతనె యున్నఁ, ♦ దండ్రి ! వంద
నార్హుఁడవు నాకు భక్తుండ ♦ వైనకతన. 158

వ. అంత నంతప్రజాసమూహంబునెదుట నట్టివాఁడట్లు ప్రసంగింపఁ
గూడదని స్వామిరహఃకృతసంజ్ఞల నానందునిభక్తిజన్యదీనవచః
ప్రవాహం బాఁకపెట్టి, మఱొక యుచితకాలంబున మాటాడుకొంద
మని తెలిపి, తనకుటీరంబునకుం జనియెఁ; బట్టనంబంతయు
నల్లకల్లోలంబునం బడియె ; నారాత్రియే ప్రకాశానందుండు
రహస్యంబుగ స్వామికడకుం జని యాలింగితుం డై భక్తిమహానం
దప్రసాదంబుం బడసి ధన్యాత్ముం డయ్యె ; నిరువురుపగూహన
మహామోదమూర్ఛాబంధంబునుండి వెలువడినయనంతరంబు
"నీకు యుక్తమైనప్రదేశంబు బృందావనం; బచటికి శీఘ్రంబె
గు" మనిస్వామి సెలవీయ, నానందుం డిట్లనియె. 159

క. మృదుభావంబుల నన్నియు
మదిలో నేఁ జంపుకొంటి, ♦ మఱల న్నీచే
నుదితంబు లయ్యె నవి ; ని
న్నుఁ దవిలితి న్బ్రేమసురవి ♦ నుత ! గౌరాంగా! 160

ఆ. నిన్నువిడిచి బ్రతుక ♦ నే నోప ; ననురాగ
మంతవుట్టు నిన్ను ♦ నరయ ;నీదు
కడనె కడపనిమ్ము ♦ గౌరాంగ ! శేషకా
లమ్ము,చనుట నాకు ♦ లగ్గు గాదు. 161

162

వ. అందులకు స్వామి యిట్లనియె.

శా. పోవంగావలె బృందకీవు ; చని, రే ♦ పున్నాపు భక్తిప్రబో
ధావిర్భూతమ్ముడ వౌచుఁ జెప్పవలె భ ♦ క్త్యానంద మాపట్టులం
దావాసంబొనరించు నందఱకుఁ ; గృ ♦ ష్ణాసక్తచిత్తంబున
న్నీ వెట్లుందువొ వారు నుండవలయు ♦ న్స్థాపించి యొక్కైవడిన్.

క. జనరక్షాదీక్షను వే
చనుమా యోనంద ! నీవు ♦ శ్రమ మొందకు వే
ననుఁ జూచుతీవ్రకాంక్షను,
గనిపించెదఁ దప్పకుండఁ ♦ గన్నీ మదిలోన్. 164

వ. అలంఘ్యదేవానుశాసనంబ ట్లుండ నిఁక నొక్కఁ జెప్ప నైతికాదని ప్రకాశానందుండు తొల్తఁ జిన్నమొగంబు చేసికొనియు వెంటనే ప్రసన్నవదనుం డై యల్లన వెండియు నిట్లనియె. 165

చ. తలఁచినయప్డు కన్పడుచు ♦ ధన్యుని జేసెదవేని నన్నుఁ, గ
న్నుల కెపు డీశుభాకృతి వి ♦ నూత్నముదావహ మౌచుఁ దోఁచునే,
నిల నెటనుండుచున్న నట ♦ కేగి వసింతు ; వరం బొసంగి, భీ
కలితమదీయచిత్తము న ♦ ఖండముదంబున ముంచి తీర్పరా !

వ. స్వామి సంతసిల్లి నీ వింతటినుండి "ప్రబోధానందసరస్వతి" యను నామంబుఁ గైకొనవలయు నని శాసించె ; నప్పటినుండియు నానందుం డాపేరఁ బరఁగుచుండె. మఱునాఁడు పెందలకడ స్వామి శ్రీజగన్నాథంబునకును ప్రబోధానందుండు బృందావనంబునకును దరలి చనిరి. ప్రబోధానందుం డట ననేకగ్రంథంబులు రచియించెఁ; గాని యిప్పు డున్నవి రెండుమాత్రమే ; వానిలో నొకటియే "చైతన్యచంద్రామృత ;" మేతద్గ్రంథంబునందు శ్రీగౌరాంగస్వామి సౌందర్య సత్స్వభావప్రభావభక్తి ప్రేమాతిశయంబు చక్కఁగ వర్ణింపఁబడియె ; మఱియు నానందుని కర్కశహృదయంబు స్వామి

యెట్లాక్రమించుకొని యట వసియించి దానినవనీతకోమలంబుఁ జేసెనో, భక్త్యావిష్టచిత్తంబుతో మనోహరంబుగ నందుఁ దెలుపం బడియె; నీగ్రంథంబు గౌరాంగభక్తవారంబునకు సుధామధురం బును మహితానందదాయకంబునై వెలయు. శ్రీగౌరాంగస్వామి వెంటరావలదు బృందకుఁ బొమ్మని చెప్పినప్పు డానందునిచిత్త వృత్తులెట్లుండెనో తెలుపుకొన్నిశ్లోకంబులు గలవు; వానిభావం బీక్రిందిగీతికలవలనఁ దెల్లం బగు. 167

ద్వి. ఏమిచేసితి వయ్య! ♦ యెద దొంగిలించి
పేరిముడిపిచ్చిని ♦ బెట్టి పీడితివి;
గంభీరకర్కశ ♦ ఖ్యాతమనీషి
యంభోజనేత్ర! యీ ♦ యనువునఁ జెడియె;
నూర్జితచిత్తంబు, ♦ నురుసత్ప్రతిష్ఠ,
యార్జితోదారప ♦ దాభిమానంబు,
లోకభీతియు, నెంత ♦ లోనోశుభాంగ!
పోకార్చి, నన్నయ్యో! ♦ పోరని జేసి!
యైహికబంధంబు ♦ ♦ లన్నియుఁ ద్రెంపి
యోహూ! తగులొ్కని ♦ యుంటి నీప్రేమ! 168

వ. ఈచైతన్యచంద్రామృతంబులోనిశ్లోకంబు లెప్పుడెట్లు స్వామి యానందున కగపడెనో యాయావద్వృత్తాంతంబు స్పష్టంబుగఁ జెప్పు; మఱియొకశ్లోకంబుఁ దద్భావంబు నీక్రింద వ్రాయఁబడియె.

శ్లో. ధరాత్రస్పృష్టస్సతతపరమావిష్టఏవాత్యధర్మే
దృష్టింపాప్తోనహిఖలునతాంస్పృష్టిషుక్వాపినోసః
యద్దత్తశ్రీహరిరససుధాస్వాదుమత్తఃప్రనృత్య
త్యుచ్చైర్గాయత్యథవిలుఠతిస్తౌమితంకిఞ్చిదీశమ్.

మ. ఒకసత్కార్యముఁ జేయ, కెల్లపుడుఁ బో ♦ పోద్వృత్తిమై నుండి,యిం
చుక యేక్షేత్రమహాత్మ్యముల్ గనక,యీ ♦ క్షోణిం బ్రవర్తించువా
రికి శ్రీకృష్ణవచోమృతం బిడి,మహా ♦ నృత్యంబుల న్పాటలం
దిఁకఁ బొగ్గాటల వారిఁ జొన్పుమహితు ♦ న్ప్రేమాంగునేఁ గొల్చెదన్.

వ. ఇనుమువంటివారిని సువర్ణోపములుగ శ్రీగౌరాంగుం డెట్లుకావించె
నో తెలుపునింకొకశ్లోకంబును దద్భావంబు నీక్రిందఁ గాన నగు.

శ్లో. దృష్టస్స్పృష్టః కీర్తితస్సంస్మృతోవా
దూరస్థరప్యానతో వాదృతోవా
ప్రేమ్ణస్సారం దాతుమీశోయఏక
శ్రీచైతన్యంనౌమిదేవందయాళుమ్.

చ. నుతులను, స్పర్శవీక్షల, స ♦ నుస్మరణంబుల, దూరదేశసం
స్థితు లగువార లేనియును ♦ శిష్టసమాదృతి, నేటికోళ్ల, నే
యతివరుసత్కృపామహిమ ♦ సందఁగ నేర్తురొ ప్రేమసార,మా
నతజనసర్వపాపచయ ♦ నాశకు గౌరహరి న్భజించెదన్. 172

గీ. అంతశక్తిని జూపి, ధీ ♦ మంతులు, యతు,
లమితవేదశాస్త్రజ్ఞులు, ♦ నాస్తికులును
మ్రొక్కి తనుఁ గొల్వఁగా నిమి ♦ పుడమి వెలసె;
మాధవుఁడొ మానవుఁడొ మఱి ♦ మాయలాఁడు? 173

గీ. పుట్టినట్టినవద్వీప ♦ పురిజనముల
సెలవుఁ గొనవలెననియు,శ ♦ చీజననిని
జూతునని బాసచేయుట ♦ చేత, స్వామి
యేగె యతియైనపిదప నై ♦ దేండ్ల కటకు. 174

శా. స్త్రీలుం బూరుషు లర్భకు ల్ముదుకలు ♦ న్శ్రీకృష్ణ! నీ న్బాసియీ
నీలాద్రి న్నివసింపలే మనుచుఁ గ ♦ న్నీళ్లొల్కఁగా స్వామి యా

పోఁలి స్వేడి చనంగఁ గష్టపడె ; నం ♦ భోజాక్షుఁ డీపీటికి
న్నైళం బాదట వచ్చు నన్ననుదులుం ♦ బాటింప రం దెవ్వరుర్.

వ. ఎట్టులో తప్పించుకొని స్వామి జగన్నాథంబు గదలిచన సన్యాసులుమాత్రి మతనివెంట వచ్చిరి. సార్వభౌముస కొకటి రెండు దినంబుల ప్రయాణంబు దనుకఁ గూడవచ్చుట కనుజ్ఞ యిచ్చి యచ్చటి నుండి తిరుగఁ జనుమన నాతండు దుఃఖించుచు నట్లచేసె. నడచి వచ్చుటకుం దగినబలారోగ్యంబులు లేమిని రామానందుం డాందోళికారూఢుం డై స్వామివెనుక వచ్చుచుండెఁ; గూడవచ్చి సవారందఱు నూఱుగురికంటె నెక్కువమంది గలరు. దారిలోఁ దత్కాలరాజనివాసం బగు ‹‹ కటక ›› పురంబున నందఱువిడిసిరి. స్వామియాహారంబించుక భుజించియొక మఱ్ఱిక్రింద విశ్రాంతింగొనుచుఁ గూరుచుండెనంత. 176

శా. రారా జైనప్రతాపరుద్రుఁడు మహా ♦ రాజోచితాలంక్రియాస్ఫారభ్రాజితదేహుఁ డై పరిజన ♦ వ్రాతంబుతో వచ్చి శ్రీ గౌరాంగాంఘ్రిసరోజము ల్నిజశిరో ♦ గాంగేయరత్నప్రభోదారామూల్యకిరీటమంట నిడె సా ♦ ష్టాంగప్రణామంబులన్.

క. చాఁగిల్లినరాజేంద్రుని
యోగీశుఁడు లేవనెత్తి ♦ యుర్వీమహిళా
భోగత్యాగుల కందని
కౌఁగిటఁ దాఁ బొదివెఁ బ్రేమఁ ♦ గ్రిక్కిఱు నుడులన్. 178

వ. వంగదేశప్రవిష్టుం డై స్వామి పూర్వపరిచితులబహుళంబుగాఁ గాంచెఁ; ‹‹ గలకత్తా ›› పురసమీపంబున నున్న ‹‹ పాణిహతి ›› లో రాఘవపండితునింట దిగె ; నచటినుండి బయలుదేఱి నవద్వీపంబు సేరువఱకు మార్గంబునందుఁ గిక్కిఱిసిన యసంఖ్యాకద్రష్టృస

మూహంబుల దూసికొని పోవలసివచ్చెం. 179

గీ. సింధుతీరంబునం దున్న ♦ సికతలోని
యణువులను లెక్క పెట్టశ ♦ క్యంబుగాని
ప్రభువుఁ ద్రోవను జూచిన ♦ భక్తగణము
గణనసేయఁగ లే మని ♦ గ్రంథము లను. 180

వ. బాల్యస్నేహితుల నవలోకించుటకై నవద్వీపంబు ప్రక్కంబాఱు
నదియవలియొడ్డున నున్న " కుల్యా " గ్రామంబున నేడుదినంబు
లుండి యంత నానది దాఁటి నవద్వీపపురంబునఁ దనపూర్వస్నాన
ఘట్టంబుకడనే స్వామిదిగె. 181

మ. ధరపై సూదిని వేయ, నేసలఁతిశ ♦ బ్దంబేనియు న్గర్ణగో
చర మౌనంతటిమౌనముద్రలఁ బ్రజా ♦ సందోహముల్స్వామితో
సరుదెంచె, న్స్మరమందు బాల్యమునఁ గ్రీ ♦ డాసక్తి దుశ్చేష్టలే
ర్పఱఁగావించినసుందరాంగుఁబరితు ♦ ష్టిన్గాంచునుత్కంఠతోఁ.

క. పెంకెతనంబునను మహో
రాంకవధరపండితాళి ♦ రారాపిళ్లఁ
గొంకక పెట్టినవిమియ
త్యంకము లరయంగ వారి ♦ కచ్చెరు వయ్యెఁ. 183

గీ. ఇట్లు చని తనపూర్వపు ♦ టింటివాఁకి
టను నిలువఁబడె నిమి ; యంత ♦ జనని దమిని
బైకిఁ జనుదేర సాష్టాంగ ♦ వందనములు
చేసె బిడ్డయందఱ కను ♦ ల్చెమ్మగిల్ల. 184

ఉ. ఎవ్వ రెఱుంగకుండ, శచి ♦ కేనియుఁ జెప్పక లోలచిత్తుఁడై
మవ్వపుముద్దుమోముఁ దల, ♦ మానుగ నొండవగుంఠనంబులో

నెవ్వగ డాఁచి పెట్టుకొని ♦ నెట్టన లోపలినుండి నిన్నుగా
జవ్వనియోర్తు వచ్చి పడెఁ ♦ జాఁగిలి సంయమికాళ్ల ముందరన్. 185

క. తనకు బ్రొక్కిన దొకజ
వ్వని యని తెలిసికొని స్వామి ♦ వడి వెన్కకుఁబో
యెను మూఁడునాలుగడుగులు ;
బ్రణతస్త్రీ యంత నిట్లు ♦ పలికె నతనితోన్. 186

క. ఇల నందఱఁ బ్రోచినపు
ష్కలకరుణాహృదయ ! సర్వ ♦ కాలము నిన్నే
తలపోసికొనుచు మెలఁగెడు
నెలఁత న్మఱిపొంది పీడ ♦ నీకుం దగునే

వ. ఆమెప్పరమపూజ్య యగువిష్ణుప్రియా దేవి ...
గి బాష్పార్ద్రనయనంబులతో నుండె నంత.

గీ. చందమామనుబోలు నా ♦ స్యం బొకింత
ధూమ్రసంకులవర్ణ మై ♦ తోఁప, స్వామి
తొట్రుపడునొక్కయీరెల్గు ♦ తోడఁ "జాన !
విడువకుండ శ్రీకృష్ణుసే ♦ వింపు" మనియె. 189

గీ. నీదుసేవకురాలిపే ♦ రాదఁ బాపి
యాఱటను గొల్పువస్తువొం ♦ డొసఁగు మనియె
సుదతి ; స్వామి యోజించి యీ ♦ జోగి కేమి
కల దొసఁగ, నీ వెఱుంగవే ? ♦ లలన ! యనియె. 190

క. లోకేశా ! పాదుకల
న్నా కిమ్మని యింతి గోర, ♦ నలినాక్షుండ
స్తోకకృపను దనపావల
నాకాంతకు విడిచి, యుత్త ♦ యవని నిలఁబడెన్. 191

క. చెంత నిడినపాదుకల
న్గాంతాత్మజము తీసి ♦ కనుల, న్దల, న
త్యంతప్రేమను బెట్టుక,
యంతట సద్గురునకు మ్రొక్కి ♦ యరిగె న్దిరుగన్. 192

గీ. ఇదియె కడసారిచూపు స ♦ ర్వేశ్వరునకు
నంగనామణి విష్ణుప్రి ♦ యకును బుడమి;
నువిద కొసఁగినపాదుకా ♦ యుగళి నేఁటి
వఱకు నందుచున్నది భక్త ♦ వరులపూజ. 193

---

క. గౌరాంగుఁడు నీలసదవ
తారము భవవార్ధిమగ్న ♦ తారకుఁ డేనిన్,
శ్రీరామా! యీపాపిఁ బ్ర
తారింపక భక్తిఁ బెంచి ♦ తప్పక ప్రోచున్. 194

---

మాలిని.

వదనవిజితసోమా! ♦ నీరదాభాభిరామా!
కదనవిమతభీమా! ♦ క్రవ్యభుఙ్మృత్యుధామా!
సదయహృదయసీమా! ♦ శాంతికృచ్ఛ్రావ్యనామా!
మదఘుచయవిరామా! ♦ మంగళారామ! రామా! 195

క. జోతలు మా రామునిసుర
వ్రాతార్చితపాదసలిల ♦ జాతంబులకున్;
జోతలు శ్రీపూతకళా
స్ఫీతత్రైలోక్యమాతృ ♦ సీతాంఘ్రులకున్. 196

శ్రీ శ్రీ శ్రీ

శా. ఆర్యస్తుత్యసమస్తసద్గుణనికా ♦ యం బంతరంగంబు ; స
చ్చర్య ల్లోకహితంబు, లార్తజనర ♦ క్షాదక్షముల్ ; దేవతా
వర్యా ! రాఘవరామ ! నీసదనుకం ♦ పాపూర్ణదృక్పాళి, మా
సూర్యక్ష్మాపతిఁ జూచి యిమ్మతనికి ♦ స్తోకాయురారోగ్యముల్.

క. సంతునకు, రాణి, కతనికి
సంతోషపరంపరలఁ బ్రి ♦ సాదించి, మన
శ్శాంతిసుఖ మొసఁగు, లక్ష్మీ
కాంతా ! శ్రీరామచంద్ర ! ♦ కరుణాసాంద్రా ! 2

మ. మును పీఠపురంబు నేలి, ప్రజకా♦మోదంబుఁ గల్పించి, యీ
వని, ధైర్యంబున, సాహసంబునను, గాం♦భీర్యంబున, ఖ్యాతిఁగాం
చినభూపుం, డిపు డాత్మజాత్మజతఁ గాం♦చెన్నోట శ్రీరామ! యీ
తని, గంగాధరరామరాయని,ఁ బ్రశ ♦ స్తప్రేమఁ గాపాడుమా !

శ్రీ శ్రీ శ్రీ

